# పీఠిక

భక్తావతంసములారా !

ప్రతిమానవుని, హృద్గృహాలయందును రెండద్భుత శక్తు లిమిడియున్నయవి. అందొకటి మనశ్శక్తి దీనిని జైకొనిన వాడే యొడుదుడుకులు లేకుండగ నిహామును జయప్రదముగా సాధింపగలడు.

సర్వానర్థముల మూలమగుభయమును జయించిన వానికి మనశ్శక్తిస్వాధీనమగును. నిర్భయుం డెంతటిపనినైనను జేయగలడు. క్రూర సర్పములనుబట్టి యాడించువాడును, శార్దూలాది మృగములతో జెల్లాటలాడువాడును ఆజన్మవైరు లగు చోరాది జయమందినవాడును నిర్భయకోటికి జెందినవాడై యున్నాడు. ఈ మనశ్శక్తి నీనికిదాసి రైళ్ళు, విమానములు, మోటార్లు, బాంబులు మనశ్శక్తి సంభవములు. మనశ్శక్తి లేనివానికిహాముదుఃఖమయము కాగా ! బరమువూట తలంప నేటికి చింతాకులు జేపనియు జేయజాలదు జీవచ్ఛవమన నీతడే యనినను తప్పుగాదు.

సంకల్ప వికల్పముల' కాకరమగు మనస్సరికట్టి కొంట పను బోసిక నేకసంకల్పముమీాదనిల్పిన దానికశక్తి బయలుపడి

సాధకుని సర్వవిధముల గాపాడును. ఏకాగ్రతగలవానికి సాధింప రాని యైహికముండదు.

ఈ యేకాగ్రతదుర్బలుని బలవంతునిగను, దరిద్రుని ధనవంతునిగను అనామకుని సనామకునిగను జేయుసమర్థతగలదు. అసాధ్యమైన యెవరెస్టు శిఖరారోహణమొక మనశ్శక్తిగల వాని కేసాధ్యము, గ్రంథములు వ్రాయుట, అష్టావధానశతావధానములు జేయుట ఆశువుగా బద్యములల్లుట, కొద్దిగనో, గొప్పగనో మనశ్శక్తి గలవానికే సాధ్యము.

ఈ చిత్తైకాగ్రిత పూర్వవాసనాబలముననో, ప్రస్తుత సాధనా పటిమవలననో లభింపగలదు. మానవుడు పూర్వ జన్మమునం దేవిషయమునకై సాధనజేసినాడో ? మరుజన్మ మం దా విషయమందు బట్టుదలగలవాడై యుండును.

ఇట్టి మనశ్శక్తిగలవాడు కర్మ, భక్తి, జ్ఞానము లవలీలగా సాధింపగలడు. చిత్తైకాగ్రతవలన లభించుమహాఫలమీ మనశ్శక్తియని మరువరాదు. ఏకాగ్రిత లేనివాని కర్మ, భక్తి, జ్ఞానములకు శ్రమయే ఫలము. గనుక ముందు మనస్సును స్వాధీనపరచుకొని పిదప కర్మ, భక్తి, జ్ఞానములయం దేయొక్కటి సాధించినను సద్యోఫలము లభించును.

మనశ్శక్తిని నాత్మశక్తిగా మార్చగల సమర్థతగలవి కర్మ, భక్తి, జ్ఞానములు ఈ మూడుమార్గములద్వారా ఆత్మశక్తిని బయటకిదీసినవాడే సమర్థుడు. నిర్జీవిని జీవవంతు

నిగా జేయు సమర్థతగలది యాత్మశక్తి, ఆత్మశక్తిగల వాని యెదుట మనశ్శక్తిగలవాడు దివిటీక్రింది దీపమువంటివాడు ఆత్మశక్తి మనశ్శక్తిని లోబరచుకొనగలదు. ఈమనశ్శక్తి సంభవములైన ప్రయోగాదు లేవియు కర్మ, భక్తి. జ్ఞానములలోనే యొక్కటినైన నాశ్రయించిన వానికి దేరి పారజూప జాలవు.

దీపమునకు దీపపు వెలుగున కెట్టులభేదమో భగవంతునకును భగవచ్ఛక్తికిని నట్టులే భేదము భగవంతుని జూచినవాడనిన వా డాత్మశక్తిగలవాడనియు, ఆత్మశక్తిగలవాడే దేవుని జూచినవాడనియు జెప్పనగు.

భగవంతుడు శక్తిస్వరూపుడు భక్తునిభావమున ననుసరించి ఆశక్తియే తదాకృతి ధరించుచున్నయది. భక్తుడు భగవంతునకువలె సర్వసమర్థుడైయుండును. గనుక ప్రత్యక్ష భగవంతుడే భాగవతోత్తముడనుట.

అచేతనమైన పాతమట్టిగోడను గుఱ్ఱముగా నుపయోగించి స్వారీచేసినవాడును, చనిపోయినకుక్కను బ్రతికించిన మహాపురుషుడును. ప్రత్యక్ష భగవంతులని చెప్పిన సంశయించువా రుండరు.

ఇట్లు ప్రత్యక్ష భగవత్స్వరూపులై తమ తమ జీవితముల లోకహితమునకర్పించినట్టియు వారి వారి భగవచ్ఛక్తులను ఆయా శక్తులద్వారా వారు వారు సాధించిన మహా కార్యజాలమును తెలుపగల గ్రంథరాజమగుట దీని కాంధ్ర మహాభక్త విజయమని పేరిడబడినది.

ఈ భక్తవిజయ ప్రకటనా కార్యములో పాల్గొని తను మనధనముద్వారా సహాయపడిన మహామహుల పేర్లజాబితా నిందే మఱియొకచో జూడగలరు. వీరలయం దీర్ఘాప్రదిష్ట టలో శ్రద్ధవహించిన బ్రహ్మశ్రీ పన్నాల రామకృష్ణయ్యగా రత్యంత వందనీయులు. వీరలందఱకు గావించు వందనసహస్రంబులతో పీఠిక ముగించెద.

సర్వేజనాః సుఖినో భవంతు

అప్పికట్ల,
బాపట్లతాలూకా
7—5—1957

ఇట్లు,
విశ్వసేవకుడు,
పంగులూరి వీరరాఘవుడు



# ఉపోద్ఘాతము

శ్రీమంతంబై నిత్యప్రకాశ సమన్వితంబై నవఖండంబు లందఖండ జ్ఞానప్రదంబై విరాజిల్లుమన పావనంబగు భగత ఖండము భక్తి, జ్ఞాన, వైరాగ్య భోగదాయకంబు నం దగ్రస్థాన మలంకరించి అభీష్టార్థ ప్రదకల్పకభూజమై ఖండాంతర్గత బహు దేశముల భేదంబులచే ననేకంబులై యుండు భాషలన్నింటికి ప్రధానభాషయగు సంస్కృత భాషామతల్లికి జన్మస్థానంబై, మూర్తీభవించిన వేదస్వరూపంబై ఆదినుండి నేటివరకున్నూ అనేకమంది దివ్యపురుషులను కని, పెంచి, లోకకళ్యాణార్థమై, పరిపూర్ణ విద్యాప్రవీణులచేసి, వేదానుసారమగు మోక్షధర్మ ముల యుగధర్మంబుల ననుసరించి నాసేతుహిమాచలము నఱకు వ్యాపింపచేసి, దేశాచారకర్మ ధర్మంబులందు భేద మున్ననూ అంతిమఫలంబగు కైవల్యమునం దెట్టిభేదమున్నూ లేని యద్వైత నుతంబు నొసంగి భగవంతుడు రక్షించు చున్నాడనుట సర్వజనవిదితమేగదా!

ఆయా దేశములందలి మహాపురుషుల జీవితములను, దేశాభిమానముచేతనేమి, లోకకళ్యాణార్థమై చేసిన, అనుప మానమగు నిష్కామ కర్మల ఋణవిముక్తికి నైతేనేమి భక్తి, జ్ఞానములందలి శ్రద్ధావిశ్వాసములచేతనేమి, అందందు అట్టి దివ్యజ్యోతి స్వరూపులగాథల శాశ్వతముగా ప్రకాశింప చేయుటకు కొందఱు పండితులు, వారిజీవితములను అతికష్ట ముచే సంగ్రహించి, రచించి దేశమునందంతటను వ్యాపింప

చేసి కృతార్థులై యుండుటచే నేటికిన్ని మనపూర్వుల చరిత్రిలు నిత్యజీవితములై చదువరుల కానంద మొసగుచు భక్తి జ్ఞాన వైరాగ్యాది సల్లక్షణాభివృద్ధికై యుత్సాహమునొసంగి తత్తద్ధర్మాభిమాన కర్మాచార పరాయణులనుగా చేయుటకు ప్రధానకారణంబులై, దివ్యోపదేశవాక్యామృతసారముగ్రోలి, జీవన్ముక్తి పొందుటకు నిర్భయావలంబనులై యుండుటచే, పరమేశ్వరుని దివ్యలీలావిభూతులాస్వాదించి, జ్ఞానాభ్యాసము నభ్యసించి, భక్తి నభివృద్ధినిచేయుటకై దైవప్రతినిధులై తమ యుద్యోగమును అనేకవిధములగు చిత్రవిచిత్రదృశ్యముల చూపుచూ ప్రజారంజకులై మతాభిమాన గుణభూషణులుగాచేసి తరింపరనుట దేశాభిమానయుక్తులగు సద్గుణ స్వభావరమణీయులగు సహజానందరసజ్ఞులకు గ్రాహ్యము గాకపోదు.

ఉత్తర హిందూస్థానమునందున్నూ యింకా యితర దేశములందున్నూ, మహాభక్తుల చరిత్రిలను మతభేదరోగావేశమత్తులుగాక విశాలబుద్ధిగల పండితులు, అనేక కష్టములనోర్చి, రచించి యుండుటచే ఇప్పటికిన్ని వారిచరిత్రిలు దివ్యజ్యోతులవలె ప్రకాశించుచూ చదువరులకు వివేకజ్ఞానోదయప్రాప్తిని గలిగించి, ఆస్తికజ్ఞానమునందారూఢిని గలిగించి, సాధనానుకూలధర్మములను, దెలిపి, ముక్తికై ప్రేరేపించి భక్తిమార్గమును ప్రదర్శింపచేసి, భారతీయ దివ్యసాంప్రదాయధర్మములను యితరదేశంబులకు నందజేసి, మతవైషమ్యముల తొలగించి నేటికిని ప్రసిద్ధిగాంచియుండుటచే అట్టిలోపమును మనఆంధ్రమాతకు లేకుండ

జేయుటకై అందందు కొందరు భక్తులు మనదేశమందలి మహా పురుషుల చరిత్రలను, కొన్ని రచించియున్నను రహస్యముగా శేషించియున్నవా రెందరోయున్న వారిచరిత్రల సేకరించి వ్రాయు సదుద్యోగమును కష్టసుఖంబులకోర్చి గ్రామ గ్రామంబునకునూ, కాలినడకనుబోవుచూ, క్షుత్పిపాసలశాంతికై, ప్రాప్తించిన ఫలములనో లేక నీటినో త్రాగి చెట్లక్రింద విశ్రాంతి తీసుకొని భక్తిశ్రద్ధలచే అభిమాన వర్జితులై జాతిమత భేదరోగరహితు లెవ్వరాయని పరికించి, దైవానుగ్రహ ధర్మ కర్మోద్యోగమునకు తగినవాడని నిశ్చయించి వృద్ధుడని విచారించక, నిర్ధనుడని భావించక, అసహాయుడని యోచించక, యీ ఆంధ్ర మహాభక్త విజయమనెడి దివ్యగ్రంథ రచనాధికార భారమునూ యీ గ్రంథకర్తగారి పైబెట్టి, దర్యార్థమై పెక్కుగ్రాముల దిప్పి శ్రీరాముడు, కరుణాభిరాముడగుటచే గ్రంథకర్తగారికి మధ్య మధ్యగలుగు కష్టంబులను సుఖములుగానే తోపింప చేయుచూ, అదృశ్యుడై అటనుండి సర్వవిధముల రక్షించుకొని స్వకార్య నిర్వాహణార్థమై తన నిజసేవకుని నేటివరకు పోషించుకొని, యిప్పటికి గ్రంథమున కొక దివ్యస్వరూపము నేర్పరచినాడు.

ఈ గ్రంథరచనాభిలాషాసక్తబద్ధ చిత్తుండగు శ్రీ పంగులూరి వీరరాఘవదాసుగారు నాకు చాలా పూర్వపరిచయులే గాక, మామకాంతరంగాను షంగసద్బంధుండగుటచే, ప్రేమోత్సాహపూరితహృదయుడై, పీఠికను వ్రాసి యివ్వవలసినదిగా

ఆజ్ఞాపించినందున అసమర్థుడనని యెంచింగియు, కర్తృహృదయాంతరంగ రమణుండగు శ్రీరమారమణుని ప్రేరేపణగానే యని భావించి వ్రాయ సమకట్టి కలము చేబట్టితిని. పరమ భక్తుల హృద్గత సద్భావ స్వరూపానందభోగిశయ్య యొక్కటే యైనను స్థానభేదము లనేకములై యుండుటచే నిందరు ఒకే గ్రామమున నివసింపక దూరదూరంబుగా స్వగ్రామసంబంధ నివాసంబుల నేర్పరచుకొని, అంతరంగమున నొక్క తావుననే యానందించుచుండుటచే, వారి వారి గ్రామంబులకేగి, అందలి పెద్దలనో లేక వారివంశీయులనో కాని చో యితర గ్రామ కాపురస్థులనో విచారించి ఒక్కొక్క మహాభక్తుని జీవితమును సేకరించవలసియుండుటచే, మసగ్రంథకర్తగారు బహుకాలము నుంచియు యీ వృత్తియే, సద్వృత్తియని భావించు నిస్పృహ భోగానందప్రాప్తికై, బండి పాతదైనను, యెద్దులను అనుకూలాననుకూల గ్రాసముచే మేపుకొని బలపరచుచు తన యిష్టమూర్తియొక్క సంపూర్ణకరుణామృతపాన సంపాదితోష్ణ బలమాధారముగా గ్రహించి వారు సుమారు 80 సంవత్సరముల వయస్సునందు పూర్తిచేసి అచ్చుకై, యిచ్చువచ్చిన బొట్టుకంతయు విచ్చలవిడిగా తిరిగి ద్రవ్యము సేకరించి పుణ్యకర్మాభిరతులగు ఆంధ్ర మహాభక్త జనుల కరాబ్జంబులందలంకరింప జేసి కృతార్థులైనటుల అతి శయోక్తి గాదని భావింతురు.

మహాత్ముల చరిత్రలనేక విధంబులుగాయుండి, యెవ్వ రెవ్వరిని నేయేభావముచే వశ్యులచేసికొని వారికి

దివ్యజ్ఞానోపదేశముచేసి, పూర్వకృత పాపకర్మముల నశింప చేయవలెనో అట్టి రహస్యంబులం నెరింగి భక్తులు వర్తింతురు. గాన వారి ఆంతరంగభావముల గ్రహించుట సామాన్యులకు అత్యంత కష్టమగుటచే, కొంతవరకైనను భక్తియోగరహస్యం బుల జ్ఞానయోగ సహాయంబున భేదభావవర్జితులై గ్రహించు వారికిమాత్రమే మహాభక్తుల చరిత్ర(వ్రాయుటకు అధికారము గలదు. గావున నే మన గ్రంథకర్తగారి కీయుద్యోగము భక్త హృదిమణుండగు శ్రీవమారమణునే గ్రహించి యే యుండిరని చెప్ప నొప్పు.

ఎన్నడో, యెందో, యేవిధముగానో జీవితంబులను కాలానుసారముగా, ఆడంబరులుగాక, వేషమాత్రంబుననే లోకవంచకులుగాక, సంతతము భగవన్నామ సంస్మరణానంద పరవశులై గడుపుకొనిశక్త్యానుసారము పరోపకారమే పరమ పదవికి సోపానమని నమ్మి స్వపరభేదమును రవ్వంతయైనను లేక ఆభేదభావముచే ఆశ్రయించిన యాశ్రితులకు నాశ్రయ మిచ్చి, భవసాగర తరుణోపాయమును చక్కగాబోధించి వెనుకచింత, ముందాశయులేక ప్రశాంతిగా కాలమును గడ పినవారి చరిత్రలయందలి రహస్య భావంబుల (గహించి అతి శయోక్తులు లేక సద్గుణములకు మాత్రమే వన్నెబెట్టి సరళమగు మృదుమధురభాషలో కదళీద్రాక్ష పాకంబుల చేజదువరుల కుత్సాహాము *గలుగురీతిని రచించినందుకు భక్త వత్సలుడైన భగవానుడు భక్తపరతంత్రుడను నామమును

సార్థకమును చేసికొనుటకై గ్రంథకర్తగారికి, వయోభేద మును పాటింపక ఆత్మశక్తి నొసంగి రక్షించుగాక.

శ్రద్ధావిశ్వాస సమన్వితంబైన ప్రేమయను నిజ పరభక్తి నార్జించి తత్ఫలమును లోకకళ్యాణార్థమై వచ్చించి, సర్వసత్యాగులైన మహాత్ముల దివ్యవాగ్జ్యోతులు అందించు ప్రకాశించి, సంసారాంధకార భయమును పారదోలకున్న సామాన్యమానవులకు వివేకోదయ మెట్లుగలిగి భరతాబండు మనేడి నామము సార్థకమగునో చదువరులు యోచింతురుగాక. ఆలు బిడ్డలచే గలుగు యాయాసముగ్రహించి యాజ్ఞోటివిడచి, ధనధాన్యాది వస్తునామగ్రిచే సిద్ధించు. తృష్ణాబంధప్రభావ మును గుర్తించి పరవైరాగ్యంబుచే తద్భంధమును ఛేదించి దృశ్యము పరమేశ్వరుని అనగా తమ యిష్టదేవుని దివ్యమంగళ స్వరూపమని భావించి, తాము తద్ధృశ్యాంతర్గతాత్మ స్వరూపులమని నిశ్చయించి, బహిరంతరంబుల విశ్వాత్మసంబంధమును వర్జింపక నామము స్మరించుచూ హృదయమున స్వరూపదర్శనము చేసికొని పూజించి భజించుచూ ప్రతి శ్వాసయందున్నా దివ్యనామాక్షర ద్వయమంత్రంబును కలిపిధ్యానించుచూ అనువంశైనను గ్రామ్య వ్యవహారము లకు తమలో చోటునీయక, తమ అంతరంగమునకు రుచించిన యొకమహాభక్తుని జీవితమును లక్ష్యములో దృఢముగా నిలుపుకొని, లోపల, వెలుపల ఆదివ్యమూర్తియొక్క దివ్యోపదేశ వాక్యామృతసారము గ్రోలి తన్మయత్వానంద మనుభవించుచూ, "బాలోన్మత్తులవలె చరించువారి పావనచరిత్రలు

పరమేశ్వరుని మహాయశమును యీదృశ్యమునందు వ్యాపింప జేసి శాశ్వతముగా స్థాపింప చేసినందున భగవంతునికి భక్తులయందుగల దివ్యానురాగ కారణము జ్ఞాన సమన్వితమైన భక్తి యనినను, భక్తి సమన్వితమైన జ్ఞానమనినను రెంటికి ఫలమొకటియే గాని భేదము లేదు. కాని ఆచరణానుమాత్రము కొంత భేదముగలదు, అంత మాత్రముచే కేవల జ్ఞానమేగొప్పదని గాని, లేక భక్తియే గొప్పదనిగాని వాదించుకొనువారు జల్పవితండ వాదులు మాత్రమే యగుదురుగాని, కేవలసచ్చిదానంద సుఖాను ప్రదంబగు సాత్విక వాదులుగారు. కావుననే ఇట్టిమహాపురుషులు విశ్వప్రియులు అని తెలుపును ఇందుచే వీరు అహింసా వ్రతపరాయణులు పరోపకారార్థమై తామైనను యెట్టికష్టము నైనను భరింతురుగాని తమచేమాత్రము యెట్టి క్లిష్టసందర్భమునందైనను. స్వప్నమందైనను యేప్రాణికిని హానిచేయ గోరరు, చేయరు. వీరికి విశ్వమునందనురాగ మధికమగుటచే ద్వేషమునకు వారిలో తావు లేదు వీరు భగవన్మహిమ నెరింగిన వారగుటచే ప్రతి వస్తువునందున్నా చైతన్యమునే జూచి యానందించి భగవత్కృత్యమును కీర్తించుచూ జీవించుటయే వీరికి జీవితధర్మము నిందావస్తుతులకు కుంగరు, పొంగరు. గుణముండినచో నామరూపములున్నా యుండుటచే విశ్వమంతయు నానాగుణమయమై యున్నందున నానావిధ నామరూపములచే నొప్పియున్న విశ్వగర్భుడగు భగవానుని యందీ నానాత్వమున్నదన్నదనియు భగవానుడొక్కడే యైనసం

దున, భక్తులకు నానాత్వమం దేకత్వమును ఏకత్వమందు నానాత్వమును భావించి యానందించుట సహజమేగదా! ఒక్క బీజమునందు వృక్షగుణంబులన్నియు కూడి యేకమై యుండి బీజము వృక్షాకారమును దాల్చినంతనే బీజమందలి నానాగుణములు, భిన్నములుగా యుండునట్లు ఒక్క భగవన్మహా బీజమందు ఈ విశ్వమంతయు లీనమైయుండి స్వరూపమును ధరించినంతనే నానాగుణములు గూడియున్నవి విశ్వము విశ్వనాథుని చిచ్ఛక్తితో గూడియున్నందున విశ్వమంతయు సచ్చిదానందస్వరూపమే యగుననుట నిశ్చయము.

ఈ దివ్యగ్రంథ ముద్రణార్థమై ఉదారసంపన్నులును, పరమభక్తులు పరమపుణ్యార్థ ఫలానుభవాశక్తులును, సగు నిష్కాముకులగువారు ధనమొసంగి భక్తమనోమందిర నివాసి యగు శ్రీనివాసుని సత్కృపామృతపానసిద్ధి కధికారభాగ్యమ్ము నందుకు పరమేశ్వరుడు వారందరకు అభీష్టార్థములనిచ్చి సర్వదా రక్షించుగాక!

ఈ వృద్ధుడగు గ్రంథకర్తగారికి భగవంతుడు మరింత ఆయురారోగ్య బలమొసంగి, ఇంకను శేషించి గుప్తముగాయుండిన మహాభక్తుల చరిత్రలను సంపాదించి పుణ్యాత్ముల ద్రవ్య సహాయంబుచే ముద్రింపించి లోకమునకు అందజేసి కృతార్థులగుటకు కరుణామయుండగు భగవంతుడు తోడై రక్షించుగాక.

ఆనందాశ్రమము
రెడ్డిపాలెం
9-5-57.

ఇట్లు,
సర్వజీవశ్రేయోభిలాషి, లక్ష్మీకాంతయోగి

# భక్త పండితాభిప్రాయములు

బ్రహ్మశ్రీ పంగులూరి వీరరాఘవయ్యగారిచే విరచితమయిన ఆంధ్రభక్త విజయమును ఆమూలాగ్రము చదివితిని. ఇతర భక్తవిజయములకంటె దీనిలో నొక విశేషము గాన్పించినది. ఇతర భక్తవిజయములలోని భక్తులు చాలమంది మనము కని యెఱుగనివారు. ఈ భక్తవిజయములోని భక్తులు చాలమంది మనము కని వినినవారు. కాశీలో నున్నవారికంటె కాశీకి చాలదూర దేశములవారికి గంగయందు భక్తియెక్కువ. (పెరటిచెట్టు మందునకు కాదు.) అన్నట్లు సన్నిహితు లెంతగొప్పవారైనను వారి గొప్పతనమును గ్రహించుట చాలకష్టము. అటులనే మన మాంధ్రులమయియుండియు మన యాంధ్రులలో. మహా భక్తులయి వివిధ వర్ణముల జన్మించిన మహానుభావులు. 1. తూము నృసింహదాసుగారు, 2. సమిడిఘంటం వెంకటరమణదాసుగారు, 3. అద్దంకి వెంకట్రాయుడుదాసుగారు మున్నగువారిని మనము (ఆంధ్రులము) ప్రత్యక్షముగ నెఱిగియుండియు వారి మహిమలను గుర్తించి భగవద్భక్తిని సంపాదించి తరింప లేకపోవుచున్నాము. అది పెద్దలోపము. అట్టిలోపమును దీర్చి, పైన పేర్కొనబడిన ఆంధ్రభక్తుల చరిత్రను సర్వసులభముగ వ్రాసి యొక గ్రంథరూపమున తయారుచేసిన యీ పంగులూరు వీరరాఘవయ్యగారు ఆంధ్రలోకమునకు మహోపకారకులయిరి. ఇటులనే, మరికొన్ని గాథలను "బుఱ్ఱకథలు"గ మార్చి తయారుచేసినచో. ఆంధ్రులందరును వీరికి ఋణస్థులగుదురని నావిశ్వాసము.

గుంటూరు.<br>20-5-57,

ఇట్లు,<br>కాశీ కృష్ణాచార్యులు

శ్రీ పంగులూరి వీరరాఘవయ్యగారు. ఈ గ్రంథరచన యందు రెండు విలక్షణములైన విధానముల ననుసరించిరి. పాండిత్య కవిత్వ ప్రదర్శనములకో లికిబోక, నిత్యనూతన మైన "ఇందు గల డందు లేడను" భాగవతసూక్తుల ననుసరించి వారి యానందానుభవమును ఇందు వెల్లివిరియ జేసిరి. రెండవది మహాభక్తుల చరిత్రములను నిస్సారములైన వాక్యములతోగాక వారి యనుభవోపేతములగు సాధనా వివరములను శాస్త్ర అనుభవాధారములతో నా యా భక్తుల సాధనముల కంటించి ప్రతిచరిత్రకు ప్రప్రథమమున సుబోధకముగా వివరించిరి ఈ విధానము ప్రస్తుత మమలునందున్న భక్తవిజయ ములలో లేదని నానమ్మకము ఒకానొక సమయమున, మీ యాంధ్ర దేశమున భక్తులు లేరను, యొక మహారాష్ట్ర సోదరుని పరుషవాక్యకారణముగ దేశాభిమానము, ఆత్మవిశ్వాసము, ఆత్మగౌరవములను ప్రకోపింప వీరీగ్రంథమును ఆంధ్ర సోదరుల కందింప గలిగిరి.

పాఠకు లీగ్రంథమునందలి భక్తుల యనుభవములను గ్రంథకర్త హృద్గతమైన యాత్మానందమును, నిరాడంబర జీవితమును లక్షించి అనల్పమైన యాత్మానందమును, అతిస్వల్ప మైన పదములలో నిముడ్చబడిన గంభీర భావముల గ్రహించి ఆంధ్రసోదరు లాత్మాన్వేషణయందు బురోభివృద్ధి నందెదరుగాక.

ఇట్లు,

రాగం ఆంజనేయులు

భగవద్భాగవత చరణసేవకుడు

గుంటూరు,

20-5-57.

శ్రీయుత పంగులూరు వీరరాఘవశర్మగారు ఈయాంధ్ర మహాభక్త విజయ మనుగ్రంథమును రచించి లోకమునకును ఆత్మకును, మహోపకార మొనరించిరని తలంచుచున్నాను. ఈ గ్రంథదర్శనముచే వీరికిగల భాగవతాభిమానము ఆంధ్రాభిమానము అపారమై ప్రవహించుచున్నదని తెలియుచున్నది. వీరు పరమవైష్ణవ శిఖామణులయ్యును అన్నిమతములను, అన్ని సిద్ధాంతములను, అన్ని సంస్థలనుజూచి సంతసించుచు, కొనియాడుచు నుండెదరు ఇది వారి యాంతరంగిక సామరస్యభావము. ఇట్టివారలు చాల తక్కువగనున్నారు. వీరి రచనా మహత్వమునకు నీగ్రంథములోని, పోతన, వేమన, గోపన మొదలగు ఆంధ్ర మహాభక్తుల జీవితభాగములను జదువునప్పుడు పాఠకలోకమునకు గలుగు ఆనందపులకలు, ఆనందభాష్పములు, ఆనందపారవశ్యము సాక్ష్యము నిచ్చుచున్నది. ఇదియుం గాక వీరిరచనలోగల చాతుర్యము చాల కాలముక్రిందట జరిగినను, పరోక్షమున జరిగినను, చరితములను, వర్తమాన కాలికములుగ ప్రత్యక్షదృష్టములుగ, పాఠకలోకమునకు భావసంస్ఫూర్తిని గలిగించి ప్రత్యక్షమే యంతయు నను, గ్రొత్తవిషయమును ; లోకమునకందఁజేయుచున్నది.

ఈ రచనా ప్రవాహములో ద్వితీయ ప్రయత్నము భక్తులతోబాటు క్షేత్రములయొక్కయు, మతకర్తలయొక్కయు

మహాత్త్వములను జీవితములను సుదూరము పరిశోధించి, భక్తిని విజ్ఞానమును సమకూర్చు గాకయని లోకము కాంక్షించుచున్నయది.

ఇట్లు మన యాంధ్ర దేశములోని భక్తకవుల, గరిష్ఠులను, పరిమాణా దర్శనములను గ్రంథించుటచే పరిశీలనమునుండి బుజువుచేయుచు, సకల దేశముల కవివరులలోను ననుకరింజ వేయదీ యాంధ్రదేశము అని దేశమహాత్మ్యమును జాటుచు ఆనృణ్యమును బడయుచున్నారు. ఆంధ్రదేశ మహాభక్తులలో నొకరగు (శ్రీ) పంగులూరు వీరరాఘవస్వామిగారి ఇట్టి మహాకృతుల ననేకము లోకమున కందజేయుదురు గాక.

ఇట్లు,
మహావిద్వాన్ పండిత :
వేదాన్తం జగన్నాథాచార్యులు
తిరుమల దేవస్థానము, ఆస్థానవిద్వాన్

అప్పికట్ల
16-5-57

# తప్పొప్పులపట్టి

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 10 | పరిసావింప | పరిసాదింప |
| 104 | 2 | మిన్నె | మిన్ని |
| | | గురునాధ | గురునాథ |
| 159 | 2 | భగవంతునిపయయము | దయయము |
| 206 | 2 | మా యాత్మ | మా ఆత్మ |
| 289 | 17 | సాపన్యాసమున | పన్యాసమున |
| 302 | 9 | ఒకేవేళ | ఒకవేళ |
| 364 | 10 | యాసక్తి | ఆసక్తి |
| 366 | 25 | సగ్వధారి | సాధారణ |
| 390 | 9 | దీనినే | దీనినేకొందఱు |
| 405 | 9 | సుహాత్వ | మహాత్వ |
| | 16 | దుగ్బలము | దుర్బలము |
| 414 | 1 | గాసుదాసు | నాగదాసు |
| 430 | 21 | జేరిఖించిన | ప్రేమించుచే |
| 480 | 21 | గూపుమాన్పి | రూపుమాపి |



# విషయసూచిక

| నెంబరు | | పుటలు |
|---|---|---|
| 1. | మహాత్మ బస్వేర పోతిన | 7 |
| 2. | యోగిరాజు వేమన | 15 |
| 3. | భక్తాగ్రణి భద్రాద్రి రామదాసు | 21 |
| 4. | భగవాన్ ముంగుడు పాపయారాధ్యులు | 26 |
| 5. | రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు | 33 |
| 6. | మహాశయులు గంగా దేశికస్వాములు | 38 |
| 7. | అయ్యలరాజు రామభద్రుడు | 46 |
| 8. | భగవాన్ శ్రీ నారాయణతీర్థ | 53 |
| 9. | కోటంరాజు నాగేశ్వరదాసు | 60 |
| 10. | లీలాశుక (బిల్వమంగళ) | 85 |
| 11. | తూము లక్ష్మీనృసింహదాసు | 104 |
| 12. | త్యాగరాజస్వామి | 148 |
| 13. | పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి | 153 |
| 14. | దూదేకుల సిద్దయ్య | 159 |
| 15. | వెంకటగిరి [illegible] బ్రహ్మచారి | 164 |
| 16. | గంగారాయుడు | 178 |
| 17. | గోవిందదాసు | 177 |
| 18. | సయ్యద్ అహ్మదలీషా ఖాదర్‌వలీ | 205 |
| 19 | ప్రతాప కోటయ్యశాస్త్రి | 225 |
| 20. | తూమాటి రామభొట్లు | 246 |
| 21. | గుంటూరు నల్లమస్తాన్ | 258 |
| 22 | అసురవాడి వెంకటసీతారామాచార్యులు | 282 |
| 23. | ఆళ్వారి వెంకటాద్రిస్వామి | 288 |
| 24. | తుంగదుర్తి బుచ్చయ్య | 295 |
| 25. | కృష్ణానందావధూత | 301 |
| 26. | తరికుండ వెంకమాంబ | 308 |

# శ్రీరామనామక్షేత్రము, గుంటూరు



శ్రీ కోదండరామప్రభువు

శ్రీరామచంద్ర సహాయాభిలాషి

# ప్రార్థన

కం. శ్రీరామనామసుక్షే ।
త్రోరుపవిత్రావనీశ । యోగిసంచయా
ధారా! గర్తనగరసం
చారా! కోదండరామ! జననుతనామా.

గీ. అల్పవిద్వాంసు దేహగే । హప్రసక్తు
నన్నుఁ గైకొని యుపకర । ణంబుగాగ
కర్తృభర్తృత్వసంపద । ల్గాంచుతావ
కీయలీలల వర్ణించి । కృపగడింతు.

గీ. కలనుమంత్రంబొసంగివి । ఖ్యాతవిశ్వ
రూపుజూపించి భయవృత్తి । రూపుమాపి
ఆంధ్రసద్భక్త సంగభా । గ్యంబొసంగి
పెంపుజూపుటయేకాక । విపులకరుణ
నాంధ్రదేశస్థక్షేత్రమ । హత్వమెన్న
విభవమునుజూడ నిచ్చెదే విశ్వనామ
రామనామోల్లసత్క్షేత్ర । ధామరామ.

కం. నీవాడించినమాటలె
దేవా! నీయంఘ్రిజేర్చి । తిగ్మసగనుమా
సేవకుడ సర్వదృశ్యము
నీవైయుండంగ నేను । నిలువంగలడే.

గీ. ఆత్మశక్తి బ్రసాదించి । యహమడంచి
తావకీయాంఘ్రిపద్మసేవావిభవ మొ
సంగిరక్షింపఁబ్రార్థితు । బెంగగొనను
వార్ధకంబున కది మీ । కృపార్ద్రదృష్టిఁ
గలుగనన్నేమిసేయఁగా । గలదు రాము
నామసుక్షేత్రధామ కోదండరామ.

గీ. అవనిజాధిపబ్రహ్మ వి । ద్యాప్రదీప
విదళితాశ్రితసంతాప । విశ్వరూప
భక్తజన భాగధేయ శో । భననికాయ
రంజితామరసముదాయ । రామరాయ.

గీ. గ్రహానికాయంబులోపల । గ్రాలువాఁడ
దేశకాలవ్యస్థల । దిరుగువాఁడ
పంచభూతాలలోసంచ । రించువాఁడ
నన్ను దయఁజూచికావుమో । సల్లవాఁడ.

గీ. తగినభక్తుల హృదయపద్మాల నితని
యంతరంగాననిలచి శ్రీ యాంధ్రభక్త
జీవితంబులగుప్పించి చెన్నుగనుట
గ్రంథకర్తృత్వసంపద రామభద్ర
తమకెజెందెను కాదను తలపుమాను
గర్తపురినేతవిమల వి ఖ్యాతచరిత
శ్రీశ శ్రీరామనామ సు క్షేత్రవాస
ప్రథితగుణసాంద్రకోదండ రామచంద్ర.

గీ. భక్తవత్సల రామకృపాసముద్ర
చందనాగరుచర్చల జర్మచక్షు
వుల గోచరసంగతి వెలయు నీవు
రమ్యమై దివ్యమైన వరాహనార
సింహరూపుడననుచు దక్షేత్రమందె
దర్శనంబిచ్చితివి మహాత్మ్యాత్మీయ
కరుణాజన్మాంతరంబుల మరువ రామ
నామసుక్షేత్రధామ కోదండరామ.

పష్ఠ్యంతములు

కం. శ్రీరామనామక్షేత్రో
ద్ధారికి గూర్రాఘుచయవి దారికి బృధుసం
సారికి గర్తనగరసం
చారికి గోదండ రామచంద్రవిభునకున్.

కం. శౌరికి నస్మద్హృదయవి
హారికి షడ్వర్గతిమిర హారికిబరమో
దారికి గర్తనగరసం
చారికి గోదండరామ । చంద్రవిభునకున్.

కం. సారసనయనునకు బుధా
ధారున కానందనిధికి దాపత్రియసం
హారికి గర్తనగరసం
చారికి గోదండరామ । చంద్రవిభునకున్.

కం. కారుణ్యజలధిరాకా
కైరవమిత్రునకు నమిత । గర్వనిభృతదై
త్యారికి గర్తనగరసం
చారికి గోదండరామ । చంద్రవిభునకున్.

కం. ధీరునకు మామకీప్సిత
పూరితచిత్తునకు ధ్యాన । పూర్ణునకుబుధా
ధారునకు గర్తపురసం
చారికి గోదండరామ । చంద్రవిభునకున్.

కం. వందనశతంబుతో భవ
బంధంబువిదల్చుకొనియె, భాగవతకథా
బృంధము విశ్వాత్మునకిడి
ఇందందివ్యక్తి యాత్మ దృగ్రితుడయ్యెన్.



శ్రీమత్

# ఆంధ్ర మహాభక్త విజయము

## త్రిలింగ క్షేత్రము

మన యాంధ్రరాష్ట్రమే త్రిలింగ క్షేత్రము. ఇది భారత స్వరాజ్యలక్ష్మికి శిరోభూషణము. క్షేత్రాధిపతులు ముగ్గురు. శ్రీశైలమల్లికార్జునుడు, ద్రాక్షారామభీమేశ్వరుడు, కాళహస్తీశ్వరుడు. మఱియు నిందు దివ్యస్థలములు పెక్కులు. అందు తిరుమల, ద్వారకాతిరుమల, సింహాచలము, అహోబలము, వేదగిరి, తిరుత్తని, అన్నవరము, భద్రగిరి ముఖ్యములు. ఈ పుణ్యస్థలము లన్నింటికిని స్థలపురాణములు గలవు. గాని ఇందు తూర్పుగోదావరి మండలమునం దలరారు భద్రాచల మాహాత్మ్యమును మాత్రము మా పాఠకుల కెఱింగించెద. ఇది వేదకాలమునుండి నేటివఱకు బుణ్యానిలయమై, భగవద్భాగవత సేవితమై, ఐహికాముష్మిక ఫలదాయకమైన దివ్య క్షేత్రమని పేరందినది. బ్రహ్మాండ పురాణమును దిలకించిన వారలకు భద్రగిరి మాహాత్మ్యము గరతలామలకము.

ము న్నొకప్పుడు మేరుగిరి తపంబొనరించి భద్రుడను పుత్రుని బడసి నాడు. ఆతండు గిరిరూప ధారియై దండకారణ్యమున గల గౌతమీ తటంబున స్థిరనివాసి యైనాడు.

సీతాలక్ష్మణ సహితుండగు శ్రీరామచంద్రమూర్తి తన వనవాస కాలమున దండకారణ్యమున సంచరించు కారణముగ నలసి సేదదీర్చుకొొన నెంచి భద్రగిరియం దాసీనుడై తత్సుఖస్పర్శ కలరుచు సంతసించి తద్గిరివరమును "అచలరూప భక్తుండవు గాగల"వని అనుగ్రహించె. "రామభద్రపదాంకత్వాద్భద్రాద్రిరితివిశ్రుతః" రామభద్రపాదచిహ్నాంకిత మగుట నా గిరి భద్రాద్రి యని పిలువబడుచున్నది.

తదుపరి భద్రుడు దీర్ఘతపంబుండ శ్రీరామమూర్తి ప్రత్యక్షంబై అర్చామూర్తిధారి నగుచు శాశ్వతముగనీయందు వసించి భక్తుల కిహపరముల సమకూర్పగల నని వరం బొసంగి, తమ్మల దమ్మక్క కారణముగ నిందు స్థిరనివాస మేర్పరచుకొని భక్తాభీష్టఫల ప్రదాతయై విరాజిల్లుచున్నాడు. తదాది భద్రాద్రి సర్వలోక పూజితమైయున్నయది. విశేషించి శ్రీరామనవమినాటి కళ్యాణోత్సవ సందర్భమున సహస్ర సంఖ్యాకులగు భక్తుల కత్యంత సేవ్యంబైయున్న దనుట సర్వు లెఱింగియే యుండిరి. స్థలమా - భద్రుడు వేలకొలందివర్షములు తపం బుండిన పవిత్రప్రదేశము. జలమా- గౌతమ మహర్షి వెంటనంటి గంగయను నామాంతరమున బ్రకాశించు గోదావరీ పవిత్రోదకము. దైవమా- కరుణాలవాలుండగు శ్రీ సీతారామమూర్తి. ఇట్లు పావనత్వమున కిక్కయగు పుణ్యక్షేత్ర మాచంద్రార్కము భాగవత సేవ్యమగుటలో నాశ్చర్యమేమి ? పురాణప్రసిద్ధిని వడసిన పావనక్షేత్రమును,

అందు స్థిరనివాసియైన, దైవమును జనసామాన్యమున కంద జేసిన భక్తాగ్రణి మన రామదాసు. భద్రాచలక్షేత్రచరిత్ర శ్రీరామదాసు చరిత్రతో ప్రారంభము. ప్రత్యక్ష శివస్వరూపు లగు ఆదిశంకరాచార్యవర్యులు గూడ భద్రగిరి సేవించి నట్లు రామకర్ణామృతమువలన వెల్లడియగుచున్నది. శ్రీ త్యాగరాజ స్వామివారు తనకీర్తనములందు గొన్నింటిచే భద్రగిరీశుని వర్ణించియున్నారు. ఇంకప్రస్తుత మనుసరించెద. మన త్రిలింగ క్షేత్రము కృష్ణా, గోదావరి, తుంగభద్రాది పుణ్యనదులకు బుట్టినిల్లు.

త్రిలింగస్వామి, వీరబ్రహ్మేంద్రస్వామి, వేమన మొద లగుయోగి పుంగవులకు నిలయము. వారణాసి వీధుల సంచ రించు త్రిలింగస్వామిని గాంచి నిజమైన విశ్వేశ్వరుడీతడని వచించిన శ్రీ పరమహంసరామకృష్ణుని కాలము వాడితడు. పుట్టుపూర్వోత్తరము లేమియు దెలియవచ్చినవిగావు. (లభించిన రెండవ సంపుటమున జేర్చి ధన్యుడనయ్యెద). ఈకాలమున గూడ ఆంధ్రగిరి కందరములం దక్కడక్కడ యోగిపుంగవు లగుపడుచున్నారను వదంతి గలదు. వదంతిమాత్రమేగాదు. ప్రత్యక్షముగాచూచి వారివలన మహోపకారముల నంది యిప్పటికిని సజీవులైయున్న ఒకరిద్దరిని వీడుచూచియున్నాడు. గణపవర పురవాసి, యొకరు రామభజనసేర్పుచు 'శొణిదెన' యందున్నాడు. ఒకనాడు, శొణిదెన వెంకటసుబ్బయ్యగా రరు దెంచి 'వెంకయ్యగారూ, మల్లాయిపాలెము నానుకొని దక్షిణ

మందున్న వీర్లకొండ కేగుదము రండి' అనిపిలచి వెంటగొని ఓష
ధులను సంగ్రహించు కొఱకు బయనించి, కొండనెక్కి అందందు
దిరుగుచు బైనగల గుహాద్వారముజేరిన తద్వారముఖమున
దిగంబరియైన జడదారి నొక్కనిఁగాంచి, నమస్కరించి యోగి
కనుసన్న గూరుచుండి స్వీయాగమన కారణ మెఱింగించి,
యనుగ్రహ మర్థించిన కృపాళుండై వెంకయ్యగారివలన రెండు
నూతన తాళపత్రముల దెప్పించి, వాటిని తన తొడలకు రుద్ది,
అందొకటి వెంకయ్యగారికిని మఱియొకటి వెంకటసుబ్బయ్యగారి
కిని యిచ్చెను. గాని యొకచిత్రముజరిగినది. వెంకయ్యగారికిడిన
తాళపత్రమునందు "హరిమర్కటమర్కటాయస్వాహా" అనుమం
త్రము వ్రాయబడియున్నది. దానిని జూచి వెంకయ్యగారిట్లనిరి.
'అయ్యా, మీయాజ్ఞప్రకార మీమంత్ర పునశ్చరణగావించెద'
తనభావిని గుర్తించుట బ్రతిమాలనవునకు విధియగుట భవిష్యచ్ఛు
భాశుభము లెఱింగింపుడన యోగిపుంగవులిట్లు సెలవొసంగిరి.
నీకు 'రెండవపెండ్లిగానున్నది' గాని ఆమెకొకస్త్రీసంతతి గలి
గినవెంటనే విడిపోవును. గాఢమైన బధిరత్వమేర్పడును. అరవై
యేండ్లవయస్సునుండి జీవితాంతము వఱకు స్వయంపాకివయ్యె
దవు. భయపడకు. భగవంతుడు వెన్నంటి కాపాడగలడు. సర్ప
వృశ్చిక బాధలెప్పుడు నిన్ను దేరి చూడలేవు. మీ యింటిపేరు
సోమరాజు వారుకదా ! ఇకబొమ్ము. 'వెంకటసుబ్బయ్య ఇది
వఱకే మంత్రోపదేశమును బొందినాడు గనుక దిరిగి వాని
కవసరములేదు'. పొండు అని త్వరచేయుచు గుహాలోని కరిగి

అంతర్ధాన మైనాడు స్వామి. ఈకొండయం దప్పుడప్పు డిట్టి మహాత్ములు గోపాలుర కగుపడుటచే వీర్లకొండయని దీనికి పేరు వచ్చినది. వీర్లనగా దయ్యాలు, దయ్యములరూపములతో మహాపురుషు లిందు దిగంబరులై జడదారులై యగుపడు కారణ ముగా నీకొండకీపేరువచ్చియుండనగు. ఇది 1920 సం॥ జరిగిన సంఘటన. పై వెంకయ్య సజీవి. మఱియొకయోగి కోటప్ప కొండపై నిరాహారదీక్షతో సంవత్సరకాలము తపంబుండి కార ణాంతరముచే వీర్లకొండ గుహ ప్రవేశించి పలువురకు మహోప కారముల గావించి పునీతులజ్జేసి అంతర్ధాన మైనాడు. వాని పోకడి యింతవఱకును దెలియఁబడదు. వీర్లకొండచెంతనున్న ఉప్మాగులూరి కొండగుహ మన సింగం గురప్పయ్యగారి తపో మందిరము.

మఱియు, మన త్రిలింగక్షేత్రము భక్తకవులకును, ప్రబంధకవులకును, నిలయము. రాళ్లకు జైతన్యము గల్పింప జాలిన శిల్పకళాకోవిదుల కాటపట్టు. దేశభక్తులకు నివాసభూమి.

భద్రాచల శ్రీరామమూర్తి తమ్మల దమక్క-కుమార్తె తెచ్చిన నివేదితాన్నము నారగించుటయు, శ్రీరామ దాసుగారి ఋణమారులక్షలరూప్యముల ప్రత్యక్షముగా రామ లక్ష్మణులు తానీషాకు జెల్లించి రశీదు తెచ్చి దాసునకిడి ప్రాణా పదనుండితప్పించిన కారణముగా నాంధ్రావనిప్రజలురామభక్తి పూరితులగుట నాకాలమున రామభజనలు మిక్కుటమయినవి. రామమందిము లేని గ్రామమే లేదని జెప్పుట అతిశయోక్తికాదు.

రామదాసుగారివలన మొలకెత్తి పందిలెక్కిన భక్తిలత తూము నరసింహదాసుగారి కాలమున నాంధ్రావనియం దంతట నల్లుకొని వెంకటరమణదాసుగారి దోహద క్రియవలన పుష్ప గుచ్ఛములతో విరాజిల్లుచు భారతదేశ మంతకును శోభ గూర్చినది.

తదుపరి సమర్థులగు భక్తులెవరును లేకున్కి విచారించిరో, ఆంధ్రజనాభా పెరుగుదల యోచించిరో, మఱి యే కారణమును పురస్కరించికొనిరో, గుంటూరునందు 'శ్రీరామ నామక్షేత్ర' మను పేరుతో రెండవ భద్రాద్రిని నిర్మించి తద్వారా పై భక్తిలతకు భగవానుడు తన నామజల మందింప జేయుచు త్రిలింగక్షేత్రము నుద్ధరించుచున్నాడు. భద్రాద్రి యందు సీతాకళ్యాణోత్సవముల మరపించు 'రామకోటియుత్సవము' లీరామనామక్షేత్రమున జరుగుట శ్రీకోదండరామ స్వామివారి కరుణగాక మఱియొండు కారణములేదు.

ఏతత్క్షేత్రపురోభివృద్ధినాశించుచు శ్రీరామచంద్రమూర్తికి గావించు వందనశతములతో నీశుభగాథ ముగించెద.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః



# మహాత్మ బమ్మెర పోతన

గీ॥ క్రిమత విజ్ఞాన భక్తివైరాగ్య మోక్ష
తత్త్వబోధానుగత లసద్భాగవత మ
హాపురాణంబు నిష్కామరూప మచ్చు
పడగ విరచించి రామునకిడిన పుణ్య
మూర్తి బమ్మెర పోతన కీర్తినెంచి
రామచంద్రుని గాంతు దుర్భవ మడంతు.

భగవంతుని యందుగల గాఢానురాగమే భక్తి. సత్య వస్తువన భగవద్భక్తి యొక్కటియె. భక్తిపెంపున బులకాంకిత గాత్రులయినవారే ధన్యమూర్తులు. స్వార్థరహితమైన భక్తి కఖండశక్తి కలదు. పాషాణమునకు దైవత్వము ప్రసాదింప గలదు; మృతశరీరమును బ్రతికింపగలదు. కృతార్థత్వమాశిం చిన నిట్టిభక్తి నార్జింపదగు. విశ్వాసయుక్తమైన భక్తివలననే ధన్యతనందుట. భక్తి, భగవంతుడు వేఱు వేఱు పదార్థములు కావు. పవిత్రహృదయు డొక్కండుమాత్ర మీరహస్య మెఱుంగగలడు. ఇట్టిభక్తి లభించినవాడే బంధముక్తుడు. భక్త్యా నుభవములేని హృదయము మరుభూమియని చెప్పకతప్పదు. భక్తియుక్తమయిన హృదయ మీశ్వరాభిముఖమైయుండును. ఈశ్వరాభిముఖమైన మనస్సు గలవానికి తాపములన్నియు హరించును. ఆపదలు దరిజేరవు. ఇట్టి మహాభాగ్య మార్జించి నవారు విషయవాసనలకును, ప్రాపంచిక కర్మలకును దూర ముగ నుండగలరు. త్రికరణశుద్ధిగ నవవిధభక్తి సాధనలయందే

యొక్కటిగాని, అన్నియుగాని నాశ్రయించి కృతకృత్యత నందవలయు.

కం॥ ఒకపరి జగములు వెలినిడి
యొకపరిలోపలికి గొనుచు నుభయము దానై
సకలార్థ సాక్షియగు న
య్యకలంకుని నాత్మమూలు నర్థి దలంతున్.

అనుభాగవత ధర్మమును ముఖ్య లక్ష్యముగ సాధన సాగింపవలయు. ఇట్టిభక్తి నార్జించిన పుణ్యామూర్తి మనపోతన కవుడుగట్టిన భక్తితత్త్వముగ ప్రసిద్ధిచెందిన పుణ్యామూర్తి. భోగ తృష్ణను మొదలంట గోసివేసిన త్యాగజీవియైన మహాత్ముడు.

తండ్రి కేసన. తల్లి లక్కమాంబ. జనన కాలము క్రీ. శ 15 వ శతాబ్దము. వృత్తి వంశపరంపరాయత్తమైన వ్యవసాయము.

ఈతడు బాల్యమునం దొకనాడు తన యావును మేపు కొనుట కడవికి తోలుకొనిపోయి తానొక వృక్షచ్ఛాయ గూర్చునియుండె. ఆయావు అడవియందందు మేయుచు నొక పొదరింటికడ కేగి, మిఱ్ఱి మిఱ్ఱి చూపులతో నిలువబడి, బెదరిన దానివలె గన్పించిన పోతనలేచి ఆవునుజూచి, దరిజేరి, వెన్ను జరిచి, పొద తిలకించిన, అందుపన్నగ భూషణుడైన సాంబ మూర్తి తన కంటబడిన నప్రయత్నముగ నేత్రములు మూత బడి నిశ్చేతనుడై కొంతవడికి కనులువిప్పి, పొదవంకకు తన చూపునుద్రిప్పి, భుజగాభరణవిరహితుడై తేజఃపుంజ విరాజ

మానుడగు మహాదేవుని వీక్షించి, చేతులు ముకుళించి యనేక విధముల బ్రస్తుతించిన, చిఱునవ్వు వెలయించుచు పార్వతీపతిచే సన్నఁజేరి మనపోతనను తన తొడనిడుకొని చుంచుదువ్వి, చెక్కిలి ముద్దుగొని "శ్రీరామ ప్రసాదసిద్ధి రస్తు" అని యాశీర్వదించి అంతర్ధానుడగుటయు, మన భక్తశిఖామణి తల్లిని గోల్పడిన బిడ్డవలె ఘోషించి, యట్టకేలకు శాంతివహించి గోవును కద లించుకొని, యిల్లుజేరి జననీజనకుల కీవృత్తాంత మెఱింగించి సంతోష తరంగిణుల నోలలాడుచుండె.

పదునాల్గవ వర్షప్రాయము గడచినది. అనుకూలవతి యగు మహాలక్ష్మిని తండ్రియాజ్ఞ బరిణయమందినాడు. ఈమె నీడవలె భర్తననుసరించి వర్తించు బరమసాధ్వీమణి. సంసారదుఃఖములకు లోనుగాక, కవితాస్రవంతికి మార్గదర్శకుడై, కవితల్లజుడై పేరొందినవాడు మన పోతన.

ఈతడు నిరాశాజీవి. ఉన్నదానితో తృప్తినందు స్వభావముగలవాడు. అప్రయత్నముగ లభించిన కవితా మహాభాగ్యమువలన నానందసాగరమున నోలలాడుచున్నాడు. కవితా సామ్రాజ్యమలవడిన కవిచంద్రు డల్పసుఖము లాశించునా?

ఈతడు ప్రథమమున 'వీరభద్రవిజయము' రచించి మహాదేవుని కర్పించినాడు. 'భోగినీదండక' మీతని విరచితమే. పది యారవయేట జిదానందయోగి దర్శనమబ్బినది. తన కవిత్వ మాధుర్యముతో నాతని తృప్తిపరచినాడు. యోగి సంతో

షము నభినయించుచు "బిడ్డా, నీవు భక్తకవివై లోకకల్యాణ మొనరింపనున్నావు. తప్పదు." అని వచించినాడు. అంతనా యోగివలన తారక మంత్రమును గ్రహించి ధన్యుడైనాడు. "యోగివలన, రామానుగ్రహమువలన, నీవు తరించుటయే గాక లోకము నుద్ధరింపగలవ" ను ఆశీర్వాదముగూడ పొందినాడు. తదుపరి యచిరకాలముననే శ్రీరామానుగ్రహపాత్రుడైనాడు. కాలము మంచిదైన సర్వభాగ్యములు తమంత తామే వచ్చునుగదా !

రామానుగ్రహమువలన సమస్త విద్యలు కరతలామలకములైనవి. ఇప్పుడు ఎఱుంగని శాస్త్రములుగాని, అలవడని కళలు గాని పోతనకు లేవు. సర్వవిజ్ఞానమును హస్తగతమైనది.

ఇతని కవిత నిర్మలమై, నిరుపమానమై మెఱుగులు తేరినది. జనరంజకమైనది. ఇప్పుడు మనభక్తకవి పులు గడిగిన రత్నమైనాడు. సహజపాండిత్య పోతనామాత్యుడైనాడు.

ఈతని కొకనాటి స్వప్నమున

సీ॥ మెఱుగు చెంగటనున్న మేఘంబు కైవడి
నువిద చెంగటనుండ నొప్పువాడు
చంద్రమండల సుధా సారంబు పోలిక
ముఖమున చిరునవ్వు మొలుచువాడు
వల్లీయుత తమాల వసుమ తీజముభంగి
బలువిల్లు మూపున బరుగువాడు

నీలనభాగ్ర సన్నిహిత భానుని భంగి
ఘన కిరీటము దల గలుగువాడు
గీ॥ పుండరీకయుగము బోలుకన్నులవాడు
వెడద యురమువాడు, విపుల వక్షము వాడు...

అయిన రాజముఖ్యుడొకడు స్వప్నమున సాక్షాత్కరించి భాగవత మనువదించి తన కంకిత మీవలయునని అర్థించినాడు.

ఈమాట విని పులకిత గాత్రుడై

కం॥ పలికెడిది భాగవతమట
పలికించెడివాడు రామభద్రుండట నే
పలికిన భవహరమగునట
పలికెద వేఱొండుగాథ బలుకగనేల.

అని ఆంధ్ర మహాభాగవత రచనకు మొదలిడినాడు. ఇప్పుడు ఆధ్యాత్మిక శాస్త్రమగు సంస్కృతభాగవతము మహాకావ్యముగ మారినది. సాధారణముగ భక్తులెల్లరు నిరుపేదలై యుండెదరు. వారలవలెనే పోతన దారిద్ర్య మనుభవించుచున్నను చలింపనిభక్తి గలవాడై యున్నాడు. భగవంతు డెవని యనుగ్రహింపదలుచునో ముందు వాని నైశ్వర్యము హరించుననుట యదార్థమైనది. ఈదరిద్రస్థితిలో భాగవతకృతి అమ్మునో? ఏమో? యని శంకించి సరస్వతి ఈతని యెదుట సాక్షాత్కరించి కన్నీరు తనపమిట చెంగుతో తుడుచు

కొనుచుండుట చూచి, "అమ్మా! భారతీ, ఊరడిల్లు మూరడిల్లుము. కర్ణాట కిరాత కీచకులకమ్మ" నని శపథము చేసి ఆమెను తృప్తిపరచెను.

సింగభూపాలుడు ఆంధ్రభాగవతమునకు తనను కృతి భర్తగా జేసిన నగ్రహారాది సత్కారముల గావింతునని కబు రంపిన, నిరాకరించిన ధీరుడు మన పోతన.

మన భక్తాగ్రణికి లోకానుగ్రహ కాంక్షతప్ప తుచ్ఛ విషయేచ్ఛలేదు. అంత సింగభూపాలుడు కోపించి పోతన కృతి రత్నములను నేలగల్ప దలంచినాడు. తన జీవితమున నది యొకనల్లమచ్చయని తలంపక పగసాధింపజూచినాడు. ఇది పోతనకు తెలియవచ్చినది. సింగభూపతి ఏమిచేయునో అను భీతిచే తన భాగవతమును భూస్థాపిత మొనర్చి రక్షించు కొని నాడు. ఇందువలన కొన్ని భాగములలో పోతన రచనలు చెడి నవి. శిథిల భాగములను నేర్చూరి సింగన, వెలిగందల నారన పూరించి గ్రంథభాగము కొరవపడకుండ చూచినారు. ఈ ఆంధ్ర మహాభాగవతమున భక్తిస్వరూప స్వభావముల సర్వ జనాదరణీయముగ నిర్వచించుటయేగాక తాననుష్ఠించి చూపి నాడు. ఈతని భక్తిమార్గములె తెలుగువారి భక్తిమార్గ ములు. పోతన భాగవతమే తెలుగువారి ముక్తిగ్రంథము. పోతన భక్తిలో శివకేశవులకు భేదములేదు. సగుణాద్వైత భక్తియన నిదియె. పరమేశ్వరుడు ప్రపంచమంతటను వ్యాపించి

యున్నాడు. ఎవరి నుపాసించినను, దేని నారాధించినను భగవంతుని నారాధించుటయే యగును. భగవదారాధన రూపమగు భక్తికి ప్రభువు సర్వేశ్వరుడు. ఈభక్తికి శమదమాది గుణములు, శ్రవణసఖ్యకీర్తనాది నవవిధ భక్తిమార్గములు సాధనములు.

భగవంతునియందు నిరంతర తన్మయావస్థ భక్తుని కావశ్యకము. భగవద్రూపమున దేని నారాధింప గలిగినను, అదియెల్ల భక్తి యనిపించుకొనును. ఇట్టిభక్తి ననుష్ఠించువారెల్లరు భాగవతు లనిపించుకొని భగవదనుగ్రహామునకు బాత్రులగుదురు.

ఉ॥ ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపల నుండులీనమై
ఎవ్వని యందుడిందు బర మేశ్వరు డెవ్వడు మూలకారణం
బెవ్వ డనాదిమధ్యలయు డెవ్వడు సర్వముదానయైన వా
డెవ్వడు వాని, నాత్మభవు, నీశ్వరునే శరణంబువేడెదన్.

అని వర్ణించిన ఆత్మస్వరూపమగు ఈశ్వరతత్త్వమే శ్రీ మహావిష్ణువుగా బరిగ్రహింపదగు.

ఆత్మస్వరూపి, సర్వాంతర్యామిఅగు నతని బొందుటకు భక్తి సాధనము. భక్తినార్జించుటకు సర్వభూత సమహితత్వమావశ్యకము.

వినయ పూర్వక మనవి. మనపోతన భక్తియే తెలుగువారి భక్తియని మాత్రము. ఇట్లు భక్తిజ్యోతి ఆంధ్ర మహా

భాగవత రూపమున అసామాన్య తేజముతో తేజరిల్లజేసి యాంధ్రుల అజ్ఞానాంధకారమును పటాపంచ లొనరించిన భక్తశిఖామణికి ధన్యవాదములు.

పలువురు చారిత్రకులు పలువిధములైన శ్రీవారి ప్రభావముల గ్రంథస్థముల గావించుట గ్రంథవిస్తరభీతి వదలితి, పాఠకులు క్షమింతురుగాక.



# యోగిరాజు వేమన

"నామనస్సు" అనువ్యవహార ముండుటచే ఆమనస్సు నీవు గాదు, నీవు యజమానివి. నీదాసి మనస్సు. నీవెప్పు డును సుఖ మపేక్షించుచుండుస్వభావముగలవాడ వగుట సుఖస్వరూపుడవై యున్నావు. మనస్సును త్రోసివేసిన సుషుప్తియం దనుభవించిన శాంతియే నీ స్వరూపమని తెలియబడును.

తలంపులగుట్ట మనస్సు. సుషుప్తియందు తలంపులు లేవుకనుక మన స్సుండియు లేనిదైనది. జాగ్రత్స్వప్నముల యందు తలంపు లున్నవి గనుక, మన స్సున్నది. అనగ, మన స్సుండిన జగమున్నది. మనస్సు లేకుండిన జగత్తు లేదు. నిన్ను నీవు జూచుసాధన బలపడినకొలది క్రమముగ జగ త్తంతరించుచున్నది. జగత్తును చూచునపుడు నిన్ను నీవు జూడలేవు. ఈ శరీరమునందు "నేను" అనుతలంపు మొదట హృదయమునుండియే బయలుదేరినది, కనుక మనస్సునకు హృదయమే జన్మస్థానము. నీ స్వస్వరూప మనుసంధించిన నీచోటికే నిన్ను తీసుకొనిపోవును.

మనస్సునదోచు తలంపు లన్నిటికి "నేను" అను తలంపు మొదటిది. ఈతలంపు లేచినతరువాతనే లెక్కలే నన్ని తలంపు లుద్భవించుచున్నవి. "నేను ఎవడను?" అను విచారముచే మన స్సడంగును. "నే నెవడ" ననువిచారము వేఱుతలంపుల నాశముచేసి మనస్సును నాశము చేయును.

మనస్సునందు లేచినతలంపుల గార్యరూపమును ధరింపనీక "ఈ తలంపు లెవనికి గల్గినవి" అనివిచారించిన, ''నాకే'' అని తోచును. ''నేను ఎవడను?'' అనివిచారించిన ''సుఖస్వరూపుడ" ననుట వెల్లడి యగును. దానితో మనస్సనునదియే లేదని తెలియును. అనగా మనస్సు తనజన్మస్థానమును జేరి సుఖించు ననుట.

ఈవిధమైన యభ్యాసము కానుకాను మనస్సునకు తనజన్మస్థానమందు నిలకడజెందుశక్తి యధికమై క్రమక్రమముగా తాను తానై విరాజిల్లును. ఇట్టిసాధనయందు కృతార్థత గడించినవాడే మన వేమనయోగి.

(ఈ మహనీయుడు క్రీ. శ. 1412 సం॥ నందననామ సంవత్సర కార్తిక శుద్ధ పూర్ణిమనాడు జన్మించినాడు. ఈతని తండ్రి తుంగకేశవుడు. తల్లి అచ్చమ్మ. సోదరులు బాపన, కేశవుడు, నారాయణ. వాసము కొండవీటియందలి పడమటి వీధి. తండ్రి రాజాస్థానమం దధికారి. ధనికుడుగూడ. భక్తి జ్ఞానవైరాగ్యము లీతని పట్టుకొమ్మలు. తండ్రిగుణగణములే మన వేమనయందు మూర్తీభవించినవి.)

చిన్నతనమునుండి చాల గారాబముతో బెఱిగినాడు. పిన్ననాడే తలిదండ్రులు గతించుటచే అన్నచేత బెంపబడినాడు, ''తండ్రిలేని బిడ్డని'' గారాబముచే పెంచినాడు. ఇందువలన విద్యాబుద్ధులు కొరవడినవి. చదువుట, వ్రాయుట మాత్రము నేర్చినాడు. (పిన్ననాటినుండియే ఈతనికి గవిత్వ

మబ్బినది. ఆశు కవిగూడ. స్వేచ్ఛావిహారి.) దుష్టసహవాస మున కలవాటుపడినాడు. భోగస్త్రీలకు దాసుడై సర్వస్వము వారి కర్పించినాడు. దుర్వ్యసనములకు లోనై వదినెగారి యాభరణములనైతము ధారబోసినాడు. ఆమె జేసిన యుప దేశమే, దుర్వ్యసనములనుండి తొలగించి గృ హ స్థ గా జేయగలిగినది

వివాహమైనది. కుటుంబభారము పైబడుట, స్వర్ణ యోగ మలవరచుకొన బ్రయత్నించినాడు కాని లభ్యపడ లేదు. పిదప (లంబికాశివయోగి దర్శన మబ్బినది. దాన వైరాగ్య మలవడి ఐహికచింత తొలగినది. యోగాభ్యాసచింత బలపడినది. భోగాశ నాశనమైనది. జ్ఞానసిద్ధి నాశించి తత్త్వోప దేశమునకై జీవితము వెచ్చించినాడు.)

- కొండవీటికి దాపుననుండు గుహలో జ్ఞానయోగి యుండె నని విన్నాడు. అభిరాముడను విశ్వబ్రాహ్మణుడు జ్ఞానయోగి మిత్రుడు. ఈ యోగిపుంగవుడు అభిరాముని గటాక్షింప నెంచి ముహూర్తము నిశ్చయించి, తత్త్వోపదేశమునకై రా నాజ్ఞాపించినాడు. ఈ వృత్తాంత మెఱింగి అభిరాముడు తన యన్నకడ నుద్యోగియగుట దీరనిపనిగల్పించి పంపి, తా నా యోగిని దర్శించి, తనను అభిరాముడుపంపినటుల బొంకి, ముహూర్తాతిక్రమణమునకు సహింపలేని యోగివలన దత్త్వోప దేశమును బొంది ధన్యుడైనాడు.

(మన వేమనకు "ఆత్మజ్ఞానము" కరతలామలకమైనది. యోగసిద్ధియు, జ్ఞానసిద్ధియు లభించినది. వీనిలక్ష్య మిప్పుడు సర్వసంగపరిత్యాగమే, స్వపరభేదము లేదు. లోక మీతని కుటుంబము. సన్యాసియైనాడు!

ఈకాలమున లోకమునందు దైవభక్తి సున్న. ఆధ్యాత్మికచింత శూన్యము. అవినీతి మిక్కుటము. (ఇప్పు డీతడు లోకమున కిట్లు బోధించినాడు. "సత్యము దప్పరాదు, అకృత్యము లాచరింపరాదు, తనతో సమానముగా సర్వప్రాణులను జూడవలయు, ధర్మమే జయము" అని!

దేశదేశాలు తిరిగినాడు. తత్త్వదృష్ట్యా లోకము వీక్షింపసాగినాడు. కొంకుజం కెఱుంగక దా నెఱింగిన సత్యమును బోధించినాడు. (ఈతడు కావించిన నీతులన్నియు తేటగీతలలోను, ఆటవెలదులలోను వెలువడినవి. ఇట్టిపద్యములు వేలకువేలు. గాని రెండువేలుమాత్రి మగుపడుచున్నవి. పుణ్యకర్మాచరణమునకు జిత్తశుద్ధి అవసరమను అర్థమిచ్చు "చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా" అను గీతచరణమును వెలయించినాడు. మతములు భిన్నభిన్నములుగా నున్నను నిరూపించుతత్త్వ మొక్కటియే యని బోధించినాడు.)

ఇట్టిబోధల నెన్నిటినో వెల్లడించినాడు. అభిరాముని వలన తనకుజరిగిన మహోపకారమునకు గృతజ్ఞత జూపినాడు. ఈత డద్వైతి. ఉపాస్యమూర్తి శివుడు. (ఎవ రేయే దేవతల బ్రేమించినను మోక్షసిద్ధిలభించు ననుస్వానుభవ

మును వెల్లడించినాడు. భక్తి జ్ఞానమున కంగము. జ్ఞానాధికారికి గర్మాచరణ మనవసరము. జ్ఞానము యోగసిద్ధి కత్యంత సన్నిహితము. "యోగమే జ్ఞానము, జ్ఞానమే యోగము" అని వీరి భావము.

వీరిసాధన లివి, నీతు లివి—

గీ॥ నిన్ను జూచుచుండ నిందును తత్త్వంబు
తన్ను జూచుచుండ దగులుమాయ
ని న్నెఱింగినపుడె తన్ను దా నెఱుగుట
విశ్వదాభిరామ వినర వేమ.

గీ॥ ఆలు మగనిమాట కడ్డంబు జెప్పిన
ఆలు కాదు నుదుటి వ్రాలుగాని
అట్టియాలి విడచి యడవినుండుట మేలు
విశ్వదాభిరామ వినర వేమ.

గీ॥ లోభివాని జంప లోకంబులోపల
మందులేదు వేఱు మతముగలదు
పైక మడిగినంత భగ్గునబడిచచ్చు
విశ్వదాభిరామ వినర వేమ.

గీ॥ సకలతీర్థములను సకలయజ్ఞంబుల
దలలుగొఱుగకున్న ఫలములేదు
మంత్రిబలముకన్న మంగలిబల మెచ్చు
విశ్వదాభిరామ వినర వేమ.

ఇట్లే అనేకనీతులు బోధించినాడు—

గీ॥ దేవుడనగ వేఱు దేశమందున్నాడె
దేహియగుచు నెక్కి దేహరథము
వాహనములగట్టి వడి దోలుచున్నాడు
విశ్వదాభిరామ వినర వేమ.

గీ॥ నాకు నెవరు దిక్కు నడినాళమందున్న
వేగుచుక్కవంటి వెలుగె దిక్కు
వెలుగుకంటెదిక్కు వేరెవ్వరున్నారు
విశ్వదాభిరామ వినర వేమ.

ఇట్లాధ్యాత్మికమునుగూడ బోధించినాడు. గ్రంథవిస్తర భీతి విరమించితి.

---

వరా:— శ్రీవారి జీవితగాథలో జరిత్రకారులు పలువిధములైన పరిభావ ములగ్రంథములలో జేర్చియున్నారు. చర్వితచర్వణభీతి జైకొన నింతలో విరమించితి.

వీరికులమువారు కదిరితాలూకా, నల్లచెర్వు, కౌరుపల్లెలలో నున్నారు. వీరు శ్రీవారి సమాధులకు ధర్మకర్తలుగూడ.



# భక్తాగ్రణి భద్రాద్రి రామదాసు

మన యిష్టదైవమైన నిర్గుణనిరాకారపరబ్రహ్మమగు శ్రీరామచంద్రుని జూచుటకే మానవజన్మ వచ్చినది. మనకును రామునకును నడుమ భేదింపరాని తెర యున్నది. అదియే సత్త్వరజస్తమోమయమయిన మాయ. దానిని దొలగించినగాని యత డగుపడడు. ఈ మాయవినోదము వర్ణింపరానిది. ప్రపంచమంతయు మాయాకార్యమే. దీని వినోదమున మైమరచి మోసపోవుచున్నాము.

దీని బహిరంగరూప మెనిమిదివిధములుగా నున్నది. అవి ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి, మనస్సు, బుద్ధి, అహంకారము. స్వభావమున లేక, నున్నటు లగుపడునది యీ మాయ. మనము చూచునది, చేయునది, తినునది, వినునది, సర్వము అనగా ప్రపంచపోకడలన్నియు, కనుపడు పదార్థాలన్నియు మాయామయములు. ప్రపంచరచనాక్రమమునే కర్మ యనెదరు. దేహేంద్రియాలకు గారణముగా మాయ యున్నది.

ఈ మాయ పరమాత్మయగు శ్రీరామునినుండియే కలిగినది. ఎందులకు గలిగినది, ఎట్లు కలిగినది, ఎవరును చెప్పజాలరు. ఇది సృష్టికిబూర్వ మవ్యక్తరూపమున నున్నది. ఈనాటి వ్యక్తరూప మానాడు లేదు. మాయాకార్యమైన ప్రపంచము ప్రళయములో నశించునుగాని,

మాయమాత్రము నశింపదు. ఇది పరమాత్మనుండి ఎప్పుడు వచ్చినదియో ఎవరును చెప్పజాలరు. గాని దాని యథార్థ స్వరూప మెఱింగినవారినిమాత్రము కన్నెత్తియైన జూడ జాలదు. ఇట్టివాడే జ్ఞాని. సత్కర్మదుష్కర్మ లన్నియు మాయామయము లగుట వీని కెఱుకయే. సత్కర్మవలన నుత్తమజన్మ, దుష్కర్మవలన నీచజన్మ; సత్కర్మవలన సుఖము, దుష్కర్మవలన దుఃఖము. ఇదియే మాయానాటకము. అన్నికర్మలు బంధకములే.

ఈ మాయాప్రభావముతోనే పశువుగా, పక్షిగా, మానవుడుగా, దానవుడుగా, నానారూపాలతో బ్రకృతి తోచుచున్నది. అసంగస్వభావుడైన జీవుడు మాయకు లొంగి సంసృతిలోబడినాడు. కర్మల నభిమానించుటయే మాయలో దగుల్కొనుట. లేని ప్రపంచము లేనిదానిగా గాని. లేక భగవత్స్వరూపముగా గాని తలంచి యారూఢ స్థితిని గడంచినవాడే భక్తుడు. ఈ రెండుస్థితులను క్రమముగా గష్టములకోర్చి సాధించిననాడే గమ్యము లభించును. పలు కష్టములరికోర్చి, "మళ్ళీజన్మాలకు రాముమదిలో నుంచండి" యని గంటగట్టి సాటించిన భక్తాగ్రణి మన కంచర్ల గోపన్న (రామదాసు). ఈతడు స్వప్రయత్నముపై జిజ్ఞాసభక్తిని గడించి రఘునాథభట్టరాచార్యులగారివలన దారకమంత్రి మార్జించి "ఏడనున్నాడో, శ్రీరాము డేడనున్నాడో" అని భగవంతుని వెదకుచు, నార్తభక్తియు "ఇక్ష్వాకుకులతిలక యికనైన బలు

కవే'' అని పాడుచు, సర్వార్థిభక్తియు గ్రమముగ ''అంతా రామమయం, జగమంతా రామమయ'' మనిపాడుచు, విశ్వ రూపోపాసనజేసి ''ఎందుజూచిన నీదు అందమే కనుపడె'' ననుచు తన సాధనాఫలమును వెల్లడించి, మళ్ళీజన్మానికి రానని స్వానుభూతి వెల్లడించిన పుణ్యమూర్తి శ్రీభద్రాద్రి రామదాసు.

తండ్రి లింగనమంత్రి. తల్లి కామాంబ. ఆదిశాఖా బ్రాహ్మణుడు. నివాసము నైజామురాష్ట్రములోని నేలకొండపల్లి. క్రీ॥ శ॥ 17వ శతాబ్దమున భద్రాచలసమీపమునగల భద్రరెడ్డి పాలెములో శబరి కులమునకుజెందిన తమ్మల దమ్మక్క యను భక్తురాలైన పూర్వసువాసినికి స్వప్నములో శ్రీ సీతారామ చంద్రులు దర్శనమిచ్చి, సమీపారణ్యమున దాళివృక్షముల పొంత నర్చామూర్తిగా దాను సీతాలక్ష్మణులతో నున్నా నని జెప్పి యంతర్ధానమగుట, మరునాడు వెదకి భద్రగిరి పైన స్వాములగాంచి, ఆనందముతో నాతాళిఫలముల నివే దించుచు ఆమె కాలము గడిపెను.

స్వామి స్వప్నమున నామెకు శ్రీరాములు ''నీకు సహాయుడుగా నచిరకాలమున మఱియొకవ్యక్తి రాగల'' డనిచెప్పిన వాక్యము ననుసరించి మన రామదాసుగారు పాలవంచతాలూకా తహసీల్దారుగా నేగి, 1670 సం॥ మొదలు కొని 1674 వఱకు శ్రీరామాలయ నిర్మాణకార్యక్రమ మున మగ్నులైయుండి కృతార్థు డయ్యెను.

ఒకానొకసమయమున మన గోపన్నకుమారుడు గంజి గుంటలో బడి మృతినందిన, "ఏబుద్ధి వీడు, ఎఱుగనివాడు, పాపడు వీడు బడలియున్నాడు, పాపనులేపి బాధలుమాన్పి ఆపదబాపి అటు కృపజూపి" అని పాడి రాముని మెప్పించి పిల్లవానిని బ్రతికించుకొనినాడు.

చేత చిల్లిగవ్వయేనియు లేకపోయినను, సాహసించి ఖజానాద్రవ్యము వెచ్చించి, ఆలయముపని పూర్తిగావించి నాడు. రెండుమూడుమండపములు, గోపురములు, ప్రాకార ములు, వాహనములు నిర్మింపించుటయేగాక, జింతాకు పత కము, పచ్చల పతకము, బిళ్ళల మొలత్రాడు, రవ్వలకుండ లములు, చెవిపోగులు, నీలాలపోగులు, కిరీటములు, గొలుసు, మంగళసూత్రము, కలికితురాయి మొదలగు బంగారునగలు గూడ చేయించినాడు. ఖజానాపైకము పూర్తిగాబడినది. ఈ వ్యయము దాదాపు ఆరులక్ష లైనది. తానీషాభటులు సర్కారుఋణము చెల్లింపనికారణమున బంధించుకొనిపోయిరి. గ్రామస్థులు తదృణము దీర్ప సిద్ధపడిరిగాని గోపన యొప్పు కొనలేదు. గోల్కొండ కారాగారమున బందియై పండ్రెండు వత్సరములు బాధపడినాడు.

తనసాహిత్య ప్రగతిచేత అప్పటిపరిస్థితులు కీర్తనల ద్వారా, దాశరథీశతకముద్వారా ఆంధ్రలోకమున కందించి భక్తలోకమునకు, భాషాసాహిత్యమునకు వెలలేని సేవ చేసి నాడు. భగవత్పరీక్షలో నెగ్గినాడు. మాయ దాటినాడు.

శ్రీరామునికరుణ కార్యరూపము ధరించినది. తానీషా కడకు రామలక్ష్మణులు మారురూపములతో వచ్చి రామ రాజ్యమునాటి బంగరునాణెములు కుమ్మరించినారు. తానీషా ఆశ్చర్యభరితుడైనాడు. వారికి రశీదిచ్చి పంపినాడు. తానీషా రామదాసునిమహిమ నెఱింగి రామదాసున కాద్రవ్యమం తయు నర్పింప న దుల కిష్టపడక నా నాణెములందు రెండిం టినిమాత్రము గైకొని దాసుగారు భద్రాద్రి జేరినారు.

ఆ రెండునాణెములు నేటికిని రామాలయమున నర్చింప బడుచున్నవి. ఈ దృశ్యమువలన చరిత్ర యెంతసత్యమో బోధపడుచున్నది. రామదాసు చేయించిన నగలన్నియు భద్రా చలమున నద్దములతో బొదుగబడిన ఇనుపబీరువాలోనుంచి నేటికిని ప్రదర్శింపబడుచున్నవి.

రామదాసుగారు 1670 సం॥లో తహశ్శీల్దారు పదవి పొంది, 1674 సం॥ వఱకు రామాలయాది నిర్మాణముల గావించి, 1686 వఱకు కారాగారవాసముండి తిరిగి భద్రగిరి కేగి, స్వామికళ్యాణములు గావించుచు గాలము గడిపి శరీ రము జాలించినారు. నబాబులలో జివరివాడగు తానీషా 1887 సంవత్సరమున ఔరంగజేబునకు వశుడైనారు.



# భగవాన్ ములుగు పాపయారాధ్యులు

ప్రతిమానవునకు, బాల్య, యౌవన వార్ధక్యములయం దెప్పుడో ఒకప్పుడు సహజముగ జ్ఞానోదయంబగును. అప్పుడు తగినదోహద మలవడిన, బరమాత్మానుగ్రహము లభించును, కాన, జ్ఞానోదయమైన వెంటనే ఈశ్వరానుగ్రహమార్జించుట కారంభింపవలయు.

సంపూర్ణముగ నిహసుఖములనుభవించి, ముసిలివయసున, భగవత్కృప గడింపవచ్చునని, జీవితము లస్థిరములగుట దెలిసియు, గాలమువ్యర్థపరచుట శ్రేయస్కరముగాదు.

గతించిన రోజులు తిరిగిరావు, కాలమమూల్యము. బాల్య, కౌమారదశలందు, బరమేశ్వరానుగ్రహము సంపాదించు టసంభవమని తలంపరాదు. ధృవాదులు బాల్యము ననేగదా భక్తినార్జించినది. ఒకడు చేసిన దుర్ఘటకార్య మింకొక డెందులకు జేయజాలడు? సమర్థతా సమర్థతలు దేహములో లేవు. అవి బుద్ధికి సంబంధించినవి.

రంగు క్రొత్తగుడ్డకు బట్టినట్లు పాతగుడ్డకు బట్టునా? బాల్యదశయందు మనంబు కోమలమైయుంట భక్తిసులభముగ నలవడును. ఇది తెలిసియే మనకు బంచాక్షరితో నక్షరాభ్యాస మొనర్చినారు, గాని వాతావరణ మనుకూలింపమి చౌటి భూమియందు నాటిన వి త్తనమైనది. అటుగాక వెంటనే దోహద మలవడిన నాభక్తి చెట్టై, మ్రానై, పూలుపూసి కాయలు

కాని పండ్లుపండి అనుభవమునకు రాకపోయెడిదికాదు. ఈ భక్తినిధి బాల్యమున లభింపనిచో యౌవనమందైనను, మఱి ప్పుడైనను భక్తిజిజ్ఞాస గలిగినవెంటనే మొదలిడి, భగవదను గ్రహము గడించుటకు యత్నించిన, మరుజన్మమందైనను కార్యసిద్ధి లభించును ఈ రహస్యమనుసరించి పూర్వవాసనా బలము ముందునకు దోయు.

సీ॥ సంస్కృతాంధ్రోన్నత సాహితీగరిమంబు
బాలత్వమున నుగ్గు, బాలుగాగ
బహుపదార్థరసస్వ భావపరిభావంబు
పిన్నతనంబున, వెన్నగాగ
నవనవకల్పనా నంతసామర్థ్యంబు
చిరుతప్రాయముననే చిగురుగాగ
సర్వవిజ్ఞాన ప్రసన్న ప్రసాదంబు
సహజప్రసాద భూషణముగాగ
గీ॥ దాలి, మెసవి, తొడిగి, దాల్చు శోభారతి
భారతీ సుతాను భావమొంది
ప్రబలచుండు ములుగు పాపయారాధ్య ప్ర
సూక్తి సకలకావ్య శక్తి భక్తి.
అని పొగడిక గొనినాడు.

తండ్రి వీరేశ్వరుడు, తల్లి భ్రమరాంబ, భార్య లింగాంబ, గోత్రము కౌండిన్యస, గ్రామము చింతపల్లి, (via) అమరావతి. ఈపాపయారాధ్యులు నిరుపేద, ధనార్జనావ్యాపృతి లేనివాడు.

నిర్లిప్తుడు. తన దేవీభాగవతమును పరదేవి కంకితమిడి కృతా
ర్థత గడించిన పుణ్యమూర్తి.

శ్రీమంతుడును, గీర్వాణాంధ్రభాషా కోవిదుడును నల్లూట్లగోత్ర వృద్ధుడును అయిన, జగన్నాథధరాధిపతి యొకనా డరిగి, "నీ దేవీభాగవతము నాకంకితమిడిన నీ పేదరికమూడ బెఱికి శ్రీమంతునిగావించెద" నని పలువిధముల, ప్రార్థించి నను, సమ్మతింపక పోతనామాత్యునికివలె, దనయిష్టదైవము కిడి తృప్తిగడించిన ధన్యమూర్తి. వీరు పలుకు పలుకొక్కొకటియు పద్యములుగానో, శ్లోకములుగానో, తయారయి హృదయమా హ్లాదమును గలిగించుచుండును.

ఈమహనీయుడు తనముప్పదిరెండవయేట శివరాత్రినాడు ధ్యానగమ్యుడై జాగ్రత్సుషుప్తిలో నుండుతరి, దేవీ సాక్షాత్క రించి, దేవీభాగవతము దనకంకితమిడుమని సెలవొసంగిన కార ణముగ, నరాంకితమిడ సమ్మతింపజాలడయ్యె. తన యుపాసనా మూర్తియగు అర్ధనారీశ్వరునారాధించు తరి శ్రీ మహావిష్ణువు ప్రత్యక్షమై, "నేనే శివుడను, శివుడనే నేనే. మాకిరువురకు భేదములేదు. పొరపడకు" మని చెప్పుచు వెంటనే అర్ధనారీశ్వ రాకృతిధరించి సాక్షాత్కరించె. నాటనుండి మతపాషండస్థితిని వదలి, అభేదభక్తిని సాధించి సిద్ధిగడించిన పవిత్రమూర్తి.

పోతనామాత్యునకు వలె నీ తడును సహజపాండితీ గరిమ నలరువాడని "సంస్కృతాంధ్రోక్తిస్నతసాహితీగరిమంబు" అనుసీసపద్యపాదమే చెప్పక చెప్పుచున్నది. సర్వవిధముల వీరి

కవిత్వము పోతనామాత్యు కవితను బోలినదగుట "అభినవ పోతనామాత్య" డీత డని జెప్ప నొప్పు.

దేవికటాక్ష పాత్రుడగుట శ్రీవారిని వాశిరెడ్డి వెంకటాద్రినాయుడుగారు, గురువునుగా గ్రహించుటయేగాక ప్రధానామాత్యునిగా గూడ నేర్పరచుకొని కృతార్థులైనారు. దేవీభాగవతరచనా కాలమున నిజ భార్యావియోగము రానున్న కారణముగ "ముక్తిద్వారము తల్పుదీయగదె చాముండా జగజ్జీవనీ" అనుమకుటముతో నిరువదియేడు శార్దూల వృత్తముల విరచించి సంతృప్తుడై జాయావియోగదుఃఖము మరచినాడు. అసూయాపరులు కొందరు "పద్యములతో ముక్తి ద్వారము తెరువబడునా? మాటలతో జింతకాయలు రాలునా" అని ఆక్షేపించుటవిని సహింపలేక ప్రభువు గురువుగారి ప్రభావమెఱింగిన వారైనను, మనోతృప్తికొఱకు ప్రత్యక్ష నిదర్శనము జూపుడని వినయముగా గురువుగారిని ప్రార్థించిన, వల్లెయని తాళములతో బిగింపబడిన ద్వారములుగల దేవీకోవెల ముఖమండపమున నిల్చి, పై యిరువదియేడు పద్యములలో నొకపద్యము జదివిన మాత్రమున అప్రయత్నముగ తాళములు తెగిపడి తలుపులు తెరువబడినవి, ఆత్మశక్తి పూరితున కసాధ్యమెందైనను గలదా!

శ్రీ వెంకటాద్రినాయుడుగారు నబాబునుదర్శించుటకు హైదరాబాదునకు వెళ్లి, అందొకసంవత్సరము నిలువవలసి వచ్చుటచే దేవీసాక్షాత్కారభాగ్యము గడించిన వారగుట

సాహసించి, నిజక్షేమసమాచారములు తెలుపు నొక పత్రి మును వ్రాసి, తాను ప్రతినిత్యము పారాయణము జేయు దేవి భాగవతము నంపుంచి, ఈపత్రము తనగురువగు సాయిరా రాధ్యులవారికి జేయునట్లు సంకల్పించిన, మగుసటి గోజుడయు మునకు, అమరావతి యందుండు మన పాపయారాధ్యుల వారి పారాయణ గ్రంథమగు దేవీ భాగవతమున బొడసూపు టయు, గాంచి సంతసించి, తిరుగు జబాబువ్రాసి అది తన శిష్యునకు జేరునట్లు సంకల్పించి, తన పారాయణ గ్రంథమం దుంచిన అది హైదరాబాదునందుగల వెంకటాద్రినాయుడు గారికి బొడసూపుటయు, నిట్లుత్తర ప్రత్యుత్తరములద్వారా, గురు శిష్యులిరువురు రాజామాత్యులై సంవత్సర కాలము రాజ్యపరిపాలన సాగించినారు. ఇట్లు గురుశిష్యుల గూఢసమా చారముల నబాబుగారెట్లో యెఱింగి సంతసించి, నాయుడు గారిని సత్కరించి, నిజమతవిరుద్ధమైనను లెక్కగొనక, నాయుడు గారి సలహాతో హైదరాబాదు నందొకచో దేవిప్రతిష్ఠ గావించి, నిత్యనైవేద్య దీపారాధనోత్సవాలకొక యగ్రహార మొసంగినారు. ఈసంఘటన క్రీ॥ శ॥ 1662 సంవత్సరమున జరిగి నట్లు వాసిరెడ్డివారి వంశచరిత్రయందు గనుపడుచున్నది.

ఇట్లు దనశక్తి సామర్థ్యములతో శ్రీ శివాజీ మహా రాజునకు సమర్థునివలె బ్రభువు వెంకటాద్రినాయుడు గారి రాజ కార్యములలో బ్రత్యక్ష బరోక్షముల దోడ్పడుచు

ననేకమహాత్మ్యముల లోకహితముగా వెల్లడించి యిహ పర ములార్జించి 1716 సం॥ ఫిబ్రవరి యందు దేహముచాలించిన పుణ్యామూర్తి మన ములుగు పాపయారాధ్య చక్రవర్తి.

పైనవివరించిన వియేకాక నింకెన్నియో ప్రభావములు పాపయారాధ్యులవారి యందుగలవని తెలిసినవిగాని వీడు గ్రహించినంతవఱకు తమకు విన్నవించినాడు.



# రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడుగారు

తే॥ గీ॥ ఆంధ్రజనపరిపాలనా ధ్యక్షుడగుచు
పార్వతీభక్తిరాజ్యసంపాదియగుచు
బరగు బంగరుకడ్డీ మా వాసిరెడ్డి
వెంకటాద్రీంద్రు ధృతిసాంద్రు వేడుకొందు॥

ప్రతిమానవునియందు అపూర్వశక్తులు రెండు నిగూఢములైయున్నవి. అందొకటి మనశ్శక్తి, ఇది చిత్తవృత్తి కేంద్రీకరణవలన గలుగుచున్నది. రెండవది ఆత్మశక్తి లేక, భగవచ్ఛక్తి. ఇది సాధనాపేక్ష లేకనే సాధ్యవస్తువై ప్రకాశించుచున్నది. చిత్తైకాగ్రత, కామ్యపరమైన మనశ్శక్తియు నిష్కామపరమైన భగవచ్ఛక్తియు వెల్లడియగుచున్నది. కామ్యమును, స్వార్థపూరితమైన సంకల్పసిద్ధియు నిష్కామపూరితమైన నిర్గుణ సిద్ధియు గలుగుచున్నది.

సర్వ కర్మఫలప్రదాతయు జ్ఞానప్రదాతయు గూడ ఈభగవచ్ఛక్తియే. ఇది వేరు వేరుగాగనుపించు శక్తులన్నింటికి బునాది. వేయేల భగవంతుడను నీయాత్మశక్తియే. దీపమునకును దాని వెలుగునకు నెట్లభేదమో అట్లే, భగవంతునకును భగవచ్ఛక్తికిని యభేదము. భగవచ్ఛక్తి యొక్క ఛాయయే మనశ్శక్తి. ప్రస్తుతకాలము మెస్మరిస్టులచే ప్రకటింపబడుచున్న శక్తులన్నియు అష్టసిద్ధులతోసహా మనస్సంభవములు.

భక్తులయందు సహజముగనో, లోకోద్ధరణ కారణము గనో దోచుచుండు ప్రభావములకు, భగవచ్ఛక్తియే కారణము. ఈ శక్తిహీనుడైన భక్తుని రిక్తుడనక తప్పదు. అచేతన పదార్థములను గూడ సచేతనవంతములు జేయజాలు సామర్థ్యము దీనియందున్నది అని, అనుభవపూర్వకముగ నెఱిగిన ధన్యులలో మన వెంకటాద్రిగారొకరు.

తండ్రి జగ్గభూపాలుడు. తల్లి అచ్చమాంబ. భార్య వెంకమాంబ. జననము క్రీ॥ శ॥ 17 వ శతాబ్దము. గుంటూరు జిల్లా చింతపల్లి ప్రభువుల వంశమునకు జెందినవారు. హైదరాబాదు ప్రభువునకు బ్రతినిధిగా నాంధ్రరాష్ట్రమును పరిపాలించిన రాజపుంగవుడు మన వెంకటాద్రినాయుడు. పదునైదవ వర్షప్రాయము వచ్చియు రాకపూర్వమే, సర్వవిద్యాసంపూర్ణుడై ఉత్సాహ, ప్రభు- మంత్రశక్తులను, సామ, దాన, భేద. దండోపాయములెఱింగి, గుఱ్ఱపుస్వారియందారితేరి, కామలాలసుడుకాక. ములుగు పాపయారాధ్య విద్వచ్ఛిఖామణిని గురువుగను, మంత్రిగను గూడ గ్రహించుటయేకాక, హరిజనుడైన భుజంగరాయుని రెండవ మంత్రిగ వరించి, వీరికు వురి చేయూతగారణముగ నాంధ్రరాష్ట్రమేకకాలికి కంటగట్టి యెదిరించిన వెలమ నాయకులజయించి శాసనస్తంభముల నాటి, దుర్గాష్టకమునిర్మించి పండితప్రకాండులకు, నూరగ్రహారము లిడి, వేలకొలది యజ్ఞముల జరిపించి, విపులాన్నదానమున భూతతృప్తిగావించి మూడుమారులు తులదూగు

టయే కాక ఏకకాలమున నూరు శివప్రతిష్ఠలును, కొన్ని కేశవ ప్రతిష్ఠలును గావించి, కోట్లకొలంది గోదాన భూదానములిడి, నూతన గ్రామములనేకములు గట్టించి, బీదనారాయణులకు జీవనోపాధుల గల్పించి, సుగుణ మణియై చేబ్రోలు పురవరంబున ద్రవ్వింపబడిన కోనేటియందు జతుర్ముఖబ్రహ్మ ప్రతిష్ఠయు, దానికి నాలుగు దిక్కులయందు, గ్రమముగ శ్రీ మల్లికార్జున, రంగనాయక, సర్వేశ్వర, గోపాలప్రతిష్ఠలును, నాలుగు కోణములయందు హనుమ వీరభద్ర, గరుడ, విఘ్నేశ్వర, ప్రతిష్ఠలును గావించి నిత్యనైవేద్య ధీపారాధనోత్సవముల కవారిగ నీనాములిడి శాశ్వతకీర్తి గడించిన భక్తశిఖామణి వెంకటాద్రిభూపమణి.

ఇట్లు సత్కర్మలద్వారా చిత్తశుద్ధిగడించిన తదుపరి, యొకనాడు పాపయారాధ్యు లరుదెంచి, ఘోరారణ్యమున గల కొండగుహాలలో దాగియుండు చెంచుమూక యదనెఱింగి దారులుగొట్టుట, బందిపోట్లుసాగించుట యే గాక బ్రతిఘటించిన ప్రజల నంత మొందించు చున్నారనుట దేవరవారెఱింగినవిషయమే, ఈ దుండగములకు మనవిరోధి బృందము చేయూత నొసంగుచున్నదని తెలియవచ్చుచున్నది. అయినను భీతిలేదు. మనహరిజన మంత్రిని మారువేషమున బంపి ఆదుండగుల బట్టితెప్పించి ఈ రాత్రియే వారందరిని చాటున కంపనుంటి సమయమతిక్రమించిన దుస్సాధ్యులగుదురు. చూచిరమ్మని పంపినహనుమంతుడు, లంకనుకాల్చివచ్చెగదా

అన్లేే, ధర్మసంస్థాపనమున కధర్మమూతగా గొనవచ్చునను భగ
దాజ్ఞ ననువర్తించెద, దీన బాపమావంతయు రాదు. సంశ
యింపక న్యాయనిడుండని చెప్పి యొప్పించి, అన్లే కావించి ఆంధ్ర
లోకశాంతియు, నాయుడుగారి మనశ్శాంతియు గలిగించిన భక్త
జనారాధ్యుడు పాపయారాధ్యుడు.

శ్రీ నాయుడిగారి మంత్రివర్గములో బంచముడొకడుండె
నన పరిభుత్వశాఖోద్యోగులలో నిందఱుపంచములున్నారని
చెప్ప నవరము లేదుగదా! నాయుడుగారు, ఆంధ్రభూభాగ
మునగల వేయి గ్రామములకు నేకచత్రాధిపతియై ఎదు
రెఱుంగక పాలించి సెబాసని వాసిగాంచిన ధీవిశాలి. ఇప్పటి
యాంధ్రులలో శ్రీ వారి పేరెఱుంగని వారు లేరనియే వీడి
తలంపు.

ఈరోజులలో బ్రిభుత్వ స్థానము చింతపల్లినుండి అమ
రావతికి మార్పబడినని దేశికేశ్వరానుజ్ఞననుసరించి శ్రీచాముం
డామరేశ్వరోపాసనాసిద్ధిబడసి, తదీయ దేవాలయము జీర్ణో
ద్ధారణగావించి, అష్టోత్తర శతశివ ప్రతిష్ఠలేక కాలమున జరిపి,
అమరేశ్వరసాక్షాత్కారమంది, ఇంద్రుడమరావతికివలె వెంక
టాద్రీంద్రు డమరావతిని ప్రకాశింపజేయుచు, నభేదభక్తిగలిగి
సాటిలేని కీర్తిగౌరవముల విరాజిల్లిన ధైర్యహేమాద్రి మన
వెంకటాద్రి.

ఇట్లుండ నొకతరి నవాబుగారి కోరికపై నాయుడు
గారు హైదరాబాదున కేగి రాజకీయముల నిమగ్నుడై
యుండునెడ, నొకనాడు నవాబు నాయుడుగారిని వెంటగొని

యశ్వశాలకేగి, అందు మదపిచ్చివలన క్షుత్పిపాసల మరచి మాలీలనుగూడ సమీపమునకు రానీక కరచుటచేతను తన్నుటచేతను భయపెట్టుచు బాధపడు పంచకళ్యాణి గుఱ్ఱమును జూపి, "అశ్వపరీక్షకులైన మీరు రోగనిదానమును గావించి ఔషధసేవ జరిపి మహోపకారము గావింపు"డని విన్నవించుటయు, 'వల్లె' యని ఆత్మశక్తిపూరితుడగు మన నాయుడుగారు నిర్భయముగ గుఱ్ఱమును సమీపించి జూలుబట్టి యాడించుచు దాని శరీరమంతయు నిమిరి హుషారిచ్చిన వెంటనే ప్రేమదృక్కుల బరపుట గాంచి, రోగము హరించినదని యెఱింగి దాణాబెట్టించి జీనుబిగింపించి తదశ్వారోహణము గావించి స్వారిసాగించి, దాదాపెనుబది మైళ్లు పయనించి తిరిగివచ్చి గుఱ్ఱముదిగి, నవాబున కుల్లాసము గల్గించి పేరు గడించిన కీర్తిశాలి మననాయుడుగారు మఱియు

గీ॥ పరగ నమరావతి గల గుడివునకును
దనకు బ్రిత్యహముస్జేర దగిన జాబు
లిష్టదేవతచేత మో యించినట్టి
వెంకటాద్రీంద్రుమహిమ భా వింపదరమె!

ఈ అద్భుతవిషయమును విని నబాబుగారు హిందూమతాభిమానియైన నాయుడుగారి సలహానుసరించి అందొకచో దేవీప్రతిష్ఠ జరిపించి నిత్యనైవేద్యాదిపూజారాధనోత్సవాధుల కొకయగ్రహారమిడి కృతకృత్యులైనాడు నబాబుగారు.

ఆంధ్రలోకమునే తనయిష్టదైవముగా భావించి పరిపాలనారూపసేవాభాగ్యము నార్జించినవాడు కనుకనే, ప్రభుత్వమునకు సాలీనావచ్చు రాబడియందు ప్రభుత్వకార్యములకు వెచ్చింపబడినదిపోను మిగిలినధనమును యజ్ఞముల నెపమున దానధర్మములు సాగించి, ధనపుకొట్లను ఖాళీలజేయు మహోదారచరితుడు నాయుడుగారు. శతాధికములుగా నూతన గ్రామముల నిర్మించి, అందందు వశించు జనులను సుఖజీవనముల ముంచెత్తె. తల్లిదండ్రులపేరులతో నచ్చమ్మపేట, జగ్గయ్యపేటల సృష్టించి తనపితరులకు శాశ్వతకీర్తిని గల్పించిన ధీశాలి. ఇతని వేనోళ్ళబొగడినను తనివిదీరదు. వేదవిదులగు పేదవిప్రుల కగ్రహారములును, షోడశమహాదానములును, అనేకవాపీకూపతటాకాది జలాశయములను నిర్మించినవదాన్యు డేలనో, అమరావతియందు వేంచేసియున్న అమరేశ్వరస్వామివారిని మరచినారు. ఇది విచారకరము. "ప్రతిమా స్వల్పబుద్ధీనామ్" అనునార్యోక్తి ననువర్తించియుండనోపు. శ్రీవారి వంశాభివృద్ధి నర్థించి రామమూర్తిని ప్రార్థించుచు నీచరిత్ర ముగించెద.



# మహాశయులు బందా పరదేశివర్యులు

మనము నిత్యమనుభవించునది కేవలసుఖము మాత్రము కాదు, కష్టమిశ్రితము. విషయసుఖము విూసాలపూది తేనె వంటిది. విషసమములు విషయములు. విష మనుభవించిన వానికే చెరుపుగలుగును. విషయము లట్లుకావు. సమీపించిన వారినెల్లర నాశనముజేయును మొదట సుఖకరములుగా గనుపించిన యాహారపదార్థములు తుదకు దుఃఖదాయకము లగుచుండుట ననుభవైకవేద్యములే గదా !

పీడాకరమగు విషయసంపాదనవలన గాలహారణమే కాక బలువిధ కష్టముల కాకరమగుచున్నది. "ధనమూల మిదంజగ" త్తనుట యదార్థమే. కాని, భగవదారాధనా దృష్టితో ధనమార్జించి తన్నిమిత్తమై వెచ్చబెట్టిన శ్రేయోదాయకమని భగవదాదేశము. దయాసత్యశౌచాదు లార్జించి పరమేశ్వరపరములుగా గడించిన విషయములు నిర్విషయములై తుదకు ముక్తిదాయకములుగూడ నగుననుట శ్రీవారి సందేశము. ఇట్టివానికి భగవానుడు ప్రత్యక్షపరోక్షములతోడ్పడి సత్కార్యాచరణమునకు జేయూతనొసంగి కృతార్థుని గావింపగలడు.

పరమేశ్వరుడు జీవులహృదయములందుండి ఇహాపరరూపములైన సమస్తకార్యములు చేయించుచుండుట భక్తులెల్లరకును దెల్లమే. "యద్యత్కర్మ కరోమి తత్త దఖిలమ్ శంభో తవా రాధన" మనుసుబోధ ననుసరించి సాధకుడు

తానుగావించు పనులన్నిటిని భగవదారాధనారూపములుగా మార్పు జేయ గలిగినప్పుడే కృతకృత్యు డగుట. ఈ రహస్య మనుభవమునకు దెచ్చుకొన్న భక్తాగ్రణి మన బందా పరదేశిమహాశయులు.

ఈ మహనీయుడు వంశపరంపరాయత్తమైన కరిణీక వృత్తిని జేపట్టినవాడై యుండియు ఏరూపముననైనను జేజాచి యెఱుంగడు. సామాన్యగృహస్థే కాని యాచించిన లేదను వాడుకాడు. ఉద్యోగరీత్యా ఎట్టివిషమస్థితి సంభవించినను అబద్ధమాడియెఱుంగడు. సత్యాహింస భూతదయ లీతని సహజ గుణములు. తన కితరులొనరించు యపకారముల గలలోనైనను దలంపడు. పరుల కపకారములజేసి యెఱుగడు ఎట్టికష్ట ములు వాటిల్లినను తనమేలుకొఱకేయని సంతసించువాడు.

వీని జననము పదునేడవ శతాబ్దము. భార్య పతివ్రత ఔదార్య శిఖామణి, పరోపకారపారీణ, అన్నదానవ్రతపరా యణ. ఈ వంశస్థు లిప్పుడు చీరాల, వేటపాలెముల యందు న్నారు. వీరిలో బందా వెంకటనరసయ్యగారు ముఖ్యులు. వీరిని కలిసి ముచ్చటించుభాగ్య మీతని కలవడలేదు. మన పరదేశి గారి జీవచరిత్ర యాంధ్రలోకమునకు నూతనమైనది కాదు. లభించినంతవఱకు సంగ్రహించి ముఖ్యవిషయముల నిందు బొందుపరుపబడినవి, పాఠకులు క్షమింతురుగాక.

పరదేశిగారి జీవితకాలమం దొక్కరోజైన నతిథి సత్కా రము జరుపని దుర్దినము లేదని జెప్పెదరు. ఏకాదశివ్రతము

వీరి జన్మహక్కు. పండ్రెండు సంఖ్యకు దక్కువగగాని నూట యెనిమిది సంఖ్యకెక్కువగగాని లేని యతిథులకు గావింపబడు యన్నదానములో ద్వాదశీపారణ జరుపుట శ్రీవారి విధి.

ఆ వ్రతదివసంబంతయు జాగరణంబుండి భగవత్కథా కాలక్షేపములతో ప్రొద్దుబుచ్చువారు. అతిథులింటికి వచ్చిన వారిని జుట్టరికంపు చూపుతో నాదరించి, యన్నపానాదుల సత్కరించి, తద్వియోగమున కడలుచు దుఃఖాశ్రువులతో సాగనంపువారు గూడ. ఇట్లు బహుకాలముజరుగ గుటుంబాస్తియే కాక భార్యమెడనున్న తాళి సహితము వెచ్చింపబడుట, బరదేశిగారు నిరుపేదలైరి. రేపటి యతిథిసత్కారమునకు గాని కుటుంబ ఖర్చులకుగాని ద్రవ్యములేదు. ఆ రేయి ప్రథమ యామమున భార్యను వెంటబెట్టుకొని పరులకు దెలియబడకనే పయనముసాగించి, పరిచయములేని గ్రామముల నివసింపనెంచి, మార్గాయాసమున కోర్చి స్వగ్రామమగు వేటపాలెమును వదలి, రాత్రి రెండవజామునకు బాపట్ల తూర్పు సత్రమునకు జేరి, జరుగనున్న కార్యమును గురించి భార్యాభర్తలు ముచ్చటించుకొన మొదలుపెట్టిరి.

నాటి రాత్రి ప్రథమయామముననే యా సత్రమున బ్రవేశించి ఆకలి సొద కడలు పుత్రుల నిరువుర బుజ్జగించుచు, ''ఇవిగో శనగపప్పు. ఇవి తిని నీరు త్రాగుడు. రేయి మూడవ జామున బయనించి రేపు పదిగంటలకెట్లో మిమ్ముల వేట పాలెము జేర్చెద. నందు నిరతాన్నదాతయగు బందా పర

దేశిగారింట మీా కన్నము బెట్టించెద. అం దెన్నిరోజులున్నను మన కన్నవస్త్రములకు దరుగులేదు. ఊరడిల్లు''డని ఐదేనిమిది వత్సరముల ప్రాయములుగల తన ముగ్ధుబిడ్డల నోదార్చు చుండు స్త్రీనొక్కరితనుగనియు, నామెమాట లాలించియు గటకటంబడుచు, వెంటనే భార్యతో వచ్చినదారిబట్టి స్వగ్రామమున కేగుచు, "ఇంతీ, విన్నావుగదా! ఆ ర్తస్త్రీ దీనాలాపములు. ఈచంటి కూనలతో రేపుదయము బదిగంటలకేమె మన యిల్లుజేరి, అం దెవరును లేమి తెలిసి నిరుత్సాహులై ఎట్టిశ్రమ పాలగునో, ఏమగునో గదా! ఆర్తుల శ్రమలడంపని వానిజన్మ నిరర్థకమనియు, దుఃఖభూయిష్ఠమనియు బెద్దలనెదరు. వీరి నెట్లు సత్కరింప జాలుదుమా, అని విచారింపవలదు. మన యింట గుందిరోలొకటి నిలచియున్నది. దానినమ్మగావచ్చిన ద్రవ్యముతో నీమెను సత్కరించి ముందు యోచింతము. కాలుసాగించి నడువు'' మని తొందరచేయుచు బయనము నాగించి, వేటపాలెమనంగల స్వగృహమును జేరి, శ్రీబొమ్మిశెట్టి సుందరరాజమను వైశ్యున కారోలు రెండు రూపాయల కమ్మి, పదార్థముల సేకరించి వంటగావించి, అతిథులకై వేచియుండ గతరాత్రి బాపట్ల తూరుపు సత్రమున తాము జూచివచ్చిన యతిథులు నియమిత కాలమున కరుదెంచిరి. వారిని యన్నాది సత్కారముల తృప్తులంజేసిరి. తమకుటుంబ స్థితిగతుల నెఱింగించి సాగనంపిరి. తదనంతరము సుందరరాజమును బిలిచి రోలెత్తించుకొని పొమ్మని జెప్పుటయు నాత

డందులకు యత్నింప నా రొట్టెక్రింద మొహరీలుంచబడె తను పడియె.

అది చూచి ధర్మాత్ముడు వైశ్యపుంగవుడు, పరదేశి గారిని పిలిచి బిందెను జూపి "తీసి భద్రముజేయు" మనిన నాకేల ఈబిందె నీరొట్టెక్రిందెప్పుడును బెట్టలేదు మా పూర్వీకులెవ్వ రును జెప్పనులేదు. ఈ సొత్తెనీయదనదే, రొట్టెలు గూడ నీ మొహరీలుంచెను గొంపోవుమని బల్కుటయు. నాకే వలసిన కొప్పుకొనక రొట్టెలను మాత్రము మీవలన భిక్షముగాగొని నాను గనుక నీసొత్తు మీయదదయే అనిచెప్పుచు, రొట్టెలుమాత్ర మెత్తించుకొని పోయెను, భగవదనుగ్రహమును కనుగొను దాను భగవత్ప్రీతిగా గావించు సన్నదాన మహాకార్యమునకు పరోక్షముగా శ్రీరామచంద్రమూర్తి తనకు జేయూతనొసం గినాడని సంతసించి నాటనుండి తిరిగి యన్నదానమహా యజ్ఞము నిరంతరాయముగ సాగించుచుండుటచే భాగ్యనగరమంత టను శ్రీవారి పేరు మారుమోగినది. ఇది విసలేని యసూ యాపరులు కొందరు ప్రభుత్వమున కెఱింగించిరి గాని ప్రభు వగు వెంకటాద్రినాయుడుగారు సంతతాన్నదానప్రియుల గుట లెక్కసేయలేదు. ఇప్పుడు పరదేశిగారి కీర్తిచంద్రిక కాశీ సేతుమధ్యప్రదేశ మంతటను నిండి పిండారబోసినట్ల యినది. క్రీ॥ శ॥ 1670 సం॥ వచ్చిన గంగాపుష్కరిణి గ్రుంకు లిడ గురవుగారిని వెంటగొని వెంకటాద్రినాయుడుగారు వార ణాసి కేగిరి. గంగాస్నానకాలమున గోరినవారికి గోరినట్లువారిగా ధనకనకాదులొసంగుచుండ జూపరులు ప్రభువుగారి యౌదార్య

మును వేనోళ్ళ గొనియాడుచుండిరి. నిరతాన్నదాతయగు బండా పరదేశిగారు నసించు ఆంధ్రదేశ పాలకుండగు మహా ప్రభు సీతాపతి చెప్పబోను యాచకులబలుకులు గర్ణాకర్ణి విని సంతోషించి నాయుడుగారు పరదేశిగారి యశశ్చంద్రికలకు శాశ్వతస్థితిని గలిగింప సంకల్పించి, కొంతకాలమందుండి దేశికాచార్యాజ్ఞ ననుసరించి యాత్ర ముగించి, యమరావతి కరుదెంచి, శ్రీవారిని నోటీసుగ బిలిపించి తన యెఱుక లేక వేటపాలెమున కరుగరాదని ముదల గావించినాడు.

రాజాజ్ఞ దల ధరించి సంవత్సర కాలమందుండినారు పరదేశిగారు. ప్రభువుగారొక ద్వాదశినాడుదయమున గాలి నడకను గ్రామం బరయుచు దలంపున వీధి జనుచుండ నొకయింటి ముంగిట నూటల కొలది బ్రాహ్మణులు హస్తప్రక్షాళనముల జేసికొనుచుండ గాంచి ప్రశ్నించి, వారిని ప ర దే శి గా రి సమారాధన కాహ్వానించినట్లు తెలిసికొని, సంతసమును వెలిపుచ్చక నొకసుముహూర్తమున బయలుదేరి వేటపాలెము జేరినారు నాయుడుగారు. అక్కడ శ్రీవారి భార్య కమలాంబ గారి అన్నదానము కన్నులార జూచి ఆనందించి, ఆమహా తల్లిచే భిక్షగొనిన ధన్యుడనగుదునని తలంచి కబురంపి, సపరి వారముగా జని ఆమెగారిచే సత్కరింపబడి, పవిత్రుడనైతినని మురియుచు, "అన్నగారు, తోబుట్టువును మరువకుందురు గాక" అను కమలాంబగారి ప్రేమపూర్వక వాక్యముల కుబ్బుచు, తిరుగుపయనము సాగించి అమరావతిజేరి, సబహు మానముగా పరదేశిగారిని జేరి "అనవసరముగా నిన్ను గష్ట

ములపాల్జేసిన నన్ను క్షమించు'' మని ప్రార్థించి శ్రీవారి కర్థ సింహాసనమిడి యాదరించె.

ఇంతమాత్రమేగాదు, ఈ పురి మీరు సాగించిన యన్న దానమునకు ద్రవ్యదాత యెవడని ప్రశ్నించి తెలిసికొని, అద్దేపల్లి సుబ్బయ్య శ్రేష్ఠిగారిని బిలిపించి, "నీవు పరదేశిగారి యన్నదానాదికమునకు వెచ్చించిన ద్రవ్యమెంత'' యని అడిగిన నాతడిట్లనియె. "దేవా ! పరదేశిగారి యొద్ద తిరిగి తీసికొను భావముతో నేను ద్రవ్యమివ్వలేదు. గాన, పద్దు వ్రాయలేదు. అందువలన నింతయని చెప్పజాల''నని ఖండితముగా జెప్పినాడు.

నాయుడుగారు ముక్కుపై వ్రేలిడుకొని "సౌభాగ్యమని నట్లుండవలదా'' యని, లోదలంచుచు సుబ్బయ్య శ్రేష్ఠిగారితో "మా కెరుకబరుపకనే దానము చేయుట నీ కధికారమెక్కడిది ? మాయాజ్ఞ దిరస్కరించిన నీవు శిక్షార్హుడవుగాని క్షమించితి. గాన బరదేశిగారి కొసంగిన ద్రవ్యమంతయు నిచ్చెద గైకొనుము.

దేవా! మీరిచ్చు శిక్షకంటెను. భగవంతుని శిక్ష మిక్కుటముగదా! సత్సంకల్పమున కన్యథా జరిగిన బాపకూపమున బడెదనను భయము నన్ను బాధించుచున్నది, క్షమింపుడు.

శ్రేష్ఠిగారి మాటలకు సంతసించుచు నిట్లనియె, "పరదేశిగారి యన్నదానమునకు వెచ్చింపబడిన ద్రవ్యము రమారమి ఇంతయని చెప్పి నావద్ద నది గైకొనుము. అది నే బర

దేశిగారికి గావించుసత్కారములో నీవును బాల్గొని తద్ద్రూప ముగా వెచ్చింపుము. దాన మన మిరపురము ధన్యులమయ్యెద మని చెప్పి యొప్పించి, అట్లుగావించినారు.

ఇట్లు వెంకటాద్రినాయుడుగారు పరదేశిగారిని సత్కరించి కమలాంబగారిని పిలిపించి యొప్పించి ఆంధ్ర ప్రభుత్వము వారణాసియందు జరుపు యన్నసత్రమున కధికారిగా పరదేశిగారిని నియమించి, వేటపాలెపు సత్రమునకు కమలాంబ నధికారిగా జేసి రెండును రెండువైపుల సాగించుచు, రెండుకులములకు వన్నెగూర్చిన పుణ్యమూర్తి ఆంధ్ర దేశ చక్రవర్తి.

ఇట్లు పరదేశిగారు తనజీవిత శేషము వారణాసియందు గడపి, చరమదశగ్రహించి వేటపాలెమును జేరి క్రీ॥శ॥ 1785సం॥ పరమపద మలంకరించిరి. కమలాంబయు నిరతాన్న దానముచే జీవిత శేషమును గడపి పిదప రెండు వత్సరములకు శరీరము జాలించి కైవల్యమలంకరించె



# అయ్యలరాజు రామభద్రుడు

సర్వభూతముల హృదయములందు పరమాత్మ ఈశ్వర రూపుడై యున్నాడు ఆయీశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వశ_క్తిమయుడు, శాశ్వతుడు, సత్యస్వరూపుడు, జ్ఞానమూ_ర్తి ఆనంద సాగరుడు, ప్రార్థనాప్రియుడు. అట్లే జీవుడునుకుండ శాశ్వతుడు, సర్వజ్ఞుడు, సత్యుడు ప్రార్థనాప్రియుడుగూడ. ఏమను, కించిజ్ఞుడు మాత్రము. ఈతడు దేహాభిమాని యగుట దనను దామరచి దేహమే తానని భ్రమ పడుచున్నాడు. సర్వశ_క్తిమయు డయిన పరమాత్మ శాశ్వతుడగుట దేహాభిమాని యైన జీవుడును శాశ్వతుడుగా గోరుచున్నాడు అతడు ప్రార్థనా ప్రియుడగుట తానును ప్రార్థనాప్రియుడగుచున్నాడు. ఆత్మ సత్యస్వరూపి యగుట సత్యము నభిమానించుచున్నాడు. ఆత్మ జ్ఞానమూ_ర్తియగుట దా దేహాభిమానియయ్యు జ్ఞానమును బ్రేమించుచున్నాడు. పరమాత్మ ఆనందసాగరుడగుట నస్థిరమైన విషయానందమును సేకరించుచున్నాడు

వేయేల! దేహాభిమానము వదలకయే తా నీశ్వరుడగుటకు సర్వవిధముల ప్రయత్నించుచున్నాడు. కాని కృతార్థత గడింప జాలకున్నాడు కారణము పురుషో_త్తమ ప్రా_ప్తియందలి రహస్య మెఱుంగకుండుటయే. ఈరహస్య మెఱింగినవాడొక్కడే. ప్రత్యక్ష పురుషో_త్తమమూ_ర్తి స్వస్వరూపానుభూతిని గ్రహించి కృతకృత్యుడైన దేవతాచక్రవ_ర్తి. ఈత

విస్తరమునతో దాటిపడు పండింపబ్రయత్నించు వానివలె దేహాభిమానుల బ్రయత్నము లన్నియు నిరర్థకములగుచు న్నవి తన దీక్షాప్రయత్నము మూడీ జీవత్వము నాశము జేసి కొనినవాడొక్కడే గమ్యము జేరగలడు. అగ్నికి వెలుతురు వేడిమి సహజము లైనట్లు, పురుషోత్తమునకును సర్వజ్ఞత్వాది కళ్యాణగుణములు సహజములైయుండు ననుట నిర్వివాదాంశము. ఇట్టి పురుషోత్తముడే అయ్యలరాజు రామభద్రుని తండ్రి అక్కయామాత్యుడు.

ఇతడు చేయిజారి తప్పిపోయిన తన ముద్దు కొమరుని వెదకి తెచ్చిపెట్టుమని శ్రీరామమూర్తిని బ్రార్థించి సఫల కాముడైనాడు. ఈ కథ యంతయు నక్కయామాత్యునకు జెందినదై యుండ రామభద్రున కంటింప నేలనన అక్కయామాత్యుడు ప్రార్థించినను సీతారాములచే రక్షింప బడిన వాడు. రామభద్రుడు. కనుక నితనిపేరు కథామకుటమున జేర్చబడినది. ఈతండు గోలకొండవ్యాపారి. బ్రాహ్మణుడు. జననము 1503 సం॥ అనగా యిప్పటికి 453 వ సంవత్సరములైనది. ఈ వంశమువా రందరు మహాకవులే. అందరు బండితులే. అందు మన రామభద్రుడు దనయిష్టదైవమగు ఒంటిమెట్ట కోదండ రామమూర్తి చరిత్రమునే రామాభ్యుదయమను పేర రామాయణము రచించినాడు.

ఈతనికి స్వగ్రామమున పేరులేదు. ఈతడు శిశువుగా నుండుతరి కోవెలలోజరుగు బ్రహ్మోత్సవమును జూడ తలిదండ్రులిరువురు పిల్లవాని జంకనిడుకొని కోవెలకేగి జనసమ్మర్ద మెక్కుడగుట బిల్లవానికాపద సంభవించునేమో, అనుభీతి

నాతని దనవెంట తీసికొని పో శంకించి పిల్లవాని వన భర్త అక్కయామాత్యునకిడి నే నాలయప్రవేశము జేసి స్వామిని దర్శించి కానుక లర్పించి వచ్చునంతకు, మీరిందయు డి గని పెట్టియుండుడని మనవి జేసి ఆలయములోని కరిగెనదాను

అక్కయామాత్యుడు భార్య! వెంటనేరాని విచారించి కాలయాపనకు సహింపలేక భగవద్దర్శనాపేక్ష ముందునకుద్రోయ, బైగుడ్డ బరచి పిల్లవాని బయుండబెట్టి ప్రక్కనున్న వారితో "మా అబ్బాయిని జూచుచుండుడు. వీని తల్లి త్వరలో రాగలదు" అని చెప్పి వారందరును సమ్మతించినట్లు దలంచి ఆతడాలయప్రవేశము జేసినాడు. కొంతసేపటికి భార్య వచ్చి నిర్దేశస్థలమున భర్తగాని పిల్లవాడుగాని లేకుండుట ప్రక్క వారిని విచారించి జవాబురాని సంశయాకులచిత్తయై అందందు వెదకి పిల్లవానిని భర్తతీసికొని వెళ్ళి యుండవచ్చునని యెంచి, ఇంటికేగినది. పిదప నక్కయామాత్యుడును స్వామిదర్శనానంతరము నిర్దేశస్థలమునుజేరి పిల్లవానినిగానకయు ఆతనితల్లి పోబడి తెలియకయు విచారించి, తల్లి పిల్లవాని గొనిపోయి యుండ వచ్చునని తలంచుచు, గలతగొనిన చిత్తముతో నింటికేగి భార్యనుగాంచి, పిల్లవానివిషయమై ప్రశ్నించి ఉభయులచర్యపములును అనాలోచితములని గుర్తించి, దంపతులిరువురు మితిమీరిన దుఃఖముతో బిడ్డను లో వెదకి వెదకి వేసారి, సూర్యాస్తమయంబగుట దమ తమ కార్యముల విసర్జించి ధైర్యంబవలంబించి, ప్రణుతార్తి హరుండగు శ్రీరామసాన్నిధ్యంబు గల్పించుకొని నిందాస్తుతుల నిట్లు ప్రార్థించిరి.

కం॥ శ్రీకాంతావల్లభ యశ
స్తోకదయారససముద్ర శుభగుణభద్రా
శ్రీ కుశలవజనకా సు
శ్రీకర సుగుణాభిరామ సీతారామా.

కం॥ నీకొడుకులు నీకెట్లో
నాకట్టులు గాదె నాదు నందనులు దమిన్
నాకొడుకు నాకు నిమ్మా,
శ్రీకర.................సీతారామా.

కం॥ నాకో, యొక్కడె పుత్రుడు
నీకో, పుత్రద్వయంబు నిలుప గులంబున్
నాకొడుకు నాకు నిమ్మా,
శ్రీకర.................సీతారామా.

కం॥ మృతుడైన విప్రసుతునిన్
బ్రతికించితివనుట నిక్కవంబగు నేనిన్
బ్రతికింపు నాదు పుత్రకు
శ్రితరక్షణ సుగుణధామ సీతారామా.

కం॥ నీ సోదరులం జూడగ
నాసగొనిన తల్లికొఱకు నై శీఘ్రమునన్
నీసోదరుల ద్దేవే
శ్రీసఖ కళ్యాణనామ సీతారామా.

కం॥ కాలునిబారిం బడియెడి
బాలుని బ్రతికింపలేక పాటార్థుడు వగవన్

లీల గాని తేనె శిశువుగ
శ్రీలలనాచిత్తధామ సీతారామా.

కం॥ నీ కోసల నే విడచిన
నాకొడుకున కీవుగాక నాథుండెవఁడో
నా కొడుకు నాకు నీవే
శ్రీకర................సీతారామా.

కం॥ శరణంబు నిన్ను వేడిన
గరితురగరథావళులను, కనకపురాసుల్
గురియింతువు శిశువిమ్మా,
స్థిరజీవితు సుగుణధామ సీతారామా.

కం॥ దత్తాపహరణ పాపము,
మొత్తదె నిను నీవొసంగి యున్నా శిశువు
న్నిత్తరి నీవే కొనవే
చిత్తంబిక సుగుణధామ సీతారామా.

కం॥ బోయలు నీమిత్రులు నిట
బోయలె నిన్నిలిపిరంచు మునువింటిని నా
బోయమనంబును శిశువెడ
జేయకు సుగుణాభిరామ సీతారామా.

కం॥ పావనములు ముక్తిసతీ
దేవనములు బ్రహ్మరుద్ర దేవావళి సం
భావనములు నీపదయుగ
సేవనములు సుగుణధామ సీతారామా.

కం॥ పాదంబులు నరకభయ
చ్ఛేదంబులు కమలగర్భ శితికంఠహృదా
మోదంబులు భక్తజన
శ్రీదంబులు సుగుణధామ సీతారామా.

కం॥ గురుపుత్త్రి బాణకీలా,
పరిదగ్ధు న్గాచినట్టిపద్ధతి శిశువు
బరిరక్షింపుము దేవా
చిరజీవినిజేసి కరుణ సీతారామా.

కం॥ సాందీపుడు వేడిన త
న్నందను బ్రతికింపలేదె నాసుతు నట్లే
ముందలనిడి యానందము
చెందింపవె సుగుణధామ సీతారామా.

కం॥ నీకరములు భయహరణ గు
ణాకరములు తాపతప్త పాపిణి హిమానీ
శీకరములు నతలోకవ
శీకరములు సుగుణధామ సీతారామా.

కం॥ పాహి జగద్రక్షక మాం
పాహి నతత్రాత దేవ వల్లభనుత మాం
పాహి జగజ్జనక విభో!
శ్రీహరి సుగుణాభిరామ సీతారామా.

ఇట్లు ప్రార్థించుచుండ దెల్లవారినది. అర్చకులు మడుం గులుగట్టి కోవెల తలుపులు తీసి లోనబ్బ్రవేసించి, నిర్మాల్య

విసర్జనాకార్యమునకు గడంగుడు అంతలోకవంక రోదనము వినంబడియె. బరికింప నొకశిశువు అర్చామూర్తియగు సీతాదేవి యొడియందుండి ఏడ్చుచు స్తన్యపానముజేయుచుండుట గాంచిరి.

పుత్రవియోగమున కడలుచుండు అక్కయామాత్య దంపతు జేరి, మీబాలు డీతడగునేమో చూడుడని చెప్పిన, చూచి మావాడేయనిచెప్పిరి. సర్చకులాబిడ్డను తెచ్చి తల్లిదండ్రుల కొప్పగించిరి. తల్లి బిడ్డకు స్తన్యంబొసంగెను. గాని సీతాదేవి స్తన్యంబారగించిన వాడగుట బాలుడ్రాగలేదు. ఈ రామభద్రుడు క్రమముగా బెద్దవాడై మహాకవిబిరుదమంది లోకవిఖ్యాతి గడించినాడు.

ఒంటిమిట్ట సీతాదేవి సంతానదాయిని యనియు, శుభదాయిని యనియు నెఱింగిన వారగుట, నేటికిని భక్తులా భూజాతను సేవించి సంతానలాభమును గడించుచున్నారు.



# భగవాన్ శ్రీ నారాయణ తీర్థ

భక్తులారా! రండు, రండు, త్వరగారండు. భజనానంద రసప్రవాహ పూరితమైన నామ ప్రయాగయందు మునుకలు వేసి వేసి తేలియాడుటకు రండు, రండు, త్వరగా రండు. భగవాన్ శ్రీ నారాయణతీర్థ స్వామి పోవుచు బిలుచుచున్నారు. రండు. రండు.

ఆ ఏమనుచున్నారు! కాలకృత్యముల దీర్చుకొని వచ్చెదరా? అని తీర్చుకొనునంతవరకు జాలును, స్నాన సంధ్య జప హోమ తర్పణాది నిత్యకర్మలవలన రాగల ఫలముగూడ లభించునట. నింతియెకాదు. శాశ్వతమై, అఖండమై, అలరాగు మోక్షలక్ష్మియు, మనను వరింపగలదు, త్వరపడుడు, త్వర పడుడు.

ఆ, ఏమనెదరు, నామప్రయాగలో జేరు నదులేవి అనియా, మీప్రశ్న? వినుడు. రామనామమేగంగ, కృష్ణనామము యమున. గోవిందనామము సరస్వతి. ప్రయాగస్నానము దేహమలము మాత్రము బోగొట్టును. నామప్రయాగస్నానమో? అట్లుగాదు. త్రికరణ స్నానఫలము లభింపజేయుననుట నిస్సందేహము. స్మరణమువలన మనస్సు, కీర్తనవలన వాక్కు, కీర్తనానుగుణ్యమగు నర్తనమువలన గాయము, ఇట్లు త్రికరణశుద్ధి లభించును.

అయాచితముగా ఇట్టిమహోపకృతి గావింపనున్నట్టి భగవాన్ శ్రీనారాయణ తీర్థులవారి జీవితగాథ చెప్పుకొనుట మన ముఖ్యవిధి. వినుండు. కాలాతిక్రమమునకు శంకింప బనిలేదు. శ్రద్ధగా వినుడు.

భగవాన్ శ్రీ నారాయణతీర్థ మహారాజు పూర్వాశ్రమమందు తల్లావఝ్ఝుల వేంకటరామశాస్త్రి. నివాసము గోదావరి మండలమునగల కూచిమంచి యగ్రహారము. క్రీ॥శ॥ 1700 ప్రాంతమున వీరి జననము. బాల్యముననే సమస్తవిద్యాపారంగతుడై ఉభయభాషాకవిత్వ మందారితేరినాడు. జన్మాది నుండియు కృష్ణభక్తుడు. స్వదేశమునం దున్నప్పుడు శ్రీకృష్ణ లీలాతరంగిణియు, ద్రావిడ దేశమందుండి తెలుగు భాషలో పారిజాతాపహరణమును మృదు మధురశైలి రచించిన కీర్తి శాలి.

ఆంధ్రదేశ సంచారకాలమున కృష్ణానదీ తీరంబున గల వెల్లటూరునందు కొంతకాల ముండుట తటస్థించినది. ఆ కాలములో జపదీక్ష నుండుతరి వరాహమొకం డెందుం డియో వచ్చి ప్రతిదినము దనముట్టెతో దీర్థులవారి నొకటి లేక రెండు మారులు నెట్టిపోవుచుండెడిదట! ఇట్లుగొన్ని దినములు జరిగినది. శ్రీవారు కారణమెఱింగి వెంటబడిపోయిన దినదినప్రయాణములలో నరవదేశమునంగల వరాహపురమును జేర్చి యంతర్ధానమైనది. ఆ పురియందే శ్రీవారు జీవితశేషమును గడపినారు.

శ్రీవారి కిష్టము లేకుండినను తల్లి యొక్కయు, కాబోవు మామగారి యొక్కయు బలవంతమున బదునెనిమిదవ యేట గృహస్థైనాడు. భార్య మహాలక్ష్మమ్మ. మహాలక్ష్మ్మ నుపాసించి వరమంది జనించిన జగదేకమాత ఈతనూజాత ప్రత్యక్ష మహాలక్ష్మమ్మయే. ఈమె మహాలక్ష్మ్మ నుపాసించి ప్రత్యహ మిష్టదేవతతో సంభాషించు పుణ్యశీల. అందచందాలమెట్ట. సుగుణాలగుట్ట. నిషేకముహూర్తము నిశ్చయింపబడినది. మామగారి యాహ్వానముపై బందుగులు వెంటగొనకనే తంబుర తాళములతో గృష్ణనామగాన మొనర్చుచు నైమరచి పయనించుచున్నాడు. మార్గమధ్యమునం గల గోదావరీనది దాట బ్రవాహములో దిగి పోవుచు నొక సుడిగుండమున బడి తికమకలై జీవితాశవదలి మానసికముగా నాతురసన్న్యాసమును గొనినాడు. భగవదనుగ్రహమువలన సుడిగుండము దప్పించుకొని బయటపడి యెట్లో మామగారిల్లు జేరినాడు. నాటిపగలు జరుపవలసిన ఔపోసనాదికార్యముల దీర్పించుట కభ్యంగనమాచరించి నూతనవస్త్రముల గట్టనిచ్చి శ్రీవారిని వేదికముందు గూర్చుండబెట్టినారు.

మహాలక్ష్మమ్మయు సర్వాభరణభూషితయై ఔపాసనాగ్నిని జేగొనివచ్చి శ్రీవారిని దిలకించి భయాశ్చర్యమగ్నయై నిజభర్తకు మానసికముగ వందనములర్పించి తేబడిన యగ్నిపాత్రతో జాటున కేగి నిలిచినది. కారణమడిగిన శ్రీవారి కేను శిష్యురాలనుగాని భార్యనుకాదు. సంసృతిదాటి సన్న్యసించిన పుణ్యమూర్తి ఇతడు. అరుగో, త్రిదండధారియై

కాషాయవస్త్రములతో బ్రకాశించుచున్నారు, అని చెప్పుచు కామదృష్టి విసర్జించి ప్రేమదృష్టినార్జించి, భక్తి మూర్తీభవించినదన్నట్లు జనుదెంచి, శ్రీవారికి నమస్కరించి యంతేవాసినిగా గ్రహింపుడని ప్రార్థించి, యిష్టార్థసిద్ధిని గైకొన్న ధన్యజీవి మహాలక్ష్మిదేవి.

భార్యాభర్త లిరువురును గురుశిష్యులైనారు. కమలనేత్రునిలీల లతివిచిత్రములుగదా? నిషేకము వ్యాపీకమైనది వీరిభౌతిక దేహములు వేరుగాని హృదయ మొక్కటియే. ఇప్పుడు వీరు నామప్రయాగలో నీదుచుండిరి కాలనియమము లేదు. క్షుత్పిపాసల జాడయే పొడసూపదు. దేహాభిమాన మంతరించినది. లోకభీతి రూపారినది. ఆంధ్రదేశమంత నామ ప్రచారముగావించి క్రమముగ గాశిజేరి, గంగానదిని దానమాడి వారణాసి యందంతటను బ్రచారముగావించి చూపరుల కాశ్చర్యదము గలిగించుచు, నొక యింటనివాస మేర్పరచుకొని ప్రతి రేయియు దలుపులు బిగించుకొని గురుశిష్యులిద్దరు, బాలకృష్ణనితోగలసి భజనానందమున నోలలాడుచుండువారు

ఒకనాడు శ్రీవారు "నీలమేఘశరీరా" అను తరంగము గానము జేయుచున్నారు. మహాలక్ష్మి బాలకృష్ణులు నృత్యములు జేయుచు తన్మయులై యున్నారు. "వ్యత్యస్థ పాదారవింద" అను చరణమును గానము జేయుచున్నారు తీర్థులవారు. తన్మయుడగు శ్రీకృష్ణుడు వ్యత్యస్థపాదారవిందుడు కాలేక పోయినాడు. పై జరణమునే నూరుపర్యాయ

ములు గానము జేసినను పదార్థమును గ్రహింపకనే కృష్ణుడు గంతులు వేయుచున్నాడు. మహాలక్ష్మియు శ్రీకృష్ణు ననుస రించుచున్నది. కోపమువచ్చి శ్రీవారు తనచేతనున్న తాళపు చిప్పను శ్రీకృష్ణునిపైపునకు విసరినాడు అదిపోయి గిలకకు దగిలినది. ఇప్పుడు! యత్నములేకనే శ్రీకృష్ణుడు వ్యత్యస్థపదు డైనాడు. అనాలోచితముగ జరిగిన ప్రమాదమునకు బశ్చా త్తాపపడి మూడురోజు లుపవసించుటయే కాక నింకెప్పటికిని గోపమునకు వశుడగానని మనస్ఫూర్తిగా శపథముగావించి జీవితాంతము నియమపాలన సాగించిన ధీశాలి నారాయణ తీర్థమహాశాలి.

దుండగులు కొందఱు యౌవనవతియగు స్త్రీతో గం తులు బెట్టుట తగనిపని యనిరెండు మూడుసారులు మందలిం చిరి గాని శ్రీవారు లెక్కసేయలేదు. పరాభవించి తమప్రయ త్నము సఫలీకృతము గావింపదలంచినారు. దుండగులు. శ్రీవా రొకరేయి కృష్ణగానము చేయుచున్నారు. మహాలక్ష్మి కృష్ణులు నృత్యములు గావించుచున్నారు. దుండగులింటిచుట్టును జేరిరి. కొందఱు తలుపు సందులగుండ లోన జరుగు భజన దిలకించినారు. తీర్థులు తన్మయులై శరీరస్మృతి తప్పియున్నారు. లక్ష్మికృష్ణులు వింజామరలు వేయుచున్నారు. గదియంతయు గోటి సూర్యప్రకాశముతో నిండియున్నది. భగవంతుని యొక్కయు భక్తులయొక్కయు జిన్మయస్వరూపములను గ్రమ

ముగ దిలకించి దుండగులు భక్తులై నారు. తీర్థులవారి పాదాల బడి తప్పునుక్షమించి శిష్యులనుగా గైకొనప్రార్థించి యభీష్ట సిద్ధిగైకొని ధన్యులయినారు. కొంతకాలమునకు వారణాసి యందే భార్యావియోగము జరిగినది. అందుండి బయలుదేరి యుత్తరయాత్రల పూర్తిజేసికొని తిరిగిస్వదేశమును పవిత్ర ముజేయుచు గృష్ణాతీరమునంగల వెల్లటూరున కొన్ని దినములు వసించి అందుండి ద్రావిడదేశమునంగల వరాహపురి జేరి అందు స్థిరనివాసమేర్పరచుకొని దేహముచాలించినారు. శ్రీవారు వెల్లటూరున నివసించు కారణమెఱిగించి సెలవు బుచ్చుకొనెద.

ఒకప్పుడు కృష్ణవరదలో బ్రాహ్మణదంపతులు తమ పుత్రీపుత్రికులతో బడి కొట్టుకొని పోవుచు నా దంపతులు మరణించిరి. పుత్రీపుత్రకులిరువురు సజీవులై తన్నదగొక్క ఈవలి యావలి యొడ్డులబట్టిరి. ఆపిల్లలను ఆ యా యొడ్డులకు సమీపగ్రామములలో గలిగి సంతానహీనులైన బ్రాహ్మణ దంపతులు వేరువేరుగా పెంచిరి. పెద్దవారైనారు. పూర్వకర్మ బలవత్తరమైనదగుట అన్నాచెల్లెండ్రను, భార్యాభర్తలనుగా జేయజాలినది.

ఈభార్యాభర్తలు సుఖముగా కాపురము జేయు చున్నారు.అన్నార్థియై త్రికాలవేదియగు సాధువొక్కం డతిథిగా వచ్చి దంపతులచే పూజింపబడి దివ్యదృష్టిం బరికించి, ''విధి బల వత్తరము, మీ రొకే జననీజనకులకు జెందినవారు తెలియ కాచరించిన పాపమునకు బ్రాయశ్చిత్తముగలదు. భయపడ

కుడు. మీరిరువురు నీలవస్త్రధారులై ఏకచిత్తముతో శ్రీకృష్ణా నది వెలువడిన తావునుండి బయలుదేరి ప్రతిరేవునను స్నానములు చేయుచు నియమపాలన గావింపుడు. మీరు ధరించిన నీలవస్త్రములకు తెల్లరంగువచ్చువఱ కిట్లుగావించిన పాపశాంతియగు బాం"డని యాజ్ఞాపింప వారట్లేకావించుచు, రాను రాను ఒకనాటి స్నానమున వస్త్రములకు నీలిమపోయి అవి దువ్వలువలైనవి. ఏ తీర్థస్నానమున నీలవలువలు దువ్వలువలైనవియో ఆ రేవు ననుసరించి వెలువడిన గృహసమూహమునకు వెల్లటూరను పేరు వచ్చినది. ఇట్టి పవిత్రస్థలమగుట మన తీర్థులవారిందు నివసింపగలిగిరని పెద్దలనిరి. వెల్ల అన తెల్లదనము, వెల్లటూరు అనగా తెల్లనియూరు. కృష్ణరేవు లన్నిటిలో నీ రేవు మిగులపాపహారమైనదిగా బరిగణింపబడుచున్నది.



# కోటంరాజు నాగేశ్వరదాసు

మరణమన నెట్టిదియో. ప్రతిమానవుడు దెలిసికొన దగిన విషయము. ఒకేదేహమునందు బాల్యయౌవనా ద్యవస్థల మార్పులెట్టివియో మరణావస్థగూడ నట్టిదియే. అది వ్యష్టిమార్పుగాని; సమష్టిమార్పుకాదు. వ్యష్టిసమష్టులు రెండును గలిసి ఉపశాంతి నందువఱకు జననమరణములు సాగుచునే యుండును. ఇది స్వరూపమిట్టిదని తెలిసి స్వానుభూతి నందినపుడే వ్యష్టిసమష్టుల కంతము. స్వానుభూతి గడించుటకే భౌతిక దేహ మవసరము దేహము పనికిమాలినదని దుర్వినియోగము జేయరాదు. పరమహంసలు మొదలు సామాన్యమానవులవఱకును చావు తప్పనిదే కనుక యథార్థ జ్ఞానసమార్జమునకు దేహ మవసరమని తెలియుచున్నది. బంగరు మొదలగు లోహముల గరుగుటకు మట్టిమూస యెట్లవసరమో, అజ్ఞానరూప లోహమును ద్రవరూపముగా దయారుచేయుటకు భౌతిక దేహమవసరము. అజ్ఞానరూప లోహము కరగించి. దానిలో గౌణసంబంధమైన చెడుపదార్థము దీసివేసిన, నదియే జ్ఞానరూపముదాల్చి గమ్యము జేర్చును. బంగారము మూసలోబెట్టి ఆమూసను కుంపటిలో నుంచి బొగ్గులుబోసి నిప్పువేసి యూదుచు, అప్పుడప్పుడు పట్టుకారుతో బొగ్గులుతొలగించి బంగారము కరగినదియో, లేదో పరీక్షించినట్లు, సాధకు డజ్ఞానలోహమును దేహమను

మూసలోబెట్టి దానిని సూక్ష్మశరీరమను కుంపటిలోనుంచి తాపత్రయములను బొగ్గులుబోసి వైరాగ్యాగ్ని నిడగిల్చి, మన నరూప వాయువు నుపయోగించుచు, నప్పుడప్పుడు చికిత్సయను పట్టుకారుద్వారా వ్యాధులను బొగ్గుల దొలగించి కరగి నదియో లేదో ఆత్మపరీక్ష జేసికొనుచు, స్వస్వరూప కనకమే తా నగుచున్నాడు ఇంతపని జరుగుటకు దేహమనుకర్మ జనక మైన మూస అవసరమే గదా! మూస లేకుండిన బంగారమెట్లు గరుగదో శరీరము లేకుండిన జ్ఞానసంపాదన సంభవింపదు గాన, భగవదాలయమునకువలె శరీరారోగ్యము రక్షించు కొను సాధన సాగించి కృతకృత్యుడైన మహనీయుడు మన నాగేశ్వరదాసుగారు.

తండ్రి భాస్కరమంత్రి. తల్లి శాయమాంబ. జననము 18వ శతాబ్దము. మనదాసుగారు పసితనముననే మాతా పితృ విహీనుడైనాడు. అప్పుడాబాలుని బోషించు బంధుగులెవ్వరు లేమి, సదాచార సంపన్నుండును, వైదిక కులాలంకారుండును, న్యాయవాద వృత్తిం గైకొని జీవయాత్ర గడపుకొనుచు సకల జనాదరణపాత్రుండై వర్తించుమహామహుండును, ఔదార్య గుణాలంకృతుండును, భూతసేవాతత్పరుండును, రామభక్తా గ్రేసరుండును అగు యెల్లేపెద్ది పాపన్న శాస్త్రిగారరుదెంచి యాపిల్లవాని నంక నెక్కించుకొని స్వగృహమున కేగి, పతి వ్రతాతిలకము నిజకాంతకిచ్చి యామె కాపుత్రరత్నమును చేతికిచ్చి యీపిల్లవాని, మాతాపితృవిహీనుని, నిజపోషణ

వ్యాపార సమర్థతావిహీనుని నేటినుండి నీ యౌరసుఁగ భావించి పోషింపుము. సంతానసౌభాగ్యులమగు మనకు శ్రీ రామభద్రుఁడీరూపంబున పుత్రభిక్ష మనుగ్రహించెనని దలంపుమని యాజ్ఞాపింప, నాపరమసాధ్వీమణి సంతోషాయత్త చిత్తయై భోజన మజ్జన శయనాసనాదిక్రియలయందు జననీ జనకుల మరపించి, యతిగారాబమున నాగేశ్వరుని బోషింపుచుండె. పాపన్నశాస్త్రి యట్టిసుముహూర్తమున నాగేశ్వరుని దనయింటఁ బ్రవేశపెట్టెనోగాని నాటికి సంవత్సరము పూర్తి గాకపూర్వమే యొకకుమారుండును, తదుపరి యొక కుమార్తెయు తనకు జనించిన, సుబ్బమాంబిక "ఇదియంతయు నాగేశ్వరుని చలువ" యని చెప్పికొనుచు వానియందుఁ బూర్వమునకంటె మిక్కుటముగ ప్రేమఁజూపుచుండె.

ఇట్లు కొంతకాలమేగ నాగేశ్వరుఁడు పంచవర్షప్రాయ సమన్వితుఁడగుఁ డాతని పాపన్నశాస్త్రి విద్యాభ్యాసమునకై పాఠశాలకుఁ బంపిన నీ ప్రాకృతవిద్యలు భగవానుని సన్నిధానమునకుఁ జేర్పఁజాలవనిగాఁబోలు ఒకపూట పాఠశాలకేగిన మరియొకపూటఁ బోవక విజనస్థలమునకేగి యొంటరిగాఁగూర్చుని ధ్యాననిమగ్నుఁడైయుండి మనంబు బహిర్ముఖంబగుడింటికివచ్చి భోజనమజ్జనాదికము లాచరించిపోవుచుండునేగాని తోడిబాలురగూడి క్రీడావిశేషములఁ బ్రొద్దుపుచ్చుటయుఁ బూర్వపురీతి నిజమృదుమధుర వాక్యములచే దల్లిదండ్రుల సంతోషవార్ధి నోలలాడించుటయు లేక భగవదాయత్తచిత్తుండైయుండ, నది తెలియక పాపన్నశాస్త్రి తనకుమా

రుని యున్మత్తవ్యాధి పీడించుచున్నదని దలంచి, యేనేమా మందులిప్పించి అంగుడలన బ్రయోజనమావంతయుఁ గను పింపకుండుటచే జేయునదిలేక, భవరోగవైద్యుఁడగు భగ వానునకావ్యాధి నొప్పగించి యూరకుండ సుబ్బమాంబిక నాగేశ్వరుని యందతిప్రేమఁ గలదగుటచే బిల్లవాఁడెందుండినను యిదకి తెచ్చి భోజనమిడుచు, వానికి వ్యాధి యంతకంతకు మిక్కుటమగు సూచనలు కనుపించుటచే ము దేమగునో యను భయము మానసంబుఁ గలవరపెట్ట నానాటఁ గృశించి పోవుచుండె.

భగవత్కృపఁ గడింపఁ బ్రయత్నించు వారలితరులకుఁ బిచ్చివారలుగా గనుపించుట నైజమేకదా! ఇట్లు కొన్ని వాస రంబులరుగ నెనిమిది వత్సరంబులు నాగేశ్వరునకు నిండుటయు వ్యాధి ప్రబలమగుటయుఁ గాంచి, ప్రసన్న శాస్త్రి పిల్లవాని కుపనయనముచేసినైన విడిచిపెట్టెదనని యెంచి, యొక సుము హూర్తంబున నట్లే గావించి. గురువర్యునియొద్ద సంధ్యావంద నము నేర్చుకొమ్మని నాగేశ్వరుని బుజ్జగించి చెప్పిపంప, నాతఁడు తండ్రివాక్యానుసరణి నాడుదయమున లేచి స్నానముచేసి సంధ్యఁ చెప్పించుకొన గురువుగారింటికేగిన, నుపనయనమునాడు శాస్త్రిగారివలన విశేషలాభముఁ బొందిన వాఁడగుట సుబ్బావ ధానులుగారు నాగేశ్వరుని కడుంకడుగారవించి యొకపీటపై కూర్చుండ నియమించి, తాను సత్వరమ స్నానముఁ జేసి శుభ్ర వస్త్రములఁదాల్చి మోమున విభూతిపిండెకట్లు ప్రకాశింపు చుండ, వచ్చి మఱియొకపీటపై కూర్చుండి నాగేశ్వరుంగాంచి,

నాయనా ! నేనుజెప్పినట్లు శ్రద్ధాభక్తులతో నేర్చుకొని ప్రతి నిత్యము యథావిధిగా సంధ్యవార్చుచుంటివేని భగవానునకు నీయందు దయగలిగి నీకుంగల వ్యాధినంతయు నిర్మూలముం గావించు. ఏదీ చెప్పెదను చెప్పుకొనుము.

శ్లో॥ అపవిత్రః పవిత్రోవా
సర్వావస్థాంగతోపివా
యస్స్మరేత్ పుండరీకాక్షం
సబాహ్యాభ్యంతర శ్శుచిః॥

అని చెప్పిన నాగేశ్వరుం డామంత్రము భక్తితోం జదివి "గురువర్యా! ఈమంత్రమున కర్థమేమి?" అని వినయముగా నడుగ, "నర్థము నీకిప్పుడవసరము లేదు. సంధ్య చక్కగావచ్చిన తదుపరిమాటది కాన మారుమాటాడక సంధ్యం జెప్పుకొమ్మని కోపముతోం బలికిన, సుబ్బావధానులుగారి వాక్యములకు బెదరక "అర్థము లేని చదువు వ్యర్థస్వరూపము దాల్చునని పెద్ద లనుట విన మే". మీరెప్పుడో సెప్పెదమన్న నామనంబొప్పదు కాన నిప్పుడే చెప్పితీరవలయు లేనిచో నాకీసంధ్యతోం బని లేదు. తర్వాత మీయిష్ట"మని ఖండితముగాం బలికిన నాగే శ్వరుని మాటవిని వీడు పిచ్చివాండు నేనేగాదని వివాదపెట్టు కొన ముందేమగునోయను భీతిచేతనో నిన్నగాక మొన్న నావలన విశేషలాభము గడించిగూడ తెలిసి తెలియని మాటలు మాపిల్లవాండనిన దగుసమాధానముం జెప్పి వానికెట్లో సంధ్యనేర్పక కృతఘ్నుండై నాడని పాపన్నశాస్త్రి యనుకొ బోవునను భయముచేతనోగాని దుస్తామసియగు సుబ్బావ

ధానులు కోపపడక సాధుత్వము వహించి నీయిష్టప్రకార మర్థముఁ జెప్పెద తామసమునిడచి వినుము. "అపవిత్రుఁడుగా నుండిగాని, పవిత్రుఁడుగానుండిగాని మఱియేయవస్థలో నుండిగాని పుండరీకాక్షుఁడైన భగవానుని దలంచిన మానవుండు లోపల వెలుపల శుచిఁగలవాఁడై యుండునునట" అని సుబ్బావధానులుగారనిరి.

"అన్ని వేళలయందును భగవానుని స్మరించినవాఁడే పవిత్రుఁడుగదా" అని నాగేశ్వరుఁడన నగ్నిహోత్రము మంచి చెడ్డల విచారింపక వస్తువుల గ్రహించురీతి పవిత్రాపవిత్రత భగవానుఁడు విచారింపక నిజభక్తునకు శుచిత్వము సేకూర్చు.

శ్లో॥ అపిచేత్సు దురాచారో
భజతే మామనన్యభాక్
సాధు రేవ సమంతవ్య
స్సమ్యగ్వ్యవసితో హిసః॥

ఆచారరహితుఁడైనను, ఇతరమునంను మనంబుఁ బోనీక నన్నే భజించు నాతండే సదాచారపరుడని కృష్ణ భగవానుడు చెప్పినాడని సుబ్బావధానులుగారనిరి.

అదివిని ఏమంత్ర జపములేకయే భగవద్ధ్యానమువలన మానవుఁడు కృతార్థుఁడు కాగలడా, అను నాగేశ్వరునికి,

తాలం వృంతేన కిం కార్యం
లబ్ధే మలయమారుతే॥

"మలయమారుతసౌఖ్య మవిచ్ఛిన్నముగా ననుభవించు వానికి తాటియాకుల విసనకర్రతో నవసరము లేనట్లు, భగవన్నామజపమహాభాగ్య మనుభవించు భక్తున కన్యమంత్రము లక్కరలే" దని సుబ్బావధానులుగారనిరి.

అదివిని నాగేశ్వరుడు నిమీలితనేత్రుండై కొంతతడవుండి మనంబున కెక్కి సమాధానముఁ గలిగెనోగాని చిఱునగవుతో తలయూచుచు గుఱునిగాంచి, మిగిలిన సంధ్యసంతయుఁ జెప్పుడని వినయముగాఁ బలికిన, సుబ్బావధానులుగా రాశ్చర్యాయత్తచిత్తుఁడై, ఔరా! వీనిమనంబెంత పవిత్రమైనది. కాదేని ఇట్టి పవిత్రప్రశ్నల గావించునా! "ఏమంత్రజపమును లేకనే మానవుఁడు భగవన్నామ జపమువలన కృతార్థుండు కాగలడా" ఆహా! ఏమీప్రశ్న? అష్టవర్షప్రాయమతిక్రమింపని బాలునిచే చేయఁదగినదియా, వీనికట్టి భావ మెట్లుఁగలిగె? మొదటినుండియు పిచ్చివాడని పిలువఁదగిన నడవడికఁగల వీనియం దిట్టి పవిత్రభావము లుంటుట విచిత్రము, జ్ఞానులు బాలోన్మత్తులవలె సంచరింతురనుమాట యథార్థమయ్యె. గానీ ఇంకను వీనిచర్య లారసెదఁగాక, యని మనంబున నువ్విళ్లూరుచు సుబ్బావధానులు తిరిగి సంధ్యఁ జెప్పఁగడంగిన మఱుమాటాడక నాగేశ్వరుఁడు గురువుగారు చెప్పినట్లెల్ల చెప్పుచూవచ్చి,

శ్లో॥ ఆకాశాత్పతితం తోయం
యథా గచ్ఛతి సాగరం
సర్వదేవ నమస్కారాః
కేశవం ప్రతిగచ్ఛతి॥

అనుమంత్రము గురువర్యుని నోటనుండి వెలువడిన వెంటనే "ఈమంత్రమునకుఁగూడ తాత్పర్య మెఱిఁగింపు"డనిన సుబ్బావధానులు "ఆకాశమునుండి వర్షరూపముగా భూమి యందుఁబడిన నీరములెట్లు సముద్రమునజేరుచున్నవో, అట్లే మానవు లేయే దేవతలకు నమస్కరించినను ఆయానమ స్కారములన్నియు కేశవునకే చెందుచున్నవి", అని యర్థ మనిచెప్ప నాగేశ్వరుఁడు వెంటనేలేచి "ఇక మీరు శ్రమపడ నవసరము లేదు. ఎందుకన, వృథాకాలహరణముచేయక మానవుఁడు భగవన్నామస్మరణముచేయవలయునని మొదటి మంత్రమును, సర్వదేవతలు కేశవాకారులగుదురని రెండవ మంత్రమును జెప్పుటచే నామనంబీసంధ్యనుండి విముఖత వహించినది. "ఇది దైవికము కాన నేనిదేపోవుచున్నాను" అని చెప్పుచు సుబ్బావధానులుగారెంతఁ జెప్పిననువినకఁ బరు గెత్తుకొనిపోయిన, "వీనికి నిజముగాఁ బిచ్చిపట్టినది. వెఱ్ఱి వేయి విధము లందులోనిది యొకటి. ఇది చక్కగా నెరవేరదని మొదట నే ననుకొన్నవిషయమే నాపనియైపోయినదిగదా పోనిమ్ము ఇక వాడెట్లుపోయిన నాకేమి", అని అనుకొనుచు శాస్త్రిగారి గృహంబునకేగి నడచిన విధమంతయుఁజెప్పి నిజ నికేతనంబునకరిగి సుఖంబుండె.

పాపన్న శాస్త్రిగా రతిశాంతులు, సదాచార సంపత్తిగల వారు. ప్రతిరోజుదయమునలేచి స్నానసంధ్యాద్యనుష్ఠానములఁ గావించి, తాళపత్రగ్రంథమునందు లిఖింపఁబడిన యధ్యాత్మ రామాయణమందొక సర్గపారాయణముచేసి, భగవానుని పోడ

శోపచారంబులఁ బూజించి, తద్గ్రంథరాజమును భద్రముగాఁగట్టి తాను భోజనముసేయుటకుఁ గూర్చుండుస్థలమునకు వెనుక గల గోడపైభాగమందు నాటఁబడిన వెంపువంకెలపైన నాపుస్తక ముంచి, భోజనముఁజేసి లేచి, దుస్తులనుధరించి తనన్యాయ వాదపదవి నిర్వహించుకొనుటకై యాయారంగల న్యాయస్థాన మున కేగి యందుఁగల పనినంతయుఁ దీర్చుకొని, సాయంతన మున కింటికివచ్చి గృహకృత్యముల నెరవేర్చుకొను చుండువాడు.

ఇట్లుండ నొకదినంబున క్రమముగా నియతకృత్య ములఁజరుపుకొనుచువచ్చి, యధ్యాత్మరామాయణము పారా యణఁజేయుటకుపైనుండు గ్రంథమునుదీసికొన వంకెలవైపునకు దృష్టి మరలించి, అందు తనగ్రంథరాజము లేమి ఇంటనుండు వారి నందఱిని విచారించి ప్రయోజనముఁగానక, పిచ్చినాగన్న చేష్ట యగునేమోయని యూహించి తనకుమారునిబిలిచి మన నాగేశ్వరుఁడెందుండినను బిలుచుకరమ్మని యాజ్ఞాపింప వా డట్లుగావించె.

అంత నాగేశ్వరునిగాంచి శాస్త్రిగారు కోపముతో "నిందుఁగల తాటియాకుల గ్రంథమును నీవతీసినావని నాకుఁ దెలియవచ్చినది. దానిని వెంటనేదెచ్చి నాకిమ్ము. లేనిచో నిన్ను కఠినదండనలపాలు గావించెదనని పలికిన దండ్రివాక్యములకు బెదరినవానివలె వడవడ వడంకుచు మాఱుమాటాడక చని, రహ స్యస్థలమున తానుదాచియుంచిన శాస్త్రిగారి సంస్కృతా ధ్యాత్మరామాయణము దాని కనువాదముగా రచింపఁబడు

పద్యములచే నలరారు నూతనతాళపత్ర గ్రంథయుతముగాఁ దెచ్చి శాస్త్రిగారికిచ్చిచేతులుజోడించి నిలచె.

అంతశాస్త్రి కుమారుఁడిచ్చిన రెండుగ్రంథములను దీసికొని "ఈ రెండవగ్రంథమేమిటి" అనిబలుకుచు విప్పిచూచి అధ్యాత్మరామాయణము బాలాకాండమని దెలిసికొని అది తన గ్రంథమున కనువాదమనిగూడ గ్రహించి కుమారుని గాంచి "యీగ్రంథమెక్కడిది? యెవరిచే రచింపఁబడినది?" అనియడిగిన నాగేశ్వరుఁడు నిర్భయముగా "శ్రీరామమూర్తిచే రచింప బడుచున్న యధ్యాత్మరామాయణము (పద్యకావ్యము)" అనిజెప్ప తండ్రి ఆశ్రీరామమూర్తి యెవరనుడు, సంతోషాతిశయమున నృత్యముసేయుచు "తండ్రీ! ఆశ్రీరామమూర్తి యెవరనియా, "నజాయతే నజనిష్యతే" పుట్టువెఱుఁగనివాఁడై స్వరూపసామర్థ్యాదులచే జెడనివాఁడై,యొరులచే జెపఁబడనివాఁడై "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" సత్యజ్ఞానానందములే స్వరూపముగా గలవాఁడై, సత్యసంకల్పుఁడై "హృత్పుండరీకం పురమధ్యసగ్ధమ్" ప్రాణుల హృత్పుండరీక నివాసియై "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" అనుధర్మమును స్థాపించుకొఱకు ప్రతియుగమునం దవతరించుచుండువాఁడై "యదాదిత్యగతంతేజః" సమస్తజీవకోటులను బ్రకాశింపఁజేయువాఁడై, సర్వేంద్రియ నియామకుఁడై, యనంతాది గూపభేదములచే సమస్తభూతములను భరించువాఁడై, సర్వకర్మలకు నాయాకర్మ ఫలములకును గర్తయై ఆది మధ్యాంతములు లేనివాఁడై,సృష్టి స్థితి సంహారకారణుఁడై,విచిత్రక్రియా సమర్థుఁడై, వాచామ

గోచరుఁడై, భక్తమానసాహ్లాదకరుండై వెలుంగుపరబ్రహ్మంబ శ్రీరామమూర్తి'' అని చెప్పి యూరకుండిన, పుత్త్రుని కౌగలించుకొని "నాయనా! శ్రీరామసహాయంబున నీచే నీగ్రంథము రచింపఁబడుచున్నదని తెలియుటచే పరమానందభరితుండ నైతి. విద్యాగంధమెఱుంగని నీకీవిజ్ఞానసంపత్తియు, మృదుమధుర వాగ్రచనా నిపుణతయు గ్రంథనిర్మాణ కౌశలంబును గలుగుటాశ్చర్యకరము. చిరకాలమునుండి నిన్ను నాదరము సేయుచు పిచ్చివాడవని దూరనాడిన నన్ను శ్రీరామమూర్తి క్షమించుగాక. నేటినుండి నాభయమేమియు లేక నీగ్రంథమును దెనిగించుము. "మఱచితిని" ఈమహాత్కార్య మెంత కాలమునుండి సాగింపుచుంటివి?'' అనుతండ్రికి నిన్న రాత్రి "అధ్యాత్మరామాయణము నాసాయంబున దెనుఁగున వ్రాయుదువుగాక'' అని రామాజ్ఞ యగుటచే తదాజ్ఞానువర్తినై పనిగొనుచుంటినని నాగేశ్వరుండనిన యాశ్చర్యాయత్తచిత్తుండై భార్యనుబిలచి శాస్త్రిగారు కుమారుని సామర్థ్యాతిశయంబులుగ్గడించి ఇంతటినుండి అతనియెడ భక్తిప్రపత్తులుగలిగి మెలంగునటుల శాసించి, తాను సంతోషసాగరమున దేలియాడుచు నాడు కుమారునితోఁగూడి భోజనముఁ జేసి నియతకృత్యముల నేరవేర్చుకొనుటకై న్యాయస్థానమున కేగె. నాఁడు మొదలింటయందు, నూరియందు గౌరవమతిశయింప రామాయణ రచనా మహాభారముఁ దలధరించి నాగేశ్వరుఁడు మోయుచు, తండ్రిని గాంచి యొక్కనాఁడు వినయాతిశయము లుప్పతిల్ల "నాయనా! అధ్యాత్మరామాయణమున బాలాయోధ్యకాండములు పూర్తి

ద్రైనని ఇక నరణ్యాకాండముఁ బ్రారభింపవలయు నంటు నకు విజనప్రదేశమును కాలవిరామమును ముఖ్యావసరములు. కాన దయయుంచి మనయింటియందలి గదులలో నొకదాని నొసంగి నాలుగుదివసములు విరామమిడి (శ్రీ)మదధ్యాత్మరామాయణ ములో నేనందుండునటులను పైగదువులోపల నన్నెవ్వరుగాని బలుకరింపకుండునటులను, శ్రీరామాజ్ఞయయినపుడు నాకై నేనే వచ్చిమజ్జన భోజనాదులఁగావించి పోవుచుండువాడనగు టచే నన్నందున కితరులు నిర్బంధింపకుండునటులను, వరం బిమ్మ'' ని పలికిన పుత్రుని వాక్యంబులకలరి, ఈమహాత్కార్య మునకిట్టి నియమముండవలయుఁగాబోలునని దలంచి మారు మాటాడక "అట్లేయగుగాక'' అనుచు తనపారాయణమున కవ సరమగు శ్లోకములఁగొన్నిటి నధ్యాత్మరామాయణమునుండి వ్రాసికొని నాడు పుత్రునితో భోజనముఁగావించి, తనుపరికర ములతో నాగేశ్వరు నొకగదియందుఁ బ్రవేశపెట్టె; యతని యిష్టానుసారమా గదికి తాళము వేసి ముద్రచేసె శాస్త్రిగారు న్యాయస్థానమున కేగె.

ఆగదియందుఁ బ్రవేశించి నాగేశ్వరుఁడు చప్పుడుచే యకఁ గూరుచుండుటచే, నందు మనుజుఁడుండినాడనుకొనదగిన గురుతు లేమియుఁ దోపకుండుటయుగాక భోజనమజ్జనాదు లకు నయితము బయటికివచ్చుట మానివేసెను.

ఇట్లు దివసత్రయంబు గతించిన పాపన్నశాస్త్రి పుత్రుని కఠిననియమమున కడలుచు, క్షణక్షణమునకు మనంబుకలగుచుండు పడుచూడ జేయునది లేక నియతకృత్యములవీడి, పదేపదే గది

యొద్ద కేతెంచి యేవలనను పుత్రుని క్షేమసమాచారము దెలి యమి నిరాశాపరుఁడై నిద్రాహారములు విడనాడి, మిగుల కష్ట ముతో గతదినములు మూఁడు వెళ్లించినాఁడు. గాని నాలుగవ దివసమట్లు గాక, శాస్త్రిగారికి నాగేశ్వరుని జీవితమును గుఱించి సందేహముఁగలుగఁజేసినది. తన్నివృత్తికై ప్రయత్నించుటకుఁ బ్రథమమున నాగేశ్వరుఁడడిగిన వరంబులన్నియుఁబడి తీఱుగలుగఁ జేసినవిగావు. కాని పుత్రప్రేమ యంతకంతకు మిక్కుటముగా పురికొల్పి తాను వేసిన ముద్రలఁ ద్రిప్పించి తాళముఁదీసి తలుపుఁ దెఱువ యత్నించెనుగాని లోపల గొళ్లెము వేసియుండుటచే సాధ్యముగామి, తలుపు బ్రద్దలు చేసియైనను ప్రవేశింపఁగాంచెద నని దలంచి తత్కార్యమాచరింపఁబోవునంతలో నొక స్నేహితుఁ డరుదెంచి "మీరలెందులకిట్టియాతురపడెదరు? ప్రథమమున నాగేశ్వరుఁడు నాలుగునాళ్లుగదా గడువడిగినది. అది జామునై దేగిన కడచనునే! గడచిన మూఁడుదివసములనుండి రాజాలని యశుభమీ స్వల్పకాలమునందెట్లు రాగలదు? అట్లుగాదేని ఇప్పటి మీ ప్రయత్నమున వెనుకవచ్చిన, ముందు రాగలిగిన యశుభములు బోఁగలవా? అవతార పురుషుండగుటచే వాని కెట్టికష్టమును రానేరదు గాన సంపూర్ణముగా సందియము వీడు"డని సమాధానముఁజెప్పి వారించెను.

అంత దివాకరుఁడీ విచారవార్త వినజాలకఁగాబోలు హస్తాద్రి మఱుఁగున కేగె. శాస్త్రిగారికి నాటిరేయి నాలుగుజాములు నాలుగు యుగములై యెట్లో గతించినవిగాని ముందే యశుభవార్త విననగునోయను భీతిమాత్రము గతింపమి, మఱే

ఇంకెక్కడి పుత్రుఁడు. నాలుగుదివసము లన్నపానములులేక జీవించినవారలెవ్వరైనను గలరా? సుపుత్రమృతిఁగనుఁగొనజాలిన నాబోటి నిర్భాగ్యునిబ్రతుకెందుకు 'మంటగలుపనా' అనిరోదన సేయుచెవరెంతఁజెప్పినను వినకఁ తలుపుబిగ్గలుసేయుఁడని సేవకులకాజ్ఞాపించి వేగిర పెట్టుడు, వారట్లుగావింపఁసిద్ధపడి యున్నంత గదిలోపలిగొళ్లెము కదలించిన చప్పుడు వినవచ్చి వారి నెంతయువారించినది.

అంత నాగేశ్వరుఁడు కనులయందు నీరుఁగార్చుచు గ్రంథద్వయము హస్తయుగంబునం దలరుచుండ గదినుండి ప్రత్యక్షమైన శాస్త్రియు, తత్కాంగల బందుగులును వానిం గౌగలించుకొని గొల్లుమనసాగిరి అదివిని గతించినరేయి శాస్త్రిగారి ప్రయత్నము వారించిన మిత్రుఁడేతెంచి నాగేశ్వరుని కౌగలించుకొని విలపించు వారినందఱి నావలకుఁదీసి పిల్లవానిని బ్రతుకనివ్వరాయేమి? అని యదలించుచు, నాగేశ్వరునితో "నాయనా! మీతండ్రిగారు నాలుగురోజులనుండి నీకొఱకు నిద్రాహారములుమాని పరితపించుచున్నారు. ఈదివస చతుష్టయమునుండి నీవన్నపానములులేక నెట్లుంటివి? రోజునకొక పూటయేనియు భోజనముఁజేసిపోయిన గాక పోయినదియా? చూడు నీకొఱకు మీయమ్మగారెంతఁ గృశించినారో?" అనుచు వానిహస్తములనుండు గ్రంథద్వయముం గ్రహించి, యందునూతన గ్రంథమునువిప్పి యరణ్యకాండము పూర్తియగుటనారసి, అది శాస్త్రిగారికి చూపింప విషాద సంతోషప్రేమలు ముప్పిరిగొన బుత్రుని కౌగలించు

(10)

కొని చెక్కులముద్దుఁగొని గద్గదకంఠుండై, "నాయనా! ఈనా లుగుదివసములు మస్తోడఁబాసి యెట్లుండఁగల్గితివి?" అనిన "గ్రంథరచనాభారవాహుండగు శ్రీరామమూర్తి తనయసన్న్యా వాసవృత్తాంతము వెల్లడించుటచే దుఃఖమాపుకొనలేనివాఁడై యుండుటయు, లేఖరిత్వపదవి నధిష్టించిన నేను జగజ్జననీజనకు లకుఁగలుగు కష్టములవిని వ్యసనపూరితుండనగుటయు గ్రంథముసాగమి యన్నపానముల మరచినాఁడ"నని దుఃఖపూరితుఁడై పలికిన నాగేశ్వరునిమాటల కచ్చటివారెల్ల రచ్చెరువంది వానిపరిభావము వేనోళ్ళఁగొనియాడుచుండ, జననీజనకులు పుత్రునిదోడ్కొనిపోయి యభ్యంజనముఁ గావింపించి ఋచి రాన్నంబుల భుజింపఁబెట్టి. తామునుభుజించి ఇష్టాగోష్టి సలుపుచు సుఖాసనివిష్టులై యుండిరి. ఇట్లు రామానుగ్రహంబున నాగేశ్వరుఁ డచిరకాలంబుననే రామాయణము పూర్తిగావించి తనపదమూడవయేట కృష్ణాసాగర సంగమ తీరమందలిరాసు మోరుకోటయందు వేంచేసియున్న ముక్తేశ్వరస్వామివారి సమక్షమున శ్రీరంగేశ్వరునకు కృతినర్పింపదలంచి, మహాశివ రాత్రినాడు ప్రొద్దుగ్రుంకుసరికి జననీజనక మిత్రబృందముతో పలువురు విప్రపుంగవులు మహాన్యాసపూర్వకముగా నభి షేకముఁగావించు సమయమున తదాలయమున కేగి, స్వామి వారిని సమీపింప నందుండు విప్రులెల్ల నైకకంఠ్యముగా మయలవాఁడ వగుటచే లోనకు రాగిట్టదు పోపొమ్మని పలుకుచు నెట్టివేసిన, దాసుగారు తిరిగి ముఖమంటపమున కేగి తనకు సంభవించిన యవమానమును లెక్కసేయక గరం

బులఁ గీలించి భక్తిప్రపత్తులు మెరయ ముక్తేశ్వరు నిట్లని వినుతించె.

ఉ॥ శంకర భక్తమానస వ ♦ శంకర దుష్టమదాసురేంద్ర నా
శంకర పాండునీలరుచి ♦ శంకర వర్ణనిభాంగ భోగిరా
ట్కంకణ పార్వతీహృదయ ♦ కైరవకైరవ మిత్రయోగి హృ
త్పంకజ పంకజాప్తజయ ♦ తాండవ ఖేలన భక్తపాలనా॥

సీ॥ దేవజగన్నాథ ♦ దేవేంద్రవంధిత వితతచారిత్రి సం ♦ తతపవిత్రి
హాలాహలాహార ♦ యహిరాజకేయూర బాలేందుభూష స ♦ ద్భక్తపోష
సర్వలోకాతీత ♦ సద్గుణసంఘాత పార్వతీహృదయేశ ♦ భవవినాశ
రజతాచలస్థాన ♦ గజచర్మపరిధాన సురవైరివిధ్వస్త ♦ శూలహస్త

గీ॥ లోకనాయక సద్భక్త ♦ లోకవరద
సురుచిరాకార మునిజన ♦ స్తుతవిహార
భక్తజనమందిరాంగణ ♦ పారిజాత
సకలలోకైకపూజిత ♦ చరణకమల॥

తే॥ గీ॥ అవ్యయుండ వనంతుండ ♦ వచ్యుతుండ
వాదిమధ్యాంతశూన్యుండ ♦ వఖిలభృతివి
నిఖిలమందెల్ల వర్తింతు ♦ నీవునగిలి
నిఖిలమందెల్ల నీయందు ♦ నెగడు దేవ॥

ఇట్లు ప్రార్థింపఁ గరుణాళుఁడగు శంకరుఁడు తద్భక్తికి మెచ్చి లింగరూపమున దాసుగారి దోయిటఁబ్రవేశించి కటాక్షించిన నాగేశ్వరుఁడు బ్రహ్మానందవార్ధి నోలలాడుచు యానందనృత్యము గావించుచుండె. ఇట నభిషేకముఁ గావించుచున్న బ్రాహ్మణులు స్వస్థలమందు శంకరుఁడులేమి సంశయాకులచిత్తులై తమలోఁ దాము గుసగుసలాడుచు గొంత వడికి దాసుగారి హస్తములయందు స్వామివారు వేంచేసి యుండుటలఁ దెలిసికొని తమతమ పూజాదికములమాని

వినయాతిశయంబు లతిశయింప వచ్చి దాసుగారికిఁ బ్రదక్షిణ నమస్కారములఁగావించి యాతని పరిధానమున కాశ్చర్య పూరితచిత్తులై పొగడుచు శ్రీస్వామివారిని స్వస్థానమున జేర్చ నటులఁ బ్రార్థింప దాసుగారు కొంతవడికిఁ దెలిసికొని,

గీ॥ భవునియందును శ్రీరమా ♦ ధవుని యందు
భేదమెంచక సమదృష్టిఁ ♦ బాదుకొల్పి
భక్తిఁజేసెడునేని ని ♦ స్వప్నమంగ
మూర్తి స్వీయాసనముఁజేరి ♦ మురియుఁగాత॥

అని నిజాభిప్రాయము వెల్లడించినంతనే తల్లింగము స్వస్థానమునకేగి చూపరుల కానందముఁగలిగించె. నంత బ్రాహ్మణులెల్లరు దాసుగారిని సబహుమానంబుగాఁ దోడ్కొని పోయి స్వామివారి పురోభాగమునం దమర్చియుంచిన యుచితాసనంబున గూర్చుండఁబెట్టిన భక్తవిశ్వాసము లుప్పొంగఁ దన గ్రంథరాజమును యథావిధిగా ముక్తేశ్వరుని సమక్షమున శ్రీరంగేశ్వరుని కర్పించి కృతకృత్యుఁడయ్యె.

అంత కొంతకాలమునకు శాస్త్రిగారు నాగేశ్వరున కనురూపవతియగు కన్నెనొకర్తుఁదెచ్చి వివాహ మతివైభవంబుగా గావించి, తదుపరి నూతనగృహంబొండు నిర్మించి యందాదంపతుల గృహప్రవేశము గావింపించి వారి పోషణా భారమంతయుఁ దానే మోయుచుండె. సంసార కృత్యముల యందు విరక్తుండై యుండుట నాగేశ్వరుఁడు భార్య నొంటి నింటవిడచి యెందేనియుం జని దనయిష్టము వచ్చినప్పుడు మాత్రమింటికివచ్చి పోవుచుండువాఁడు.

ఇటులఁ గొన్నిరోజులుగతింప శాస్త్రిగారు పరలోకో న్ముఖుఁడై యుండి తనకుఁగలయావదాస్తిని కుమారులందఱికిఁ బంచియీయదలంచెను గాని యస్పటిస్థితినిబట్టి స్వతంత్రించి యేకార్యముఁ జేయఁజాలని వాఁడగుటచే యీారసునకులోఁబడి తానుదలంచినటులఁ గావింపలేనివాఁడై చేయునదిలేక విచార పూరిత మానసుండై స్వల్పకాలంబుననే మృత్యువాతం బడియె

దానకుటుంబ భారమంతయు నాగేశ్వరుని శిరంబున కొఱగినది కాని దానికతఁడు లెక్క సేయక పూర్వపు రీతి వర్తింపుచుండుటఁగాంచి రేపల్లె, భట్టిప్రోలు గ్రామంబు లంగల వైశ్యపుంగవులు కొందఱాభారమంతయుఁ దమపై వైచి కొని సంపూర్ణ విరామమిచ్చిన నాగేశ్వరుఁడు పరమానంద భరితుఁడై నిరంతరము రామభజన సేయుచు జీవితము సార్థక పరచుకొనుచుండె.

ఇట్లుండఁ గొంతకాలంబునకు దైవయోగంబుపేర్మి దాసుగారి భార్య గర్భవతియగుట విని, భట్టిప్రోలునగల వైశ్య శిఖామణులు కొందఱు భక్తిపెంపున చీన చీనాంబరములను కొన్నియుపహారములును సేకరించి యొకబ్రాహ్మణునకిచ్చి దాసుగారి భార్యకర్పించి రమ్మని చెప్పిన, నాతండా ముడుపు గైకొని రేపల్లెకువచ్చుచుండ మార్గమధ్యమందా బ్రాహ్మణు నకు దాసుగారుకలసి యాతని యాగమన కారణంబెఱింగి, ఈ ముడుపునిచ్చి నీవింటికిఁబోయిన దీనినాయిలుఁ జేర్చెద. వృథా శ్రమ నీకేలయని నమ్మఁజెప్పి యాముడుపు గ్రహించి తన

శిరంబునందిడుకొని రామభజనసేయుచు వచ్చుచుండఁ గొంత వడికి నవమాసస్ఫూర్తి విజృంభింప మార్గాయాసమున నను వంజాలకొక వృక్షచ్ఛాయఁ గూరుచుండియుండిన భిల్లకామిని నొకర్తుంగాంచి సమీపించి వినయవినమితవదనుండై, "అమ్మా! వస్త్రాదికములచేతను, రుచ్యములగు నుపహారములచేతను నిన్ను సన్మానించువారెవ్వరుండరని నీవుధరించిన జీర్ణవసన ములే చెప్పకఁ జెప్పుచున్నయవి గాన నాయందు సోదర వాత్సల్యముంచి మద్దత్తవసనాదులం గ్రహింపు"మని చెప్పుచు తనయొద్దనున్న ముడుపు నామెకందిచ్చి బ్రహ్మానందమున నోలలాడుచు నెందేనియుంజనియె.

ఈవృత్తాంతము భట్టిప్రోలు నగరవైశ్యపుంగవులు విని కటకటంబడి చేయునదిలేక దాసుగారికి తెలియకుండునట్లు తిరిగి వివిధోపహారములను ఉత్తమవసనములను సేకరించి దాసుగారి భార్యకంపి పరితృప్తులైరి. అంతకొంతకాలమునకు దాసుగారికొక పుత్రుఁడుదయించిన నేకపుత్రవిషయమగు టచే తల్లి రామారాయుఁడను నామకరణముఁగాంచి యతి గారాబమున బోషించుచుండె.

పుత్రలాభమునకుఁదోడు శిష్యలాభమును గడింప నెంచి దాసుగా రాంధ్రరాష్ట్రమంతయు సంచరించి యం దందు భక్తిజ్ఞాన వైరాగ్యపూరితములైన యుపన్యాసము లిచ్చుచు వర్ణవిచక్షణ లేకయే శిష్యబృందమును గడించుచు గొంతకాలమునకు గుంటూరునకేగి యందనేకమంది శిష్యుల

సేకరించిరి. దాసుగారు బుద్ధిబలమునకుఁదోడు దేహబలము గూడ గలవారు.

అంత నొకసంవత్సరంబున సకాలవర్ష ప్రతిబంధక మేర్పడుటచే రేపల్లె వాస్తవ్యులందఱొకచో జేరి తన్నివారణో పాయము లాలోచింపుచుండ దాసుగా రెటనుండియో వచ్చి వారల మనోభావము లెఱింగి దయాళుండై మీరేల కటకటం బడెదరు, ఇప్పటికొక యామంబు గతించులోపలఁ జాలినంత వర్షము వర్షింపగలదనియు రామాజ్ఞయయినది. కాన తచ్ఛుభ సమయమునకై వేచియుండుడని జెప్పుచు స్వగృహోన్ము ఖుండై చనిన దాసుగారి వాక్యముల లక్ష్యసేయక, సభ్యు లందఱాయూరంగల శివునకు సహస్రఘటాభిషేకముఁ జేయ నిశ్చయించి, తన్మహాకార్యమున కవసరమగు పరికరముల సిద్ధ పరచుచుండులోపల దాసుగారిచే నిర్ణయింపఁబడిన కాలం బరనిముసంబుండగనే ఎక్కడలేని మేఘంబు లాకసంబెల్లడ నావరించి సంపూర్ణముగా వర్షించి కర్షకుల కానందముఁ గలి గించె. నాడుమొదలా యూరంగల యాబాలగోపాలమున కును దాసుగారియందు భక్తివిశ్వాసము లతిశయింపసాగె ననుటలో వింత లేదుగదా.

భరతఖండంబునం గల పుణ్యక్షేత్రంబుల నారయు తలంపున దాసుగారు శిష్యబృందముతో బయలుదేరి రామ భజనసేయుచు సీతాకల్యాణ సమయమునకు భద్రాచలమున కేగి సీతారాములు కల్యాణమంటప మధ్యస్థులగుటయుఁ

దన్మంటపమును చుట్టుముట్టి జనసముదాయ మిసుకజల్లిన రాలకుండు నట్లుండుటయుఁ గాంచి, తాను శిష్యులతో నామండప సమీపమున కేగి భజన సేయుట దుస్తరంబని దలంచి కాఁబోలు తిర్పుడుత్సవమును మానుకొని, యాలయముఖ మంటపమున జేరి శిష్యులుం దానును కరతాళముల గ్రహించి తాళంబూరలు మీటుచు.

ఆనందభైరవి రాగం — ఆటతాళము

కనులకుఁ గనుపడవేమి శ్రీరామ! రామయ్య తండ్రీ!
కనులకు॥ ఇంత కన్నడ సేయఁగ కారణమేమి ॥క॥

ఎక్కడనున్నావో స్వామి నాకిం కెవరయ్య దిక్కికనో
సర్వాంతర్యామి ॥క॥

గుహుడు కడిగిన పదము లేవి జనక కూతురు కూర్చున్న
వామాంకమేది ॥క॥

పయిడిముగ్గులు గొల్సు లేవి చేత బట్టిన మంచితీరు
కమాను లేవి।

మంచి పచ్చలపోగు లేవి తళుకు మించిన నీవ్రేళ్ళ యుంగ
రము లేవి ॥క॥

ఘంటల మొలనూలు యేది బొజ్జ గదల తళుకుమను
కౌస్తుభ మేది ॥క॥

ముద్దులుగులుకు మోమేది జగన్మోహనమైన మీ చిరు
నగవేది ॥క॥

వరదుఁడిచ్చిన హార మేది తూము నరసింహుఁ డర్చించు
చరణంబు లేవి ॥క॥

శ్రీ భద్రాచలవిహార తులసీదళహార హేసింధు గంభీర పరమదయారసపూర 
నాగేశ్వరదాస మందార జగదేకవీరా ॥క॥

అని భక్తిభావంబుట్టిపడ ప్రార్థించిన సీతారాములాతనిభక్తికి మెచ్చికొని మంటపస్థ విగ్రహములయందుండు తమతమ షోడశకళలనులేపి నాగేశ్వరుని ముందావహింప జేసి యానందించుచుండె. అదిగాంచి,

కాఫీరాగము — ఆట.

నాపాలి భాగ్యమేమందు రఘునాధుఁడు కనుపించె ముందు పాపములెల్లనుబాపు శ్రీరాముల రూపము కనులకు పూర్తిగఁ గనుపించె ॥నా॥

బొరసిబొరసియున్నందుకు తాంబూర చిరుతలఁబూనినందుకు తరుచైన యెండ మధ్యాహ్న సమయమని వెరువకబోయి కోనెల దూరినందుకు ॥నా॥

మంచిసొమ్ములు దాల్చినాడు నవ మన్మథ రూపము వాడు ఎంచగలేరు గౌరీశవాణీశులు మంచివారలకెల్ల మంచివాడగువాడు ॥నా॥

అని యానందగీతముఁ బాడుచుండ తాము నరసింహదాసుగారి రహస్యమును గ్రహించి నాగేశ్వరుని సన్నిధానమునకేగి ప్రార్థించి సబహుమానముగాఁ దోడ్కొనిపోయి కల్యాణవేదికపై ప్రవేశపెట్టిన తిరిగి యావిగ్రహంబులు షోడశకళాపరిపూర్ణములై విరాజిల్లె. నంత నాగేశ్వరుని మాహా

త్స్యమున కచ్చేపవంచుచు సంయమంసువారు యథావిధిగా కల్యాణమహోత్సవము గావించి కృతకృత్యులైరి. అంత కొంతకాలమందుండి రామాజ్ఞ గైకొని బయలుదేరి యుత్తర యాత్రలనన్నియు సేవించి, క్రమంబున దక్షిణదేశయాత్రలం జేయుచు శ్రీరంగమున కేగి యందొక శతకరాజమును శ్రీరంగనాయకున కర్పించి, ఎనిమిదవ వత్సరంబున నిజగృహ ప్రవేశంబుగావించె.

దాసుగారింటి కేగిన మరుదినసంబున అష్టవర్షప్రాయాతీతుండగు కుమారుండు మృత్యుముఖ సంప్రవేశంబునను తద్వ్యసనదశ కడలక పుత్రశవమును హరిభజన పూర్వకముగా శ్మశానవాటికిం గొనిపోయి ఖననాదిక్రియలాచరించి, వివాహ మహోత్సవమున కేగి వచ్చువాని పోలిక, నిర్వికారుండై యింటికిం జనుదెంచి, లోకమర్యాదానుసరణి శుచిస్నానాదికములాచరించి భగవద్ధ్యానాసక్తచిత్తుండై యుండు నెడ, బంధుగులు కొందఱు అరుదెంచి పెద్దతనముసం దిట్టి పుత్రవియోగదుఃఖము సంభవింపదగినదియే మీకని సమాశ్వాసింప, వారలంగని దాసుగారు చిరునవ్వు మోమున దా డవమాడ, "మీరెట్టి వెఱ్ఱివారలైతిరి! ప్రతిదినము తాను విసర్జించు మలంబున ననేక కీటకంబులుపడి మృతినందుచుండ, వానికై దుఃఖింపని మానవుం డన్యస్త్రీగర్భమునుండి పొడమిన పుత్రరూప కీటకముల కడలుట సమంజసంబగునా? 'ఋణానుబంధరూపేణ పశు పత్ని సుతాలయాః' । అను నీతివాక్యమెఱుంగరా! కాన

మిూ మిూ యుపన్యాసము లింతట గట్టిపెట్టి రామనామామృతముఁ బానముఁ జేయుచు కృతార్థులు కం”డని బోధించె.

ఒకపరి నిజకాంతచే ప్రబోధింపఁబడి పితృశ్రాద్ధమునకు భోక్తల నియమించుటకై బయలుదేరి విఫణిమార్గంబున వచ్చుచుండ, బీదవర్తకుఁడొకఁడు దాసుగారినిజీరి మిగుల సన్మానించి, తన యంగడియందున్న పదార్థములలో శ్రేష్ఠములై చెన్నారు పుట్నాలఁగొన్నిటి నర్పింప, వాటినిగ్రహించి భక్షింపుచు, పౌరోహితుండగు ధర్మశాస్త్రిగారి గృహంబునకేగి, స్వీయాగమన కారణంబెఱిగింప నాతండు వినివిననివాని వలె నటించి కపట మందహాసపూరితుండై, ‘దాసుగారేమిటో భక్షింపుచున్నారు!’ అనియడిగిన, ‘తప్తచణక శకలములు తెడవర్తి వెంకయ్యశ్రేష్టిగారు భక్తితో నర్పింప భక్షింపుచున్నాను గాని, నేడు మాతండ్రిగారి యాబ్దీకము; తాము భోక్తకు దయచేయవలయు’నని ప్రార్థనాపూర్వకముగా బలికిన దాసుగారికి “ధర్మశాస్త్రి బ్రాహ్మణుఁడైన వాఁడెప్పుడును నీయింట భుజింపడు. దురాచారపరుండవై తండ్రి తద్దినము రోజుగూడ అభక్ష్యా భక్ష్యములెఱుంగక వైశ్యుఁడర్పించిన శనగపప్పు భక్షించుచు తగునని నన్నెటుల భోక్తకురమ్మని పిలచితివి? సిగ్గులేక నీవుపిలచిన పిలతువుగాక, నేనెటుల నీయింటికిరాగలను పోపొమ్ము. నేనగా దీ యూరంగల బ్రాహ్మణుఁడెవ్వఁడును నీయింట భుజింప”డని దూరనాడిన, ధర్మశాస్త్రి ననేకవిధములఁ బ్రార్థించియు ప్రయోజనముఁగానక, గృహం

బునకేగి జరిగినవిధమంతయు భార్యకెఱిగించి, "రామాజ్ఞాను సరణి కార్యములు గట్టెక్కఁగలవు. కాన నీవు శంకింపక నన్నాదికముల పచనముగావింపు"మన నా సాధ్వీమణి యట్లే గావించుచుండ నంతలో నిరువురు దూరాధ్వగులగు బ్రాహ్మణులేతెంచిన భక్తిప్రపత్తు లుల్లసిల్ల వారిని భోక్త లుగా నియమించుకొని శ్రాద్ధము పరిసమాప్తి గావించి కృతకృత్యుండయ్యె.

ఇట్లమానుషక్రియల ననేక మాంధ్రలోకమున నెల్ల డించి తన డెబ్బదిరెండవయేట పునరావృత్తిరహిత శాశ్వత బ్రహ్మలోకమును గడించె.



# లీలాశుక (బిల్వమంగళ)

రచయిత : శ్రీ పన్నాల లక్ష్మీనరసింహంగారు

" The Glory of the Divine Name cannot be established through intellect and reason but it can be experinced through Faith and reverence only. " — "Mahatma Gandhi."

భగవన్నామమహిమ తెలియఁవలయునంటె పరిజ్ఞానవాదముచే అసంభవము- గాని కేవలము శ్రద్ధ, విశ్వాసముచేతనే సాధ్యపడును.

శ్లో॥ భవానీశంకరౌ వందే, శ్రద్ధావిశ్వాసరూపిణౌ,
యాభ్యాం వినా నపశ్యంతి, సిద్ధాః స్వాంతస్థ మీశ్వరం ॥
— "తులసీదాసు."

శ్రీ బిల్వమంగళుఁడు మొదట మహాభక్తుఁడైనను, ప్రారబ్ధవశమున మార్పుచెంది, పరమశ్రద్ధ, విశ్వాసములతో భగవన్నామస్మరణవలననే, మరల ఉద్ధరింపబడిన మహానుభావుడు. అతని జీవిత చరిత్రవలన మనకు బోధపడు విషయం "భగవన్నామమునందు అచంచల శ్రద్ధవిశ్వాసమే" గావున వారి జీవితము మనకు రాజబాటవంటిది. వారివలె, మనమును నిరంతర భగవన్నామ స్మరణజేసి తరింతుముగాక !

శ్లో॥ కరారవిందేన పదారవిందం
ముఖారవిందే వినివేశయంతం,
వటస్యపత్రస్య పుటేశయానం,
బాలం ముకుందం మనసాస్మరామి॥

పరమపవిత్రమగు కృష్ణవేణీ నదీ తటమందు "కొల్లూరు" అను నొకగ్రామము కలదు. అందు వేదాధ్యయనపరుడు, సకల ధర్మశాస్త్ర వేత్తయునగు "రామదాసు" అనునొక బ్రాహ్మణోత్తముడు కలడు. ఈతనికి "బిల్వమంగళుడు" క్రీ॥ శ॥ 17వ శతాబ్దియందు గలిగెను. బిల్వమంగళునికి యథాకాలమున చౌలోపనయ నాది సంస్కారములుగావించి, గురుకులమునకు పంపిరి. బిల్వ మంగళుని బాల్యమంతయు గురుకులవాసముననే గడచినది సకలశాస్త్రములు, వేదాధ్యయనము చేసెను. పూవు పుట్టి గనే పరిమళించునన్నటుల బిల్వమంగళునికి, భగవద్భక్తి, అతిథిసేవ మొదలగు సద్గుణములు అలవడెను. యిట్లు కొంత కాలముగడువగా, బిల్వమంగళునికి, "ముక్తాంబ" అను కన్యనుయిచ్చి వివాహముచేసిరి.

ఇటులుండ ఒకరోజున కొందరు భక్తులు యీ క్రింది విధముగా సంకీర్తనచేయుచు వెళ్లుచుండిరి.

నామం:- గోవింద, ఘనశ్యామ, గాతేచలో, విషయోంసె,
మన్‌కో, హటాతేచలో ॥.

ఈ భక్తులనందరిని వారింటికి ఆహ్వానించి, సత్కరించి, మరునాడు వారిని పంపివేసెను. ఇట్లు మహాభక్తిచేయుచు బిల్వమంగళుడు కాలముగడపుచుండెను. కాలాంతరమున బిల్వ మంగళుని తల్లిదండ్రులు గతించిరి. పైతృకసంపదఅంతయు బిల్వమంగళుని స్వాధీనమాయెను.

శ్లో॥ యౌవనం ధనసంపత్తిః,
ప్రభుత్వ మవివేకితా,
ఏకైక మప్యనర్థాయ,
కింయత్ర చతుష్టయమ్॥

అనగా యౌవనము, సంపద, అధికారము, అవివేకము ఇవి ఒక్కొక్కటియే అనర్థము చేకూర్చును. నాల్గును నున్నచో చెప్పున దేమి ?

బిల్వమంగళునికి పూర్తిగా స్వేచ్ఛకలిగినది. అదుపులో నుంచువారు లేరు. అందువలన అతడు క్రమముగా దుస్సాంగత్యమువలన యుక్తాయుక్త వివేచనా శూన్యుడాయెను. సాంగత్యదోష మెంతటిపనినైనను చేయించునుగదా ? బిల్వమంగళుడు దుష్టసాంగత్యముచే అనేక వ్యసనములకు లోనయ్యెను.

ఒక దినమున ఆగ్రామములో పెద్దలందరు కలసి "చింతామణి" యను వేశ్యయొక్క నాట్యము ఏర్పాటుచేసిరి. పండితులు, రసికులు, విలాసులు ఆమె నాట్యము చూడ నేగుచుండిరి. బిళ్వమంగళుడుగూడ మిత్రులవెంట నర్తనశాల కేగెను.

"చింతామణి" భూలోకసుందరి. హావభావముల చక్కగ నభినయించుచు నాట్యము చేయుచుండెను. చింతామణియొక్క సౌందర్యమునకు, అభినయమునకు బిల్వమంగళుడు అచ్చెరువొంది ముగ్ధుడాయెను. తుచ్ఛమును నీచమునగు ఆమెశరీరమునకు, తనశరీరము, మనస్సు, ఇంద్రియములు,

కులము, మర్యాద, ధర్మములు, వేయేల తనసర్వస్వమును, అర్పించెను. సర్వకాల సర్వావస్థలయందు చింతామణిస్మరణ దప్ప వేరొండు లేదు. బ్రాహ్మణ కుమారుడు పూర్తిగా పతితు డయ్యెను.

ఆహా, స్త్రీ మోహితుడగు వానికి యితరము లేవియు అవుసరముండదుగదా!

ఇటులుండ బిల్వమంగళుని యింటిలో ఒకనాడు తండ్రి ఆబ్దికము వచ్చెను. విహితధర్మకర్మాచరణాసక్తులగు పురోహితుల బలవంతముచేతను, పితృకర్మాసక్తిగల యితరులగు పౌరుగువారియొక్క మందలింపుల చేతను, బిల్వమంగళుడు నాడు యింటనుండ తప్పినదికాదు. శ్రాద్ధము జరుగు చున్నంతసేపు కాలము మనస్సులో చింతామణి చింతనయే. శ్రాద్ధము నెట్లో పూర్తిచేసి చింతామణి గృహామునకు పోవుట కుద్యుక్తు డయ్యెను.

బిల్వమంగళుని భార్య ముక్తాంబ మహాపతివ్రతాశిరో మణి. శ్రీమద్భాగవతములో చెప్పినట్లు భర్త పతితు డైనను, దైవముగా భావించుచు ఆయన చిత్రపటమును, నిత్యము భక్తితో పూజించుచు, ఆయన నడతను మార్పు చేయించవలసినదిగా శ్రీకృష్ణ పరమాత్మను

నిరతము నామామృతమును
మరపింతయు లేక నీదు మనమున నెప్పుడున్।

మరి మరి గ్రోలుచు నుండెడి
పరమకృపాబ్ధీ! గ్రహింపు వందనశతమున్॥
అని ప్రార్థించుచుండెను.

ప్రయాణోన్ముఖుడైన భర్తను సమీపించి, "నాథా, నేడు పైతృక మాచరించితిరిగదా? గావున యీరోజు గృహముననుండి, రేపు ఉదయమే చింతామణిగృహమున కేగుదురు గాక, పితృకర్మ సిద్ధించగలదు" అని అనేక విధముల ప్రార్థించెను. గాని అతని హృదయము ఎన్నడో ధర్మశూన్య మగుటచే, ఆమె మాటలు చెవిటివానికి శంఖూదినట్లాయెను.

చింతామణి గృహము నదికి ఆవలతీరమున కలదు. బిల్వమంగళుడు ఎటులనో నదీతీరముచేరెను. దాదాపు సాయంసమయమగుచుండెను. దైవవిధానము అతివిచిత్రముగదా?

ఆకాశమున చిన్న మేఘములు బయలుదేరి క్షణములో చూచుచుండగనే ఝుంఝూ మారుతములు వీచసాగెను. కుంభవృష్టి ప్రారంభమాయెను. అహర్నిశలు నిర్భయులై నదీ మధ్యమున సంచరించు నావికులు, తమనౌకలను తీరమునజేర్చి వృక్ష మూలముల నాశ్రయించి, ప్రాణముల నరచేతబెట్టుకొని యుండిరి.

ఈ పరిస్థితులను జూచుచున్న ముక్తాంబకు ఒక్క మారుగా భయము, ప్రేమయు గలిగినది. తననాథు డెటులైనను యీ రోజున చింతామణి గృహమునకుచేరక మానడని నిశ్చయించి, భర్తను మనసార ధ్యానించి, సమస్తదేవత

లకు నమస్కరించి, ఆరాత్రిసమయమున ఒంటరిగా నదీ తీర మునజేరి, ఓనదీ దేవతలారా !

గీ॥ "ఈ ప్రవాహంబుదాటగ నెంచువిభున,
కూతిగా సంఘటింపించి ప్రీతినించి,
యీ శరీరాని కమలత్వమిచ్చ్యరాగ,
వాహినీ దివ్య దేవతా పంక్తులారా॥ "

అని ప్రార్థనచేయుచు నదిలోదుమికి ప్రాణములు విడ చెను. ఇట్టి భయంకరదృశ్యములు బిల్వమంగళునికి యించు కైనను ఔదాసీన్యము గలుగలేదు. తన్ను నదిని దాటించిన, కోరినంతడబ్బు యిచ్చెదనని నావికులను బ్రతిమలాడుకొనెను. గాని నావికులు యీతని ప్రార్థనను నిరాకరించిరి. వేరొం డుపాయము గానక "కామాతురాణాం, నభయం నలజ్జా" అను నార్యోక్తిప్రకారం నదిలో దుమికెను. ప్రవాహమున కొట్టుకొని పోవుచుండెను. దైవవశమున ఆదేసమయమున నీటిప్రవాహమున కొట్టుకొని పోవుచున్న శవమును గొప్ప దారుఖండముగా భావించి దాని యాధారమున తీరమున జేరెను. చాల చీకటిగా నుండెను. మనుష్య సంచారముగూడ లేకుండెను. ఎట్టకేలకు అతడు చింతామణి గృహము చేరెను.

నాడు పైతృకమగుటచే బిల్వమంగళుడు రాడనియెంచి తలుపులు గట్టిగా బిగించుకొని చింతామణి గాఢనిద్ర పోవు చుండెను. బిల్వమంగళుడు ఎంతపిలచినను పలుకలేదు. పనుక ప్రక్కనున్న గోడమీద ఆతనికి ఒకత్రాడు వ్రేలాడుచున్న

టుల గోచరించెను. దాని సహాయమున లోపలికి దుమికి చింతామణిని సమీపించెను.

ఆమె యీతనినిచూచిన వెంటనే యింటిలోనికివచ్చిన రీతిని ప్రశ్నించెను. దారుఖండమూలమున నదినిదాటి, రజ్జు సహాయమున గృహమున ప్రవేశించినటుల జవాబుచెప్పగా, ఆతని సమాధానమువిని దీపముచేబూని గోడమీదగల రజ్జువునుచూడ, అచ్చట ఒక నల్లత్రాచుపాము వ్రేలాడుచుండెను. వెంటనే ఆశ్చర్యమునొంది నదీతీరమున కేగిచూడ అది ముక్తాంబశవమయి యుండెను. యీ దృశ్యములుచూచి చింతామణి నిశ్చేష్టురాలాయెను. బిల్వమంగళుడుగూడ శిలావిగ్రహముమాదిరిగా స్తబ్ధుడాయెను. ఇది అంతయుజూచి చింతామణి బిల్వమంగళునిగురించి యీ క్రింది విధముగా బోధించెను. "ఓయీ! నీవు బ్రాహ్మణుడవు సర్వధర్మముల నెరింగిన పండితుడవు. విశేషించి నేడునీ తండ్రిశ్రాద్ధము కాని నీవు చీము నెత్తురు, వస, మలమూత్రములతో కూడిన నా ఈ శరీరమున మోహితుడవై సర్వవిధ ధర్మకర్మల విసర్జించి, యీ భయంకర నిశీధివేళ, భార్య శవసహాయమున నిటకు వచ్చితివి. పండువంటి సంసారమును నాశనము చేసికొంటివి. అంతు లేని నీ పాపమునకు నిష్కృతిగలదా? యీ విషయమందు నేను భాగస్వామినే, నా పాపమునకు మాత్రము శాంతికలదా!

నేడు నేను పరమసుందరినని భావించి, పిచ్చివాడవైతివి. కాని నా ఈశరీర సౌందర్యముగూడ ఈశవము వలెనే ఒకప్పుడు పరిణామము చెందును గదా.

గాని, నా మీద చూపిన ప్రేమలో సహస్రాంశమయి నను, ఆభువన మోహనుడగు శ్యామసుందరమూర్తిని కలసి కొనుటకు వ్యాకులముతో పరుగిడి, సర్వకాల సర్వావస్థల యందు, ఆతనిని స్మరించి ధ్యానించిన, పునరావృత్తి రహిత శాశ్వతగతిని పొందియుండే వాడివిగదా ?

చింతామణియొక్క యీ వాక్యములకు బిల్వమంగళుని హృదయము కరిగిపోయెను. చిన్ననాటి భక్తి, ధర్మపరాయణత్వము శాస్త్ర చింతనము జ్ఞాపకమువచ్చెను. నేత్రము నుండి అశ్రుధారలు జలజల రాలెను. వెంటనే చింతామణి పాదములు పట్టుకొని, "తల్లీ, నీవు నేడు నాకు దివ్యదృష్టిని ప్రసాదించితివి. నీవు చింతామణివి కావు, నాయొక్క నీవు ఆ శ్యామసుందరమూర్తివే, ఆశీర్వదించి శెలవొసంగుము. ఇదియే అనేక సమస్కారములు," అని ప్రార్థించెను.

"అద్యమే సఫలం జన్మ సుప్రభాతాచమేనిశా" అనుచు కృష్ణధ్యాన మొనర్చుచు.

నామం:- శ్రీకృష్ణ, గోవింద, గోపాల్ శ్యామ్, రాధా మాధవ
రాధిక శ్యామ్, గోవింద, గోవింద, గోపాలశ్యామ్ శ్యామ్।
శ్యామ్, రాధే రాధే, కృష్ణా కృష్ణా, రాధే రాధే.

ఎక్కడికో, ఎందులకో తెలియక బయలుదేరెను. కొన్నిరోజు లయినతర్వాత, "ముఖ్యతస్తు మహత్కృప ఏవ" అని శాస్త్రములు చెప్పుచున్నవి గాపున, ఒకసద్గురు వును ఆశ్రయించి వారివలన ఉపదేశమును పొందనిశ్చయించు కొనెను. కృష్ణాతీరమున "సోమగిరి" యను మహాత్ముని

గురువుగా బడసి ఆయనవలన 'గోపాలమంత్ర' ముపదేశము బొంది ఆయన ఆజ్ఞతీసికొని,

కం॥ "ధీరులు, నిరపేక్షులు, ఆత్మారాములు నైనమునులు, హరిభజనము, నిష్కారణము, సేయుచుందురు. నారాయణు డట్టివాడు నవ్యచరిత్రా." అనగా ("Devotion for the sake of devotion") పల్లెలు, పట్టణములు, ప్రయాణము చేయు చుండెను. కొన్నిరోజులు గడచిన తర్వాత పరమాత్మయీతని పూర్వసంస్కారములు అన్నియు నశించినవో, లేవోయని పరీక్షింపనెంచి, తోవ మధ్యమున ఒక పరమ సుందరిని పంపెను. ఈయువతిని చూడగనే ఆతనికి మనస్సు చలించెను.

భగవద్గీతలో చెప్పినప్రకారం

శ్లో॥ యతతోహ్యా పి కౌంతేయ।
పురుషస్య విపశ్చితః।
ఇంద్రియాణి ప్రమాథీని
హరంతి ప్రసభం మనః॥

"అనగా! ఓ అర్జునా బలవత్తరమైన ఇంద్రియములు భగవంతుని బొందుటకు యత్నించుచున్న, పండితుని మన స్సునుగూడ బలవంతముగా నాకర్షించును" ఆబిల్వమంగళునకి మరల మోహము జనించెను. భగవంతుని పూర్తిగామరచి, ఆయువతి వెంటపడెను. ఆమె తన యింటిలో ప్రవేశించగా బిల్వమంగళుడు ఆమెయింటివాకిట కూర్చుండెను. ఇంతలో గృహయజమాని బయటకువచ్చి, యీదీనునిజూచి, అతడు ఏపనిమీాద వచ్చితివని ప్రశ్నింప "అయ్యా!లోని కేగిన,యువతిని

మనసార ఒక్క పర్యాయము" చూచెదలచి కొంటినని సమాధానము చెప్పెను. నిష్కపటియగు, ఆబ్రాహ్మణుడు తన భార్యను చూపదలచి, ఆమెను పిలచికొని వచ్చుటకు యింటిలోపలికి వెళ్లెను.

ఒక్క పర్యాయము ఆదీనబంధుని సేవించిన వారి యోగక్షేమభారమును ఆసర్వవ్యాపివహించును గదా!

శ్లో॥ అనన్యాశ్చింతయంతో మాం,
యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం,
యోగ క్షేమం వహామ్యహం॥

నేడు బిల్వమంగళుని సరిదిద్దుభారము వాడే వహించెను. అజ్ఞానాంధుడగు ఆబిల్వమంగళునికి. దివ్యచక్షువులను ప్రసాదించెను. ఆతని హృదయము శోకభరితమయ్యెను. అతడు మ్లానహృదయుడై తలయెత్తెను. ఎదుట ఒక బదరికా (రేగు) వృక్షము కనుపించెను. భక్తిభావము చెల రేగెను. అతడా రేగిచెట్టునుండి రెండుముండ్లను తుంచి తెచ్చెను. ఇంతలో గృహస్థుని భార్యగూడ వచ్చెను. బిల్వమంగళుడు, ఆమెపై ఒక్క పర్యాయముచూచి, "ఓ అభాగ్య నేత్రములారా! మీరెంతటిదుర్మార్గము నాచరించుచుంటిరి." అని పలుకుచు యాబిల్వమంగళుడు ఆయచంచల నేత్రములకు దండనవిధించుట యుక్తమనితలచి, ఆరెండు కంటకముల చేతను రెండు నేత్రములను పొడచుకొనెను. రెండు నేత్రములనుండి నెత్తురు వరదలుగా పారజొచ్చెను. బిల్వమంగళుడు ఆనందముతో హరికీర్తన గావించుచుండెను.

నామం:- "గోవింద జైజై ! గోపాల జైజై! రాధారమణహరి, గోవింద జైజై" అని, గృహమేధి ఆయన భార్య మిగుల సుఖిం చిరి. గాని వారునిరుపాయులుగదా? బిల్వమంగళునికి అజ్ఞాన మంతయు నశించెను.

ఆశ్యామసుందరిని దర్శించుటకు ఆయన చాలవ్యా కులపడసాగెను. ఆకలి దప్పులు పూర్తిగానశించెను. పల్లెలు వనములు ఆయన సంకీర్తనలచే ప్రతిధ్వనించుచుండెను.

శ్లో॥ శ్రీకృష్ణ! విష్ణో! మధుకైటభారే!
భక్తానుకంపిన్! భగవన్! మురారే!
త్రాయస్వ మాం కేశవ! లోకనాథా!
గోవింద! దామోదర! మాధవేతి.

శ్లో॥ విక్రేతు కామాకిల గోపకన్యా।
మురారి పాదార్పిత చిత్తవృత్తిః।
దధ్యాదికం మోహవశా దవోచత్।
గోవింద! దామోదర! మాధవేతి॥

యీ మాదిరిగా గోవింద, దామోదర స్తోత్రము చేయుచు ఒక ముళ్లపొదమీదపడి, "కృష్ణా, కృష్ణా" యనుచు నిరంతర నామస్మరణ చేయుచుండెను. ఇట్టిస్థితిలో ప్రేమపూర్ణు డగు పరమాత్మ ఎట్లువూరకుండగలడు!

ఒకరోజున పరమాత్మ ఒక సుందరబాలకవేషము వేసికొని బిల్వమంగళుని సమీపించి, "తామెవరు? తమకు చాల ఆకలిగాయున్నట్లున్నది. కనుక కొంచ మాహారము తీసికొనివచ్చితిని. మీరు దీనిని స్వీకరించి ఆనందించండి".

నామం:- రాధారమణ, మదనమోహన, బృందావనా ।
చిన్ని కృష్ణా ॥ శ్యామసుందర, మదనమోహన,
బృందావనా, చిన్ని కృష్ణా॥ సాధుజన మనోవిహార,
సర్వాధార ధీరకృష్ణ, మాధవ గోవిందకృష్ణ, మధు
రిపు గోపాలకృష్ణ ॥

అని పాడుచు బ్రహ్మానందములో, మహాయోగి స్వప్రభమగు ఆ ప్రసాదముల స్వీకరించి, హర్షపులకిత గాత్రుడయ్యెను గద్గదస్వరముతో, "స్వామీ ! మీ పేరేమి? మీ నివాసమెచట? మీరేమి చేయుచుందు''రని ప్రశ్నించెను.

ఆ మాయవేషధారి, "నా ఇల్లు ఇచ్చటనే, నాకొక పేరని నియమము లేదు. నన్ను ఎవరెట్లు ఆశ్రయింతురో వారిని అట్లే నేను అనుగ్రహించెదను".

శ్లో॥ యే యథా మాం ప్రపద్యంతే,
తాంస్తథైవ భజామ్యహం,
మమ వర్త్మాను వర్తంతే,
మనుష్యాః పార్థ సర్వశః॥

బిల్వమంగళుడు ఆమధురవాక్యములు విని బ్రహ్మానందము జెందెను ఆగోపబాలుడు నవ్వుచు, "తమకు ప్రతిదినము ప్రసాదము తెచ్చియిచ్చెదను తాము స్వీకరించండి'' అని చెప్పగా అందులకు బిల్వమంగళు డంగీకరించెను.

అదేమిచిత్రమోగాని బిల్వమంగలుడు అప్పటినుండి తైలధారవలె అవిచ్ఛిన్నముగా నామస్మరణచేయుటకు ప్రారంభించెను.

ప్రార్థన:-"గీ॥ దేవా, నీచరణ ప్రసాదకణ లభ్భింగాక, లేకున్న
నొండే వెంటన్ జనునీమహామహిమదానూహింప నెవ్వారికిన్,
నీవారైచనువారిలో నొకడనై, నిన్గొల్చు భాగ్యంబు,
నాకీవే, యిప్పటి జన్మమందైన, నొండెందైనవో ఈశ్వరా॥"

నామం:- రాసలీలలోల చిన్ని, గోపాలబాల,
గోపాలబాల రాధికాలోల,
బాలకృష్ణ నీలీల, నేనెన్న జాల,
జాలనేల యశోద, బాలగోపాల,
కరిరాజపాల, కరుణాలవాల,
కనకాసుచేలా, తులసీవనమాలా,
పాండురంగ వేణునాద, గోపాలబాల ॥

ఆ పరమాత్మ ప్రతిరోజు తెచ్చిపెట్టుచున్న ప్రసాదమును స్వీకరించుటచే ఆయనకు భక్తి మరీ హెచ్చసాగెను. బిల్వమంగళుడు ఎవ్వరికై తమ సర్వస్వమును సమర్పించెనో, నేత్రహీనుడయ్యెనో, అత డీబాలుడని గ్రహించెను. ఎల్లప్పుడు యీతని మాటలు వినుటయందే, మనస్సు లగ్నముచేయుటచే బిల్వమంగళుడు ఆపదలన్నియుతీరి, స్త్రీ వ్యామోహామునుండి విడువడి, మరల యీ గోపబాలకుని మోహామున జిక్కుకొంటినని తలచుచుండగా, ఆశ్యామసుందరమూర్తి, "అయ్యా, యేమో ఆలోచించుచున్నారే, నేను నేడు బృందావనము వెళ్లుచుంటిని. తమరుగూడ దయచేయుదురా" యని అడిగెను.

"నాయనా, నేను అంధుడనుగదా! బృందావనము నకు ఎట్లురాగలను?" అనెను. అందులకు, శ్యామసుందరుడు "చూడు. ఇదిగో, నా కర్ర. నీవు దీనిని బట్టుకొనుము. నేను బృందావనమునకు తీసికొని వెళ్ళెదను" అని చెప్పగా, బిల్వ మంగళుడు బ్రహ్మానందముతో, శ్రీకృష్ణుని ముగళి పట్టుకొని యీ క్రిందివిధముగా ప్రార్థనచేసి, నామస్మరణతో బయలు దేరెను.

శ్లో॥ హే గోపాలక, హాకృపాజలనిధే, హే సింధుకన్యాపతే,
హేకంసాంతక, హే గజేంద్రకరుణాపారీణ, హే మాధవ,
హే రామానుజ, హే జగత్రయగురో, హే పుండరీకాక్ష, మాం,
హే గోపీజననాథ, పాలయ, పరం జానామి, న త్వాం వినా॥

నామం:- హరేరామ హరేరామ. రామ రామ, హరేహరే।
హరేకృష్ణ, హరేకృష్ణ, కృష్ణ కృష్ణ, హరే హరే॥

భగవానుడు భక్తునికి కర్రయిచ్చి, మార్గముచూపుచు తీసికొని వెళ్ళుచుండెను

భగవానునికి, భక్తులయెడ ఎంతప్రేమయో గదా!

శ్లో॥ అపిచేత్సు దురాచారో,
భజతే మామనన్య భాక్,
సాధురేవ సమంతవ్యః,
సమ్యగ్వ్యవసితో హి సః॥

ఎంత దురాచారము గలవాడయినను, అన్యమును సేవిం పక నన్నే సేవించుచుండునో యాతడు శ్రేష్ఠుడనియే తలంప వలయును. ఏమనగా, యతడు "పరమేశ్వర సేవచేతనే కృతా ర్థుడనగుదును" అను మంచి నిశ్చయముగలవాడు గదా!

ఇచ్చటనుండి కొంతదూరము వెళ్లిన తరువాత "ఇదిగో బృందావనమునకు వచ్చితిమి, నేనికపోవుచుంటిని", అని పర మాత్మ యనెను. బిల్వమంగళుడు కర్రనువీడి బాలకుని హస్త మును బట్టుకొనెను. శ్యామసుందరుని హస్తస్పర్శనము చేత, ఆతనిశరీరమంతయు, విద్యుత్తు ప్రవహించి నట్లులయ్యెను. బాలక రూపమున శ్యామసుందరుడు ఎదుటనుండుట అతడు గాంచెను. భగవంతుని హస్తమును గట్టిగ బట్టుకొని "శ్యామా! ఇప్పుడు నిన్నుగుర్తించితిని. చాల దినములకు నిన్ను నేను పట్టుకొన గలిగితిని, ప్రభూ! ఇకనిన్ను నేను విడువను." అని అనెను.

శ్రీకృష్ణుడు "వదలుము వదలుము"–అనెను. బిల్వమంగ ళుడు "కాదు, కాదు. ఎన్నటికిని, నిన్ను నేను వదలను" అని గట్టిగా చేతినిబట్టుకొని,

" తే॥ దొరకితివి నీవు, నిశ్శంక దొడ్డదొరవు,
నాదువిందును గైకొని, నన్నుధన్యు,
చేసితివి, నేను సంతసించితిగదయ్య,
అహహా, గోవింద, బాల మురారి శౌరి॥ "

శ్యామసుందరుడు గట్టిగా విదలించి, చేతిని విడిపించుకొనెను. గాని బిల్వమంగళుడు శ్యామసుందరుని "అనన్యభక్తి" యను రజ్జువుచేత హృదయమున బంధించి వేసెను. ఆరజ్జువును త్రెంచు కొనుట నాతనికిగూడనసాధ్యముగదా ? చేతిని విడిపించుకొని, మందహాసముతో వాలుచూపులు చూచుచు, నేగుచున్న శ్రీకృష్ణుని జూచి బిల్వమంగళు డిటుల బ్రతిమలాడుకొనెను.

"క॥ రారా, ముద్దులకృష్ణ,
రారా, రంగయ్య గోపరాజకుమారా,
రారా, ప్రియమున నిచ్చెద
కోరిన భక్ష్యంబు లివ్వి. కొనుము భుజింపన్॥

క॥ కలయో, నిదగు మాయయో,
తెలియంగజాల, సూక్ష్మదృష్టినినైనన్,
అలయించి, పారిపోవకు,
పలుమోసంబేల, గోప బాలా కృష్ణా॥

క॥ శబరికాసందష్ట సంచితంబులుగావు
పక్వగేహారామఫలము లివిగో,
అల కుచేలుని పాతయటుకులు గావివి,
గరమాగరము, నేతి గారెలివిగో,

ద్రౌపదీపాక పాత్రస్థ శాకముగాదు,
భోజ్యోత్కృష్ట, శుద్ధాన్న పుంజ మిదిగో,
వల్లవీప్రేషిత పస్యమితముగాదు,
వేడి వేణ్పొంగలి చూడు మిదిగో ॥

తే॥ భక్తియుక్తుల. జలశాక పత్రములును
నీకు నమృతమటంచును, నేను వింటి
కాని వారలెవ్వారలె యనన్యభక్తి,
నాకు లేదని యోచించినావొ కృష్ణ ॥

చ॥ నిలునిలు పోకుపోకు మిదె, నీరజనాభ యనుగ్రహింపుమా
నిలునిలు పోకు పోకు మిదె, నన్విడనాడిన నేలుగల్గునే

నళినదళాక్ష! యింత కఠినత్వముబూనుట యేటిన్యాయమో తెలగుటమేలె, నావలన తప్పులు గల్గిన సైచుటొప్పదే ॥

తే॥ ఏను వెన్నంటి తరుమంగ లేను నిన్ను,
బలము లేకుంట, నే నింక నిలువనెంతు,
ప్రభుడ నీచిత్తమే నాదుభాగ్యమగుట
వలన, నీకిష్టమగుచోట, నిలుము కృష్ణ॥

యింత ప్రార్థనచేసినను స్వామి నిలువలేదు. అప్పుడు స్వామిని:

"సీ॥ వసుదేవనంద దేవకియశోదలకు, నీ
పోకలనెల్ల "రిపోర్టు" చేతు,
ప్రహ్లాదు ముచుకుంద పార్థముఖ్యులకు, నీ
గడుసుచేష్టలు "టెలిగ్రాము" సేతు,
అక్రూరవిదుర, భీష్మాంబరీషులకు. నీ
చేష్టలు నే "బ్రాడుకాస్టు" చేతు
నీదు పిల్లాటలు, మీదిలోకములకు
కడువడి "కేబులుగ్రాము" సేతు, "

తే॥ కోరి నే నిచ్చుఫలముల గొనవదేని,
కేవలుండవు, నిర్గుణి వీవటంచు,
"వాలుపోష్టుల" భిత్తికాపాళియందు,
తెలియనంటింతు ఝడియను తెలిసికొమ్ము ॥

శ్లో॥ హస్తమాక్షిప్య, యాతోసి బలాత్ కృష్ణ, కిమద్భుతమ్,
హృదయాద్యది నిర్యాసి, పౌరుషం గణయామి తే॥ "

"చేయి వదలించుకొనిపోవుటలో నాశ్చర్య మేమున్నది? నాహృదయమునుండి కదలుము. నీ పౌరుషము తెలియును." అని బెదరింప, భగవంతుడు డాబిల్వమంగళుని విడలేకపోయి అతని ప్రతిజ్ఞకు బ్రహ్మానందభరితుడై

తే॥ పిల్ల జాబిల్లి శిరమున బెట్టువాడు,
భక్తజనముల రక్షకై కాచువాడు,
గౌరి వామాంకమున జేర్చి కరుణఁగూడ,
సాంబుడప్పుడు నాకు సాక్షాత్కరించె॥

అప్పుడు శ్యామసుందరుడు బిల్వమంగళుని సమీపించి, యాతని నేత్రములను, తన కోమల మృదుహస్తములతో నొక్కసారి తాకెను. బిల్వమంగళుని నేత్రములు సాటిలేని ప్రభాన్వితము లయ్యెను. ఆదివ్యనేత్రములతో స్వామిని ప్రత్యక్షముగా దర్శించి, యానందాశ్రువులతో ఆయన పాదములు కడుగుచు,

"శ్లో॥ నాన్యం వదామి, నశృణోమి, నచింతయామి,
నాన్యం స్మరామి, నభజామి, నచాశ్రయామి,
భక్త్యా, త్వదీయచరణాంబుజ, మాదరేణ
శ్రీ శ్రీనివాస! పురుషోత్తమ! దేహి దాస్యం॥"

అని ప్రార్థించెను. భగవంతుడు ఆయనను లేవనెత్తి కౌగలించుకొనెను.

భగవంతుడు భక్తునిమొక్కయు, సుమధురసమ్మేళముచేత జగమంతయు భక్తిభావపూరితమయ్యెను. దేవ

తలు పుష్పవర్షము కురిపించిరి. భక్తుడు భగవంతుడు ధన్యులైరి.

వేశ్యయగు చింతామణి, గృహస్థు మరియు నాతని ధర్మపత్ని దైవయోగముచే,

శ్రీకృష్ణ గోవింద హరే మురారే, హేనాథ నారాయణ వాసుదేవ
జిహ్వే పిబస్వామృత మేతదేవ గోవింద దామోదర మాధవేతి ॥

అని సంకీర్తనము చేయుచు నచటకు వచ్చిరి. పరమభక్తుడైన బిల్వమంగళునిప్రభావముచేత, భగవంతుడు వారందరకు తన దివ్యదర్శనము నొసంగి కృతార్థుల జేసెను.

బిల్వమంగళుడు తన జీవితశేషమంతయు భక్తిప్రచారము భగవద్గుణానుకీర్తనము జేయుచు యంతమున గోలోక ధామము నొందెను.



# తూము లక్ష్మీనృసింహదాసు

రచయిత : శ్రీ మిన్నెకంటి గురునాథశర్మగారు

ఐహిక భోగాసక్తుల సాహచర్యాదికములచేఁ ప్రాణులకును భగవద్భక్తి సన్నగిల్లుచున్నది. హేతువాదములు మెండగుచున్నవి. ప్రత్యక్ష ప్రమాణమే ముఖ్యమగుచున్నది. "ఆత్మవత్సర్వభూతాని" యన్నట్లు కించిద్జ్ఞులగు తా మన్యుల మహిమాతిశయముల నమానుష కార్యముల సందేహించి వెక్కిరించుచున్నారు. "మురారే స్తృతీయః పంథా" యన్నట్లు విపరీతమైనను నవీనమార్గముఁ ద్రొక్కుటయే యశస్కరమయి నాస్తికత ప్రబలుచున్నది. అనుయాయులు దోడగుచున్నారు. కాప్రస దుర్మతాంతరములు విజృంభించుచున్నవి. అయినను వేకువతఱి రిక్కలవలె నందందున్న భగవద్భక్తులకు మా దాసుగారిచరిత్రము వేడ్కఁగొల్పకపోదు

భక్తిలత కాలవాలమును, సంగీత సాహిత్యములకునికి పట్టును, ప్రసిద్ధమును, పవిత్రమును, నగువంశమున, తూము లక్ష్మీనృసింహదాసుగారు, క్రీస్తుశకము 1790 వత్సర ప్రాంతమున, నప్పయాఖ్యునకును వేంకమాంబకును నవతరించిరి వీరు గోలకొండ వ్యాపారులు ఆపస్తంబ సూత్రులు. యజుశ్శాఖాధ్యయనులు. వసిష్ఠశక్తిపరాశరాఖ్య త్రయార్షేయులు పరాశర గోత్రభవులు.

నృసింహదాసుగారి తాతగారు వేంకటకృష్ణయ్యగారు. వీరు గుంటూరు మండలము బాపట్లతాలూకాయందలి పొన్నూరుగ్రామమున నివసించుచు భావనారాయణస్వామిని సేవించుచుండిరి. వీరి కప్పయాఖ్యుండు జనించి బుద్ధిబలములతోఁగూడ దేహబలమును వహించి రాజగౌరవము నొందుచు, వేంకమాంబను పెండ్లాడి యే కారణముననో పొన్నూరు విడిచి గుంటూరుపట్టణముఁ జేరి స్వగృహమును నిర్మించుకొని కాపురముండిరి.

హరిభక్తిపరాయణులగు నాపుణ్యదంపతులకు లక్ష్మీనృసింహదాసు, కృష్ణదాసునానొప్పు పుత్రద్వయమును, రుక్మాబాయి నాఁబరగు ముద్దుకూతురును జనించిరి. రుక్మాబాయిని జగ్గూలరావు వంశజులకిచ్చి పరిణయ మొనర్చిరి. ఆ లక్ష్మీనృసింహదాసు, కృష్ణదాసు నుచితసంస్కారములంది ఆంధ్రగీర్వాణవిద్యల నభ్యసించి రామభక్తులై యుండిరి. పిదప "సంబ్రాజు" వంశజాత సద్గుణోపేతయగులక్ష్మీబాయమ్మను, లక్ష్మీనృసింహదాసును, సీతమ్మయను బాలికను కృష్ణదాసును పరిణయమయిరి భగవద్భక్తశిఖామణియగు మన యీలక్ష్మీనృసింహదాసునకు సంతానము లేకపోయెను. సాధారణముగా భగవంతుఁడేలనో తనదాసుల కౌరసపుత్త్రుల నొసఁగకుండును. ఈ భక్తుఁడు పరమపదముఁ జేరిన వెనుక లక్ష్మీబాయమ్మగారు, మఱదికొడుకును రామదాసనాముని పెంచి నైదేహియను కన్యనిచ్చి వివాహము చేసెను. వార

లును నిస్సంతానులైరి. అంత నై దేహమ్మయు భర్తృ మర ణానంతరము తాము లక్ష్మణరాయనామువి పెంచికొనిరి. వారికొడుకులు నూతుందుఱ్ఱు భద్రాద్రి నేటికింగలరు.

మన లక్ష్మినృసింహ దాసుగారు బాల్యమునుండియు రామభక్తుండై నడచుచున్న యడుగడుగునకు "రామ" "రామ" యనియు,మాటమాటకు "రామ" "రామ"యని మదిలో నను కొనుచు నుండువాడు. పువ్వు బుట్టుటతోడనే పరిమళించుం గదా! తన కిర్వదేండ్లు వచ్చినపిదపం దండ్రి స్వర్గస్థుండగుటం గుటుంబభార మధికమై కలంపం, బొన్నూరులో పేష్కారు వేతనమున దినములు గడుపుచుండినను, రామభజనము నతిథ్య భ్యాగతసేవనము, నాంధ్రకవితారాధనముమాత్రి మేమఱ కుండెను. అట్టు లెన్నిదినములో జరుగలేదు. దాస్యము స్వాతంత్ర్యము నడంచుంగదా! రామసేవ కుద్యోగధర్మ మంత రాయమగుడుం, దృణంబుంబోలె నాపేష్కారు పదవిని విస ర్జించి, సమర్థుండగు గురువునొద్ద ఘోరసంసార పారావార తారకమ్మగు తారకమంత్రరాజముం గోరి కైకొని, తనయింట రామమందిరము నిర్మించి భద్రాద్రి సీతారామ విగ్రహముం నిల్పి నిత్యము భజించుచు. గద్య పద్యాదులచేం బొగడుచు నెన్నియేని భక్తిబోధక శతకమ్ముల గేయమ్ముల రచించి సుప్రసిద్ధుడై యుండెను.

అన్నదానము పునర్జన్మహేతువని వాదించుట లోభుల కును, ఆచరణ శూన్యులై "అహం బ్రహ్మాస్మి" యని నాల్క తుదచే సుస్మితులై యుచ్చరించి తెప్పరలెగుర వేయు దాంబికుల

కును, కాపథగాములై పుణ్యపాపంబు లాత్మకంటవను పండిత ప్రభువులకును జెప్పఁజాలను.గాని ముక్తికి భక్తియు భక్తికిఁ దీర్థసేవయుఁ గారణములు గాకపోవు. తామెందుం గొఱగాక భక్తులంజూచి యోగులమాత్రము పొగడియు, యోగులం జూచి జ్ఞానులనే కొండాడియుఁ దవితరుల దూషించువారు తీర్థయాత్రాపరుల గేలిసేయుదురోటు? శివశర్మాదులు తీర్థయాత్రలఁ గృతార్థులుగా లేదా? నేఁడు ధూమశకటాదులవలన దూరమ్ము సయితము దాపగుచున్నది. పూర్వమో? కాశి కేగుట, కాటికేగుటతో సాటియఁట (అనగా దిరిగిరారనుట). రైళ్ళలోఁగూరుచుండి యనాయాసముగా యాత్రలసేవించిన ఫలముకవేళ నంతలేకుండునేమో యని వాదమున కొప్పుకొన్ననుగాని, నడకతో వివిధశ్రమలకోర్చి కష్టసుఖంబుల ననుభవించుచు, ననేక గ్రామప్రజల యన్యభాషా సల్లాప దూషణ భూషణాదుల నాలకించుచు, నింద్రియ నిగ్రహము నలవఱచుకొనుచు, గామక్రోధములఁ గట్టిసైచుచు, యదృచ్ఛాలాభసంతుష్టిమెయి జేయుయాత్ర భూతదయలు లోకజ్ఞానమును, సౌభ్రాత్రమును, భక్తిని బెంపొందింప జేయకపోదని నమ్మకతీరదు. ఫలముగల్గకపోదు. అట్లగుటవలననే యాత్ర సల్పి వచ్చినవారిని స్వపౌరులు మేళతాళంబుల నెదురొ్కని మహావైభవంబున నింటికిం గొంపోయెదరు.

సీ॥ పొడిదగ్గు కంఠంబుఁ ♦ బొరిపుచ్చకయమున్న
తల ప్రకంపంబుఁ బొం ♦ దకయమున్న

బొమలుకన్నులమీఁదఁ ♦ బొనవి వ్రాలకమున్న
ఘోరనేత్రములకష్టు ♦ బొరకమున్న
శ్రుతిపుటంబులశక్తి ♦ సురిగిపోవకమున్న
వళులాననమునఁ ♦ బర్వకయమున్న
హృదయంబులో జాగ ♦ పదనుదప్పకమున్న
గాత్రంబు శిథిలంబు ♦ గాకమున్న ॥

పండ్లుపేర్వాసి కదలుచూ ♦ పకయమున్న
కాకికడకంటిపై చూపు ♦ రాకమున్న
కాలుసేయాడు తటియందు ♦ కదలవలయుఁ
దీర్ధసేవకు దేహమ ♦ స్థిరముగాన.

(కాశీఖండము)

అనితలపోసి మనదాసుగారు క్రీస్తుశకము 1818-19 కి సరియగు బహుధాన్య సంవత్సర కార్తికమున శ్రీరంగమున కేగి రంగనిం గడునుప్పొంగుచు సేవించి "శ్రీరంగశాయి తారహారము" అను మకుటముగల సీసపద్యముల నిర్వ దేఁడింటిని సమర్పించి తిరిగి యింటికివచ్చెను. వీని నే దేవుని స్పుడు దర్శించినను బద్యములశ్లో బొగడక మగిడిరా లేదు.

కాశీయాత్ర క్రి॥ 1820-21.

తనమాతృదేవతయగు వేకమాంబను నర్ధాంగియగు లక్ష్మీబాయమ్మను, సోదరుఁడగు కృష్ణదాసును నుచిత వాక్యముల సమాధానపఱిచి విక్రమసంవత్సరము చైత్ర శు॥ ౧ శనివారము రేవతి నక్షత్రమున గుంటూరునుండి కతిపయాప్త

మిత్రులం గదలి, యమరావతి కేగి కృష్ణాస్నానమునఁ బవిత్రుఁడై భర్గుఁగానియాడి, దుర్గమారణ్యమార్గముల ననర్గళ భక్తి పరవశుఁడై నడచుచుఁ, గ్రమముగా భద్రాద్రి కేగి శ్రీరామచంద్రమూర్తిని దర్శించి

సీ॥ అర్థికిచ్చినధనం ♦ బప్పుడె మఱచెదఁట
పదిలమోహోరామ ♦ బహుపరాకు
అపకార మొనరించు ♦ నతనిమఱచెదఁట
పదిలమోహోరామ ♦ బహుపరాకు
మఱచుట నీకిది ♦ మఱిసహజంబ ట
పదిలమోహోరామ ♦ బహుపరాకు
మహినున్న యీదీను ♦ మఱచెద వేమొకో
పదిలమో హోరామ ♦ బహుపరాకు.

గీ॥ పద్మజాక్ష రమాధీశ ♦ బహుపరాకు
భక్తనరసింహపోషక ♦ బహుపరాకు
భద్రశైలోపరిస్థిత ♦ బహుపరాకు
భక్తమందార రఘువీర ♦ బహుపరాకు॥

ఇట్టి యనేక పద్యంబులం బరాకుఁదెల్పి మఱలఁ బయనంబై, దినక్రమమున నశ్వారావుపేట, కొవ్వూరు, రాజమహేంద్రవరము నావలఁ బిఠాపురముఁ జేరి కుంతిమాధవుఁ బూజించి, సింహాద్రి కేగి వరాహ నృసింహస్వామికి మ్రొక్కి, కూర్మపురము దరిసి ఘలీశ్వరునిసేవించి జగన్నాథము దొరసి మార్కండేయాది పుణ్యతీర్థములఁ గ్రుంకి, జగన్నాథుని బిల్వమహిమ కథలవినుచు నాతనికి నమస్కరించి.

పంచచామరము.

"పరాకు శ్రీరమాంగనాస్య పద్మ పద్మ బాంధవా
పరాకనంత పద్మజాండ వారపూరి తోదరా
పరాకుభక్త హృన్నివాస భవ్యదివ్య విగ్రహా
పరాకు దేవ మాళిరత్న భాసితాంఘ్రి పంకజా ;

అనిపొగడి పంచరాత్రంబులు వసించి యటుగదలి బహుకష్టప్రయాణంబుల జాజిపురంబేగి యున్నదిని పైతృక క్రియల నిర్వర్తించి, మార్గశ్రమమ్మున నలసి కాశీదర్శన భాగ్య మున్నదో లేదోయని చింతించి, రేయియగుడు నిద్రింప సుస్వప్నంబయ్యెనట దాసుగారి పద్యములనే వ్రాసెదను.

సీ॥ బ్రహ్మాదులకునైనఁ ♦ బడయసాధ్యముగాని
యప్రతి హతశక్తు ♦ డైననీవు
దురితాత్ముఁడంచు నన్ ♦ ద్రోయగాఁజూడక
యతిదీనుఁడీతఁడం ♦ చాత్మనెఱఁగి
జాలి జనించి కాఁ ♦ బోలు నాపైని నీ
నిర్హేతుక ప్రేమ ♦ నెగడఁజేసి
స్వప్నగోచరుఁడవై ♦ భయమెల్లఁదీర్చితి
మేలు నాకరయవే ♦ వేలుగాదె ॥

స్వాంతమున నాదుపట్ల ♦ నో క్రింతకరుణ
నీకుఁ గల్గినయెడలఁ ♦ద్రి లోకములను
నాకు సముఁడుండగలఁడే ♦ య నాథరక్ష
దశరథకుమార రామభ ♦ ద్రాద్రిధామ ॥

సీ॥ నెఱవకు మటంచు నన్నిట్లు ♦ వెన్ను సఱచి
దయఁదలిర్ప గఁ దెల్పెడి ♦ దాత లెవరు
నాకు సముఁడుండఁగలఁడె ♦ యనాథరక్ష
దశరథకుమార రామ భ ♦ ద్రాద్రిధామ ॥

చూచితిరా? భక్తావనవ్రతబద్ధకంకణుఁడగు భద్రాద్రి రాముని కారుణ్యాతిశయము శ్రీరాముఁడు స్వప్నగోచరుఁడై వెన్ను సఱచి భయమువాపి పోయెనఁట. అదంభవ్యాపారుఁడగు దాసుగారి నుడులివి. ఆహా! నృసింహదాసా! ఎంతధన్యుఁడ వోయి! శ్రీరామభద్రుపవిత్రహస్తస్పర్శభాగ్యము నందితివి! సద్భక్తుల స్వప్నంబులట్టివ, వారివిశ్వాసంబు నట్టిద. అంతనజ్ఞులు కొందఱు దాసుగారి స్వప్నవృత్తాంతమును భక్తి పారవశ్యమును జూచి పరిహాసించిరఁట. అవును వారు—

సీ॥ ఖేమజంబని కొందఱు ♦ పెద్దలెల్ల
నవ్వ నిందింతు రాతప్పు ♦ నాదికాదు
దాసుఁడనుపేరు పెట్టించి ♦ ధరణియందు
ద్రిప్పిరక్షించు నీదెకా ♦ దేవ దేవ ॥

అనియు,

సీ॥ మించి జనములెల్ల ♦ మెచ్చుటకొఱకు వ
ర్తింపఁజాల లయకు ♦ సొంపుమీఱ
నెనఁగి పాడనేర నిల ♦ నపప్రయోజక
తనువు దీనిఁ బ్రోచు ♦ దాతవీవె॥

క॥ హరి నీయడుగుందమ్ముల ।
నరసి మదింగంటి నిుక, నరివర్గముకే, నెఱవను జామి,

అని నమస్కరించి పొగడి రామునికిఁ దస్పష్టి గూర్మి కలదని యెఱింగి, నూతనోత్సాహసంరంభంబున బాదచారియై క్రమముగా బుద్ధగయ కేగి యఫల్గూదకమగు ఫల్గునీనది దర్శించి ఫల్గునసారథిని స్మరించు. స్నానసంధ్యాదులును పైతృక విధులను నిర్వర్తించి యందందుంగల పుణ్యతీర్థములు మెట్టుచు, రామనామస్మరణము సలుపుచుం జనిచని, దూరమ్మునం బుణ్యరాశియగు కాశిం గని.

సీ॥ రజతాద్రి యిు చటికి ♦ రాబోలునే మొకో
కాను కాశీసౌధ ♦ కాంతిగాని

(అతివిస్తరమగునను భయంబున శ్రీదాసుగారు రచించిన పద్యములను సాంతముగా వ్రాయనైతి.)

అని వర్ణించుచు సంతోషాతిశయమున నృత్యము సేయుచు.

గీ॥ పాంచభౌతిక దేహంబుఁ ♦ బాసిజీవుఁ
డెసగునప్పుడు సర్వక ♦ ర్ణాంతరమునఁ
దారకబ్రహ్మ మంత్రంబు ♦ దయనొసంగు
హరుని కాపురమగు కాశి ♦ నరయఁగంటి ॥

అని యుప్పొంగి దరియంజని హృదయపీఠి విశ్వేశ్వరునిల్పి భావకుసుమంబులం బూజించి, జాహ్నవీ విమలతోయావగాహనమునఁ బవిత్రదేహుఁడై యవ్వలిదరి నొక

భూసురాహ్వానమున నతనియింట వసించి భక్తితాత్పర్య విశేషంబుల నిత్యము విశ్వనాథుని సేవించుచు బిందు మాధవు భావించుచు, భగవానుని దర్శించుచు, దండపాణిని విమర్శించుచు, దుండిని గొల్చుచు, భైరవునిబిలుచుచు క్రమక్రమముగా నర్వదినాలుగుఘట్టముల నధికశ్రద్ధc బరిశీలించి పవిత్రుcడై కృతార్థుcడనైతినని హర్షించి పితృతర్పణాదులొనరించి విడువలేక విడువలేక యగస్త్యునింబోలెc గాశివిడిచిపశ్చిమదిశగా నరిగి ప్రియాగను గాంచి, గంగా యమునా సరస్వతులం దివేణీ సంగమంబు న తత్సమీపక్షేత్రంబుల నరసి యబ్బర పడి కృతావగాహనుండై విధులు నిర్వర్తించి తత్సంగల విశేషంబు లారసి జన్మము సఫలంబయ్యెనని భావించి, దీర్ఘప్రయాణముల డస్సినవాడగుటచే నటుపైకిc జనలేక వెనుకకు మఱలి, తన చూచిన మహిమముల మనంబునందలచుచుc, గొన్ని దినంబులకుc గర్తపురి (గుంటూరు) కేగుదెంచి, తనతల్లియగు వేంకమాంబాపాదపద్మముల వ్రాలి, తన్ను వేడ్కమెయిం జూడ వచ్చిన పౌరులు నాసికాగ్రవిన్యస్తహస్తులై నిరీక్షించుచుండc దాcదెచ్చిన గంగాజలంబుల నమ్మాతృదేవత నభిషేకించి తృప్తుcడై, ద్రష్టలహృదయంబుల మాతృభక్తిబీజంబుల నంకురింపజేసి యాత్రావిశేషంబుల నుగ్గడించుచు బంధువులతోcగూడc గొన్ని దినంబులు గుంటూరునc గడపెను.

భద్రాద్రి

దాసుగారెందు సంచరించినను జైత్రమాసంబున దన యిష్టదైవమగు శ్రీరామచంద్రపరబ్రహ్మమూర్తిని సంద

ర్శించుటకు భద్రాద్రి కేగవలసినదే. కనుక శ్రీరామకల్యాణ నిరీక్షణ కౌతూహలాయత్తచిత్తుండై తప్పుఁడగు కృష్ణదాసుం దోడ్కొని బంధువుల వీడ్కొని, కడువేడ్కఁగొఁగదలి లోచూ డ్కల హరిపదముల బంధించి, వృషవత్సర చైత్ర శుద్ధ నవమి దినంబునకు భద్రాద్రిఁ జేరి, గౌతమీ పూతవారి సుస్నాతుండై శ్రీరామునకు హృదయమిచ్చి సీతాదేవికి గొన్కలిచ్చి, హను మకు మ్రొక్కులిచ్చి యంజలిబద్ధుండై యయ్యాస్థాబంధవుం గుఱించి,

సీ॥ గడయందు నిప్పాసి ♦ కనులకు భవదంఘ్రి
నీక్షింపఁజేసిన ♦ దేవకానె
గంగాదియాత్రలీ ♦ కలుషాత్ము చేతఁ జే
యించి రక్షించిన ♦ దేవకానె
కలయందు నర్భకా ♦ కారినై వీనికి
ధృతి నెలకొల్పిన ♦ దేవకానె
మఱలనిప్పాపి నీ ♦ చరణసన్నిధిఁ జేర్చి
యింపుగావించిన ♦ దేవకానె॥
యింక దక్షిణదిగ్యాత్ర ♦ లెటులవీని
వలనఁజేయింపఁగా మది ♦ దలచినావొ
భారమెల్లను నీదె ♦ దివ్యప్రభావ
దశరథకుమార భద్రాద్రి ♦ ధామ రామ॥

అని యెన్నేని పద్యంబుల నాభగవంతుం బొగడి యతని యంఘ్రుల హృదయంబున స్థాపించుకొని మఱల గుంటూరు చేరెను.

## దక్షిణ దిగ్యాత్ర

భక్తిపరులకును జ్ఞాననిష్ఠులకును దారతమ్యము కలదు. జ్ఞానధను లద్వైతాను సంధానమునను భక్తులు సేవ్యసేవక భావమునను నానంద పరాకాష్ఠ నధిగమింతురు. పూర్వసుకృత పరిపాకవశమ్మున తన్మార్గములు లభించును. భక్తాగ్రేసరుండగు మనలక్ష్మీనృసింహదాసుగారు తనువస్థిరమనియు, సత్కార్యా చరణము నేమరరాదనియు, సంపదలు బుద్బుదప్రాయము లనియు, తీర్థయాత్రా సోపానాధారమ్మున జ్ఞాన సౌధాధి రోహణ మనాయాసమ్ముగా సలుపనచ్చుననియు నిజసతీ మతల్లికిం దల్లికిం బోధించి తమ్మునికిం ధైర్యమ్ముఁగొల్పి నిర్ధ నుండయ్యు నావిశ్వాసంబే మూలకాని రామునిపై భారంబువైచి రామేశ్వరాది దివ్యక్షేత్రంబుల వీక్షించుచు కాంక్షాతిరేకంబున వృషవత్సరాషాఢ శుద్ధద్వితీయాదివసంబున (క్రీస్తు 1821–22) గర్తపురినుండి నిర్గమించి పొన్నూరుఁజేరి శ్రీభావనారాయణ స్వామిని సంభావించి, బాపట్లకేగి యందున్న భావనారాయణ స్వామివారిని బొగడి యుబ్బుచు, నిట్లు నిబ్బరంబుగాఁ దాఁగడ చిన ప్రతిష్ఠలములనుండు స్వాములను దర్శించి మ్రొక్కుచు, నను దిన ప్రయాణమ్ముల నల్లన నెల్లూరికేగి, యుల్లంబు పల్లవింపఁ గ్రన్నన మున్నుగాఁ జెన్నలోఁ గ్రుంకులిడి యప్పురి దివ్యా లయంబుఁ బరికించి యచ్చెరువొంది, దయాసనాథుని రంగ నాథుని సేవించి, మించితిరువలిక్కేణిఁజొచ్చి పార్థసారథి నర్చించి, చెన్నపురినుండి తిన్నగాఁ గదలి, యెడనెడ వర్షంబులఁ దడియుచు, గడగడవడకుచుఁ బిడుగుల కడలుచు గడగండ్లబడుచు,

క్షుత్తృష్ణలకు సోలుచుఁ, గాలినడకలకుఁ దూలుచు, బడలువడి యడుగులు దడఁబడ నొడలు కృశింపఁ బయనములుసేయుచుఁ, జిదంబరముఁ గరము మురియుచు నరసి యందలి పుష్కరిణీ తీరముననుఁగల నానావిధభక్తులఁ బులకలెసఁగఁ బరికించి, యం బరలింగమును సంబరంబునంగని ప్రణామిల్లి, బిల్వదళంబుల నమకచమకంబుల బూజించి, శియాళికరిగి శంకసుసకేఱఁగి గౌరీ మయూరంబుంగాంచి పంచనటము వీక్షించి కావేరిదర్శించి కాయంబుఁ దోయంబులముంచి మధ్యార్జునంబున మహేశ్వరు నర్చించి. కుంభకోణమున ద్వాదశ తీర్థంబులంబొడఁగని "కుం భేశ, శంభో హరహర, యని నుతించి," మఱియుంగల దేవతలఁ దీర్థంబులసేవించి, పంచనాథమున భవుని భక్తిసోఁ బాటించి, యందాకాలముననున్న మహాభక్తుఁడగు శ్రీ త్యాగరాయల వారి మహిమల విని యచ్చెరువొంది వారిదర్శింప నరిగిరట. దాసుగారేతెంచుట త్యాగరాయలువారెఱింగి యభ్యు త్థానాదికము లాచరించి, మహారాజాధిరాజులు పాదప్రసాతం బుల బ్రార్థించినను గీలునంబుచ్చు నమ్మహాగాయకుండు, స్వర చిత్రకృతుల నతికుతుకమునఁ బాడిరట. తచ్ఛ్రవణమునఁ దన్మ యుఁడై దాసుగా రానందబాష్పబిందు బృందము జాఱుచుఁ డ,

క॥ చేతులఁ దాళముపట్టుక
చేతో మోదంబుసోడ సిగముడి వీడన్
బాతరలాడుచు మింటను
గీతము నారదుఁడువాడె గృష్ణా యనుచున్ ॥
(భా॥)

ఉట్టి నారదునివలె నృత్యముచేసెనఁట. "పాముకాళ్లు పామే యెఱుఁగున్" అనినట్లు భక్తుల మార్గ మన్య దురాసదము. త్యాగయ్యగా రితనితో మాట్లాడవచ్చునా, యని సందియపడ వలదు. దాసుగారు చెప్పిరి వినుడు,

సీ॥ కేవలానంద సం ♦ కీర్తనావళివింటి
భావస్థితియు శుద్ధ ♦ భక్తిఁగంటి
భక్తులు శిష్యులు ♦ బలసి కొల్వఁగ గంటి
వాఙ్మాధురీ వైభ ♦ వంబు గంటి
వినయసత్సంపద్వి ♦ వేకముల్ కనుగొంటి
శ్రీరామ పదభక్తి ♦ చెల్వు గంటి
యనుపమకందగరాసి ♦ యనుభవంబును గంటి
దన్మయత్వంబాత్మఁ ♦ దనరఁ గంటి ॥
నరసికనుగొంటిఁ ద్యాగరా ♦ యాఖ్యనంచు
నీలసద్గుణపుంజ మిం ♦ కెన్నిదైన
దివ్యమహిమాతి శయములు ♦ దేజరిలుట
గంటి హర్షాబ్ధి నోలాడు ♦ చుంటి మదిని ॥

అని తత్ ప్రార్థనా భంగభయమునఁ గొన్నిరోజు లతని యింటనుండి త్యాగయ్య భక్తికలరినాఁడు. చూడుఁడు.

గీ॥ రామపదభక్తి కీత్యాగ ♦ రాయవరుని
సమముగానేర రెవ్వరీ ♦ క్ష్మాతలమున
బ్రేమనాథునుఁడొకసారి ♦ పిలిచెనేని
రాముఁ డోహోయటంచు మా ♦ ర్పలుకునంట ॥

గీ॥ అట్టిఘనునియాజ్ఞ ♦ నంది యచ్చోటువాసి
కదురయంబుకోడఁ ♦ గదలిసాగి
పరఁగరాజిలు నవ ♦ పాషాణమహిమంబు
నాలకించి ముందు ♦ కరిగియరిగి ॥

అనినాఁడు.

"రసభర నిభృతానామ్ దర్శనా దేవసూనమ్ । ప్రభవతి రసికానాం కోఽపిచేతో వికారః । ప్రథమరసనిదానే జాయమానే సుధాంశౌ । ద్రవతిహి సరళాంతః ప్రకృమశ్చంద్రకాంత॥" "రసికులకేదో మనోవికారంబుగలుగుఁ గనినయంత సరసుల, శృంగారరస నిదానుఁడగు శీతభానుఁ డుదయముగాఁగ సరళమతి చంద్రకాంతము గరగు గాదె" (నా వ్రాసిన యడవిపూలు)

అనినట్లు, భక్తులు భక్తులఁజూచి తన్మయులగుదురు. పిదప నరసింహదాసు త్యాగరాజుచే సత్కృతుండై యరిగి శరధిని, నవగ్రహశిలలను, చక్రతీర్థము, స్వేతారంభ స్థలము వీక్షించి, యావల భైరవాదితీర్థముల యర్థ్యకృత్యము లాచరించి, రామేశ్వరము శాశ్వత సౌఖ్యప్రదము ననశ్వరముః సముత్సుకతన వీక్షించి మహోన్నతంబై విచిత్రశిల్ప విభ్రాజితంబై కైలాసంబువిలాసంబుడంబు విడంబించు దేవాలయంబు హర్షంబువొదల. దిలకించి, పులకితాంగుడై లోనికరిగి, కఱవు దీఱ రామలింగేశ్వరస్వామిని సందర్శించి, "కాశికాపురినుండి గంగఁదెచ్చితిని ఈశ! దీనిని గ్రహింపఁగదయ్య" అని ప్రార్థించి, తద్గంగాజలంబుల నమకచమకాదుల నభిషేకించి

బిల్వాది పూజాద్రవ్యంబుల నర్పించి బరువుదీరినట్లు, కోరిక నెఱవేరినట్లు, పెన్నిధి లభించినట్లు నుబ్బి సంతుష్టుండై చేతులు జోడించి,

గీ॥ అన్యమెఱుఁగను దేవ యహ ♦ ర్నిశములు
దైన్యమున నీపదంబులఁ ♦ దలఁచి సుజన
మాన్యహా పరమార్థ సం ♦ పద లభించి
ధన్యమతినైతి నీదగు ♦ దర్శనమున ॥

కం॥ అంగములో సగమంగన
కుం గడమసగంబు భక్త ♦ కోటికొసఁగితే
భృంగి నినుగానవచ్చు భు
జంగచయ విభూషదోష ♦ సంగవిదూరా ॥

లోనగు పద్యంబులఁబొగడి, యవ్వల హనుమదాదుల కెఱఁగి, మఱియు నందిర్వచనాల్గు తీర్థంబులఁ గృతస్నానుండై గంధమాధన పర్వతంబుఁ దుదముట్ట నధిరోహించి, సింధు బంధను శ్రీపాదంబులస్మరించి, పిదప సేతుమాధవు పదంబుల మూర్ధంబుసోక మ్రొక్కి, యుభయసాగరసంగమంబున నుచిత విధులు నిర్వర్తించి, యందు దినత్రయంబుండి పిదప నేకాంత రాములసేవించి, యందు చింతలపాటి లక్ష్మీనారాయణగారి వేడికోలుమెయి నతని యింటికరిగి, అందాభూసురుని కోర్కెఁ దీర్చుటకుఁ గొన్నిదినంబులుండి, రామాయణము పురాణము చెప్పి యతనిచేఁ బూజితుండై కదలి, మఱల సేతుమాధవు దర్శించి,

సీ॥ తగఁ బ్రయాగపురి మా ♦ ధవుఁడు నీక్షేమంబు
నడిగినాఁడని చెల్పు ♦ మనియెఁ బ్రీతి
జాహ్నవి నీపాద ♦ జలజంబులకు మ్రొక్కె
యమున నీదాసనే ♦ యనుచుఁబలికె
వరసరస్వతి నిన్ను ♦ బహుగతుల్ వినుతించె
యన్నపూర్ణ నమామి ♦ యనుచుఁబలికె
కాశీశ్వరుఁడు నిన్ను ♦ ఘనముగా వినుతించె
దక్కుసురల్ నీవె ♦ దిక్కటనిరి ॥

తే॥ భైరవుఁడు దండి మేము నీ ♦ బంట్లమనిరి
వినగదే యుత్తరక్షితి ♦ విషయములివి
తెలిపినాఁడ నిజస్థితి ♦ దెలిపిమీర
సేతుమాధవ వినవయ్య ♦ చిత్తమరల ॥

(మఱియుం బెక్కుపద్యములు గలవు. విస్తరభీతి విరమించితి)

ఉ॥ కోరికదీరె నీచరణ ♦
కోమలయుగ్మము నాశ్రయించుటన్
గోరికదీరె గంగనిటఁ ♦
గూరిమి లింగని కొప్పగించుటన్
గోరికదీరె సేతువున ♦
గొంకక స్నానము లాచరించుటన్
ఊరికిబోయివత్తు దయ ♦
యుంచుము నీమది సేతుమాధవా !

అని నమస్కరించి కోటితీర్థముం గ్రహించి సంసంబై దర్భశయనముఁ జేరి శ్రీరామునకు సాష్టాంగమొఱఁగి శ్రీరంగము సరసి తనయనుభవము నిట్లు చెప్పినాఁడు.

సీ। ప్రాకారసప్తక ♦ పరికరంబు గనుఁగొంటి
నదియొవైకుంఠ మం ♦ చలరుచుంటి
శారిద్దిశగోపుర ♦ త్రయమును గను గొంటి
దక్షిణంబున నేడు ♦ దనరఁగంటి
బశ్చిమమున మూఁడు ♦ ప్రజ్వరిల్లుటగంటి
నుత్తరంబున నాలు ♦ నుంటగంటి
నిరువదియొక్క గో ♦ పురముల నిటుగంటి
నామధ్య శర్వాల ♦ యంబుఁగంటి ॥
నందుఁ గోట్యర్క దివ్య ప్ర ♦ భాళియనఁగ
దాసవరులకుఁ గలపెన్ని ♦ ధానమనగ
మూఁడుమూర్తులలోనాది ♦ మూర్తియనగ
వెల్గుచుండెడి శ్రీరంగ ♦ విభునిగంటి ॥

సీ॥ ఛగఛగదీప్తులఁ ♦ దరుణార్క రుచిమించు
ఘనకిరీటముతలఁ ♦ గాంలగంటి
సన్మణిస్థగిత భా ♦ స్వద్రత్నహారముల్
వక్షస్థలంబునఁ ♦ బరఁగఁగంటి
విద్యుత్సహస్రకో ♦ టిద్యుతులీనెడి
మేఖలనడుమున ♦ మెరయఁగంటి

స్వర్ణవస్త్రద్వయి ♦ సహజ దేహవినీల
కాంతులా చ్ఛాదించి ♦ కాలిగంటి ॥
చంద్ర సూర్యద్యు తులమించు ♦ శంఖ చక్ర
ముఖర దివ్యాయుధోత్కర ♦ ములు కరముల
దనరఁగాఁగంటి నిటువంటి ♦ ఘనతరాంగు
సంగదూరుని శ్రీరంగ ♦ శాయిఁగంటి ॥

ఈ మొదలగు ననేకపద్యంబుల నాతనిఁబొగడి జంబు కేశ్వరనేగి యంబులింగమున కభివాదనములుచేసి కంచిని గాంచి పురవైభవము నభివర్ణించి,

ఉ॥ ఆఁకలిఁగొన్న యట్టిజను ♦
డన్నముఁగైకొను మాడ్కి-బేదవుం
డూకలు పాత్రిష్ఠనైనటుల ♦
రోగికి నౌషధ మబ్బినట్టులు
దేశికపుటెండ మాడుచుఁ జరిం ♦
చెడివానికి నీడలభ్యహా
నాకరణిం గరీంద్రవర ♦
దాంఘ్రులఁగంటి మహాభి లాషినై ॥

క॥ దవ్వులగని డాయంబో
నవ్వాకిలి వారలడ్డ ♦ మైనిలుప గనే
నివ్వెరపడి యుండగనట
జివ్వనవొక వైష్ణవుండు ♦ చేర్చెఁ లోనన్ ॥

ఫలవృక్షమూలంబునఁ గంటకములున్నట్లు స్వామి ద్వారసన్నిధినున్న ధనలుబ్ధులగు నీదావారికుల బాధయును భక్తవరేణ్యుఁడగు నీ సరసునకుం గూడఁ దప్పినదికాదు అయినను శ్రీరాము డండయైయుండ నంతరాయము లేమిచేయును ?

ఆవల నృసింహదాసు వరదరాజస్వామిని సందర్శించి హర్షాతిశయమునఁ బులకలు నకురెలనొలకఁగాఁ బరవశుండై పుడమిపైఁబడి యుంచుకతడవున కుత్థితుండై మస్తకమున హస్తములు మోడ్చి హస్తివరదు నిస్తులభక్తిఁ బ్రస్తుతించియుఁ దదితరస్థల ములఁ ముదంబునం దిలకించియు మఱునాఁడు తిరుపతి కేగ నొకవింతజరిగెను.

లక్ష్మీనరసింహదాసు తిరుపతిచేరి శ్రీ వెంకటేశ్వరస్వామిని మదిని దిరముకొల్పి ధ్యానించుచుఁ బర్వతారోహణ ప్రయత్నమునందుండ మున్నుకంచిం గన్పించిన వైష్ణవుండె యరుదెంచి "నీ తాత తండ్రుల మ్రొక్కుబడుల నెల్లఁ దీర్పఁ గల్గిన నే కొండ నెక్కుము లేకున్న నెక్కకుము" అను పలుకు వినవచ్చిన దెసకుం దల ద్రిప్పి చూడ్కుల సారించి మారు పలుక గమకించునంతలో నయ్యాయవైష్ణవు డల్లనల్లనం జని యదృశ్యుండయ్యె. అంతదాసు నిట్టూర్పుపుచ్చి కూలఁబడి "ఈయన మున్నుకంచిలో గన్పించి వాకిలి దాటించిన వైష్ణవుండయని తలంచి మాటలాడ నుంకించునంతలో నదృశ్యుండయ్యె. ఇతఁడు నిక్కపువైష్ణవుఁడుకాఁడు నాపెన్నిధానము నాభాగ్యరాసి నాదైవము నాతండ్రి ! "అవేంకటేశ్వరుఁడే" కట్టా! ఎట్టినిర్భాగ్యుఁడను ఒక్కమాటయైన నోరారఁ బల్కక

పోతి తనివారఁ జూడనైతి బిగియారఁ గౌగిలింపకపోతి చేతు
లారఁ బదము లొత్తనైతి స్వామీ! ఏలయింత నిర్దయ షేరా!
వేంకటేశ్వరా! కొండమెక్కఁడనఁగా?

సీ॥ తాతనాటిఋణము ♦ దలఁచి లెక్కలుతీసి
ప్రీతిమాని బడుదు ♦ ఖ్యాతిమీని
కఠినవృత్తిదాల్చఁ ♦ కదలరా వలదంటి
విట్టులాడనీక ♦ చెట్టులొప్పి ॥

గీ॥ కాసుపైనాసఁ జేసి యీ ♦ కరణి భక్త
గణములను బాధపెట్టుట ♦ గుణముకాదు
తగదనుచుఁ దెల్ప నీసరి ♦ దైవమేడి?
నొక్కఁడుండవౌట నీకిటు ♦ లొప్పెనౌర!

సీ॥ వాడుకోర్చి విత్త ♦ పటలమార్జించియు
బాదుషాకొసంగు ♦ ఫలమదేమి
కడుపుకైన దినవు ♦ గాసియ్యవేరికి
బీదజనులయందు ♦ బింకమేల?

గీ॥ నీవొసంగక సిరిమాకు ♦ నెగడుటెట్లు
మానుసర్వంబు నీయది ♦ కాదెదేవ
యడ్డమే నీదుచేతికి ♦ నశనమాత్ర
మిచ్చితదియును గొనరాదె ♦ యిచ్ఛయున్న ॥

సీ॥ కొండపైకివచ్చి ♦ కోర్కెలెయ్యవియైన
గోరువాఁడనంచుఁ ♦ గొంకుగదిరి

భీతి జెందినావొ ♦ బిలిచిన బలుకవు
తెలిసెనీదుగుట్టు ♦ తెల్లముగను ॥

సీ॥ వేంకటాద్రినిలయ ♦ వేగిరపడబోకు
ఋణముదీర్తు నీకు ♦ నెల్లినేట
నింతవాఁడవౌట ♦ యెఱిఁగిన భద్రాద్రి
విడిచియేలవత్తు ♦ బ్రీతినిటకు ॥

సీ॥ తనువు నీసొమ్ముగా మున్నె ♦ ధారవోసి
యున్న నాయెడ నరమర ♦ లుంచఁదగునె
మంచిచెడ్డలునీవె నే ♦ నెంచనేల
ప్రోచికొ మ్మంబువులఁబడ ♦ ద్రోచికొమ్ము ॥

క॥ సెలవిచ్చినఁ బసివినియెద
నిలుమన్నను సముఖమందు ♦ నిలిచెదమదిలో
గలవార్త దెలుపకుండిన
దలఁచు కెటుల వైష్ణవోక్తి ♦ దగనీవిధిగాఁ ॥

సీ॥ తొంగిచూచియు నలమేలు ♦ మంగతాయి
దాపురానోడె నీగట్టి ♦ తనము నెంచి
కాసు తనయునికన్నను ♦ ఘనమటంచు
విందు నదియుట నిజముగా ♦ నలసెనేఁడు ॥

సీ॥ ఔర! గోవిందరాజైన ♦ ననుజుఁడఁడ
వీఁడు మనవాఁడు చూచి కా ♦ పాడు మనఁడు
ఔర! యిటువంటి మేళమీ ♦ భువనినొప్పె
మఱి యెచటనుండదిక వేయు ♦ మాటలేల ॥

ఇట్లెన్నెని విధముల నిష్ఠురోక్తులుపలికి పర్వతమెక్క మాని యచ్చోటన పడియుండి రిక్తహస్తుఁడ నే నెట్లు ఋణ విముక్తిఁ గందును స్వామికెట్లు కృపగల్గునని తలంచుచు సంచె పై గుర్తుబఱచి నిద్రించుచుండ స్వప్నంబున.

సీ॥ రజతాద్రికాంతి ని ♦ రాకరించెడు నీలి
చందంబుగల్గు న ♦ శ్వంబు నెక్కి
మల్లెపూలంగి పై ♦ మఖల ధట్టిబిగించి
వల్లెవాటుగ ఖండు ♦ వా నమర్చి
మణిమయ మకుటంబు ♦ మస్తకంబున దాల్చి
దండిసొమ్ములు మెయి ♦ నిండఁదాల్చి
ఎడమచేతను గళ్లె ♦ మిరవొందగాఁబట్టి
తక్కినచేత బె ♦ త్తంబుఁదాల్చి
కులుకునడకను దుముకులు ♦ కొసరు కొసరు
నూర్పులనుగల్గి జనములు ♦ చోద్యమంద
దావుసేరి ఓనరసింహ ♦ దాస యిందు
రమ్మనఁగ నేను నతనిజే ♦ రంగనేగి ॥

నమస్కరించి నిలువంబడి యద్భుతమందుచుండ నింపు హాస సుందర ముఖారవిందుఁడై.

గీ॥ నీవు మావాఁడవని నిజం ♦ బేవచింతు
నాదు విధిదాట ♦ నేరికిఁ గాదుగానఁ
బర్వతంబెక్క వలదని ♦ పలికియుంటిఁ
గూడదను పనిచేయంగఁ ♦ గోరనేల ॥

పంచచామరము.

"నగంబుఁజూచుకోర్కె నీమ ♦ నంబునందు గల్గినన్" రమ్మ

క॥ అని శైలమునకు ననుదో
డ్తోనిచని చూపంగగంటి ♦ గోగర్భంబున్
ఘనపాప నాశనంబుగ
గన గంగాధారమున్ను ♦ గా సర్వంబున్

మఱియు మురిపెంపు పెంపుదోల్కాడ,

సీ॥ నీలఘనాఘన ♦ నిగునమ దేహంబు
నందు బీతాంబరం ♦ బమరువాని
నరిదరశార్ఙ్గ గ ♦ దాదిసాధనములు
హస్తచతుష్కమం ♦ దమరువాని
రసికోటిదీప్తిని ♦ రాకరించెడి కాంతి
గల కిరీటముతలఁ ♦ గలుగువాని
కస్తూరివాసనల్ ♦ గ్రమ్మెడు మెయినిండ
సొమ్ములఁదాల్చిన ♦ సొగసుకాని॥

వక్షమున శ్రీమహాలక్ష్మి ♦ వసఁగువాని
హాటకాంబరము మొలజీ ♦ రాసువాని
వేంకటాద్రీంద్రనిలయు శ్రీ ♦ వేంకటేశు
గాంచి సేవించి యిట్లువ ♦ చి చినాఁడ॥

అని యెన్నేని చందంబులం గొండాడి మఱియుంగల విచిత్రంబులంజూచి.

గీ॥ అవ్వచటియఁ జూచి • యాశ్చర్యమొందుచు
నాజ్ఞవడసి యమ్మ • హాద్రిడిగ్గి
మఱియుఁ గల్గుచోట్ల • మహిమలెల్లనుగాంచి
మేలుకొంటినంతఁ • జాలవేడ్క ॥

చదువరులారా! చూచితిరా? భక్తపరాధీనుని వింత చెయ్వులు "గోవు వెంటనుండు కోడెభంగి" భక్తుల వెంటనుండెద ననుట దబ్బరయా? ఈయొక్క విషయము చాలదా? దాసు గారి పవిత్రజీవితము సంతత స్మరణీయమగుటకు దానెంత తపముసేసెనో! ఎంత, భక్తి గలిగియుండెనో! ఎంత పుణ్యా మార్జించెనో! భగవంతుఁడు తన వెంటనుండుటకుఁ దనకోర్కెఁ దీర్చుటకుఁ దనతో మాటలాడుటకు. దనతోఁ దిరుగుటకు. ఆహా! నృసింహదాసా! ధన్యుఁడవు ధన్యుఁడవు; గాఢతర భక్తిపాశమున భగవంతుని బంధించి గంగిరెద్దునువలె వెంట దిప్పుకొనుచుంటివి.

పాఠకులారా! యవ్వలి వృత్తాంత మిట్లు చదువుకొనుఁడు.

ఇట్లు నృసింహదాసు దానెన్నండు కనివిని యెఱుంగని వింతల నక్కపటపురాతు చూపఁజూచి మేల్కాని యిది సత్యమా? అసత్యమా? చిత్తవిభ్రమమా? యని తలంచు చుండ ఘ్రాణతర్పణంబుగా సుసౌరభ మేతేర నిదియేమని యన్వేషించుచో నాతని శయ్యపై.

ఉ॥ ఎన్నఁడునైనయోగి విభు • లెవ్వని పాదపరాగమింత యుం। గన్నుల గానరట్టి ............ (భాగవతము)

శ్రీవేంకటేశ్వరుని పాదచిహ్నము సురభి రజోలేశము నుండం గాంచి విస్మితుండై లేచి తోడివారలకుం జూపి యా వేంక టేశ్వరుని శ్రీపాదరేణువులఁ దలపై ధరించియు నాఘ్రాణిం చియుఁ గన్నులకద్దుకొనియుఁ గొంత యచ్చటివారి కొసం గియు పిచ్చుకుంటుపై భాగీరథి ప్రవహించినట్లు భగవత్కృప నాబోటి కించిద్జ్ఞునిపై ప్రసరించె జూడీయని సిర్భర హర్షాతి రేకంబునఁ బిచ్చివానివలె గంతులువైచుచు నాడుచు బాడుచు నవ్వుచు నానందాశ్రుల గండతలంబులఁ దడుపుచు మైమఱ చుచుఁ దలద్రిప్పుచు బ్రహ్మానందాంతరంగుఁడై పరితృప్తుఁడై నిమీలితనేత్రుఁడై స్వప్నగోచర పురుషుని భావంబున బం ధించి పరికించుచుండ నమ్మాయాపురుషుఁ డించుకసేపు హృదయకర్ణిక నధివసించియుఁ గొంతడొకతడవు నిటలతటం బున నటనంబుసలిపియు నావల సహస్రార చక్రంబున సన్ని రేకుల వికసింపఁజేసి నడుమ గర్ణికయందు నిలిచి కోటిసూర్య ప్రభామండలంబునఁ బ్రకాశించి దుర్నిరీక్ష్యుండై యుండెనట. అట్లంత క్షేత్రమున రెండు గడియలసేపు బ్రహ్మానంద మనుభ వించి యంత నల్లన గనులువిచ్చి తోడివారల పొగడ్తలకు లజ్జించుచు నెట్టకేలకటనుండి కదలి యలమేలుమంగ కంజలి బంధము ఘటించి గోవిందరాజులఁ గొండాడి నమస్కరించి,

సీ॥ శ్రీపాదరేణువు • చిన్నంవరాయంచు
బల్కు వైష్ణవపరి • భాషవింటి

స్వామిప్రసాద సం • ప్రాప్తంబుఁగోరిన
నెలచాల హెచ్చను • విధముఁగంటి
గడకాష్ఠలపు నున్న • కాసివ్వకుండంగఁ
జిక్కఁబోదనువార్త • జేరివింటి
వింతవింతలు గల • వెలలేని పటములఁ
గన్నులపండువు • గాఁగ గంటి
భక్తియెంతయున్నఁ • బైకంబులేదని
సర్వసాక్షియైన • సామికెఱుక
గాన నతఁడెనన్నుఁ • గనిపోచు వేల్పని
యాపురంబుదాఁటి • యనలికరిగి ॥

భగవంతుఁడును నియతిని దాటఁడు అతఁడే దాటిన నందరుదాటరా? కనుకనే శ్రీకృష్ణుఁడు కుచేలునితో.

సీ॥ ఏను దురిలోక సంగ్రహార్థంబు • కర్మాచరణంబుసేయు

గీ॥ గతిమనంబునఁ గామమో • హితులుగాక
యర్థిమై యుక్తకర్మంబు • లాచరించి
ప్రకృతి సంబంధమునుబాసి • భవ్యనిష్ఠ
దవిలియుందురు కొందఱుత్తములు భువిని ॥

(భాగవతము)

అనియెను అట్టివాఁడే మనదాసుగారుగూడ" అంత నతడు కాళహస్తి నరసి యాస్వామిని బ్రార్థించి [illegible] మార్గమున మఱల బొన్నూరువచ్చి యవ్వాల గుంటూరు బ్రవేశించి

వేడ్కఁ దల్లి కెఱిఁగి యనుజుని దీవించి భార్యా సహర్యుల నంగీకరించి జననికై తెచ్చిన కోటితీర్థంబు నామెనభిషేకించి మాధవప్రీతిగా సమారాధనాదికము నిర్వర్తించి "పోయి సేవింపలేకున్నఁ బుణ్యతీర్థ మహిమ వినుటయు నఖిలకల్మష హరంబు" అనుచు నాయామాహాత్మ్యములఁ దన కష్టసుఖ ముల యాత్రా విశేషముల నందఱకుం దెల్పుచునుండెఁ, ఈయాత్ర వృషసంవత్సర ఫాల్గుణ శుద్ధ పాడ్యమికి సమాప్త మయ్యెను.

మఱల శ్రీరామనవమికి భద్రాద్రికేగి రామునకు దనవృత్తాంతమెఱిఁగించి మగిడివచ్చెను.

ఇట్లు నిరంతర ప్రయాణము లొనర్చుటవలన నారో గ్యముచెడి కొన్నిదినంబులు వ్యాధిబాధితుండై దాసుగా రాత్మ గతంబున "స్వామీ! ఒకచోఁబడియుండి యను క్షణము నిన్ను స్మరించుటకా, ఇట్లు కదలలేని స్థితినిగల్గించితివి అని తారకము జపించుచు గొంతకాలమునకు దేరుకొని క్రీస్తు శకము (1827–28) వ్యయసంవత్సర పుష్య శు ౬ నాఁడు బయలుదేరి యుత్తరదిశాభిముఖులై చనిచని యయోధ్యకేగి రాముఁడు జనించినచోటనియు, వసించినచోటనియు, నాడిన చోటనియుఁ బాడిన చోటనియు, వల్కలములు ధరించిన చోటనియు, దశరథుని నిర్యాణస్థలమనియు, భరతుడు పాదు కల బూజించు చోటనియు నందలి జనంబులుచూప నా యా పుణ్యస్థలముల సభక్తికముగా నారాధించి సరయువునఁ గ్రుంకు

లిడి పితృతర్పణాదు లొనర్చెను. వంశమును బవిత్ర మొనర్చు టకును బితరులకు సద్గతులు గలిగించుటకును "జాలఁడా యేఁడు తరములకు నొకమహాత్ముఁడు" అంత నందఁతడు కొన్నాళ్లుండి హరిద్వారముఁ జేరి యటనుండి బదరికావనమున కేగి నారాయణు దర్శించి మ్రొక్కు లిడి యాక్షేత్రమహిమల వర్ణించి మఱలి కాల్నడకల బహుకష్టప్రయాణముల సర్వజిచ్ఛ్రావణ శుద్ధైకాదశి నాటికి గుంటూరు చేరెను ఎక్కడ గర్తపురి! ఎక్కడ నర నారాయణులు తపంబుచేసిన బదరికావనము! ఎక్కడ యయోధ్య! ఎక్కడ కాలినడకలు యాత్రాఫలము లభించుటయు సామాన్యముకాదు. కావుననే సాముద్రికులు యాత్రారేఖలుంటయు నదృష్టవిశేషముందురు మఱల చైత్రంబున భద్రాద్రి కేగి వచ్చెనుజుడీ.

శ్రీదాసుగారి కిట్లెన్ని యాత్రలు చేసినను దనివితీఱ లేదు. నడకయన్న భయము లేదు, ఎంతదూరమైనను బుణ్యక్షేత్రమన్న బుద్ధిచెంబును గొల్లాయగుడ్డకు ముడివేయుటయే, ఇది యేమి కాని ఆయనకు ముల్లువిఱుగదు పాముఁ గఱవదు, దొంగకనఁబడడు. కాలితీపు లేదు దృఢకాయుఁడే. యుపవాసియైనను వర్చస్వియే. జంఘాలుఁడైనను, అభక్తవశ్యుఁడు గరుడోత్సవ సందర్శనాభిలాషుడై విరోధినత్సర వైశాఖమునఁ గతిపయాప్త భక్తులతోఁ గదలి కంచి కేగి స్వామిని సేవించి మఱలి చెన్నపట్టణమురాఁగ వైదికబ్రాహ్మణుఁడు మురికినాడను శాఖకుం జెందినవాఁడు ధనాఢ్యుడు భక్తుఁడు నగు

నాగండ్ల వరదరామదాసు వీరినాహ్వానించి యుచితసేవలఁ దృప్తుంజేసి దాసుగారివలనఁ దారకమంత్రరాజ ముపదేశము నొంది తనయింట గురువుగారిని మాసత్రయముంచుకొని రామాయణము సాంతముగావిని పిదప నాలుగువేల రూప్యములతో నరసింహదాసుగారి పాదపూజసేసి "స్వామీ! మీ రింకొక పర్యాయము వేంచేసి భద్రాద్రి రామచంద్ర మూర్తిని సందర్శించు భాగ్యము నాకు లభింపఁజేయవలయు" నని ప్రార్థించి వీడ్కొలుపఁగా దాసుగారతని వినయ భయ భక్తి శ్రద్ధలకలరి యిదియంతయు నా శ్రీరాముని కారుణ్యాతిశయమని తలంచి గుంటూరునకేతెంచి మూఁడు తరంబుల నుండి పెరుగుచున్న ఋణమ్ము నా నాల్గువేల రూపికలొసంగి నిశ్శేషమ్ముగాఁదీర్చి ఋణవిమోచన సంతర్పణ మొనర్చెను.

సీ॥ అష్టదిక్పతులు ప్రసన్నులైన • హరియి ప్రసన్నైనను
దలఁచుమానిసికిఁ బ • త్రింబువలదు
పరుగడ తట్టైన • భద్రేభమైనను
ద్యాగశీలునకు ల • క్ష్యంబుగాదు
అధికాశగలవాని • కల్పసంతోషికి
గణ్యంబుగాకుండుఁ • గనకశిఖరి
నాథుండు రక్తుఁడై • నవిరక్తుడైనను
దరుణి కేమిటిని సౌం • దర్య రేఖ॥
(రామలింగ)

అని యడిదము సూరకవి రామలింగేశునితో మొఱ పెట్టుకొన్నట్లు పత్రములు లేకున్న నేమి? తరములు గడిచిన నేమి? సద్బుద్ధియగు నధమర్ణునకు.

అంతం గొన్ని దినములకు మఱల నరసింహదాసు చెన్న పురికరిగి వరదరామదాసుం దోడ్కొని వికృతివత్సర చైత్ర మాసాదిం బయలుదేరి శ్రీరామనవమి కుభయులు భద్రా ద్రిం జేరి. శ్రీరాముని సముత్సుకత సందర్శించి యట నిత్య ము దుర్వారిదిగదా భాగ్యమని తత్రిత్యులం గొండాడి తిరిగి గుంటూరుకు వచ్చిరి.

నృసింహదాసుగారి బుద్ధికి నడవడికిం బ్రభావమునకు నబ్బురంబడి వీరినివిడచి నుండఁదగదని సకళత్రముగా వారిం జెన్నపురికిం గొంపోయి యచట నాఱుమాసములుండి భక్తి జ్ఞాన సంపత్తిచే వైరాగ్యమువోడమ నందుండ నిచ్చగింపక తన యాద్యస్తువితతిని శకటాశ్వాదులపై బూన్చి యందుఁ గదలి వికృతివత్సర కార్తీకమున భద్రాద్రికరిగి కాపురముం డిరి. అందు నిరతము రాము సేవించుచు నృసింహదంపతుల సంభావించుచు నా వరదరామదాసు దంపతులు సంతోష మున గాలము బుచ్చుచుండిరి.

క॥ కర్మమునఁ బుట్టుజంతువు
కర్మమున సమృద్ధిఁ జెందు • గర్మమునఁ జెడున్
గర్మమె జనులకు దేవత
కర్మమె సుఖదుఃఖములకుఁ • గారణమధిప ॥

అన్నట్లు దేహి కర్మానుగుణ్యమైన దశాపరిణామము నందవలయు భద్రాద్రిలో శ్రీరాములకుఁ గైంకర్యము సేయు వారు ధనాశా పీడితులై స్వామిధనము హరించుచుఁ దత్తత్కాలోచిత కైంకర్యములఁ గావింపక యేరినిం జీరికిఁగొనక యుచ్ఛృంఖల వృత్తిని సంచరింపసాగిరి చూచితిరా! కడు దవ్వులన్న వరదరామదాసాదులు భద్రగిరి నివాసమే పూర్వపుణ్య విశేషమని భావించిరి. అశ్రాంతము స్వామిసన్నిధినుండి సేవలొనరించు నీయర్చకులు తమయదృష్టమును బాటింపక పోగా? నకార్యములకు పాల్పడిరి. ఎందున్న నేమి? బుద్ధి లేని వారు మొసళ్లు, మీలు కర్కటముల్ నిరతంబును జాహ్నవీ నదిఁ నివసించుచున్నను స్నానఫలము దక్కునా?

ఈయర్చకుల మొండగముల నృసింహదాసు నిరీక్షించి చక్క సేయ లేక తనసొత్తు పోయినట్లు నాలిం గోల్పోయిన వాని వలెఁ గడుఁ బరితపించి చింతించి యొకనాడు "ఓ రామచంద్రా! నీకు సేవలు సక్రమముగా జరుగుట లేదు. నే నెట్లు సహింపఁ గలను నాకే తెరవు? అని మొఱవెట్టి నిద్రింపఁగా స్వప్నంబున నొక వైష్ణవుం డరుదెంచి నృసింహా! వగపేల? లెమ్ము చందులాలును దర్శింపఁబొమ్ము అన్నియుం జక్కనగును" అని పలికి చనియె. అంత దాసు మేల్కాంచి తన ప్రియశిష్యుఁడగు వరదరామదాసునకో స్వప్నవృత్తాంతమంతయు మఱి తనమున సంతసముతో నుడివి శ్రీరామాజ్ఞగా భావించి సభక్తి నమస్కరించి హైదరాబాదునకుఁ బయనమై యొకఁడ చనియె. భక్తుల

భావములు భగవంతునకు భగవంతుని భావములు భక్తులకుఁ దెలియుచుండును.

క॥ చిక్కఁడు వ్రతములఁ గ్రతువుల
జిక్కఁడు దానముల శౌచ • శీల తపములం
జిక్కఁడు యుక్తిని; భక్తిని
జిక్కినక్రియ నచ్యుతుండు • సిద్ధముసుండీ ॥

ఆకాలమున నిజాంరాజ్యమును బరిపాలించుచు హైదరాబాద్ అను ప్రధాన నగరమున నాసర్ద్దౌలానవాబుగారు నివసించుచుండిరి. అతనికి మహారాష్ట్ర బ్రాహ్మణుండును, ధర్మాత్ముఁడును, చండశాసనుఁడును, సన్మార్గప్రవర్తకుండును, సమర్థుఁడు, భక్తుఁడు నగు చందులాల్ ప్రధానామాత్యుం డుగా నుండెను. పుణ్యాత్ముఁడగు నమ్మంత్రిశిఖామణి కొకనాటి రేయి కలలో శ్రీరాముఁడు దృగ్గోచరుండై "ఓరీ! నృసింహదాసు నీదాపున కేతెంచుచున్నాఁడు వాఁడు నాప్రియభక్తుండు సుమా"యని నుడివి యదృశ్యుండుకాగా వెంటనే కనులు తెఱచి యద్భుతపడి శ్రీరామచంద్రమూర్తిని ధ్యానించి శ్రీనృసింహదాసు కారణమ్మున గృతార్థుడనైతి నా జన్మము సఫలమయ్యె రాముని కా దాసుమీఁద నింత ప్రేమయుంట కా మహాత్ముఁ డెంతతపముచేసెనో, ఆ మహాత్ముఁ డెన్నఁడు వచ్చునో? వారి చరణకమలముల నెన్నఁడు చూడఁగలుగుదునో? వారికి నావలని ప్రయోజన మెయ్యదియో? ఇంత నచ్చిన భక్తుని వాంఛితముల రాముఁడేల సఫలము చేయఁడో? నన్ను ధన్యునిజేయుతలంపు నం గావలయు, రాముఁడీ విచిత్ర

సంఘటనము సేయఁబూనెనని యెన్నియో తెఱంగులఁ దుఱంగలించు భావములలోఁ బొద్దులుపుచ్చుచుండఁ, గొన్ని దినములకు లక్ష్మీనృసింహదాసుగారు హైదరాబాదున కేగి, చందూలాలు మందిరంబు నానందంబునం దరియఁజని సులభోపాయంబున లోనికరిగి, రాజాధిరాజా, సలామంచు మ్రొక్క నాదీర్ఘకాయంబును నా ద్వాదశోర్ధ్వ పుండ్రములను నాతులసిపూసల పేరులను నా విశాల నేత్రంబులను నాపంచకక్ష్యల నీరుకావి ధోవతిని నాశరీరకాంతిని నాసుస్మితాస్య సౌందర్య విలాసములను భుజంబుల వ్రేలాడు నత్యాత్రి సంచిని నమ్మంత్రివర్యుఁడు పరికించుచో మహాప్రభూ ! మీ రాజ్యములోని భద్రాద్రి నివసించు నరసింహదాసుఁడ నని చెప్పఁగా నుద్దవిడి గద్దియడిగ్గి యొక్కపెట్టున బిగ్గఁగౌగిలించి, చందూలాలు దగ్గఱకేగి నిట్లనియె. "శ్రీరామచంద్ర పరమాత్మానుగ్రహముగాంచిన భక్తపుంగవా ! వింటివా నిన్నుగంట నాఁ్ఁలినోముపంట పండినది. నీకు బంటనై నీసెప్పిన పనిసేయ సన్నద్ధుఁడ మహాత్మా! పనిఁగొమ్ము రమ్ము మమ్ము మా మందిరమ్ము పావనమ్ము సేయుము." అని యంతిపురిలోనికిం గొనిచని పదములవ్రాలి పూజించి రాముఁడు తన స్వప్నంబున నుడివిననుడులను నుడువఁగా, హర్షావేశమున నొడలుమఱచి మైపులకలెసఁగ నానందాశ్రులు రాల గద్గదకంఠుఁడై, దాసు కొండొకవడికి మంత్రిని గౌగలించుకొని 'యంభోజ గర్భాదులరయఁగరాని శ్రీ రా మ చం ద్రు నీక్షింపఁ గల్గితివే ;

తండ్రీ! ఎంతధన్యుఁడవు నిన్నుఁగన్న బన్నములుఁరలవే! నిన్నుఁదాకిన పున్నెములు వఱలవే!" యని కొంతప్రొద్దు ప్రశంసించి, చందులాలు ప్రార్థింపఁగా నతనియింటఁ గొన్ని దినములు వసించి యతనికిం ద రకమహామంత్రరాజము నుపదేశించెను పిమ్మట నొకనాఁడు చందులాలు సవినయముగా దాసుతో "మహాత్మా! నన్ను మీరు కృతార్థుం జేయ నరుదెంచి నన్నేల మీ ప్రయోజనంబునకు వినియోగించుకొనరు? ఇంతిదవ్వు మిమ్ముల నడపించిన యవసరకార్యమెయ్యది? యనుగ్రహమున నానతిం" డని వేఁడగా సహర్షఁబున నాననమ్మున మందహాసంబు మొలకలెత్త నతం డిట్లనియె.

"మంత్రిశేఖరా! ఎఱిఁగియుంటివికదా! మీ రాజ్యములోని పూజ్యమైన భద్రాద్రిని శ్రీరామభద్రుని, ఆ స్వామివారికి శ్రీనవాబుగా రొసఁగిన పవిత్రక్షేత్రములను యాత్రికులొసఁగు ముల్లెలను ముడుపులనుహరించి మదోన్మత్తులై యర్చకులును తదధికారులు నెవరిని లెక్కింపక తుదకు స్వామి కైంకర్యము సైతము సక్రమముగా జరుపుటలేదు. దీనికి సహింపలేకున్నారము. స్వామివారికి నిత్యోత్సవములు జరుగు నట్లేదేని యుపాయము మీరారయునది" యని యూరకుండ నతఁ డద్దాని కింత యేల! తదధికారము మీరే స్వీకరింపు"డను నమాత్యు పల్కుల కడ్డము వచ్చి, "అయ్యా! మీరొండు చందంబునఁ దలంపవలదను దాసుగారికి నమస్కరించి పరేంగిత విదుండగు నమాత్యు డిట్లనియె "స్వామీ! నేను నిష్క-

పటముగా నిస్సంశయముగా నిజముగాఁ బల్కుచున్నాఁడ. ఒక్క దేవాలయమునకాదు,

ద్వి ప ద.

భద్రాద్రి పాల్వంచ ♦ పరగణాలెల్ల
భద్రంబుగానీవు ♦ పాలింపఁదగుదు
వాయుర్వికెల్లనీ ♦ వధికారమూని
చేయుము న్యాయసం ♦ సిద్ధిఁ బాలనము
రాజితమైనట్టి ♦ రాజా బిరుదము
నేఁ జెల్లుగా నిదె ♦ నీకొసంగితిని
చెలగినీక రాజా నృ ♦ సింహదాసంచుఁ
బిలుతు రింతటినుండి ॥ ”

అని దాసుగారు నిరాకరించుచున్నను వినక వెంటనే యొక శాసనములిఖించి మనమార నమ్మహామహున కొసంగె.

ద్వి ప ద : మఱియు నొంటెలు రెండు ♦ మత్తేభయుగము
తురగచతుష్క మెంతో ♦ భక్తినొసఁగి
సరిఫేష్తురాయిాలు ♦ సరిగంచుసేల్వ

(నరసింహదాసు చరిత్ర)

నిచ్చి కనకాభిషేక మొనర్చి మహావైభవంబున పునర్దర్శనమయ్యేడు గావుతమని యర్థించి, కొంతవడి వెంట నడిచి వీడ్కొనియెను.

అట్లా నరసింహాభక్తవర్యుండు ఖరసంవత్స రాషాఢ కృష్ణ చతుర్దశినాటికి భద్రాద్రిం జేరి, మహామాత్య సందర్శన మగుటయుఁ, దాలూకాధిపత్యము లభించుటయు, నిమ్మహా వస్తువాహనమ్ము లబ్బుటయు గజాంతైశ్వర్యము చేకూరుటయు స్వామీ! భవదీయానుపమాన కృపాతిరేక వశమునసే యని సర్వము రామార్పణ మొనర్చి నాటినుండి తాలూకా కధి కారియై, శ్రీరామ కైంకర్యములు వేళతప్పకుండ సక్రమముగా జరుగున ట్లాజ్ఞాపించెను. అప్పటి భద్రాద్రివైభవమును వర్ణింప దరముగాకుండె. ఎప్పుడు మంగళ వాద్యధ్వనులే. నిత్య కల్యాణము పచ్చతోరణము. అది భద్రాద్రికాదు, వైకుంఠము. ఆరామునికి సేవలుసేయించుచు నొప్పదనున్నవారు నరసింహ వరదరామదాసుగారలు నారదతుంబురులు.

ద్విపద: రామునకు దయాది • రాజిలఁదగిన
శ్రీమద్విధులకొప్ప • చెల్వంపు గృతులు
గద్య పద్యాదులు • కడు హృద్యములుగ
విద్యారసపౌఢి • వెలయఁగావించి
శ్రీరాము సత్పదాం • చిత పూజలందు
గోరికలార నె • క్కొనగ స్థాపించెఁ
గాడు చుందెల్ల • ప్పటికిని నాకృతులు
వేడుక నారఘు • వీరుసన్నిధిని ॥

(నరసింహదాసు చరిత్ర)

ఇట్లు రామకైంకర్యమునకు మాత్రిమే యచింతి తోపగతాధిపత్యము, ననుపమానైశ్వర్యమునంది మహాభక్తుఁ డగుట, దానభోగంబులఁజిక్కక నవనీతము తక్రమునందు న్నట్లు, జనకుఁడు రాజ్యముపాలించినట్లు, కుచేలుఁడు వైభవముల నుపభోగించి నట్లు కనుగలిగి మెలఁగుచుండెను.

అంత నాకాలమున భయంకరక్షామదేవత తాండవ మాడె. ప్రసిద్ధముకదా నేటికిని నందనకఱవు. అప్పుడీదాసుగా రొనర్చిన ప్రజాసేవ యపారము. గొప్పయన్నసత్రము నాయూర నెలకొల్పె. ఎన్నియో కుటుంబము లటకేతెంచె. వినుఁడు.

ద్వి ప ద : ఎందఱువచ్చిన • నేమి పోయంచు
నందఱ కొనరించె • నన్నదానంబు
శిశువులకును బాలు • చేరియిప్పించెఁ
బశుసమితికి మేఁతఁ • బాటించి కూర్చె
వారమునకు నొక్క • పరిలగడుగు
లాంగ స్త్రీబాల • కాళి కమర్చె
మాల మాదిగలకే • మరక యన్నంబుఁ
జాలుఁ జాలనఁగ తె • న్నగ సమకూర్చె
ముమ్మార్లు భోజనం • బులు చేయువారు
ముమ్మార్లు తినువిధం • బున నమరించె
బాత్రిలుచాలక • బహుగచ్చుకుండ్లు

చిత్రింబుగాఁగట్టి • చేర్చె బక్వములు
ఆనాడు కట్టించి • నట్టి కుండంబు
లీనాటికిని నిల్చె • యెసఁగు భద్రాద్రి

(నరసింహదాసు చరిత్ర)

ఇట్లెన్నేని తెఱంగుల విజయవత్సర శ్రావణమునఱకు జనులఁబోషించె. నవ్వాల వర్షముగురిసె. సుభిక్షముదరిసె. జనము మురిసె. పాఠకులారా! నరసింహదాసుగారికి శ్రీరాముఁ డుద్యోగమిప్పించిన దెందులకో తెలిసికొంటిరా? కఱవులో ననదలకు పేదల కన్నవస్త్రములిచ్చి రక్షించుటకుఁ జూడీ భగవల్లీలల నెవ్వఁడెఱుఁగఁగలఁడు!

ఎట్టివారికిం బూర్వకర్మానురూప ఫలం బవశ్యమను భావ్యమ నాగండ్ల వరదరామదాసుగారికి క్షయరోగము సంభవించె. నానాటికిం గృశించుచుండె. అప్పుడు నరసింహదాసతనికరముఁ గరమునఁ గీలించి, కాయంబు బుద్బుద ప్రాయంబనియు, నైశ్వర్యంబు నశ్వరంబనియు, జావు కాయమ్మునకు తావనియు, "నిన్ను జెన్నపురినుండి నే భద్రగిరికి శ్రీరాము సేవలకై తెచ్చినట్లు వైకుంఠమునకు నొప్పఁగ నిన్నుఁగొంచు నరిగెద ననియు, నిది రామాజ్ఞ నెఱవకు" మనియు నూఱడించి తత్సన్నాహమున నుండ, వరదరామదాసు భార్యయుఁ దల్లియు నేమును మీ వెంట నచ్చెదము మన వల్లెయనియె. తన యర్ధాంగియగు లక్ష్మమ్మ బాయమ్మగారు నాకును వైకుంఠయాత్రకు సెలవిందు మిముఁ బాసి ధరనిల్వ

నేర నెట్టులన దాసు కొంతవట్టు విచారించి నీకు భగవదాజ్ఞ లేదు. భూమియందుండుమని చెప్పి మఱియుం గొందఱుభక్తులు మమ్ము మీతోఁ గొంపొండు. శ్రీరామునితో సాకేతపౌరు లరుదెంచినట్లు మీతో నరుదెంతుమన నధోముఖుండై మీ మీ యిచ్చచొప్పునఁ జేయుడు. విధినిమాత్రముఁ దాట నేరి తరము? అనిపల్కె. ఆహా! మన భక్తాగ్రేసరునియందెంత విశ్వాసమో యానాటిప్రజలకు మృత్యుదేవత తనకుఁ గైవస మయ్యెంగావలయు దాసు తనయింటఁగల స్వర్ణరజతమయాది సర్వవస్తువులకు జాబితాలు వ్రాయించి రామాలయముం జేర్చి వలసిన వస్తువుల వలసినవారికిచ్చె.

ద్వి ప ద : ఏమియు లేకుండ • నిల్చూఱవిడచి
ఆమీద రాజకీ • య ప్రసంగములు
దేశపాండ్యాలకుఁ • దెలియ బోధించి
వాసిగా నచ్చిలా • ద్వయ శాసనముల
పైని శ్రీరాము స • ర్వ స్వర్ణరత్న
మానితాభరణముల్ • మఱియెన్నఁదగిన
స్థిరచరాస్తులపేర్లు • చేర్చి చెక్కించి
సరిగఁ గోవెలయందు • స్థాపనచేసె ॥
(నరసింహదాసు చరిత్ర)

మఱియు వరదరామదాసుగారికి యాఱునెలల పుత్రు దాసి చేతులందుంచి సాకుమనిచెప్పి తనయొద్దనున్న తమ్ముని

కొమరు రామాఖ్యుని దీవించి మహాప్రస్థాన మహోల్లాసంబున నుండు నెడ వరదరామదాసు రామభజనసేయుచు విగతా సుండయ్యె.

అంత జనులందఱు విస్మయస్వాంతులై చూచుచుండ వరదరామదాసు శవమును వెంటఁదీసికొని కాళ్ళగజ్జెలఁ గట్టుకొని బుజమునఁ దాంబూరఁబెట్టుకొని చేతులఁ జిటకలుఁబట్టుకొని కంఠంబులెత్తి భక్తులతోఁ గలసి భజనసేయుచు,

కాంభోజిరాగము — కీర్తన.

పోయెదమయ్యా! వైకుంఠమునకుఁ బోవుచునున్నాము ।

శ్రియః పతిని దలంచి భక్త శ్రేణులకు దండములుపెట్టి ॥పోయె॥ మోదముతో గోదావరి।నాధారముచేసి కొని సాధు జనులవెంబడి మేము।నరగున శ్రీరాముల జూడ ॥పోయె॥

కూరిమి రాముఁడిచ్చిన । భూరిసంపద్వ్రాతమెల్ల కోరిక లూరఁ గ్రిమ్మఱ । శ్రీరాముని సన్నిధిఁ జేర్చి ॥పో॥

కోరి యీ శరీరముల । శౌరికర్పణముసేయ । శ్రీరామ భక్తులును నార । సింహ దాసుఁడనెడి నేనును ॥పో॥

అని భజనసేయుచు నృత్యములు సలుపుచు నమ్మాకతోఁగదలి యరుగుచుండ నంబరతలంబున నంబుజాక్షుఁడు కోదండంబుంబూని నయనంబులకుం గోచరింప.

కీర్తన — ఆదితాళము.

అడుగో కోదండపాణి అడుగో । భద్రాచలేశుం ॥డడుగో॥

అళిసముదయము । నదలించెడిబల్ । తళుకు ముంగుగుల । బెలుకులుగలవా ॥డడుగో॥

చందురుగుచికడు।మందముచేసెడి।పొందుగలుగుమో ।మందముగలవా ॥డడుగో॥

తీరుగ కస్తురి।తిలకము మెఱయఁగ।చారుభ్రూయుగపు।సైగలుగలవా ॥డడుగో॥

వెన్నెలనీనెడు । సన్నపునగవులఁ । జెన్నలరెడు । నాపన్నరక్షకుం ॥డడుగో॥

కంబుకంఠమున । ఘనరుచిగలర । త్నంబుమెరయు శ్రీ । దశరథరాముం ॥డడుగో॥

వాసిగ భద్రగి । రీశుఁడగుచు భువి।గాసిలు నరసింహ ।దాసునేలువా ॥డడుగో॥

(విస్తరభీతి సాంతమువ్రాయ విరమించితి)

ఇట్లు భక్తబృందముతోఁ గలసి నయనగోచరుండై నవ్వుచున్న శ్రీరామమూర్తి నాపాదమస్తకము వర్ణించుచు క్రీస్తుశకము 1833—34 విజయవత్సర భాద్రపద కృష్ణచతుర్థి సౌమ్యవాసరమున రవి పశ్చిమాద్రిఁ జేరుతఱి వీధులం బోవుచుండఁ బువ్వులఁ జల్లువారును, నెదురువచ్చి దండాపతితులగువారును, మెండుగాఁ గొండాడువారును, వారువోసి నమస్కరించువారును, దోడఁజనువారును, నబ్బురపడువారును, ఈ మార్గ మవలంబించినవారు తొల్లి పాండవులని వింటిమి. నేఁడు

మిమ్ముఁ గంటిమని యుత్సాహంగువారునై పౌరులెల్ల రనుగమింప మున్నీని మన్నేటిదేవేరి యగు గోదావరీ నదీతీరముం జేరి వెనుకకు మఱలి దేవాలయ శిఖరోపరిచక్రముం జూచి నమస్కరింప నది యంగీకారసూచకముగా గిరగిర తిరిగెనఁట. అంత నావైకుంఠయాత్రికులు నెన్నంటిబె బడవలపై నెక్కి దాసును బురస్కరించుకొని భజనలుసేయుచు, నితరజనులీ యద్భుతముంజూడ, మఱికొన్ని పడవలపై నెక్కి వచ్చుచుం బరిపరి విధములం దలంచుచుండఁ గొంత దవ్వరిగిరి అట్టియెడ నిది యత్యంత సాహసకార్యమని గాని, ఇది యాత్మహత్య కాదా యనికాని, అడ్డుపెట్టుట యుచితమనిగాని, తలంచువారు లేరైరన్నచో నాదాసుగారి యచంచల గాఢభక్తి వైరాగ్యములం దెంత విశ్వాసముండెడిదో వేఱ నుడువ ననవసరము. అట్లు వారు నడిపాయకరుగ గోదావరీ వారి సముత్సాహంబునం బొంగి తరంగహస్తంబులం బిల్చుచుండ "జయ రమారమణ గోవిందహరే" యను నారావంబు భూనభోంతరాళంబులు నిండుచుండ, వేలకొలది జనంబులు పరివేష్టించి ప్రతీక్షించుచుండ, ముందు వరదరామదాసు కళేబరఁబు దాసు గంగలోఁ గలిపె. అంతలో నానదియొక్క పెట్టున బొంగి రామరామ రామా యనుచున్న లక్ష్మీనృసింహదాసును దరంగహస్తంబులఁ గౌఁగిలించి యదృశ్యం బొనర్చె. తత్క్షణము మిగిలిన పదునేడుగురుభక్తులు లక్ష్మీబాయమ్మతో గుభేలున నాగోదావరిలో దుమికిరి. అప్పుడు,

ద్వి ప ద : వింతగానొకదివ్య ♦ విమల తేజంబు
ఘనతరసూర్య ప్ర ♦ కాశంబుమించి
జనములుసూడంగ ♦ జనె వియద్గతిని॥"
(నరసింహదాసు చరిత్ర)

వారు వీరనక యెల్లర కాదివ్య తేజంబు గన్పింప నిది లక్ష్మీనృసింహదాసుగారి దివ్య తేజంబని తలంచి యపరిమితాద్భుతముల నందిరి.



# త్యాగరాజస్వామి

మనస్సు కామసంకల్పములతో గూడినపు డశుద్ధము, కామరహిత మైనపుడు శుద్ధము. అశుద్ధమైనమనస్సు బంధమును శుద్ధమనస్సు మోక్షమును సమకూర్చును; అనగా విషయాసక్తమైనపుడు పునరావృత్తి విషయరహితమైనపుడు బంధవిముక్తిఅనుట, విషయముల మనస్సున కంటనీకుండుట, సాధకుల కర్తవ్యము. విషయములంటని మనస్సు స్వస్థానమున నిల్చి భగవద్రూపిడగును.

మనిషియన మనోనిగ్రహము గలవాడే. మానవుడు సాధింపవలసిన ఇహపరములు రెండింటికిని మనోనిగ్రహమవసరము. మనోనిగ్రహములేని వాని జీవితము దుఃఖమయము. భగవంతుడు సగుణ, నిర్గుణస్వరూపుడు. సగుణసిద్ధి గడించిననే నిర్గుణ సిద్ధిలభించుట. ముందు సగుణోపాసనము ద్వారా మనోచంచలంబూడ్చిన, గ్రమముగ నిర్గుణసిద్ధి యలవడి అసంప్రజ్ఞాతసమాధి యలవడు. శబ్దబ్రహ్మము నజపంకటించి సాధనసాగించిన, సులభముగ సగుణ నిర్గుణసిద్ధులలవడి సాధకుని కృతార్థుని గావించును. శబ్దబ్రహ్మపరబ్రహ్మల కభేదము, శబ్దబ్రహ్మోపాసనవలన నచిరకాలముననే, భ్రమరకీటన్యాయమున నుపాసకు డుపాస్యు డగుచున్నాడు.

ఒక్కడైన పరబ్రహ్మమే జలచంద్రన్యాయమున ప్రపంచమునం దంతట నిండియుండుట దెలిసి నానాత్వమం



త్యాగరాజస్వామి

దేకత్వమును లక్షించుచు శబ్దబ్రహ్మము నుపాసింపవలయు నను రహస్య మెఱింగి తరించిన పుణ్యమూర్తి మన త్యాగ రాజమూర్తి.

తండ్రి రామబ్రహ్మము, తల్లి శాంతమ్మ. ఇంటిపేరు కాకరవారు. సోదరులు. 1. పంచాపకేశుడు, 2. రామనాథుడు. జనన స్థలము చోళమండలమునందలి తిరువారూరు (పుణ్య క్షేత్రం) పెరిగినది కుంభకోణసమీపమునగల పంచనదము. త్రిలింగబ్రాహ్మణుడు, కాలము క్రీ.18వ శతాబ్ది. అన్న లకుమించిన మేధాసంపద గలవాడగుట తండ్రికృపకు పాత్రుడైనాడు. పంచవర్షప్రాయమం దక్షరాభ్యాసమైనది. సంవత్సరములోప లనే బడిచదువు పూర్తియైనది. పిదప దండ్రివద్ద సంస్కృతము జదివి, పండితుడైనాడు. 8వ యేట నుపనయనము, శొంఠి వెంకటరమణయ్యగారికడ సంగీత మభ్యసించి రాగాలాపము జేయుట, పల్లవిబాడుట, నూతనకల్పనలు జేయుట, లక్ష్య లక్ష ణముల సమకూర్చుట, సమగ్రముగ సాధించి పేరువడసినాడు. పదునాల్గవయేట దండ్రియు, బదినైదవయేట దల్లియు బరమప దించినారు. పదియారవయేట, కాంచీపురవాసియగు భాగవ తాగ్రణివలన రామతారకమును గ్రహించి, దేశికాచార్యాను మతి రోజునకు 125 వేల ప్రకారము 38 యేండ్లకు సరిగా 96 కోట్ల జపముగావించి శ్రీరామసాక్షాత్కారభాగ్యము గ్రహింపగలిగినాడు. అనుకూలవతియు సుశీలయునైన కమలాంబ యను భార్యతో నిర్బాధకరముగ జీవయాత్ర గడపుచుండె.

ఒకప్పుడు త్యాగయ్య తన్మయుడై శ్రీరాముని "ఏల నీదయరాదూ" అను కీర్తన అఠాణారాగములో బాడుచుండు తరి, నెందుండియో ఒక యోగివచ్చి భక్త్యావేశముతో గాన మొనర్చు త్యాగయ్యనుజూచి మైమరచి నిలువబడిపోయినాడు. త్యాగయ్యగారు కొంతవడికి గన్నులుదెరచి యోగిపుంగవుని గాంచి నమస్కరించి యపరాధమును క్షమింపుమని వేడుకొని యుచితరీతి సత్కరించినాడు.

అంత నాయోగివరుండు నేను కావేరీస్నానమాచరించి వచ్చెద; నంతవఱకు నీయొద్ద నుంచుమని చెప్పుచు నొకతాటి యాకుల గ్రంధము త్యాగయ్యగారి కొసంగి జననినాడు. భోజనకాలమునకు రాలేదు. రెండురోజులు జరిగినది. అతిధి జాడయే లేదు. భార్యాభర్తలు నిద్రాహారములమరచి దుఃఖించు చున్నారు. మూడవ రేయి జరుగుచున్నది. త్యాగయ్యగారి కెట్లో నిదురబట్టినది శ్రీరామమూర్తి స్వప్నమున గోచరించి "నీకు గ్రంధమిచ్చిపోయిన యోగి నారదుడు. అత డొసంగినగ్రంధము స్వరార్ణవము" అనిచెప్పి యంతర్ధానమైనారు పెన్నిధిగన్న పేద చందమున నాతడు బ్రహ్మానందమంది భార్యతో నాదివ్య స్వప్నవృత్తాంతముజెప్ప దంపతులిద్దరు దమ యదృష్టముగొని యాడుకొనుచు నిత్యకృత్యముల బ్రవర్తింప గడంగిరి.

ఏకాదశి యుపవాసము. ద్వాదశిపారణ. తులశిపూజ వీరికి విడిపోని వ్రతములు. జ్ఞానభక్తివైరాగ్య పూర్ణుడును సంగీతవిద్యా పారంగతుడు నగు పట్నాల గోవిందదాసుగారి

కొకరేయి స్వప్నమున శ్రీరామచంద్రుడు దర్శనమిచ్చి "నీవు రేపే బయలుదేరి త్యాగరాజస్వామిని దర్శించి వారిగాన, మాధురి నాఘ్రాణించి రమ్మని యాజ్ఞాపించు కారణముగ నాతడు శ్రీస్వామివారిని దర్శించి, గానసుధారసమాని సెలవు గొని పాండురంగదర్శనార్థియై పండరిపురమున కేగినాడు.

మఱియొకప్పుడు గంగాతీరవాసియగు రామదాసను భక్తశిఖామణి తనకు స్వప్నమున లభించిన రామాజ్ఞనను సరించి తిరువారూరున కరిగి, స్వామివారికి తనగానమును విని పించి, స్వామివారిగానమును విని సంతసించి, గానకళ నుద్ధరింప వచ్చిన యపరనారదావతారునిగా బ్రశంసించి వెళ్ళినాడు.

తంజావూరు, మైసూరు, మహారాజు లొకరొకరుగా జనుదెంచి తమతమ యాస్థాన విద్వాంసులుగానుండ ప్రార్థించిన "మా రామచంద్రుడు బీదవాడైనప్పుడు మిమ్మాశ్రయింప గల"నని సమాధానమిడిన కారణముగా, నిజసోదరులు కుట్రజేసి శ్రీవారి పట్టాభిషేకపంచకమును కావేరిలో బారవేయ నిద్రాహారములు మరచి దుఃఖించుచు, తనకు స్వప్నమున సాక్షాత్కరించి కావేరినదిలో పట్టాభిషేకపంచకమున్న స్థలము నెఱిగించిన శ్రీరామవాక్యానుసరణి వర్తించి, తనయర్చా మూర్తుల పరిగ్రహించిన భక్తాగ్రణి త్యాగరాణ్మణి.

ఎడతెరిపిలేని భక్తితో గానలోలుని గీర్తించుచు బయలుదేరి రంగనాథునిదర్శించి కీర్తించి, వరదరాజస్వామిని సేవించి దివ్యగానామృతమున నభిషేకించి వెంకటరమణు దర్శింప దిరుమలకేగె. అప్పుడు స్వామి తెఱచాటైయున్నాడు "తెఱ

దీయగరాదా, తిరుపతి వెంకటరమణ'' అని తన దివ్యగాన
ముతో జాలిగొనవేడినాడు. వెంటనే ఆ తెర తెగిపడినది,
స్వామిదర్శనమైనది. దీన త్యాగరాజుని మహిమలోకమున వెల్లడి
యైనది. బాల్యసఖుడగు సుందరేశ్వరుని కోర్కెపై నాతని
యింట గొన్నిదినములుండి సెలవుగొని సుందరేశ్వరు డొసం
గిన బల్యంకికనెక్కి బయనించుచుండ, మార్గమధ్యమున గల
యడవిలో దొంగలు రాలురువ్వ మొదలుపెట్టిరి గాని వారు
రువ్విన రాళ్లు తిరిగి వచ్చి వారినే బాధింపసాగినవి. ఇద్దరు
వీరులు త్యాగరాజును రక్షించుచున్నట్లువారికి బొడగట్టెను.
దొంగలు మహాత్ముడని గ్రహించి శరణుజొచ్చిరి.

శ్రీవారి మహాత్మ్యములు పెక్కులుగలవు, పలువురు
చరిత్రకారులు గ్రంథస్థములు గావించియున్నారు. చర్విత
చర్వణభీతి నిందు జేర్పమానితిని, పాఠకులు క్షమింతురుగాక.

ఈ మహాత్ము డిరువదినాలుగువేలకృతులు ఆస్తిక
నైతిక సాంఘికములుగా రచించుటయేకాక, నౌకాచరిత్ర
ప్రహ్లాద భక్తవిజయము మొదలగు భక్తిరస ప్రధానములగు
నాటకములనుగూడ రచించి భాషాసేవ గావించినాడు.

శ్రీరామునివలన తనప్రాణప్రయాణ సమయమెఱిఁగి
తనసమాధి కావేరీతీరమున నెలకొల్పుడని శిష్యులకు జెప్పి,
క్రీ. 1847 సం॥ పరాభవ పుష్యబహుళపంచమి పుణ్యదినమున
మన త్యాగరాజస్వామి శ్రీరామునియం దైక్యమైనాడు.

# పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి

సాంఖ్యతారకామనస్కములని యోగములు మూడు విధములు. ఈ మూడు యోగములును ప్రత్యక్ష పరంపరా సాధనములుగూడ నగుచున్నవి. యోగత్రితయసిద్ధివలన, జ్ఞానేంద్రియః కర్మేంద్రియాంతరింద్రియ ప్రాణపంచకమాత్రా పంచక స్థూలసూక్ష్మకారణశరీర కామక్రోధాది దుర్గుణ విజయః మలవడి బ్రహ్మైక్యస్థితి లభించును.

ఇందు తారకయోగము జీవస్వరూపమును, సాంఖ్య యోగ మాత్మస్వరూపమును, అమనస్కయోగము బ్రహ్మైక్యస్థితిని గలిగించి సాధకుని ధన్యునిగాచేయును.

పూర్వభవమునందు సాధకునకు యోగభ్రష్టత గలిగిన గారవడిన యోగమును పూర్తిగావించుకొని ఉత్తరజన్మలో గమ్యము నందగలుగుచున్నాడు. ఇతడు జన్మతోనే జ్ఞాన పూర్ణుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిసంపన్నుడు. వీనికి సర్వవిద్యలు తమంత దామై వరించును. అవతారపురుషుడన నిట్టివాడే. ఇట్టి పుణ్యులలో బోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవా రొకరు.

తండ్రి నందికొండపాపఘ్ని మఠాధ్యక్షుడైన వీరభోజ యాచార్యులు. తల్లి వీరపాపమాంబ. జననము 17వ శతాబ్దము. తల్లి దండ్రులు భారతదేశమునంగల తీర్థయాత్రల జేయుచు, మహాత్ముడగు అత్రిమహాముని యాశ్రమమున కేగి, ఆతని సన్నానమందు విశ్రమించి యున్నతరి, మునివరుడొక

బాలుని గొనివచ్చి వీరభోజునకిడి వీని యారసునిగా గ్రహించి పోషింపుమని సెలవొసంగిన, వల్లైయని పుత్రుని స్వీకరించి నందికొండ కేగి అతిగారాబమున ప్రేమించి పోషించుచుండిరి పిదప పరిపూర్ణాచార్య ప్రకృతాంబ లీపిల్లవాని తలిదండ్రులనియు, వారు పరమపదించిరనియు గర్నాకర్ని వినినవారగుట, రెట్టించిన ప్రేమతో బెంచుచుండ. బుత్రుని పదియవవర్ష ప్రాయమున పెంపుడు తండ్రి గతించినాడు.

ఇప్పటికి బ్రహ్మంగారికి విద్యలుపూర్తియైనవి. తల్లి యనుజ్ఞవడసి తీర్థయాత్రలకు బయలుదేరి దివ్యక్షేత్రముల దిలకించుచు, గ్రమముగ జనగాంపల్లెఁజేరి గరిమరెడ్డి అచ్చమ్మ గారియింట గోపాలకుడైయుండి కాలజ్ఞానము వ్రాయమొదలిడెను. పశువుల గాయుకాలమున జరిగిన శ్రీవారి నిత్యకృత్యము ఉదయమున లేచి గోశాల శుభ్రముగావించి, రాగి సంకటిముద్ద మూటగట్టుకొని గోవుల వెంట బీటికిజని, అందొక గిరిగీసి ఆ గిరిలో నావులదోలి, తానొక పొదరింటజేరి కాలజ్ఞానము వ్రాయుచు. బొద్దుగ్రుంకినతోడనే తాను వ్రాసిన తాటియాకులను అచ్చమ్మగారి యింటి ప్రక్కగల పాడుపాతరలో వైచి మూయుచుండువాడు.

ఇతనిపాలనలో నున్న గోవులు క్షీరసమృద్ధి పశుసమృద్ధి గలవైనవి. ఒకనాడు కొందరు పథికులు దారినబోవుచు గాళ్లు కదలనీక నెమరులు వేయుచుండ జూచి, ఆశ్చర్యపడి వాటి నదలించిరిగాని కదలలేదు, మెదలలేదు. పాలకుడు లేమి విచారించి, ఆ ఆవుల బీటిమేతకు ద్రిప్పజూచిరి కాని ప్రయో

జనము లేకపోయినది కాగా, వారికి నేత్రావరోధముగూడ సంభవించిన భయపడి, తమతమప్రయత్నమును మాని, వచ్చినదోవబట్టిరి. వెంటనే నేత్రావరోధము దొలంగినది. వారువచ్చి అచ్చమ్మగారి కీవృత్తాంత మెఱింగించిన నామె గారనుదెంచి గోవుల నదలించిచూచి నిజమెఱింగి పొదలో గూరుచుండి యేమేమో వ్రాసికొనుచుండు బ్రహ్మంగారిని బహువిధముల బ్రస్తుతించి ప్రసన్నుని గావించుకొనినది.

బనగాంపల్లె నబాబు బ్రహ్మంగారి మహిమల గనుం గొనుటకై విందునకు బిలిచి మాంసాదుల వడ్డింపించిన నవి స్పర్శమాత్రమున ఫలపుష్పములైనవి. వానికి నబా బబ్బురపడి శ్రీవారి ననేకవిధముల స్తుతించి ప్రసన్నునిగావించుకొని ధన్యుడై నాడు. తదుపరి అచ్చమ్మగారికి జ్ఞానోపదేశము గావించి, సబహుమానముగా బయలుదేరి కందిమల్లాయపల్లె జేరి అక్కడి జనులకు దనమహిమలజూపి, గోవిందమ్మను వివాహమై నిజ భార్యతో మహాక్షేత్రముల దర్శించుచు, నక్కడక్కడ దత్త్వోప దేశములచే జనుల దృప్తిపరచుచు, గొంతకాలమున కింటికిజేరి పుత్రపుత్రికాసంతానమంది సుఖంబుండ, మునుమూరి పీరు సాహెబు కుమారుడగు సిద్దయ్య వచ్చి నమ్రుడై ప్రార్థించి శిష్యపద మర్థించి కృతకృత్యుడై నాడు.

శ్రీ స్వాములవారు సిద్దయ్యగారికి బ్రహ్మోపదేశము జేసి యాదరించుటయే కాక సాంఖ్యతారకామనస్కములను దృగాత్మ నిర్ణయమును హంసస్వరూప నిర్ణయమును, స్వర

శాస్త్రమును ఛాయాపురుషలక్షణమును బోధించి కృతార్థుని గావించినారు.

తదుపరి దక్షిణదేశ సంచారమున నొకచో కుష్ఠువ్యాధి గ్రస్తుడైన భర్త తొడపై నిడుకొని దుఃఖింపుచుండు బ్రాహ్మణ స్త్రీనిజూచి దుఃఖకారణమడిగి తెలిసికొని తీర్థప్రసాదములతో నారోగ్యవంతుని గావించినాడు.

ఒకప్పుడు సిద్ధయ్యగారికి షట్చక్రాధిపతులైన దేవతల స్థానముల నిరూపించి చెప్పుచుండ, చాటుననుండి విన్న కక్కయ్య అను మాలవాడు ప్రత్యక్షముగ జూడగోరి, భార్యా నిదురించుసమయమున నామె దేహము జీల్చె. స్వామివారు చెప్పిన స్థలములందు దదధిదేవతలు లేమి చింతించి, శ్రీవారి కడకరిగి తనఘోరకార్య మెఱింగించి దుఃఖించిన, కరుణామయుడైన బ్రహ్మంగారు వెంటనే ఆతని వెన్నంటి వచ్చి, శవముపై నిజకమండలోదకము బ్రోక్షించియు, హస్తస్పర్శ గావించియు నామెను నిదురనుండి లేపినట్లు బ్రతికింపజాలినాడు. ఆమెయు స్వామివారికి వందనశతము లర్పించి ధన్యమైనది.

పిదప నంద్యాల బ్రవేశించి దాహమిండనిన నాయూరి విశ్వబ్రహ్మణులు శ్రీవారి ప్రభావ మెఱుంగగోరి, కరగిన సీసరసముతో నిండిన మూసను పటుకారుతో బట్టితెచ్చి చేతి కిచ్చిరి. వెంటనే తప్తలోహమును ద్రావి దాహము తీరినదని చెప్పుచు, చిరునవ్వొలయించి తనయాత్మశక్తి రూపొందించిరి. మఱియొకప్పుడు పదమూడుబస్తాలబియ్యము వండించి ఆరగింపు

డన, మందహాసముజేయుచు ఈ స్వల్పకార్యమునకు నేనేల, మాసిద్ధ డాచరించి మీకు దృష్టిగల్గించునని జెప్పుచు సౌజ్ఞ జేసిన, గురుమూర్తియాజ్ఞ దలధరించి యొక్కమెతుకేనియు మిగులనీక నారగించి తేపిన సర్వశక్తిపూరితుడు సిద్ధయ్య.

మఱియొకప్పు డహోబిలమున కేగు మార్గమధ్యమున గల వటవృక్షవాసియగు బ్రహ్మరాక్షసిని నిర్జించి యాత్రికులకు మార్గావరోధమును దొలగించినాడు. బ్రహ్మంగారు మన కడప నబాబువండి వడ్డించిన మాంసాహారము నదృశ్యమగునట్లు సంకల్పించి కృతార్థుడైనాడు. కడపనుండి అల్లాపల్లె వీరభద్రుని సేవింపనేగుతరి యెదుర్కొనిన దొమ్మండుగురు దొంగల దేహాంగబంధ మేర్పడునట్లు శాపమొసంగి వారికి గర్వభంగము జేసినాడు.

శ్రీవారు కలియుగాది 4692 సంవత్సరమున సజీవ సమాధి నలంకరించిరి. వీరి మహోపదేశములు బ్రతిసాధుని నోట వినెడివారమే యగుట విస్తరింప బనిలేదని తలంచెద. వీరు వెల్లడించిన మహోపదేశములతో నిండిన తాళపత్రము లను దాచియుంచిన ప్రదేశమున గలచింతచెట్టిప్పటికిని కని పించుచున్నది. దేశవిప్లవసూచకముగా అందు బూసిన పూత యంతయు నొకేరోజు రాలిపోవునట.

# దూదేకుల సిద్ధయ్య

భగవంతుడు సర్వమయుడు, సర్వశక్తిపూర్ణుడు అగ్నిని. వేడి, వెలుతురు లెట్లు వీడిపోవో అట్లే భగవంతుని యాత్మ శక్తియు భగవంతునిదయయు వీడిపోవు. ఆభగవచ్ఛక్తి యొకప్పుడు బయటికి దోచుటయు, మఱియొకప్పుడు లోపకుండుటయు గూడ గలదు. ఈశక్తి భగవంతునిలో గుంభించినప్పుడతడు నిర్గుణుడు, బయటికి దోచునప్పుడు సగుణుడు. ఈశక్తియే భూతచలనమునకు గారణము. ఇది తేజోమయమైనది. ఇందుండి లేచినట్టియు, ప్రతిప్రాణిహృదయగతమైనట్టియు అణుస్వరూపమాత్రి తేజోబిందువే ఈశ్వరుడు

కనుపాపలమధ్య నివాసియైనట్టియు, పరమాణుస్వరూపమైనట్టియు తేజోబిందువు జీవుడు. జీవస్వరూపమైనదృక్కును, దృశ్యమగు ప్రపంచమును సాధకుడగు ద్రష్టయు నీమూటిని త్రిపుటి యనబడును. ఈ త్రిపుటిరహితమే ముక్తి. విడివడినపుడు సంసృతి. భౌతిక శరీరమందంతట వ్యాపించియున్న వ్యానవాయువునకు ద్రిగుణము లావరించి భగవచ్ఛక్తిని మఱుగు పరచుటచే నేర్పడిన వికారమే, నేననుస్పృహకు గారణము. ఇది నిజముగాదు. భౌతికదేహమునగల పరిచ్ఛిన్న వ్యాన వాయుగతమైన శుద్ధచైతన్యశక్తియే నేననుస్పృహకు గారణము.

ఈ గుట్టెఱింగినవాడే జ్ఞాని, ఇది తెలియనివాడజ్ఞాని. అజ్ఞాని శరీరమనస్సుల నేకముజేసి, నేను అనుచున్నాడు. జ్ఞానియో, మనోదేహములకు విలక్షణమై, ముఖ్యప్రాణవాయువున కంటి

యున్న శుద్ధచైతన్యశక్తిని పురస్కరించుకొని "నేను" అనుచున్నాడు. జీవశక్తి ఉన్నతములైన పర్వతాదులను, సూర్యచంద్రాదులను సైతము, లోబరచుకొనుచున్నది. ఈశ్వరశక్తి సృష్టిస్థితిసంహారముల కాకరము. మఱియు నవసరానుసరణి జాగ్రత్స్వప్నసుషుప్తులయందు గ్రమముగ నేత్రకంఠ హృదయములం దప్పుడప్పుడు దిగుచుండు స్వభావముగలది. జీవశక్తి, హృదయమందు స్థిరనివాసమేర్పరచుకొనినదియు ముఖ్యప్రాణాశ్రితమైనదియునైన తేజోబిందువే ఈశ్వర శక్తి. ఈరహస్య మనుభవపూర్వకముగా గుర్తించిన వాడే సర్వజ్ఞమూర్తి. సర్వశక్తిపూర్ణుడు. త్రి కాల వే ది. ఇట్టివాడే మన సిద్ధయ్య.

ఈతని నివాసము కడపజిల్లా ముడుమాల. తల్లి ఆదంబి, తండ్రి పీరుసాహేబు. సప్తమవర్ష ప్రాయమున బడిలో ప్రవేశించి పదునాల్గవ వత్సరప్రాయమునకు చదువు పూర్తి చేసి, శమదమాదిగుణములతో భక్తిప్రపత్తులుగల్గి విరాజిల్లుచు, బ్రహ్మవిద్యాసంపన్నుడగు దేశికాచార్య సేవాభాగ్యమలవరచుకొన వేచియుండుతరి, కర్ణాకర్ణిగా వినినవాడగుట, పితరుల కెఱింగింపకయే బయలుదేరి, కందిమల్లాయపల్లె వేంచేసియున్న శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారి కడకరిగి, సాష్టాంగవందనం బాచరించి, "సద్గురూ! సకలభువనాధారా! సచ్చిదానందస్వరూపా! వీడిని శిష్యునిగా గైకొను"డని ప్రార్థించి, నమ్రుడై నిలచిన, స్వామివా రాతని దీవించి, అంతేవాసిగా నంగీకరించె.

అంత బీరుసాహెబు పరబ్రహ్మేంద్రస్వామివారియొద్ద కందిమల్లాయపల్లెలో తన కుమారు డున్నాడని తెలిసి, జను డెంచి సిద్దయ్యనుగాంచి, "బిడ్డా! ఇంటికి రమ్ము పోదము, అన్నాడు." నేనురాను. ఇక్కడుండి ఏమిచేయుదువు? స్వామి వారి యొద్ద బ్రహ్మవిద్య నేర్చుకొనియెద? చదువంతియు వచ్చినదిగదా, ఇకబ్రహ్మవిద్య యననెట్టిది? అది వేదాతీత మైనది, త్రిమూర్తుల కందనిది. దివ్యజ్ఞానులసొమ్ము, అన్నాడు సిద్దయ్య. నీవు మహ్మదీయుడవుగదా! ఐననేమి? హిందూమతావ లంబనమేల కావలయు? మనవారు నిన్ను వెలివేయరా? వృద్ధు లగు తల్లిదండ్రుల సేవకంటె బ్రహ్మవిద్య గొప్పదియా? తల్లి దండ్రుల కష్టపెట్టువారికి ముక్తి యెక్కడిది? అను తండ్రిని దిల కించి ముందు బ్రహ్మవిద్య నార్జించి పిదప మిమ్ము సేవించి ధన్యుడ నయ్యెద. నా మనం బీపీరబ్రహ్మేంద్రున కర్పించితి. దిరుగనేరను. తల్లి, దండ్రి, గురువు దైవము, కులము, స్థలము వేయేల! సర్వము నాకు గురుమూర్తియే, అని ఖండితముగ. జెప్పి విరమించె.

పుత్రుని గాఢవిశ్వాసమున కుబ్బుచు, బీరుసాహెబు తిరిగి యింటికేగి నిర్విచారుడై యుండె. ఇట్లు గురుసేవమరిగి తిరుగుచు గ్రమముగ సాంఖ్యతారకామనస్కములను లక్ష్య త్రయమును, దృగాత్మ నిర్ణయమును, హంస సంచారక్రమ మును ఎఱింగి ఆత్మశక్తి పూరితుండై అజ్ఞులకు దేరిచూడ రాకుండె.

తండ్రి పీరుసాహెబు మతాభిమానులు దుర్బోధకు లొంగి వీరబ్రహ్మేంద్రస్వామినుండి తన కుమారుని విప్పింప వలసినదిగా కడప నబాబు యొద్ద పిర్యాదుజేయ నాతండు తన ముందు హాజరుగావలసినదిగా బ్రహ్మంగారికి తాకీదు పంపినాడు. దాని నెఱింగి సిద్దయ్య తండ్రియవ్యక్తమునకు కటకటపడి దేశికాచార్యానుమతి రాజసేవకుని వెన్నంటి బయనముసాగించి నబాబుముందు హాజరైనాడు. నీ పేరేమి? సిద్దడు కులమేది? దూదేకులము; మతభ్రష్టుడవైతివా? లేదు, హిందూ మత మవలంబించినావటగా, లోకమున మతము లనేకములు గాని దేవు డొక్కడేగాదా, ఏమార్గమున నడచినను గమ్యము దొరకును. తగిన గురుని దొరకమి వీరబ్రహ్మముగారి నాశ్రియించినాడ; నిదితప్పగునా? నీకు జేతులుఅయినా గలవా? ఉన్నవి. ఉండిన నాకు సలాముజేయ వేల? నా సలాము నా గురుతప్ప మఱియొకడు భరింప లేడు. గాన జేయ లేదు, నీ గురువంత గొప్పవాడా! అవును నేజేయెత్తిన నీకు బ్రిమాదమువచ్చునేమో, అనుభయము నన్ను బాధించినది. బరీక్షింప నెంచిన నల్లరాతిగుండు దెప్పింపుము. అది యేమగునో చూడగలవు. అను సిద్దయ్యమాటవిని నబా బురియాడు చిత్తముతో రుబ్బుడు పాత్రిమును తెప్పించి ముందుంచిన, సిద్దప్ప, గురుప్రభువును దలంచుచు జేకొట్టి ఆ నల్లరాతికి సలాము గావించిన నది పెటపెట ధ్వనులతో ముక్కలక్రింద తయారయినది. నవాబు చూచినాడు, వడకిపోయినాడు. లేచి సిద్దయ్యకు వేలకొలంది

వందనములు గావించి భక్తిప్రపత్తు లుల్లసిల్ల బూజించి సబహు మానముగా వీడ్కొల్పినాడు.

గురుమూర్తిని దర్శించి సర్వ మెఱింగించి కృతార్థు డైనాడు సిద్ధయ్య. ఒకప్పుడు పంచానన తెగకు జెందిన వారు కొందఱు నంద్యాలనుండి బయలుదేరి వచ్చి బ్రహ్మము గారిని దర్శించి. బిక్ష కాహ్వానించిన వల్లెయని శ్రీవారు సిద్ధయ్యతో బయనించి నంద్యాల జేరినారు. వంటలు సిద్ధమైనవి. యజమానిని బిలిచి, "మారువడ్డించుకొనని" నియమముగలదు. దానిని మీరు పాటింపనిచో బ్రమాద పడియెదరు. గాన జాగ్రత గొనుడని ఖండితముగ జెప్పి, భోజనమునకు గురుశిష్యు లిరువురు గూరుచున్నారు. మారువడ్డించిన నేమగునో చూచెదనని యెంచి, యజమాని వంటవారికి బోధింప వారును విస్తరులయందు భోజనసదార్థముల ముందు కొద్దికొద్దిగా వడ్డించిరి గురుశిష్యు లిరువు రది భుజించి లేవ నుద్యుక్తులగుడు వంటవాడు శ్రీ వారి కెఱింగింపక నే పదార్థముల మారు వడ్డించిరి. అది చూచి గురుశిష్యు లిరువురు శంభునామస్మరణజేయుచు మాఱుపల్కక భుజించుచుండిరి. నాడు జరుగనున్న భూరి సమారాధనమునకు తయారు చేయబడిన పదార్థమంతయు వీరిద్దరికే చాలలేదు. యజమాని భయవినయములు ముప్పిరిగొన నేతెంచి శ్రీ స్వామివారిని ప్రార్థించి ప్రసన్నుని గావించుకొనినాడు.

ఆత్మబలము గలవారి కసాధ్య మెందును లేదు గదా!

1725 సం॥ నం దొకనాడు పూల నెపంబిడి సిద్ధయ్య నావల

కంపి, శ్రీబ్రహ్మంగారు జీవసమాధిని బ్రవేసించినాడు. పూర్వు లకై వెళ్ళిన సిద్దయ్య బనగానపల్లె పూలతోటలో నుండుతరి, నొక వృద్ధబ్రాహ్మణు డేతెంచి "మీ గురువుగారు సమాధిని బ్రవేశింపనున్నారు. ఆలశించిన దర్శింపలేవు, వెంటనే బయలు దేరు"మని తొందరపెట్టిన మారుమాటాడక కందిమల్లాయపల్లె జేరి స్వామివారు సమాధినలంకరించినారని విని, దుఃఖాతి రేకంబున దేహస్మృతిలేక పడియున్న శిష్యునకు నిజదర్శనం బిచ్చుటయే కాక, విశ్వరూపసందర్శనముగూడ జేయు కుటుంబివి గమ్మని యాశీర్వదించి యంతర్ధానమయినాడు గురువుగారు. అంత సిద్దయ్య గురుమూర్తి యాజ్ఞానుసారము వివాహమై పలువురుశిష్యుల సేకరించి, సద్గురునామస్మరణ ముతో జీవితశేషమును ముగించి 1736 సంవత్సరమున శాశ్వతబ్రహ్మపదవి నలంకరించినారు.



# వెంకట్రమణ బ్రహ్మచారి

"అనన్యా శ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం ॥

భగవానుడు పరమదయాకరమూర్తి. ఆర్తరక్షణ వ్యాపార పారీణుడు. ఏదీనులు రక్షణగోరి యన్యచింతా విముఖులై తన్ను జీరెదరో, కష్టమనియెంచక యెంత దూరమైనను స్వయముగ జని మనోరథముల దీర్చుచు వారి జీవితమంతయు దన తలపై ధరించి నిత్యానందమున దేల్చుచుండువాడు. ప్రహ్లాదాది భక్తులంద ఱీకోటిలో జేరినవారే. అందు నుంచియే అన్ని చింతలుమాని యెవరు నన్నుపాసించుచున్నారో వారి యోగక్షేమమును సర్వమును నేను వహించుచున్నానని శ్రీకృష్ణభగవానులు జెప్పుచున్నారు. పినతల్లి వాగిషుక్షత మానసుండై స్థానాభిలాషియై తపమాచరించిన ధృవమహర్షికి యచిరకాలమున భగవానుడు దర్శనమిచ్చి కోరిన యిహకోరికయు గోరని పరకోరికయుగూడ నిచ్చియున్నాడు. అనగ భగవానుడు కల్పవృక్షము వంటివాడనుట. కల్పవృక్షము క్రిందకూర్చుని మానవుడు సమస్తకోరికలను పొందుచున్నాడు గదా ! అట్లే భగవంతుడను కల్పవృక్షము క్రింద నేనున్నానని నమ్మి యేయేకోరికలు కోరుచున్నారో ఆయాకోరికలు సమకూడును. భగవంతుడు భావప్రియుడు. యేరూపమున దలచువారికి నారూపమున దర్శనమిచ్చును. గనుకనే పరిపూర్ణ ప్రేమయు భక్తిరసపూరితమగు హృదయ

మును గలిగి భగవానుని నే భావమున నెట్లు ప్రార్థించినను అజ్ఞానాంధగారము నశించును. జ్ఞానజ్యోతి పొడకట్టును. ఆయన సాన్నిధ్యము దొఱుకును. కావున నజ్ఞానాంధకారమును నశింప జేసికొని జ్ఞానప్రకాశమును బొందుటకు ప్రయత్నించుట మన కర్తవ్యము అని యొకబంగాళీ భక్తుడు పాడియున్నాడు. భగవంతుడని రోకలిని నమ్మి భవనదిని దాటవచ్చును. ఇట్టి మహాపురుషులలో మన వెంకటరమణ దాసుగా రొకరై యున్నారు. వీరి నివాసస్థలము గుంటూరు మండలమునం దలరారు అలవలపాడు, ఆఱువేల నియోగి; తండ్రి సుబ్బరామయ్య. పొట్టిగను సన్నగనుయుండి దినమంతయు ధావళి గోచితో నే తిరుగుచుండువాడు. నేను చూచునప్పటికి నడుమువంగిపోయి యున్నది. అట్లే గోదావరినుండి మోసికొనివచ్చి తనసత్రమునకు నీరు సప్లై చేయుచుండువాడు. ఆరంభమునుండి కొంతకాలమువఱకు సత్రమునకు యజమానియు, వంటవాడును, నీళ్ళవాడును, పూజారియు, సేవకుడునుగూడ తానేయై యుండువాడు. ఈతనికి పదియైదవ వత్సరప్రాయమున తండ్రి సుబ్బరామయ్య మాతృహీనుడైన పుత్రుని దోకొని, సీతాకళ్యాణ మహోత్సవ దిదృక్షాపేక్ష పురికొల్ప భద్రాద్రికేగి, సీతారాముల దర్శించి కళ్యాణ మహోత్సవం బారసి, భగవానుని నిత్యసేవా మహాభాగ్యము గడింపగాబోలు నేతత్క్షేత్రంబున నే జీవిత శేషము ముగింప దలంపు గలవాడై, పుత్రునితో నంద నివసించి భిక్షాపాత్ర నాశ్రయించి, అభ్యాగతాతిథి పూజా సంపదోద్రిక్తుండై జీవితము సాగింపుచుండి

యచిరకాలముననే దేహము చాలించె. పితృ మరణానంత రము సన్నపూర్ణోపాసకులగు బ్రహ్మచారిగారు, పిత్రాచార మును వీడక భిక్షనెక్కుడుగ సంపాదించి యాత్రికుల నెల్లర నాహ్వానించి యన్నాదికముల సత్కరించుచు, శునక శూక రాది భూతలోకమునుగూడ తృప్తి నందించుచుండువాడు. తన యిరువదియవ వత్సరప్రాయమునం దన్నపూర్ణా సత్రమను పేరుతో నొక చిన్నకుటీరమును, యాత్రికులు నివసించుటకొక పూరిపాకాయును, దేవమందిరమున కొక గుడిసెయు గల్పించి పనిసాగించుచుండిన, భగవదనుగ్రహము పేర్మి యీ కుటీర ములే పెద్దసత్రముగ మారినవి. వంటపాత్రలు విస్తారముగ సమకూర్పబడినవి. నిత్యాన్నదాన మవారిగా జరుగుచున్నది. బ్రహ్మచారిగారా నిర్ధనులు. క్షేత్రమునువీడి గూవలకు పోవు వారుగారు. తత్క్షేత్రమా మహాదారణ్య ప్రావృతమై యున్న యది. గ్రామమునందు వసియించు గృహస్థులా శ్రీమంతులు గారు. ఇట్టి స్థితిలో సత్రమెట్లు సాగుచున్నదియో, దివ్యమంది రములు మంటపములు ప్రహారిలు ఎట్లు తయారయినవియో తెలిసికొన నేరికిని తరముగాకున్నయది. నిరతాన్న దాన తత్పరుండగు శ్రీమార్కతూము లక్ష్మీనరసింహదాసుగారి వందనార్చనాది సత్కారములంది సంతసించునట్టి యర్చా మూర్తులిప్పుడు బ్రహ్మచారిగారి పూజాది సత్కారములంది సంతసించుచున్నారు గాన నీమూర్తుల గరుణారసదృష్టి ప్రసార మానసత్రముపై సోకి యిట్టి మహోన్నస్థితికి దెచ్చినదనుటలో సందియములేదు.

చూడు డొకప్పుడు సీతాకళ్యాణ మహోత్సవము దిల కించుటకు వేలకొలది యాత్రికు లరుదెంచి భోజనమునకై అన్నపూర్ణాసత్రమునకు స్నానము జేసి వచ్చియుండిరి ఆనాడు సత్రములో భోజనపదార్థములు స్వల్పముగ నుండుటచే యుండినంతవఱకు బచనము జేసి యుంచబడియె. తయారయిన పదార్థములు వచ్చిన యాత్రికులకు జాలవని భయముజెంది వంటలవారు భగవదారాధనము జేయుచున్న బ్రహ్మాచారి గారికి విన్నవించిరి బ్రహ్మాచారిగారు నవ్వుచు పాకశాల కేతెంచి, శ్రీరామానుగ్రహ ముండిన మనకు తరుగు లేదు, వడ్డనపని సాగింపుడని హెచ్చరించుచు, నా పదార్థములపై నొకవస్త్రముగప్పి చేతులు జోడించి. మనము నందీశ్వర సాన్ని ధ్యము గలుగఁజేసికొని యిట్లని వినుతించె.

"ఎవ డీవిశ్వమునకు గారణత్రయ రూపుడై సంకల్ప మాత్రముచే సృష్టి స్థితి సంహారములు జేయుచు జన్మరహి తుడై యుండియు భక్తులకొఱకు నామరూపములు ధరించి యున్నాడో, ఎవనిస్వరూపమును దేవాదులు దర్శింపనేరక సర్వారూపోపాసనము జేయుచున్నారో, ఎవడు ప్రపంచమునకు జనకుడై, పాలకుడై, శేషియై, నాథుడై, జ్ఞేయుడై, స్వామియై, ఆధారుడై, యంతర్యామియై, భోక్తయై, కారణ కార్యరూపియై, విశ్వవిలక్షణుడై, బంధుడై, ఆశ్రితరక్షణైక దీక్షాధురంధరుడై భక్తవత్సలుండై భక్తాభీష్ట ఫలప్రదాతయై యున్నాడో, ఏని యధిష్టానము లేనిచో జేతనము లచేతనములై యుండునో, శ్రీ రామ లక్ష్మీనరసింహాదా సార్చన వందనాదు లెవడు

గ్రహించి సంతసించుచు, పూర్వసుకృతము పేర్మి యిప్పుడు మత్పూజలనందుచు నాకాత్మస్వరూపుడై యున్నాడో, అట్టి శ్రీరామమూర్తి యీయన్నాదికములచే భూతతృప్తి గావించునటు లనుగ్రహించుగాక!" యని భగవన్నుతి గావించి యాత్రికుల నుపలక్షించి,

ఉ॥ తక్కువ లేదు నాకు నిరతంబు సుదర్శన చక్రధారియై
ప్రక్కలనిల్చి లోపముల బారగద్రోలుచు సౌఖ్యసంతతుల్
మిక్కిలికూర్చి మించుదయ మేలులొనర్చెడి రాముడుండ
నా కెక్కడి లేము లెక్కడివి యిష్టఫలవ్యతిరేకసంగతుల్ ॥

అని చెప్పుచు దిరిగి వచ్చినకాజ్ఞయిడి భగవదర్చనము పూర్తిజేసి మంత్రపుష్పమిచ్చుటకు దేవమందిరమున కరిగె. ఈమహనీయుని పూజకు కాలనియమము లేదు పుష్పము లవసరములేదు. ఫలాదికముల ప్రసక్తి ప్రయోజనకారి గాదు. నోట సహస్రనామము లుచ్చరించుచు నామమున కొక నమస్కారము భగవానున కర్పించు చుండుటయే ఈపూజ కంతము లేదు. రోజునకిరువది సహస్రములు జరుగుననుట యతిశయోక్తి కాజాలదు. ఇది యింతటనిలిపి ప్రస్తుత మనుసరించెద.

అంత యాత్రికులు సూపకారులిడిన యన్నాదికముల బరితృప్తినంది బ్రహ్మచారి ప్రభావమున కభినందించుచు మహోత్సవ దిదృక్షాపేక్ష ముందునకుద్రోయ శ్రీరామాలయమున కేగి, పదంపడి తదుత్సవపరిసమాప్తివఱకు యాత్రికులు బ్రహ్మచారిగారి సత్కారముల బరితృప్తిగాంచి స్వగ్రామముల కేగిరి.

మఱియొకప్పు డనగ నుత్సవదివసములలో నొకనాడు పగలు రెండుజాములవఱకు భోజనపదార్థములంట లేకుండుటయు. గష్టమునకు సహింపలేక వంటవారలు పారిపోవుటయు. యాత్రికులు విస్తారముగ వచ్చియుండుటయు విచారించుచు, శ్రీరామ పాదాబ్జములపై బడి దీనాననుడై బ్రహ్మచారి "దుఃఖింపుచు, రామా! మేఘశ్యామా! త్రిలోకాభిరామా! ఈ తెప్పరంబెల్లు దీర్చెదవో భారమునీయదియ. నీదివ్య గుణ కీర్తనముగావించు భారముమాత్రము నాయదియ. నే నసమర్థుడననుట దెలిసియు నుపేక్షవహించిన నీయపకీర్తి ఎవరిదనుకొంటివి? కానిమ్ము, నాపని నేను జేసెద. తర్వాత నీయిష్టము. "ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదాం లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహం" "రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే। రఘునాథాయ నాథాయ సీతాయాః పతయేనమః," "నమః కోదండ హస్తాయ సంధీకృత శరాయచ।దండితాఖిల దైత్యాయ రామాయాపన్నివారణే," "ఆర్తానా మార్తిహంతారం భీతానాం భయనాశనం ద్విషతాం కాలదండం శ్రీరామచంద్రం నమామ్యహం,"అని కన్నులుమూసి వినుతించు చున్నంత.

సీ॥ తిరుశేఖ లేర్పడ తిరునామములు బెట్టి
ధౌతవస్త్రంబులు దనరగట్టి
తులసిపేరులుమెడ దులకరింపగ దాల్చి
నెమ్మేనగంధంబు నెఱిదగిల్చి

వెడ నుత్తరీయముల్ నడుములకు జుట్టి
పుండ్రదండలు శిఖ వ్రేలగట్టి
కుడిచేత జపమాల కొమరొప్ప గాబూని
యెడమచే బల్లెము లెనగనంది

గీ॥ కక్షభాగంబులం బుస్తకముల బూని
నలుపు నెఱుపును గలమేను లలరుచుండ
బొడుగుగల వైశ్యులిరువురు వడిగవడిగ
వచ్చి రాభూసురోత్తమ వసతికడకు ॥

(భద్రాద్రి రామచరిత్ర)

ఇట్లువచ్చి బ్రహ్మచారిం గాంచి నమస్కరించి అయ్యా! మున్నొకపరి విపత్సమయమున మేము మ్రొక్కు కొనిన మ్రొక్కుబడి చెల్లించుటకుగాను శ్రీసీతారామునకు రూప్య శతద్వయంబు బట్టుకొని వచ్చితిమి. కైకొని శ్రీస్వామి వారి కర్పింపుడని చెప్పుచు, రూప్యములచే నింపబడిన పల్లెర మొకదానిని ముందుబెట్టి రెండునారి కేళములను కర్పూరమును తాంబూలముతో సమర్పించిన, బ్రహ్మచారి సంతసించి శ్రీస్వామి వారికి కర్పూర హారతియిడి నారికేళముల నైవేద్య మిడి కట్నము చదివించి ప్రసాద మాభక్తులకిచ్చి, ''అయ్యలారా! నేడు భగవత్ప్రసాదము గైకొనుట కిటకు భోజనము నకు రండు. మఱియు మీ దేయూరు?ఏకులమువారు?వివరింపు డనిన నందు బెద్దవాడిట్లనియె. "మేము పాశ్చాద్దేశ వైశ్యులము. సీతాకళ్యాణ మహోత్సవము దిలకించుటకును, మ్రొక్కుబడి చెల్లించుకొనుటకును, కుటుంబయుక్తముగవచ్చి గౌతమితటం

బునం దమర్చబడిన కుటీరములలో నొంట నివసించియున్నా రము. మాకొఱకు కుటుంబములు వేచియుండును. సెలవొసంగిన వెళ్లివచ్చెదము. శ్రీవారి యాజ్ఞానుసార మనువర్తించెదము" అని చెప్పి సెలవంది యెందేనియుం జనిరి. అనంతర మా ధన మును వెచ్చించి భోజనపదార్థములను దెప్పించి వంటవాను లేమి తానే యాపనిని చేయ నిశ్చయించి కృతప్రయత్నుండై యుండ,

సీ॥ గౌతమీస్నానంబు గావించుటం దడి
సిన పిల్లజుట్లను జివురగట్టి
మూడు రేఖలు దేర మొగమున గళమున
బాహూదరాదుల భస్మమలది
నీర్కావిరంగున నెఱిలేని తడిపొడి
యంగవస్త్రమ్ముల నడిమికట్టి
చివరలారిన చిన్ని చేలముల్ పైగప్పి
పిడుపలు భుజములం దడరబూని
గీ॥ హస్తమున నుదపాత్రము లతిశయింప
యాజుహోమపనిమత్తుల నధికభక్తి
చదువుకొనుచును భోజన సత్రమెందు
గలదనుచు వచ్చి రిర్వురా ఘనునికడకు ॥
(భద్రాద్రి రామచరిత్ర)

ఇట్లు వచ్చి బ్రహ్మచారిం గాంచి నమస్కరించి, "బీద బాపలము. జీవనోపాధి కనువుగానమిం నెందేనియు, న్వంట జేసియైనను కుటుంబపోషణము జేసికొనదలంపుగలవారమై

బయలుదేరి పలుతావుల దిరిగితిరిగి,విసివి యిట కరుదెంచితిమి. మీసత్రంబున సూపకారత్వంబునకు మమ్ము నియమింపుడు. నేడు మాపసితనమునుజూచి సంతసించిన చిత్తానుసారము వర్తింపగలము. మఱచితిమి. మాకేరోజిష్టము లేనియెడల నాజ్ఞనెళ్ళెదము.'' అని చెప్పుచు, దాసుగారి చేతనున్న జల పాత్రము నొకరును, మఱియొకపాత్రమింకొకరును గైకొని గౌతమి కేగిరి. బ్రహ్మచారిగారు నాఁడు తనకు లభించిన పదార్థము లకును మనుష్యసహాయమునకును ఉబ్బుచు, నిదియంతయు భగవదనుగ్రహమనితలంచి, దేవమందిరమున కేగి "రంగా! నీచిత్ర చరిత్రల నెవరు గనిపెట్టగలరు ఆర్తత్రాణ పారీణుడవనుట కీదివసమున జూపిన యద్భుతచరిత్రము చాలదా! తండ్రీ" యని వినుతించుచు, శ్రీస్వామివారిని షోడశోపచార విధుల నర్చించి, పదంపడి సహస్రనామార్చనము గావించి మహానివేదనమున కెదురుచూచుచుండె.నింతలో గోదావరినుండి నీరువచ్చుటయు, సహస్రాధిక బ్రాహ్మణ బృందమునకు సరి పడు భోజనపదార్థములు సిద్ధపడుటయు వడ్డనలు పూర్తియగు టయుగూడ జరిగినది స్వామివారియెదుట నైవేద్యముంచిరి బ్రహ్మచారిగారు "రంగా! నైవేద్యమారగింపరా తండ్రీ!''యని కేకవేసినంత, మామూలు ప్రకార మెక్కడనుండియో సర్ప రాజంబే తెంచి నైవేద్య మాఘ్రాణించె. నంతబోక బ్రహ్మ చారిగారి తొడపైజేరి యాడుచు తన సంతోషమును వెలి బుచ్చుచుండె. నిట్లుండ బ్రాహ్మణభోజనములు పూర్తియైనవి. వంటబ్రాహ్మణు లిరువురును వచ్చి గౌతమికి వెళ్లివచ్చెదమని

చెప్పి వెళ్లిరి. సర్ప మంతర్ధానమయ్యె. న ప్పుడు బ్రహ్మచారి బ్రహ్మానంద పారావారమున దేలియాడుచు లేచి, గౌతమి కేగిన విప్రులురామి విచారించి. వారికొఱకు సమస్త ప్రదేశ శములను వెదకించి ప్రయోజనముగానక ఇది భగవల్లీలయని నిశ్చయించుకొని "దేవాదిదేవా మహానుభావా, "హరిర్హరతి పాపానిదుష్టచిత్తైరపి స్మృతః। అనిశ్చయాపిసంస్పృష్టో దహ్యాతేవ హీ పావకః" తెలిసికొనక నిప్పుదాకిన కాలురీతి, ఎవరి దలంచిన మాత్ర పాపములు దహింపబడుచున్నవో, అట్టి నీకు నమస్కరించుచున్నాడ. మానవు డెవనియందు మనసునిల్పిన మాత్ర నరక మనుభవింపడో, ఎవని నామకీర్తనమున స్వర్గము విఘ్నకారి యైనదో, ఎవనియం దుంచబడిన మనస్సుగలవానికి బ్రహ్మలోక మల్ప మైనదియో, ఎవనిస్మరించుట బ్రహ్మ హత్యాది సమస్తపాపములు నాశనమగునో, ఎవనినామ సంకీర్తనము సంసృతిబంధమును సడలింపగలదియో, సంసార సర్ప దష్టున కెవనినామం బౌషధప్రాయంబో, ఎవడు సకల శుభ నాసమగువాడో, నరకదుఃఖము గలుగజేయునట్టిదియు, మిగుల భయంకరమగునదియు నగు కలికల్మష మెవనినామస్మరణ వలన నిర్మూలింప బడుచున్నదియో, ఎవనినామ మొక్క క్షణకాలము జరుగనియెడల సద్భక్తుడు తనధనమును దొంగల పహరించినట్లు చింతించుచున్నాడో అట్టి నీపాదముల కభివాద నములు. రామా! మేఘశ్యామ భక్తమనోభిరామా

ఉ॥ అన్యమెఱుంగ కెల్లప్పుడు
నాత్మ భజించుచునున్న నన్ను సా

మాన్యు ననుగ్రహించి యిటు
మానవ రూపముతోడఁజొచ్చి సౌ
జన్యముజూపి పోయితివి
సారసలోచన నేను ధన్యుఁడన్
ధన్యము నాకులంబు జన
నంబును సార్థకమయ్యె నేటికిన్ ॥

చ॥ ఎఱుఁగుదు సర్పరూపమున
నెప్పుడు దర్శనమిచ్చుచుంట నే
నెఱుఁగుదు వైశ్యరూపమున
నింతకుమున్ ధనమిచ్చిపోక లో
నెఱుఁగుదు బ్రహ్మరూపమున
నిప్పుడు పాచకుఁడైనజాడ యి
ట్లెఱిఁగి యెఱుంగనట్టిఁడగు
నీజడు బ్రోవఁగ రమ్ము రాఘవా ॥

ఉ॥ చిన్నటినాటనుండి నిను
జిత్తమున న్భజియించువాఁడ నే
నెన్నఁడు వన్నెలాడి మొగ
మెత్తి కనుంగొనకున్న వాఁడనే
నన్నది కాదటంచనని
యట్టిఁడనేని దృఢవ్రతంబునం
దున్న జనుండనేని నను
నుత్తమ లోకము బొందఁజేయవే ॥

(భద్రాద్రి రామచరిత్ర)

అని ప్రార్థించి, నాడు భుజింపక రామ మంత్రంబు జపించుచు జాగరణంబు జేసె. మరునాడుదయంబున బురజను లెల్ల రీవార్త విని సంతసించుచు జనుదెంచి, బ్రహ్మచారింగాంచి నమస్కరించి, "దేవా! నిర్జరాదుల కేని దర్శనం బొసంగని శ్రీరామచంద్రుడు నిన్న నీకనురక్తుడై దర్శనం బొసంగుటయె గాక దాస్యంబునుగూడ జేసిపోయెనని వింటిమి. నీభాగ్యమే భాగ్యము. అని పెక్కువిధముల వినుతించిరి.

మఱియొకనాటి బ్రాహ్మణ సమారాధనంబునం దాజ్యము లేకుండుటయు, నభ్యాగవతులు భోజనమునకు గూరుచుండుటయు,దల్లోపనివారణంబు గావించువారు లేమియు జింతించి పాచకుల నిద్దరజీరి, "నాయనలారా, మనయింటగల రిక్తయాజ్యపాత్రముల గొనిపోయి శ్రీరంగనియాజ్ఞయయి నది గాన, నీరెండు పాత్రముల యాజ్య మప్పుగా గొనిపోయెద మని చెప్పుచు గోదావరినీటిచే బాత్రల నింపుకొని రం"డని బనిచిన వారలట్లు గావించి, పూర్ణపాత్ర లింటికిజేర్చి చూచుసరికి జలమంతయు నెయ్యిగా మారినది.అభ్యాగతాతిథివర్గమంతయు బ్రహ్మనంద సాగరమున నోలలాడుచున్నది. నాటిసమారాధన మెట్టిలోపంబును లేకయ నెరవేరినది. మరునాడు భక్తు లర్పించిన ద్రవ్యంబుచే నాజ్యంబార్జించి గౌతమీదేవి బుణము దీర్చి కృతార్థుడై చెలంగినాడు.

ఈ సత్రమందును తదితర స్థలములయందును ఒక పిచ్చివాడు తిరుగుచుండువాడు. అతని పేరుగాని యూరు గాని యెవరికిని తెలియుటలేదు సన్నగను పొడవుగను చామన

చాయగనుండి యొక చింపిరిగుడ్డలమూటయు. చిల్లపెంకుల హారములును ధరించియుండువాడు. బ్రహ్మచారిమాత్రి మా పిచ్చివానిని మిగుల బ్రేమించును. ఈతి డెవడని బ్రశ్నించిన నాగునువని చెప్పుచుండువాడు. ఆ పిచ్చివానిని నీ వెవరవని యడిగిన బ్రహ్మచారిగారి శిష్యుడనని జెప్పెడివాడు. యిందు నిజమెంతయో మనకు దెలియదుగాని బ్రహ్మచారిగా రావ్యక్తికి భోజనమిడిగాని తాను భుజింపరు. అతడు భుజించు నప్పుడు రెండుకుక్కలు తోడభుజించుచుండునవి. ఇట్లు బ్రహ్మచారిగారమానుషక్రియల గావించి నలుబది వత్సరము లన్నదానము సాగించి, తనభారమంతయు తుంగదుర్తి నరసింహారావు (వకీలు) గారిపైనుంచి క్రీ॥ శ॥ 1919 వత్సర మున నిత్యవిభూతినందిరి.



# రంగారాయుడు

క్రీ॥ శ॥ 18 శతాబ్దమున నెల్లూరు మండలమునంగల వెలుదుంట్ల గ్రామంబున బ్రాహ్మణ వంశమందు రంగారాయుడను దివ్యపురుషుం డుద్భవించి క్రమముగ బాల్య కౌమారంబు గడచి సర్వవిద్యా సంపన్నుండై, భద్రాచలము తాలూకా తహాశీలుదారుగా ప్రభుత్వమువారిచే నియమింపబడి, శ్రీరామ సేవా మహాభాగ్యం బయాచితముగ నలవడినందులకు మిగుల సంతసించుచు జనుదెంచి, గౌతమి నుత్తరించి, స్నానసంధ్యానుష్ఠానముల బవిత్రుండై శ్రీరామసన్నిధిం బ్రవేశించి, యాదివ్యసుందరమూర్తి యఖర్వాపరూపమును దిలకించి,

సీ॥ శ్రీవిదేహాత్మజ చెంగట నివసించి
తప్పక సేవల దన్పుచుండ
సౌమిత్రి భయభక్తి సంపదోద్రిక్తుడై
తెలయుచు భవదాజ్ఞ వేచియుండ
భరతశత్రుఘ్నులు పార్శ్వంబుల న్నిల్చి
వింజామరల బూని విసరుచుండ
అంజనీసుతుడు పాదాబ్జంబు లొత్తుచు
స్థిరభక్తి పేర్మి మైమరచియుండ
గీ॥ నిండు పేరోలగమ్మున గూర్చుండి తౌర
వరద! భద్రాద్రిపురవాస! వసుమతీసు
తామనోహర! బ్రహ్మవిద్యానిరూప్య!
రామ! పావనసుత్రామ! రమ్యధామ!

దేవా! "ధ్యాయన్కృతే యజన్యజ్ఞైః త్రేతాయాం ద్వాపరేర్చయన్। యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్" అనునట్లు కృతయుగమునందు నీధ్యానమువలనను, త్రేతాయుగమునందు యజ్ఞముల వలనను. ద్వాపరయుగమునందు పూజించుటవలనను ఎట్టిఫలముగలుగునో, అట్టిఫలము కలియుగమునందునీనామస్తోత్రముచేయుటవలనగలుగుచున్నయది. పరాత్పరా! ఏ తేజస్సుచేత సూర్యుడు వెలుంగుచున్నాడో, ఏ తేజస్సు సకల తేజస్సులకు ప్రకాశము గలుగజేయుచున్నదో, ఏ తేజస్సు చైతన్య లక్షణమైనదో, ఏ తేజస్సు విస్తారమైనదై సర్వోత్తమమైనదో, అట్టి తేజస్వరూపుడవగు నీకు నమస్కరించుచున్నాడ. ఏపరమాత్మ ఈలోకమును పరలోకమును సకలభూతములను అంతర్యామియై నియమించుచున్నాడో,ఏపరమాత్మ భయము వలన వాయువు విసరుచున్నదో,సూర్యుడుదయించుచున్నాడో ఇంద్రాది దిక్పాలకులు తమ తమ కార్యములయం దప్రమత్తులై మెలంగుచున్నారో, మృత్యుదేవత భయపడుచున్నదో, అట్టి పరమాత్మవగు నీకు వందనము జేయుచున్నాడ. మఱియు నో రామా! ఏ దేవుడు పరమతేజస్సో ఏ దేవుడు పరమతపస్సో ఏ దేవుడు పరబ్రహ్మమో ఏ దేవుడు సర్వోత్తమ ప్రాప్యస్థానమో అట్టి దేవుడవగు నీకు గేల్మోగుడ్చుచున్నాడ. పరమపురుషా! పావన తీర్థములకు పవిత్రమును గల్పించు వాడవును, ధ్యానార్హుడవును,జూడదగినవాడవును, కీర్తింపదగినవాడవును, స్తోత్రముచేయదగిన వాడవును, పూజింపదగినవాడవును, స్మరింపదగినవాడవును, నమస్కరింప దగినవాడవును, అయి

యున్నావు, సంసారబంధమునకు కారణమును, పుణ్యాపుణ్యాత్మకమును అయిన సకల కర్మములకును గారణమగు నజ్ఞానమును సర్వమును ఆత్మా నాత్మ జ్ఞానమునుగలిగించి పడంపజేయు పుణ్యుండవీవు. నిన్ను ధ్యానించువారికి రూపము, ఆరోగ్యము,సర్వార్థములును,ఆనుషంగికములైన భోగములను నిచ్చువాడవు నీవ. పరమాత్మా! సకల పాపములకు ప్రాయశ్చిత్తము నీనామ స్మరణమే యగుచున్నది బ్రహ్మహత్యాది మహాపాపములు చేసినవాడైనను నీధ్యానము జేసినయెడల వాడు తపోవంతుడును పఙ్క్తిపావనులను పవిత్రులనుగా జేయువాడును భక్తాగ్రణియు నగుచున్నాడు. నీవు జూచినంత హృదయగ్రంధి ఛేదింపబడును. సకల కర్మములు నశింపబడును. నీనామస్మరణ మొక్కమారు భక్తిమైచేసినంత మాత్రమున ధాతుసంతతిని వహ్ని గరగించునటుల సకల పాపములను గరగించుచున్నది. మానవు డవశుడై నిన్ను స్మరించినమాత్రమున సకలపాపములనుండి విముక్తుడగుచున్నాడు. సీతాపతే! పరాత్పరా, దీనదయాపరమూర్తే, కారుణ్యజలధే, దాశరథే అని పెక్కుభంగుల వినుతించి, తానువచ్చిన కార్యమును విన్నవించి భక్తుండొక్కడిట పనిగొనుచున్నాడను జ్ఞాపకముమాత్ర మ్ముంచుకొండని" ప్రార్థించి, తనవిడిదలకరిగి నిజకార్యానుసరణి బ్రవర్తించుచు, "పుంఖానుపుంఖ విషయా నుపసేవ్యమానో, ధీరో నముంచతి ముకుంద పదారవిందా" అనురీతి భగవత్పాదారవిందముల హృదయపీఠి బ్రతిష్ఠించి పూజించుచు, జీవితము సార్థకపరచుకొనుచుండె. ఇట్లుండి యొకనాడు భగవదా

రాధన గావించి నిశ్చలచిత్తుడై ధ్యానమగ్నుడై యున్నతరి శ్రీరామునకు రత్నకిరీట మొకదాని జేయించి యర్పించుటచే తమను దలంపాయన కుదయించినది. తానా శ్రీమంతుడు గాడు. అన్యుల యాచించుటకు తినయుద్యోగ ధర్మం బొప్పు కొనదు. అయాచితముగా ద్రవ్య మొసంగు వారు లేరు. ఇంకెట్లు తనసంకల్పము కార్యరూపముగ మారగలదు. ఇది ద్రవ్య సాధ్యమగు పనిగాని తేర కగునదిగాదు ఇవి యన్నియు చింతించి రంగరాయుడు వగలంబొగలుచు తన మనోరథం బీడేర్పుటకు శ్రీరాముడే సమర్థుడగుగాని యన్యులుకొ జాల రని నమ్మినవాడై. నిజాభీష్ట సిద్ధికై శ్రీరాముని వేడుకొనుచుండె.

ఇట్లుండ నొకనాటిరాత్రి స్వప్నంబున

సీ॥ నీలజీమూత సన్నిభ శరీరమువాని
కాంచనాంబరముచే గ్రాలువాని
తతశంఖ చక్ర గదా పద్మహస్తుని
రత్నకిరీట శిరంబువాని
అనుజత్రయంబు తన్ననుసరించినవాని
మునిలోక నుతులకు మురియువాని
చిరునవ్వు మోమున చెన్నుగుల్కెడివాని
అభయహస్తంబుల నలరువాని

గీ॥ క్ష్మాతనూభవ వామభాగమున నెల్లు
వాని శ్వేతాతపత్రంబు వన్నెలీను
వాని పద్మాక్షు పద్మాప్తపద్మగర్భ
భవ్య పదపద్ము శ్రీరామభద్రు గాంచె.

ఇట్లు గాంచి భయభక్తి వినయంబులు ముప్పిరిగొన నమస్కరించి నిలచిన రంగరాయుం గాంచి రామభద్రుండు, "పుత్రా! నీవు దలపెట్టిన కార్యంబు ద్రవ్యాతి సాధ్యంబు. అయ్యది లభింపక నీవు పరితపించు టేనెఱుంగుదు. నీపితామహుడు డన ర్ఘరత్నంబు లారింటి నీజనకస్థలంబునం దొకచో భూస్థాపితంబు చేసి మీతండ్రి కేనియు జెప్పక మృతినొందియుండె. నయ్యది మత్కిరీట కార్యమున వినియోగింప దగినవియై యున్నయవి. గాన నీవేగి యారత్నంబులంగొని పనిసాగింపు"మని సెలవిచ్చె, సంపూర్ణముగా విషయము నెఱిగించి యదృశ్యుండైన, రంగారాయుడు మేల్కాంచి స్వప్నవృత్తాంతము స్వీయజనుల కెఱింగించి నాడే ప్రభుత్వమువారిచే సెలవంది స్వగ్రామమును జేరి, భగవన్నిర్దేశ్య ప్రదేశంబున ద్రవ్వించి యొకపేటికయందు భద్రపరచి యున్న రత్నషట్కంబును గ్రహించి, పరమానంద కందళిత స్వాంతుండై యచిరకాలంబున భద్రాద్రి కేగి, పనివారల బిలిపించి కిరీటనిర్మాణకార్యమును పూర్తిచేయించి, ఆ కిరీటమునకు ముందుభాగమునం దుండునటుల నొక కమలమును చెక్కించి దాని మధ్యభాగమున నొక మరకతమును వేయించు టుచితమని దలంచి, ఏతన్మణి నార్జించుట దుర్లభమగుటచే కాలాంతరేణ సంపాదించి యలంకరింపదగునని యెంచి, ముందు మరకత మమర్పదలచిన స్థలముమాత్రము నిలువయుంచి, మిగత భాగ మంతయు పూర్తిజేయించి, మరకత సంగ్రహాపేక్ష దినదినాభి వృద్ధియగుచుండ దత్ప్రయత్న మాచరింపుచుండె.

ఎంతప్రయత్న మాచరించినను మరకతముమాత్రము లభింపలేదు. సీతాకాళ్యాణ మహోత్సవ సమయం బతిసమీప కాలమునం దున్నయది. తదుత్సవమునకు కిరీటము తయారు చేయించి రామమస్తకమునం దలంకరించి కృతార్థుడనగు దునం చెంచిన వాడగుటచే, రంగారాయున కత్యంతవిషాద మంకు రించి యుత్సవము సమీపించినకొలది యభివృద్ధిగా జొచ్చి నది. ఎంతధనము వెచ్చించినను మణి లభించునటుల గనుపింప లేదు. ఏమిచేయుటకును దోపక రంగారాయుడు నిరంతరము చింతాసముద్రమున విరామము లేక నీదులాడుచుండెను. శ్రీసీతాకళ్యాణమహోత్సవదిదృక్షాపేక్ష నతిశయింప భక్తులనేక మందివచ్చి గోదావరి పూర్వతటంబునం దమర్పబడిన కుటీర ములయందు గ్రమక్రమంబున జేరుచుండిరి నవాహ్నికదీక్షతో యుత్సవము ప్రారంభింపబడినది. కళ్యాణ సమయమునకు కిరీ టము తయారుగాదను వంత నంతకంతకు మితిమీర, రంగా రాయుడు నిద్రాహారముల గొనక, రామానుగ్రహ సంగ్రహా ణాభిలాషం గైకొన తదర్చనా నిమగ్నుడై యుత్సవమున బాల్గొనక స్వగృహమునంద నివసించుచుండె.

చైత్ర శుద్ధ సప్తమి రాత్రి రంగారాయుడు ధ్యాన నిమ గ్నుడైయున్నయెడ, "భయపడకుము. రేపు మధ్యాహ్నమునకు కిరీటము తయారుకాగల" దను వాక్యము వినువీధినుండి చెవిని బడెను. గాని అది దాసుగారు నమ్మలేదు. తెల్లవారినది. కాలోచితకృత్యముల దీర్చుకొని దుఃఖతరంగము లొకటి వెంట నొకటి వెన్నంటుచుంట, వేడుకదగ్గి భాష్పపూరిత నేత్రుండై

ఉద్ధార్థిభక్తియందు లగ్నమయిన మనఃపద్మముగలవాఁడై నూచుచున్నతరి, యొకవేశ్యాతిలక మరుదెంచి నమస్కరించి యొటులో సుముఖుం గావించుకొని యిట్లనియె.

"అయ్యా, నేను ప్రాగ్దేశవాసినిని. వేశ్యాంగనను. సుగుణ మణియను పేర బరగుదాన. శ్రీరామమూర్తి నాకు స్వప్నమున దర్శనం బొసంగి, "కాంతా, నీకు హైకోర్టు జడ్జి బహూకరించిన యంగుళీయకమునం దలరారు రత్నమును భద్రాద్రి తాలూకా తహశీలుదారున కిమ్ము. ఆతండు యమూల్య రత్న కిరీటంబొండు నిర్మించి నాకు సమర్పింపనెంచి నైజంబగు ధనంబును వెచ్చించి, కిరీటమును తయారుచేయించి తన్మకుటమున శోభనుగూర్చజాలు జీవమణి లభింపమి విచారింపుచున్నాఁడు. గాన నారత్న బొసంగి జన్మ సార్థకము గావించుకొమ్మ"ని పలికి సన్నుతులనంది యదృశ్యుండయ్యె. గాన దయయుంచి ఈ రత్నమును గ్రహింపుడని విన్నవింపుచు తనయొద్దనున్న జీవమణి నొసంగి కృతార్థయయ్యె.

అంత రంగారాయుడు సంతోష పారావారమున దేలి యాడుచు, శ్రీరామానుగ్రహ మింతయొప్పునే యని తల యూచుచు, కిరీటమును దెప్పించి పనివారలచే దక్షిణ కిరీట మధ్య ప్రదేశంబున మరకతమును స్థాపించుటకై నిర్దేశించియున్న స్థలంబున దాని నంటింప, నారత్న మాగూటిలో హెచ్చు తగ్గులు లేక యిమిడి కిరీటమున కలంకార మొసంగె.

ఇదియంతయు జరుగుసరికి శ్రీరామనవమి నాటి యుప రాజ్ఞము సమీపించినది. వెంటనే తయారయిన కిరీటమును

దలధరించి హరిభజనముతో నానందనృత్యము గావించుచు రంగరాయుడు వివాహమంటపమును సమీపించెను శ్రీసీతా రామ యర్చామూర్తుల ననోన్యాభి ముఖముగా రత్నసింహా సనముల పై గూర్చుండజేసి యర్చకాళి వివాహమంత్ర పఠనము గావించుచుండెను. మంటపముచుట్టు ముట్టి ప్రేక్షకులు క్రిక్కిరిసి యుండిరి. అట్టియెడ రంగారాయుడుగారు కిరీటమును భగవానుని కర్పించి, కరంబుల ముగుడ్చి సిమీలిత నేత్ర పద్ముండై ఇట్లని వినుతించె. "రామా! పరమపావననామా! పాప విరామా! భద్రాద్రిధామా! పాహిమాం పాహిమాం పాహిమాం దేవా! తపఃకర్మాత్మికములగు సకల ప్రాయశ్చిత్తములలోపల నీనామస్మరణ ముత్తమమైనది. భయంకర నరకదుఃఖాత్మిక మగు కలికల్మషము వెడలించు నదియు నీనామమే. తండ్రి! నీ యవ్యాజప్రేమ యిట్టిదని వర్ణింప నాబోటికి వశమగునే. అగ్ర జుచే ననేక యిడుమలం గుడుచుచు నడువులసంచరించుచుండు సుగ్రీవుని రక్షించినావు. ఎంగిలిపండ్లు భక్షించి శబరిని కాపాడి నావు, చపలమర్కటుని సేవల గ్రహించినావు, కౄరుడగు కాకాసురు ననుగ్రహించినావు, జటాయువునకు పునరావృత్తి రహిత శాశ్వత బ్రహ్మపదం బొసంగినావు, రాక్షస నాశంబొనర్చి వసుంధర కష్టము లీడేర్చినావు సూనిలోకము నతికృపాదృష్టి వీక్షించినావు. వెయ్యేల, యభిలషిత పదార్థంబొసంగి నన్ను కృతార్థుం గావించినావు. జగద్బంధూ! కరుణాసింధూ! నీవు సర్వాంతర్యామివై, అగ్ని నాయూ దార్వాదులయందు బ్రవే శించి దార్వాది రూపములు కలవాడై యనుపడువిధమున,

నీవు భూతలముయొక్క యాకారములలో నానారూపములు కలవానివలె గనుపడుచున్నావు. సర్వలోకములకును నేత్రరూపుడగు సూర్యుడు లోకనేత్రములయందలి దోషములచే దూషితుడుగాని విధమున, సర్వభూతాంతరాత్ముడవగు నీవు లోకసంబంధములగు దుఃఖములు కలవాడవు కావు. జ్ఞానరూపా సర్వగతుడును, స్వతంత్రుడును, ఒక్కడును, సకలలోకములను లోబరచుకొన్నవాడును నీవ." అని వినుతించి కరంబుల దట్టుచు,

ధన్యాసిరాగము—చాపుతాళము.

శ్రీరాములనమ్మి సేవించువారికి చింతలు పనియేటికే మువ్వాటికి ॥ శ్రీ ॥

తారకనామ కీర్తనచేయువారికి వేఱుమంత్రము లేటికే ఓమనసా॥ (శ్రీ)॥

మత్తవృత్తి నిరసించినవారికి మఱునిబాధ లేటికే॥

తత్త్వస్వరూపము దెలిసినవారికి తాపత్రయము లేటికే ఓ మనసా ॥ (శ్రీ) ॥

పన్నగశయనుని కృపగల్గువారికి బాపసంఘము లేటికే॥

మన్నించు భద్రాద్రి రామదాసుడనైతి,మర్మమెఱుగ లేవటే ॥ ఓమనసా ॥ శ్రీ ॥

అనిపాడుచు భజనానందమున దేలియాడుచుండెను. క్రమముగా సీతాకళ్యాణ మహోత్సవము ముగిసినది. రంగారాయు డింటికి జని మరకతమొసంగిన గణికాతిలకమును జీరి యామణి వెల గైకొమ్మని నిర్బధించెను; గాని ఆయమ యంగీకరిం

పక, దేవా! రామాజ్ఞయగుటచే మణినర్పించితినిగాన ప్రతి ఫలాపేక్ష నాకు లేదు. మీయాజ్ఞ ప్రతిఘటించినందునకు క్షమింపుడని ప్రార్థించెను.

వ్రియప్రియాసల కోర్చి ముగించిన భగవత్కార్యమం దీమె భాగహారిణి యగుచున్నదే యని రంగారావు చింతించు చుండెను.

కిరీటమునకైన వ్యయమంతయు భరించి తత్ఫలమును గైకొననెంచి ఆవేశ్యయు దగుప్రయత్నము గావించుచుండె. కామ్యాభిలాష యిరువురకు దినాదనాభి వృద్ధినందుచుండె ననుటలో సందియము లేదు. ఉభయులను సమాధాన పరుప నెంచి పలువురు భక్తులు పలువిధముల ప్రయత్నించిచూచిరి గాని ప్రయోజనము లేకపోయినది.

ఇట్లుండ నొకనాటిరేయి స్వప్నమునందు బ్రాహ్మణ బాలకులవలె రామలక్ష్మణు లిరువురకు ప్రత్యక్షమై, "భగవన్మ స్తకాలంకారమగు కిరీట విషయమున మీకు సంబంధము లేదు. ఈకార్యమున మున్ను తానెవ్వరికడ నేవస్తువుల దాచి యుంచెనో నాయా వస్తువుల శ్రీరామమూర్తియే తెప్పించు కొని తనకార్యమును పూర్తిజేసికొని యున్నాడు. గాన మీ కామ్యాసక్తి విడి తృప్తులుగం"డని సెలవిచ్చి యంతర్ధానులైరి.

ఇట్లు భగవదాజ్ఞ వినినంతనే యిరువురకు తమ తమ యవి వేకములు విడిపోయెను. అంత భద్రాద్రిరామున కాసత్కార్య ఫల మర్పణగావించి భక్తాగ్రేణు లిరువురు పరితృప్తినందిరి. ఈకిరీటము శ్రీ వైకుంఠైకాదశియందును, శ్రీరామనవమి దివసంబునను శ్రీరాముల కిప్పటికిని యలంకరింపుచుండెదరు.

# గోవిందస్వామి

"నాహం దేవో న మర్త్యోవా న తిర్యక్ స్థావరోపివా
జ్ఞానానందమయ స్స్వాత్మా శేషో హి పరమాత్మనః"

మోక్షసౌధము నధిరోహించుట కేర్పడిన సోపాన త్రియము నొక్క జన్మముననే గ్రమముగ నుత్తరింప వలయు నను నిర్భంధములేదు గతజన్మమునందొక మెట్టునెక్కిన వాడు మరుజన్మమున మొదటిమెట్టునెక్క బ్రిసక్తిలేకనే రెండవమెట్టు నెక్కుటకు బ్రియత్నము జేయును. ఆజన్మమునం దామెట్టెక్కినవాడు మూడవజన్మమున మూడవమెట్టెక్కి గమ్యస్థానము జేరగలడు. అనగ గతజన్మమునందు సత్కర్మము సంపూర్ణముగ నాచరించి మనోపరిశుద్ధతను గడించినవాడు, మరుజన్మమున భక్తిగైకొని మూడవజన్మమున జ్ఞానమునుబొంది కృతార్థుడౌననుట. "పార్థనైవేహానా ముత్ర వినాశస్తస్య విద్యతే కళ్యాణకృత్ కశ్చి దస్తి దుర్గతిం తాత గచ్ఛతి। ప్రాప్యపుణ్యకృతాన్‌లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః" "శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోభి జాయతే। అథవా యోగినా మేవ కులే భవతి ధీమతాం। ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మయదీ దృశం। తత్రితం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం। యతతేచ తతోభూయ స్సంసిద్ధి కురునందన." "పరమాత్మాను సంధానమునకు యత్నించి సామర్థ్యములేక భ్రష్టుడైన వానికి నిహపర లోకములందు నాశనములేదు. మంచి చేసిన వాడొకప్పుడును దుర్గతిని జెందడు. వాడు పుణ్యాము

జేసినవారి లోకములను జెంది అచ్చట బహుకాలము వసించి పిదప సదాచారవంతుల యిండ్లనైనను, శ్రీమంతుల గృహములనైనను బుట్టుచున్నాడు. అట్లుగాకపోయిన యోగులకుల మందు బుట్టుచున్నాడు." అని శ్రీకృష్ణభగవానులు చెప్పుటచే మానవు డేజన్మమున నెంతి సత్కార్మ దుష్కార్మము లాచరించిన నవి మరుజన్మమునం దనుభవమునకు వచ్చుచుండుననుట, లోకములో జన్మమునందు దుర్మార్గము లాచరించు వారుగను సత్కార్మిష్ఠులుగను భక్తిప్రపత్తులు గలిగినవారుగను జ్ఞానపూర్ణులుగను బుట్టుచుందురు. ఇందు మొదటి తెగవారి దూషణములకు శేషించిన మూడు తెగలవారును పాత్రులగుచున్నారు. అందు నాల్గవ (జ్ఞానులు) తెగవారు సుతరాం నింద్యులుగ జూడబడుచున్నారు హిరణ్యాకశ్యపుడు ప్రహ్లాదుని విపరీతవర్తనల కతికుద్ధుండై యాతని వశపరుచుకొనుటకు సామదానభేద దండోపాయముల సాగించియు బ్రయోజనముగానక, "ఓరీ దుర్మార్గా! పండువంటి వంశము పాడుసేయ బుట్టితివి గదరా, నీ వెవరవో యోచించుకొనిన నీమూర్ఖ్యము విడిపోగల"దని మందలించిన, తండ్రీ! వినుము. నేను దేవుడనుగాని, మానవునుగాని, పశువునుగాని, పాషాణాదులనుగాని గాను. జ్ఞానానంద స్వరూపుడగు పరమాత్మనై యున్నాను. మఱియు "నాహం విప్రో న చ నరపతి ర్నాపి వైశ్యో న శూద్రో నోవావర్ణీ న చ గృహపతి ర్నోవనస్థో యతిర్వా కింతు శ్రీమ ద్భువన భవన స్థిత్యపాయైక హేతో లక్ష్మీభర్తుర్నరహరి తమో దాస దసస్య దాసః" నేను

బ్రాహ్మణుడ గాను, క్షత్రియుడ గాను, వైశ్యుడ గాను, శూద్రుడగాను, బ్రహ్మచారినిగాను, గృహస్థుడగాను, వాన ప్రస్థుడగాను, యతినిగాను, విశ్వనియంతయగు బరమేశ్వరుని యొక్క దాసుని పాదసేవకుడను.'' చూడుడు. సంపూర్ణముగ బ్రపంచస్థితిని వదలికొనినవాని స్థితి ''హరి మయము విశ్వ మంతయు హరి విశ్వమయుండు సంశయము బనిలే దాహరి మయముగాని వస్తువు బరమాణువులేదు వంశపావని వింటే'' విశ్వమంతయు బ ర మా త్మ స్వ రూ ప మై యున్నపుడు ''ఆధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం తత్వజ్ఞానార్థ దర్శనం ఏతద్ జ్ఞాన మితిప్రోక్తం'' జ్ఞానియగు వాడాత్మజ్ఞానముతో గూడి తత్వ జ్ఞానార్థము దెలిసికొని యుండవలయునని శ్రీకృష్ణభగవానులు శాసించినపుడును జ్ఞాని యింకెట్లుండగలడు? విమానముమీద నంతరిక్షమున బోవువానికి భూమియందుగల గృహములు, మేడలు, చెట్లు, కొండలు సమానముగ గనపడునట్లు, బ్రహ్మ జ్ఞానికి విశ్వమంతయు బరబ్రహ్మ స్వరూపముగనే గనుపడు చుండును. కారణమగు పరబ్రహ్మమునకును కార్యమగు విశ్వమునకును భేద మేమాత్రము లేదని తెలిసికొనినవారే జ్ఞానులు. యిట్టివారలలో మనస్వామివా రొక్కరై యున్నారు. వీరి జననస్థలము మలబారు మండలాంతర్గతమగు ఆలపాడ. కులము బ్రాహ్మణ. తల్లి దండ్రులపేర్లు తెలియవు. వీరికి తల్లి దండ్రులుంచిన పేరునందు విరాజిల్లు నక్షరపఙ్క్తి వీక్షింపగల మహాభాగ్యము గలుగలేదుగాని యనేకమంది యనేక విధములుగా పేర్కొనుచుండు నామము లన్నియు సార్థకములై

యున్నవి. అందు నాకు దెలిసినవిమాత్రి ముదహరించు చున్నాడ. 1. గోవిందస్వామి, 2. గోళ్ళస్వామి, 3. బాల బ్రహ్మచారి, 4 మళయాళస్వామి. వీరు మళయాళములో దన బాల్యము గడపి, యుపనయనమైనదాది దేశసంచారము జేయుచు, దనజీవితములో సగమాంధ్రదేశమున వెళ్ళించి, అందక్షయ సంవత్సర మార్గశీర్షము మొదలు శ్రీ భద్రాచలరాము నాశ్రయించియుండి, ప్రభవ సంవత్సర వైశాఖ శుద్ధ చవితీ దివసంబున దేహము జాలించినారు.

ఈ ఘనుండు పరమహంసాశ్రమమునం దుండుటచే కాబోలు, నన్నివర్ణముల వారివలన భిక్షగైకొనుచు, "గోవింద రాం రాం, గోపాల హరి హరి'' యను దివ్యనామమును త్రికరణము లైక్యపరచి, సర్వదా ఆబాలగోపాలమునకు గర్ణపేయముగ నుచ్చైస్స్వరంబున స్మరించుచు, దనకు గనుపించువారి నెల్లర తనలో జేర్చుకొని భజనజేయుచుండువాడు. నెయ్యేల, నా మహామహుని దర్శించిన మాత్రమున నెట్టి నాస్తికునకైన నాస్తికత్వ బుద్ధివోడము ననుటకు సందియము లేదు.

ఒకప్పుడీభక్తాగ్రణి నెల్లూరు పురవీధుల శిష్యబృంద పరివేష్టితుండై రామభజనసేయుచు, మార్గావరోధము గావించిన దన్మండలాధికారియగు పాశ్చాత్య ప్రముఖుండొయ్యన జనుదెంచి, యదలింపుచు స్వామివారిని డాసి, భీకరాకారుండై యెదుటనిలచి, ఏమేమో కఠినవాక్యములాడ నుద్యుక్తుండై, శ్రీరామ భజనానందమున మున్నలువేయుచుండు హరిదాసుగారిచే నాకర్షింపబడిన చిత్తముగలవాడై, యప్రయత్నముగ

"గోవింద రాం రాం, గోపాల హరి హరి" అని బిగ్గరగ బాడుచు, స్వామివారి ననుసరించి భజనసేయ బ్రారంభించి యానంద నృత్యము గావించుచుండె. నీ చిత్రమును గావించి ప్రేక్షకులు పరమానందభరితులై, స్వామివారి ప్రభావమును వేనోళ్ళ గొనియాడుచు,

సీ॥ బ్రహ్మహత్యానేక పాపాటవుల కగ్ని
కీలలు హరినామ కీర్తనములు
గురుతల్ప కల్మష క్రూర సర్పములకు
గేకులు హరినామ కీర్తనములు
తపనీయ చౌర్య సంతమసంబునకు సూర్య
కిరణముల్ హరినామ కీర్తనములు
మధుపాన కిల్బిష మదనాగ సమితికి
గేసరుల్ హరినామ కీర్తనములు
గీ॥ మహిత యోగోగ్ర నిత్యసమాధి విధుల
నలరు బ్రహ్మాదిసురలకు నందరాని
భూరి నిర్వాణ సామ్రాజ్య భోగభాగ్య
ఖేలనంబులు హరినామ కీర్తనములు ॥

"గనుక నే హిందూమతద్వేషి నోటినుండి రామమంత్రము వెలువడినది. మున్ను సప్తమహర్షుల వాగమృత ధారలగ్రోలి, బోయ వాల్మీకి మహర్షియై చెలగినట్లు, బలువురు మూఢాగ్రేసర చక్రవర్తులు మనస్వామివారిని తిలకించినంత శ్రీరామభక్తి సంపూర్ణులై తేజరిల్లిరనుటకు సందియము లేదు." అని చెప్పుకొనుచు దమ తమ సంతోషముల వెల్లడించిరి.

స్వామివారికి గోపము సున్న, డాంబికము హుళక్కి, దేహ పోషణ వ్యాపారము శూన్యము, శుష్కవాదములు శశ విషాణములు ఎప్పుడు చూచినను రామభజన సేయుటయే. ఏమాట మాట్లాడినను భగవన్మహిమాభివర్ణనమే. ఏపని జూచినను శ్రీరామ కైంకర్య విశేషపూరితంబె. ఏస్థలమున సంచరించినను, శ్రీరామ భజనానంద సంజనిత బాష్పబిందు సముత్కీర్ణ సుందరవదనారవింద సముల్లసిత శిష్యబృంద సమాక్రాంత విస్తారంబె. ఆహా! ఈ సాధుపుంగవుని సేవించువారిదియె జన్మము. నిత్యతృప్తి ఈ సుగుణఘనికి బ్రధానగుణము. ఈ పరమపావనమూర్తి దేశికానుగ్రహ పాత్రుడైనప్పటినుండి బ్రహ్మచర్యవ్రత దీక్షాపరుండై భారత దేశమునంగల తీర్థయాత్రల సేవించి, యోగసిద్ధియు మంత్ర సిద్ధియు గడించి, ప్రథమమునం దాంధ్రదేశమునం దలరారు ముఖ్యపట్టణములలో నొక్కటియగు నెల్లూరున కనతి దూరమునంగల వావిళ్ళ కేగిరి. అందీ పవిత్రాత్ముని యమానుష చర్యలు కొన్ని వెల్లడియైనవి. తద్గ్రామంబునం దనేకరోజుల నుండి కలరాదేవత ప్రవేశించి పశువులను, మనుజులను తన నోటవేసికొనుచుండె. గ్రామవాస్తవ్యులు శ్రీమంతులగుట, నెంత ద్రవ్యమునైన వెచ్చించి యీ యుపద్రవమును బాపు కొన దలంచి తగిన మంత్రవాది నారయుచుండిరి.

ఇంతలో నెక్కడనుండియో కాషాయాంబరధారి యొకండు నారాయణ స్మరణజేయుచు; బురవీధుల "కాషాయ దండ మాత్రేణ, యతిస్సర్వత్ర పూజయేత్" అను న్యాయము

ననుసరించి యూరివాసులచే వందనములందుచు విప్రగృహము
లకు మందమంద గమనంబున బోవుచుండె. విపత్సముద్రము
నందు మున్కలు వేయుచుండు వారలకట, నా యూరిజనము
లాసాధుగాంచి తమ నుద్ధరింప దలంచివచ్చిన భగవదపరావ
తారమని యెంచి, పరుగు పరుగున బోయి, పుర ప్రముఖుల
కాపుణ్యపురుషుని రాక నెరింగింప, వారలు డెంచి వందనముల
గావించి తగిన విడిదిలయందు బ్రవేశపెట్టి; మజ్జనభోజనాది
కార్యముల గొఱంత లేకుండునటు లేర్పాటుల గావించి, తమ
కష్టపరంపర లెఱింగించుటకు సమాయాన్వేషణము జేయు
చుండిరి. అంత స్వామివారు భోజనముజేసి నారాయణ స్మర
ణముతో వచ్చి తనకొఱకై యమర్చియుంచిన యాసనముపై
గూర్చుండి వేదాంతోపన్యాసముల గావింపజొచ్చె, కొందఱె
కపటులకు తమ కపటముల గప్పిపుచ్చుటకు వేదాంతోప
న్యాసములు మిక్కిలి సహాయకారులుగా నున్నయవి. అప్ప
రమ పవిత్రోపన్యాసముల వినుటకు రమారమి యప్పూరి
వాస్తవ్యులందఱు వచ్చి స్వామివారి వాక్యానుసరణి యుచిత
స్థలములం దాసీనులై వినుచుండిరి. అయ్యుపన్యాసధోరణి
కాలమును గప్పిపుచ్చినది. ఎట్టకేల కుపన్యాసకుడును శ్రోత
లును తమ తమ పనుల జాలించి స్వామివారు కాలోచిత
కృత్యముల దీర్చికొనుటకును, సభికులు కుటుంబకార్యముల
నవరించుకొనుటకును సభను ముగించి వారి వారి స్థలము
లకు జనిరి.

అంత స్వాములవారు కాలోచితకృత్యముల దీర్చికొన నేగుతరి సమయమారసి, పురప్రముఖులలో నొకరిద్దఱాయన వెంటనేగి గ్రామమునకు సంభవించిన విపద్దశనంతయు విశదపరచి ఈ ముప్పునుండి తప్పించిరక్షింపవలయునని ప్రార్థించిరి. స్వామివారి కామాటలు కర్ణపేయములుగ నున్నవి, ద్రవ్యసంగ్రహణార్థమే తెంచినవాఁడు కాన లోలోన సంతసించుచు వారింగాంచి, మీగ్రామమునకు సంభవించిన విపత్తు నడంచుట దుర్ఘటము. నలువది దినములు సీతలాయంత్ర పునశ్చరణముజేసి యయ్యది రచ్చబండక్రింద బ్రతిష్ఠించిన మీకు శుభము లలవడును. దీనికి రమారమి పదివేలరూప్యములు వెచ్చింపవలయు నియ్యది ద్రవ్యసాధ్యమైన పనిగాన నడుమ నెట్టిలోపమును బొడసూపకుండ సాగించుట దుస్తరము మీకు ప్రూచీపడెదరేని యెట్టులో ఈ మహోపకారము జేయఁగలము. ఇది మా యాశయమని చెప్పిన మర్మరణముల కడలుచున్నవారు కాన సమ్మతించిరి.

ఈసమయమున బుమ్మలముగ ద్రవ్య మార్జింప వచ్చునను పేరాసబైకొన దన యసమర్థతను గుర్తింపకయే అయ్యగా రాపని కొప్పుకొనిరి. ఈవార్తగ్రామమంతటను వ్యాపించి పురిజనుల సంతోషవార్ధి నోలలాడించినది. నాడే నగర మధ్యప్రదేశమున బందిరిలు వేయఁబడినవి. తగిన సంభారములన్నియు సేకరింపబడినవి. మరురోజు తెల్లవారి యేడుగంటల ప్రొద్దెక్కినది. మంగళ వాద్యములతో మన సన్యాసిగా రాపందిలియందు ప్రవేశించి, తనకుద్దియగు బాపనయ్యల గొందఱ సమకూర్చ

కొని. వారి సాయంబున సీతలాయంత్రిం బొండెట్లోనిర్మించి పునశ్చరణము సాగించె. బందిలియందు బ్రతిరోజు బ్రాహ్మణ భోజనము లవారిగ సాగుచున్నవి. ఊరిలోనివా రాబాల గోపాల మాపందిలియందే కాపురము జేయుచుండిరి. రోజునకు సహస్రాధిక రూప్యములు వ్యయమగుచున్నవన నతిశయోక్తి కాదు. ఇరువది దివసములు కడచినవి. వింశత్సహస్ర రూప్యములు వ్యయమయినవి కాని గొట్టాలమ్మ పురిలోని మనుజులను వ్యయపరచుటమాత్రము మాన లేదు. "ఏమండి! అయ్యగారూ! యిరువది రోజులయినను కలరా తగ్గలేదేమండి?" అని ఎవరయిన బ్రశ్న వేసిన సక్రమముగ నలువది దివసములు పూర్తియయినగాని తగ్గదని సమాధానముజెప్పుచుండువాడు. అమాయికులగు పురజను లామాటలనమ్మి అయ్యగారు చెప్పినట్లెల్ల ద్రవ్యము వెచ్చించుచుండిరి.

ఇట్లుండ నొకనాడు గోచిపాతరాయం డొక్కండు డా గ్రామమున జరుగు మహోవిభవమును జూచుటకును బురజనుల నుద్ధరించుటకును పిలువని పేరంటముగవచ్చి యజ్ఞవాటికను జేరి యంత్రమును బరీక్షించుచుండె. నదిచూచి మన అయ్యగారు కోపముతో 'నావలకుబోయి కూరుచుండుము. ఏమట్లు చూచెదవు నీకు బిచ్చిపట్టినదియా' అని యదలించుచు జారచురంజూచెను. ఈమహామహుడే మన కథానాయకుడు. ద్రవ్య సంపాదననాసక్తి బ్రేరేపశక్తికిమించిన కార్యము దలపైబెట్టుకొని తనగుట్టుబయలుపడునేమో యనుభయమెంతయో పురికొల్ప, నోరికొలంది పేలుచుండు నా కపటసన్యాసిని కాంచి

మన కథానాయకుడు వినయ వినమితవదనుండై, "అయ్యా! నా దొక చిన్న మనవి. మీరు కావించుకార్యము ప్రశస్తవంతము సీతాలాయంత్రప్రతిష్ఠవలన గ్రామమున కెంతయేనియు శుభము గలుగ గలదు. కాని యిప్పటి మీ ప్రయత్న మట్లుగాక వ్యతిరేకమగునని తెలియుటచే సంశయాస్పదచిత్తుడనైతదీయ శుభవార్త మీ కెఱింగింపజాల కూరక నిట్టూర్చుచున్నాడ. కోపపడకుండెదరేని వెల్లడించెద"ననెను. ఆమాటలవినిన గపటసన్యాసికి మితిమీరిన కోపము వచ్చినది. పండ్లు బటబటగొఱకుచు గుడ్లెఱ్ఱజేసి "ఏమీ వ్యతిరేకమా! నీకేమి తెలుసునని మాట్లాడితివి? ఇట్టియమంగళము లికఁ బేలకు. ప్రేలితివేని తగినశాస్తి కాగలదు. పోపొమ్ము" అని స్వామివారిని దూరనాడిన "అయ్యా! కోపపడకుడు. పొరపాటెంతవారి కేనియు రాగలదు. శాంతముతో వినుడిప్పుడు మీరు ప్రతిష్ఠింపనున్న యంత్రమందు బీజములు తమ తమ స్థానములయందు నిలువమి యిట్లు పలుకవలసి వచ్చినది. యెందులకో కొందర శాస్త్రపరిశోధనము గావించి నామాట సత్యములైన శిక్షింపవచ్చు"నని స్వామివారనిరి. తాను పట్టిన పట్టె నెగ్గవలయునను పిచ్చియూహగల మన సన్యాసికి నిష్ఠురపటియగు స్వామివారి వాక్యములు మఱింత కోపకారణములై మితిమీర జేయుటచే "ఏమీ" బీజములు స్వస్థానములందు నిలువలేదుగా! పెద్దశాస్త్రవేత్తవలె మాట్లాడుచున్నాడవే! యుక్తాయుక్త వివేకములేని శిష్యుని స్వీకరించిన గురువు ననవలెనా. నిన్ననవ బ్రయోజనము లేదు. యింకనైన నోరు మెదల్పక దిన్నగ గూరుచుండుము. లేనిచో తగిన ప్రాయశ్చి

త్తము గాగలను." అనిపలుకుచు, నయ్యగారు తన కపటము బయటబడకుండుటకో లేక తెలియకనో సభికులతో మాట్లాడుచు నటునిటు దిరుగుచుండె. నంత సభలోని పెద్దలలో నొకరు లేచి, "అయ్యా సన్యాసిగారు ఈస్వామివారు శాస్త్రప్రమాణము జూపెదనని పలుకుచుండ తొందరెందులకు? తగిన సమాధానము జెప్పినగదా వారి మాటలకు విలువవచ్చునది. శాస్త్రము జూపుమనుడు" అనిపలికి కూరుచుండెను.

నన్ను దప్పుపట్టుటకు బ్రహ్మ దిగిరావలె. వీడన నెంత? ఎటువంటి శాస్త్రజ్ఞులైనను నాకడ్డియేందాసులే నాశక్తి తెలియక మీరిట్లేల మాట్లాడెదరు? నాయంతవాడీ బీదసన్యాసితో శాస్త్రచర్చకు గడంగి మర్యాద బోగొట్టుకొనునా? వీనికి గురువు పరదూషణాదికములు మాత్ర ముప దేశించినట్లున్నాడు. మీకు నాయందు నమ్మకము లేనియెడల వీనిచేత నీకార్యము బూర్తి చేయించు కొనుడు. నేమానుకొనెద"నని సన్యాసిగారు ధిక్కరించి పలికిరి.

అది విని గోవిందస్వామి చిరునవ్వుతో "మన ముభయులము మాట్లాడుచున్నపుడు నిష్కారణముగా నా దేశికాచార్యుని నిందింపనేల? లోప మేదయిననున్న నన్ను శిక్షింపుడు. మీకు మీ దేశికాచార్యు డెట్టి గౌరవపాత్రుడో నాకు నా దేశికాచార్యుడట్లె గౌరవపాత్రుడగునని యెరుగదలంపరు? గాన వృథాగా మద్గురునిందగావింపకుడు" అనిస్వామివారనిరి. అదివిని ధిక్కరించుచు, "స్వభూషణాదికముల గావించుకొనునట్లు శిష్యుని తయారుచేసిన గురువును నిందించినను బాపములేదు. నీవు

నాతో మాట్లాడ నర్హుడవు కావు. ఆయధికారము నీగురువున కుండిన దీసికొనిరమ్ము. పొమ్ము. అవసరమున్న, వానితో మాట్లాడెద''నని సన్యాసిగారనిరి.

స్వామివారుగురుదూషణమునకోడుచు శ్రవణపుటంబుల వ్రేళులుంచి ''వినయముతో నయ్యా! నాగురువర్యునికింగల యధికారానధికారముల నెన్న బోకుడు ఆమహానుభావుని ప్రభావమిట్టిదని వర్ణింప నాతరముగాదు. నాగురువర్యుని దిలకింప మీకిష్టమేని సర్వవ్యాపియగు నాతండిప్పుడేయిక్కడనే దర్శనమియ్యగలడు. మద్దేశికుని ప్రభావము గొంత మీకు జూపినగాని నామాట యందు నమ్మకము గలుగదు. ఇదిగో చూడుడని చెప్పుచు చిన్న కాకితపుముక్కల రెండింటి దెప్పించి యందొక దానిపై నిజగురుదత్త మహామంత్రమును ("గోవింద రాం రాం గోపాల హరిహరి") వ్రాసి త్రాసునొండు దెప్పించి దానియం దొకవైపున నుంచి, "అయ్యా! సన్యాసిగారూ! శ్రీవారి గురువర్యుండొసంగిన మంత్రరాజమును లిఖించి త్రాసు రెండవ వైపునందుంచుడు. దాన మీసంశయము నివర్తిగాగల''దని చెప్పుచు రెండవకాకితపుముక్క నాతని చేతికిచ్చె.

స్వామివారినుండి కాకితము పుచ్చుకొని సన్యాసిట్లు దలంచె, "ఏతడు పిచ్చివాడు. కాదేని యొకేబరువుగల కాకితములపై మంత్రములు లిఖించినంతమాత్రమున బరువునుండి భేదపడునని దలంచువా డుండురా! పొరపాటు. తప్పక రెండును సమానభారము గలవియయ్యే యుండును. దీన నన్నీతడు వంచింపజాలడు. మంచిది, మంచిది. దీననే వీని మదము

డంగగలడు. అట్లే గావించెదగాక!" నని మనస్సమాధానము గావించుకొని, ఆచిన్న కాకితముపై తన గురువర్యుడిచ్చిన మంత్రము లిఖించి త్రాసుయొక్క రెండవ వైపున నుంచె.

వెంటనే స్వామివారిచీటి తూకమునమించి చూపరుల కద్భుతము గలిగించె. నప్పుడాస్వామి సభికులంగాంచి, "అయ్యలారా! నాగురువర్యుని ప్రభావము దిలకించుడు. సన్యాసిగారు మంత్రము లిఖించిన కాకితము తేలికయైనది. సన్యాసిగారికి సహాయముజేయ నెంచితిరేని తూకమునకుమించు మరే వస్తువైనను తెచ్చి త్రాసునందుంచి కృతార్థులుగండు. త్వరపడు"డని చిరునవ్వుతో బలికెను.

ఆమాటలువిని కొందఱు సభికులులేచి వారివారి దగ్గరనుండు కాకితముల గొన్నిటిదీసి సన్యాసి త్రాసువైపునం దుంచిరి. కాని ప్రయోజనము లేకపోయినది. మద్గురుప్రభావమునుగనుగొంటిరా! యని స్వామివారనుచుండ సభలో స్వామివారికి "జే" అను కేకలు మిన్ను ముట్టినవి. దానితో సన్యాసికి పరాభవము సంభవించుటచే నాటిరాత్రిపలాయనము జిత్తగించిరనియు, వానిపేరు తనకు దెలియదనియు మహారాజశ్రీ గద్వాల లక్ష్మారెడ్డి గారు చెప్పుచున్నారు. ఇట్లు గోవిందస్వామివారు సన్యాసి కాపట్యమడంచి గ్రామము నలయించు కలరా వ్యాధి మాటమాత్ర రూపుమాపి, సీతలాయంత్రప్రతిష్ఠా కార్యము సక్రమముగా బూర్తిచేయించి సర్వజనాదరణపాత్రులైకొంతకాలమటనుండ, దలవనితలంపుగ స్వామివారికి సప్తాహముజేయ సంకల్పము వొడమ వెంటనే ముహూ

ర్తము నిశ్చయముగాబడినది. ఈవార్త యచిరకాలమున నెల్లూరుమండలమునం దంతట వ్యాపించినది యథోచితముగ సర్వసంభారముల సమకూర్పబడినవి. స్వామివారు నివసించుట కాపురివాస్తవ్యులచే నిర్మించబడిన మఠముచుట్టు గొప్ప పందిరులుగూడ తయారయినవి. మహాత్ములు సిద్ధసంకల్పులుగదా! ముహూర్త కాలమునకు సరిగా హరిభజనాపూర్వకముగ సప్తాహము ప్రారంభింపబడి సంపూర్ణాన్నదానముతో క్రతువు సాగుచున్నది. లక్షలకొలంది ప్రేక్షకులు స్వామివారితో గలసి భజనానందమున దేలియాడుచుండిరి. పూర్ణాహుతినాటికి దాదాపారులక్షల ప్రేక్షకులతో గ్రామమంతయునిండిపోయినది. వాడెవాడుపుట్ల బియ్యము వండి యన్నము రాసి పోయబడి యుండె. నంచుకొనుదగిన శాకాదికములు సిద్ధపరుపబడినవి. పూర్ణాహుత్యనంతరము స్వామివారువచ్చిన జనమును, సిద్ధపరుపబడిన పదార్థములను దిలకించి, వినియోగాసాధ్యమైయుండుటచే గాబోలు, మఠనిర్మాణకాలమున గట్టింపబడిన యాంజనేయ దేవాలయ శిఖరముపైనెక్కి ప్రేక్షకుల నుద్దేశించి కరమునెత్తి, "ఆత్మీయులారా! భోజన పదార్థములన్నియు సిద్ధమయినవి. తత్పదార్థ వినియోగమునకు బలువురు యువకుల సాయమవసరమైయున్నది. ఇప్పటికి భోజనకాల మతిక్రమించినను సాయపడువారు చాలినంతమంది సమకూడియుండలేదు. కాన నిష్టమున్న వర్ణవ్యవస్థల జూడక నెవరికివారు భగవత్ప్రసాదమును స్వీకరింపుడు'' అని బిగ్గరగా కేకలువేసెను. స్వామివారి పలుకు లాలించి భగవత్ప్రసాదమును ప్రేక్షకులు స్వయ

ముగ స్వీకరించి యాదివ్యస్థలమును జగన్నాథమును గావిం చిరి. అవబృథాంతముతో క్రతువు పూర్తియయినది. స్వామి వారు సప్తాహానంతర మాయూరియందు కొన్ని దినములుండి బయలుదేరి చనిగండ్ల, శ్రీనివాసపల్లెలమీదుగ కర్నూలున కేగి, యటనుండి పత్తికొండ కేగు రస్తాన ప్రయాణము జేయు చుండిరి. వెనుకనుండి మోటా రరుదెంచుచుండెను. డ్రయివరు శ్రీ వారిని ప్రక్కకు దొలకించుటకు విశేషప్రయత్నము జేసి యంతర్ముఖులైయున్న స్వామివారిని తొలగింపజాలక విఫల మనోరథుడై, యజ్ఞానావృతుండగుట కోపావేశమెంతయో బ్రేరేప నిష్కారణముగ కఠినతవహించి, దురభిమానముతో కారును ప్రక్కకుదొలగించుకొని పోవుటమాని, స్వామివారిని వెంబడింపజేసి గంటకు ముప్పదిమైళ్ళు వెళ్లగల వేగమాకారు నకు గలిగించి రెండుమైళ్లవరకు నడపంగలిగినాడు. గాని శ్రీ వారిని ప్రక్కకు దొలగింపజేయుటకుగాని, తుదకు సమీపింప జేయ గలుగుటకుగాని సమర్థుడు గాకపోయినాడు. ఆత్మశక్తి పూరితు నడ్డగింప నేరితరము! అంత నాసారథి తనగర్వము విడ నాడి కారుదిగిపాదచారియై వెంబడించి,యచిరకాలమున స్వామి వారి పాదముల బడగలిగినాడు. చూచితిరా! మనసారథి గర్వ పూరితుడై యుండినప్పటి స్థితియు, గర్వరహితుడై యుండిన ప్పటి స్థితియు. గాన "గర్వమేరికిని కార్యకారికాదు". ఆహా! ఆత్మశక్తియన నిట్లుండవలదా! అట్లు సారథి స్వామివారి పాద ములబడి యపరాధమును క్షమింపగోరుచు ప్రార్థించి తెచ్చి కారున గూరుచుండ జేసి కృతార్థుడైనాడు. ఈవార్త కర్నూలు

మండలమునం దంతటను వ్యాపించి స్వామివా రెందుండినను జనులు గుంపులుగవచ్చి వందనార్చనాదుల గావించి పోవు నటుల జేసినది. పాఠకులారా ! ఈపుణ్యపురుషుని జీవితము వ్రాయుభాగ్యము నాకు గలుగజేయుటకు భగవానుని ప్రార్థించుచున్నాడ. వినుడిప్పుడు బొబ్బరలంక నుండి రాజోలు కుబోవు కాల్వకట్టపైన నొక సాధుమూర్తి తిరుగుచుండెను. వీరికోపమునకుగురియై యొకకారు మూడురోజులు నడువలేక నిల్చిపోయినది. ఈమహామహునిగాంచి యచేతనములగుకార్లు, బండ్లు, స్త్రీమర్లు భయపడుచున్నయవి. ఇష్టమున్నవారువీక్షింపనగు. వీరిపేరు చెప్పువారులేరుగాని, మూర్తినిమాత్రము జూపగలరు.

కొయ్యలగుంట వాస్తవ్యులు కొందఱు స్వామివారిని మహానందికిం గొంపోయి యందొకమఠమును నిర్మించి స్వామివారి నందుండ బ్రార్థించిరి. భగవన్మహిమను లోకమునకంతకును వెల్లడిపరచుటయే పరమధర్మమని నమ్మిన మహానుభావు లొక్కచో నిలచియుండగలరా! ఇట్లయినను వారి యిష్టానుసారము కొంతకాలమందుండి యటనుండి గద్వాలచేరి యందు రామనామమాహాత్మ్యమును బోధించి భక్తి బీజమును మొలకెత్తించినారు.

నైజాము రాష్ట్రమున నివసించు హిందువులు ప్రాయశః గాఢభక్తిపరిపూర్ణులగుట సర్వజనవిదితము. రావిశేషమ్మక ముగూడా అందువలన నారాష్ట్రము నందలి వ్యాధిగ్రస్తులు స్వామివారు రామభజన జేయు స్థలమునకేతెంచి రామ నామామృతమును గ్రోలి యారోగ్యవంతు లగుచుండిరి. నాట

నుండి మనకథానాయకుడు భవరోగ వైద్యుడగుటయేగాక ప్రాకృత వైద్యుడుగూడ నైనాడు. ఇది యంతయు నారసి యచ్చటిభక్తులు స్వామివారియం దతిశయించిన భక్తిప్రపత్తులు గలవారై యుండుట స్వామివారియాజ్ఞ నొందు కూపమును దర్శించిరి. ఆనూతిలోని జలమున శ్రీ స్వామివారు రామ నామామృతమును గ లి పి ర ట. ఆ నీరిప్పుడమృతమువోలె వ్యాధులకు పనిజేయుచున్నవట. అటనుండి బయలుదేరి యం దందు సంచరించుచు బెజవాడ కేతెంచి కృష్ణానదిం గ్రుంకి, కనక దుర్గను సేవించి భద్రాద్రి కేగు తలంపున బయనము సాగించి, మార్గమధ్యమునం దలరారు నందిగామతాలూకా కమ్మవారి పాలెమునకు సమీపమునంగల కాప రామయ్యగారి భావి వద్దకువచ్చిరి. యాకూపమునంగల జలము స్నానపానయోగ్యం బుగాక గీటకములచే నిండియుండి ప్రేక్షకుల కసహ్యము గొలుపుచుండె. ఈ బావిచుట్టును రామయ్యగారికి గొంత భూమి కలదు గాని అది బదరికాశ్రమ సదృశంబగుటచే వ్యవ సాయ యోగ్యంబగునది కాకయుండె. అట్లు స్వామివారటకు జేరి ప్రాతస్స్నాన సమయంబగుట ననుమానింపక, నానూతి యందుస్నానము జేసి సమీపవర్తులగుగోపాలకులజేరి, నేటినుండి యీభావినీరు స్నానపాన యోగ్యంబగుగాక! రేగుపొదలచే నిండియుండు నీపరిసరక్షేత్రం బచిరకాలమున ఫ ల వృ క్ష సమావృతంబైయొసంగుగాక! యనిజెప్పియెందేనియుం"జనియె.

మరునాడుదయంబున గోపాలకులవలన నావార్త రామయ్యవిని సంతోష సంశయబులు ముప్పిరిగొన, నూతికడ కేతెంచి యమృతోపమానములై యున్న జలంబులగాంచి పరమానందభరితుడై, "ఏమహామహుని కరుణాతిరేకంబున

బ్రహ్మానందమును మరపించునట్టి యానందమును బొందగలిగితినో అట్టి మహనీయుని దర్శించినగాని నాజన్మము కృతార్థత నంద జాల"దని దలంచి, నాడే పయనమై పెక్కుస్థలముల వెదకి వెదకి యెట్టకేలకు భద్రాచలంబున శ్రీరామసేవా పరాయణుండై యుండుస్వామివారినిగాంచి, వందనముగావించి తనసంతసమును వెల్లడించి కృతార్థుండయ్యె. ఇప్పుడు రామయ్యగారి భావిసీ రమ్మృతమునుమించి పరిసరక్షేత్రమునగల కదళీవనమే వారి నుజ్జీవింప జేయుచున్నవట

నాడు మొదలు రామయ్యస్వామివారినిసేవించి తత్త్వజ్ఞాన సంపన్నుండై యుండెనని చెప్పుదురు. ఇట్లుండ గొందఱుభక్తులు స్వామివారునివసించుటకు భద్రాచలక్షేత్రమున మఠమొండు నిర్మింప నెంచి, శ్రీవారి కిష్టము లేదని తెలిసియు బని ప్రారంభించిరి. రెండుగజములయెత్తు గోడలు లేచినవి ఇంతలో ప్రభవ సంవత్సర వైశాఖమాస మేతెంచినది. రామయ్య కార్యాంత రాసక్తుడై యెందేనియుం జనియె. సీతాకళ్యాణ మహోత్సవము ముగిసి నెలయయినది. శ్రీరామునకు వైశాఖపూజలు జరుగు చున్నవి. పున్నమివచ్చి శ్రీవారికి రక్తభేదులు కలిగించినది. ఔషధసేవలేదు. రామభజన మాన లేదు. వైశాఖ శుద్ధ చవితి నాడుదయమున శిష్యు వీరాచారిని పిలిచి, "మాపని దీరినది, పోవుచున్నాము. నీవు విచారింపక శాశ్వతసుఖ మనుభవింప ప్రయత్నింపుము. కృతకృత్యుడ వయ్యెద"వని సెలవిచ్చుచుండు సమయమున బ్రహ్మరంధ్రమును భేదించుకొని శ్రీవారిజీవాత్మ పరమాత్మయం దైక్యమయి శిష్యకోటికిని చూపరులకు నెంతయో యద్భుత విషాదములు గలిగించినది.

# సయ్యద్ అహ్మదలీషా ఖాదర్ వలీ

## కొత్తలంక యోగి

కం. బాలునిగతి నున్మత్తుని
పోలిక జడమతివిధాన భూతోన్మాదో
ద్వేలుని వడువున సుజ్ఞా
నాలంబుండలరుఁ బుడమి నకుటిలమతియై ॥

సమస్త చేతనాచేతనాత్మకమైన ప్రపంచంబంతటను బరమాత్మని దిలకింపుచు, సర్వసమదృష్టి యలవరుచుకొని నిష్కంటకముగ నిజదేహయాత్ర కొనసాగించుకొనుచు, పామరులవలన నేలాటి యాటంకములు గలుగకుండుటకు బాలోన్మత్త పిశాచావిష్టులవలె గనుపించుచు, నటకునివలె సమయానుగుణముగ క్రోధముఖరగుణముల నెలువరచు చున్నను, దద్బోధము క్రియారూపమును దాల్పనీకఁ బరోక్షముగ నాశ్రితుల మనోభీష్టముల దీర్చుచు, మృత్యుదేవతకు స్వాగతమిచ్చు మహాత్ములీయాంధ్రరాష్ట్రమునం దన్నిజాతులలోను స్వల్పముగ గనుపించుచున్నారు. గాని సామాన్యమానవు లెల్లరు భేదవృత్తి సహితులగుటయు, దురభిమాన పూరితులగుటయు, వర్ణబద్ధులగుటయు సుజ్ఞానపూరితుల గనుగొన జాలక పోవుటయేగాక, వారి నాక్షేపించుచు, తమ తమ జీవితముల గలుషవంతములఁ జేసికొనుచున్నారు. వర్ణపిశాచ మెట్టి యకార్యమున కొడిగట్టదు! యెట్టివర్ణమునకు జెందిన వారైనను పవిత్రులనియే దలంచుచు, స్వభాషణ పరభాష

ణాదు లంటనీక సమస్త ప్రపంచ మీశ్వరాంశా పూరితమని యెఱింగిన పుణ్యపురుషున కొక్కనికిమాత్ర మాయాత్మ నిష్ఠులు గోచరింపబడుచుందురు. అట్టి మహాపురుషులకెల్ల కన్నాకై యసమానమప్రతిభా ప్రభావములు గలిగి నవీన నాగరికతా మహాత్మ్యము పేర్మి శాస్త్రమర్యాద లతిక్రమించి వర్తించుచు, సంశయోద్భూత చేతస్కులై మెలంగు యాధునికుల విపరీతభావము లంతరింపఁ జేయఁజాలు నడవడిచే విరాజిల్లు మహాత్ముండు మన సయ్యద్ అహమ్మదలీషా ఖాదర్ వలీ. వీరి నివాస స్థల నామధేయ జననీజనక జనన కాల వివరములు సంపూర్ణములుగ దెలియుట లేదు. గాని క్రీ. శ. 1921 వత్సరమున జరిగిన జనాభా సందర్భములో కొత్తలంక నివాసియగు కొండపల్లి యజ్ఞన్నగారప్పుడు తన బ్లాకులో నివసించియున్న వలీగారిని ప్రశ్నించి యతికష్టము మీఁద పేరును, నివాసమును, వయస్సును కనుగొనజాలితినని చెప్పుచున్నారు. ప్రస్తుత మాయా విషయముల కనుగొనుట కింతకంటె తగిన సాధనలు లేకపోవుటచే నవియ నిందు బొందు పరచెద. నివాసస్థలము నైజాము రాష్ట్రములోని నల్లగొండ మండలాంతర్గతమగు గొల్లపల్లి. ఈ గొల్లపల్లి యస్టేటునకు జెందిన జమీందా రీకుటుంబమున జననము. తల్లిదండ్రులు పేస్లు తెలియవు. వయస్సు 125 సంవత్సరములు. రైల్వేస్టేషన్ భువనగిరి. ఈ విషయములన్నియు క్రీ. శ. 1921 సం॥ తెలియ వచ్చినవియగుట నిప్పటి కీవలీగారి వయస్సు 135 సంవత్సరము లయియున్నవని చెప్పెదను. కారణము తెలియదుగానియిప్పటికి

రమారమి యేబది సంవత్సరముల క్రితము శ్రీ కుండ లేశ్వర మునకేగి అందు గౌతమీతటమునంగల మిఠాయిపాకావద్ద చిన్న కౌపీనధారియై కూరుచుండువాడట. దగ్గిర నొక మృణ్మయపానపాత్ర ముండెననికూడ తెలియుచున్నది. గ్రామ మునం దప్పుడప్పు డన్న మర్థించి మెసవుచుండిరి. శీతాతపముల లెక్కసేయక మెలంగెడివాడు. ఒకటి రెండు పర్యాయములు గౌతమి నవలీల నుత్తరింపగలిగిరని యొకరిద్దరు చెప్పుచున్నారు. ఈ కుండ లేశ్వరమున నున్న రోజులలో నిప్పుడు రాజమహేంద్ర వరమునంగల కోటిలింగాలయం దలరారు మఠమున వసించు చుండిన కృష్ణావధూతగారు, వలీగారి యనుగ్రహమర్థించి కొన్ని రోజులు శ్రీవారి వెన్నంటి తిరుగుచుండ, యొకప్పుడు పురవీధుల జనుచు, గారణములేకయే యవధూతగారు బలమగు ప్రహారణములచే నలయించుట గాంచి, చూపరులు కటకటంబడి యవధూతను పరిహసింపుచు, నీతురక నాశ్రయించి నందు లకు బ్రతిఫల మనుభవించితివిగదా. చాలు, నిక నాపిచ్చివాని వీడి సుఖంబుండుమని పెక్కువిధముల బోధింప, నాతండు నవ్వుచు శ్రీవారు నన్ను బరీక్షింప నిట్లు కొట్టిరిగాని, నాయందు కోపముచే కొట్టినవారు కారని జవాబుచెప్పి తనపట్టు సాగించి కృతార్థుడైనాడట.

కేశనకుర్రు వాస్తవ్యుడు మాధవరపు కొండయ్య తనభార్యకు సంభవించిన కు ను మ వ్యా ధి క నేక చికిత్సలు చేయించి ప్రయోజనము గానక విసివి, వలీగారినిదర్శించి యారోగ్య మర్థింప, గరుణించి ప్రసన్నవదనుండై మనోరథ

సిద్ధియగుగాకయని'యాశీర్వదించి పంపిన, నాటగోలె వ్యాధిసన్నగిలి యచిరకాలమున నామె సంపూర్ణారోగ్యము గడించి పుత్రవతియై విరాజిల్లినది. ఆయమ తనపుత్రుని జంకనిడికొని సభర్తృకయై సిద్ధపరచిన పాయసము గైకొని, సభక్తిపూర్వకముగ వలీగారిని దర్శించి వందనశతము లర్పించి పాయసంబర్పింప, నాతండు సంతసంబు వెలిబుచ్చుచు, బాయసంబున గొంతభాగము మెసవి యూరకున్న. శేషించిన భాగమును ప్రసాదముగ నాయమ సభర్తృ పుత్రికయై భుజించి, శ్రీవారివలన నాశీర్వాదములంది సుఖముగ నిల్లుజేరి కృతకృత్యయయ్యె. ఈదంపతులిరువురు పుత్రపుత్రికా సౌభాగ్యసంపదోద్రిక్తులై యారోగ్యపూరితులై విరాజిల్లుచుండిరి. మఱియొకప్పు డొక మార్వాడీ బ్రాహ్మణు డొక్కండరుదెంచి యోగిగారిని దర్శించి నమస్కరించి, పంచదారలాడువుల నుపహారంబుగ నొసంగిన శ్రీవారా లాడువులలో గొంతభాగము గొఱికికొని తిని, మిగిలిన భుక్తశేష మాబ్రాహ్మణున కొసంగినారట. అతం డాప్రసాదమును చేనంది భుజింప మనంబొప్పక, స్వాశ్రమమునకేగి యొకగూట నాప్రసాదమిడి మిన్నకుండెనట. నాడు రేయిస్వప్నమున యోగిగారు బొడసూపి, "నీవసూయాగ్రస్తుండవై నేనిడు ప్రసాదము భక్షింపక నుపేక్షించియుంటివి. ఇదికారణంబుగ నీకాపదలు సంభవింపనున్న"వని నమ్ముమని యంతర్ధానులైరట. అంత నాతండు మేల్కని భయవిస్మయంబులు ముప్పిరిగొన మిగిలిన రేయి యెట్లో వెళ్లించి, మరునాడుదయమున నూతనోపహారముం గైకొని యోగిగారి దర్శనమునకేగ శ్రీవా రాతని

దరిజేరనీక దరిమివేసెనట. ఆవల నావిప్రుండు గృహంబున కేగి గూటనిడిన ప్రసాదమును గ్రహించి, పదంపడి, యోగిగారిని దర్శించి ప్రసన్నవదనుని గావించుకొని, యావిపత్సముద్ర పతనమును దప్పించుకొని కృతకృతుండయ్యెనని బ్రహ్మశ్రీ ఆకుండి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు చెప్పుచున్నారు.

శ్రీవారు ద్వంద్వసహిష్ణులై భయవివిహీనులై క్షుత్తృష్ణల గణనసేయక, విజనస్థల విహారాసక్తచిత్తులై కౌపీనమునుగూడ త్యజించి దిగంబరులై, శయనాసనాది విధానములందు స్థలనిర్ణయము లేక వర్తించుచు, భక్తిప్రపత్తులు గలిగి దరిజేరిన స్వాశ్రితుల సన్మానించి వారిడు స్వల్పోపహారముల బరమప్రీతి గైకొని కృతకృత్యుల గావింపుచు, నిహాపరము లర్థించివచ్చిన శిష్యలోకమును కఠినపరీక్షలచే నలయించి యుత్తీర్ణులైనవారి గడతేర్చుచు, చూపరుల కీతండు పిచ్చివాడని దోప మార్గమునం బోవునెడ చెట్టుచెట్టు పుట్ట పుట్టచుట్టి గనుపించెడి పత్రములెల్ల నాఘ్రాణించుచు. సమీపించినవారి నదలించి యావలికంపుచు, మార్గమధ్యంబునంగల పశుమలంబులపై కొంతసేపు విశ్రమింపుచు, మఱియు నేనేమో వికటక్రియల గావించుచు, హేయాహేయ ద్వంద్వ విరహితులై దురితమతుల పరిహారణాదుల సత్కరించుచు, జలమలవిసర్జనాత్సరమున మర్మస్థాన ప్రక్షాలనములగూడ నుజ్జగించి చూపరుల కసహ్యముగొల్పుచు పరమపవిత్రులయ్యు నపవిత్రులవలె దోచుచు, నమానుషక్రియా కలాప విలాసులై కుండలేశ్వరమున కఖండశోభ గలిగింపుచుండిరి.

[27]

ఒకప్పు డన్నంపల్లి బ్రాహ్మణుఁ డొక్కఁడు పయనించుచు మార్గమధ్యంబునంగల కాల్వకట్టపై దిగంబరియై పరుండియుండిన యోగిగారిని గాంచి. నమస్కరించి శ్రీవారి కర్పించుటకుఁ దనయొద్ద నెట్టిపదార్థమును లేమి విచారించుచు, ముందునకుఁ గొంతనడక సాగించిన సమీపమునఁగల క్షేత్రమున విరాజిల్లి కాయలచే నలరారు మామిడివృక్షములను వాటిని పరిపాలించు యజమానినిగాంచి సమీపించి తన యభిమత మెఱింగించిన నాతం డమందానందమున చూతసాలారోహణంబు గావించి, పక్వఫలములఁ గానక విచారించి వృక్షమునందలరారు కాయలయం దుత్తమము లేరి ముదురుకాయల రెంటి కోసియిచ్చిన, నావిప్రుండు సంతోషాయత్తచిత్తుండై యా మామిడికాయల గైకొని యోగిగారు పరుండియుండిన స్థలమునకు దిరిగివచ్చి, యాతని నందుఁగానక సమీపమునఁగల పంచముల గృహముల దిలకించి, అందొక గేహంబున గూర్చుండియుండిన యోగిగారినిగాంచి భక్తిపెంపున నస్పృశ్యతకు జంకక మాలగూడెములోనికిం జని శ్రీవారికి తాను తెచ్చిన మామిడికాయలనిచ్చి చేతులుజోడించి నిలచిన, నతని దృఢభక్తి కలరుచు నా పులుపుమామిడికాయ లమృతములట్లు భక్షించి విప్రుని సన్మానించి పంపిరి. ఇట్లు శ్రీవారు కుండలేశ్వరమున నుండుకాలమున సమీపగ్రామమగు కొత్తలంక నివాసియగు గేదెల స్వామి, తన రెండవపుత్రుండగు గోవిందరాజులు సంతానవంతుడుగామి విచారించుచు బుత్రుని జేరి, "నీవు సంతానార్థివై కుండలేశ్వరమున వేంచేసియున్న

దిగంబరయోగిగారి నాశ్రయింపుము పొమ్ము” అనిన నాతండు వల్లెయని నాడేబయలు దేరి కుండలేశ్వరమున కేగి యోగిగారిని దర్శించి కొబ్బరిబొండములు రెండర్పింపబోయిన నాతండు కోపించి యావలకుఁ దరిమివేసెనట. అంత గోవిందరాజు భయాక్రాంత చిత్తుండై నాటికిల్లుజేరి మఱునాడు తిరిగి కొబ్బరి బొండముల గైకొనిపోయి యోగిగారినిదర్శించి బొండములర్పించిననాతండు దయాళుండై యాకాయల భుజించెనట. ఇట్లే ప్రతి రోజు గోవిందరాజు తనకు లభించిన ఫలాదికముల యోగిగారి కర్పించుచు, నాతని యనుగ్రహమును బొంది రాత్రిం బవలు భజనసేయుచు యోగిగారి వెంటనంటి సంచరించుచు, దేహాభిమానమును విడచి దేశికాచార్య సేవామహాభాగ్యము గడించుచు, నిద్రాహారములమాని వర్తించుచు, దేశికాచార్యానుమతి యప్పుడప్పుడు గృహంబున కేగి గృహకృత్యముల నెరవేర్చుకొని తిరిగి యోగిగారిని సమీపించి సేవసేయుచుండువాడు. గాని యస్థిరసంతాన సంపద నెప్పుడుగాని గోరక నిర్లిప్తుండై మెలంగుచుండె. ఇట్లుండ గొంతకాలమునకు యోగిగారి యనుగ్రహమువలననో, పూర్వకృత సుకృతము పేర్మినో మఱి యేకారణముచేతనో గోవిందరాజుగారికి పుత్రికాచతుష్టయంబును, నేకపుత్ర భాగ్యమునుగూడ గలిగి జనకుండగు గేదెల స్వామికి సంతసము గలిగించినది.

ఇట్లుండ గోవిందరాజు భక్తిశ్రద్ధలు నానాట యభివృద్ధి యగుచు గురుసేవా మహాభాగ్య తత్పరుండై గృహమున కేగుటగూడ మరచి, తన్మయానందమున నోలలాడుచు యోగి

గారికి ఛాయవలె దిరుగుచుండుట జనకుండగు స్వామియు, నగ్రజుండగు వెంకటరత్నమును గోవిందరాజు మనసు ప్రపంచ విముఖత వహించి పరమార్థావలోకనము జేయుచుండుట విచారించి, నాతని వేరువిధముగ నింటజేర్చుట కనువుగానక నెట్లో నాతని బోధించి యోగిగారిని కొత్తలంకకు జేర్చి సేవించు నట్లాడంబరచి, కార్యసాధనకు దగుప్రయత్నములు జేయు చుండ భగవదనుగ్రహము పేర్మి, శ్రీవారందునకు సమ్మతించి శిష్యునితో కొత్తలంక జేరి గోవిందుని గృహ మలంకరించె

ఇట్లు శిష్యవాత్సల్యమెంతయో విస్తరింప యోగి కొత్తలంకయందును తత్పరిసర నారికేళ వనములందును తది తర స్థలములందును సంచరించుచు, కుండలేశ్వరమునందు వలెనే కాలముద్రోయుచుండుటయు, యోగి ననుసరించి గోవిం దుడు గృహకృత్యముల నంతయు విడనాడి నిర్లిప్తుడై సంచ రించుటయు జననీ జనకులును, భార్యాబిడ్డలును సోదరులును కటకటంబడి నాతని మరలింప ననువుగానక గోవిందుని మంద లించియు గోపించియు, బోధించియు సామదానభేదముల సాగించిచూచి ప్రయోజనము లేమి, యోగిగారియందు నీకింత యనురాగ ముద్భవిల్లుట కేప్రభావము లాతనియందు గనుపెట్టజాలితివో అయ్యవి మాకును జూపించిన నీప్రయత్న మునకు మేమడ్డుపెట్ట మనియు, లేనిచో ననేకాంతరాయముల గలిగించెదమనియు బెదరించి తమపట్టును కొనసాగింపదలంచిరి.

అందుకు గోవిందు తగిన సమాధానముచెప్పకనే తన నిర్లిప్తత్వమును కొనసాగింపుచుండె. కృతార్థత నొందదలంచిన

శిష్యు లిట్లేగద వర్తించుట! ఇదియంతయు యోగిగారంతర్దృష్ట్యా నెఱింగిన వారగుట శిష్యునకుగల సంకటముదొలగింప సమయ మారయుచుండె. నిట్లుండ కొంతకాలమున కొకనాడు యోగి విజనస్థలమునందు నివసింపుచున్నతరి యకస్మాత్తుగ విపరీత మగు గాలివాన ప్రారంభించి యచిరకాలమున భూమినంతయు జలమయము గావించినది. గోవిం దీయుత్పాతమును దిలకించి దేశికాచార్యుడు విజనస్థలమునం దెట్టి యాపద నొందు చున్నాడో యనియు, నాయన నారసి గృహమునకు జేర్చి కృతకృత్యుడ నయ్యెదననియు దలంచి, యాగాలివానలో బయలుదేరి నారికేళవనములను తదితరములైన యునికిపట్లను రోసి, యోగి నెందును గానక పరితాపాన్వితస్వాంతుడై విసుకు గొనక జలపూరితములైన మిట్టపల్లముల లెక్కసేయక వెదకి వెదకి, తుదకు పెద్దకాల్వకట్టుకు దవ్వులనుండు మాగాణిగట్టున నొక తాటియాకులమట్ట మీూమున కడ్డమిడుకొని కూరుచుండి యుండిన యోగిగారిని దర్శించి, సమీూపించి నమస్కరించి తన యభిమతంబెఱింగించి దేశికునాన నాతని తనభుజమున నెక్కించు కొని సునాయాసముగ నిల్లుజేర్చి, బలిష్ఠమగు ప్రిహారిమధ్య, విరాజిల్లు నిజగృహమునంగల యొకగదియందు బ్రవేశపెట్టి, శీతబాధా నివారణార్థము చలిమంటవేసి సేదదేర్చి పాదము లొత్తుచు గొంతసేపు కూర్చుండి, యోగిగారు నిద్రించి నట్లె ఱింగి నిద్రాభంగమగునని శంకించుచు, నింటగలవారి నెల్ల నెదుట నున్న తన రెండవగృహంబునకంపి వాకిళులుమూసి, దర్వాజా వెలుపల గోవిందుడు తన యన్నయగు వెంకటరత్నముతో

గూర్చుండి యుండెను ఇట్లు దాదాపు నాలుగుగంటల కాలము గడచిన గోవిందుడు యోగిగారు నిద్రనుండి లేచి రేమోయని దలంచి తలుపుదెరచి గృహమంతయు బరికించినను యోగిగారెం దునను గనుపించలేదు. ప్రమాదమువలన నెట్టి విపత్తైనను సంభవించి యుండిన దేమోయని శంకించుచు, తదావరణమునం గల గూపముల సహితము నెదకి ప్రయోజనము గానక బరిత పించుచుండ, నీవార్తగ్రామమునంతటను వ్యాపించి పురిజనుల కలవరపెట్టినది. పలుదిక్కులకు బలువురు యోగిగారియుటకు వెంటవెంటనే జనిరి. ఇట్లుండ గొంతసేపటికి యోగిగారుత్తర బజారున దిరుగుచున్నారను వాక్యము దెలియవచ్చి నెంటనే పురవాసుల నాశ్చర్యాబ్ధి ముంచివేసినది. నష్టద్రవ్యరాసి చేకూరినట్లు సంతసించుచు గోవిందుడు పరుపరుగునం బోయి శ్రీవారిని దర్శించి తిరిగి గృహమునకు దోడ్తెచ్చి కృతార్థుం డయ్యె. ఈయద్భుతమునుగాంచి గేదెల స్వామి పుత్రి మిత్రి సహితముగా శ్రీయోగిగారికి శిష్యుడై నిరంతరపరిచర్యామహా భాగ్యమున పాలుబంచుకొని కృతకృత్యుండయ్యె. నాడు మొదలు వెంకటరత్నము గోవిందు ననువర్తించుచుండె.

అప్పటినుండి గోవిందు డెట్టియంతరాయము లేక దేశికా చార్య సేవాపరతంత్రుడై నేటివఱకు విరాజిల్లుచున్నవాడు. ఈకలికాలమునం దిట్టి యద్భుతప్రభావ సమేతుడగు గురు వర్యుండు లభించుటయు, అతికష్టములకోర్చి కఠినపరీక్షల నారి తేరి శుశ్రూషా మహాభాగ్యము గడించు శిష్యుండుండుటయు నబ్బురమేయగు గదా!. చూడుడు. ఒక్కనా డశుద్ధవిలిప్తమైన

శరీరముతోనున్న విజనస్థల వాసియగు యోగిగారిని దర్శించి గోవిందుడు సమీపించి, "బాబూ! మీ దేహమం తెంతయు నమేధ్య మలముకొనబడియున్నది. యాజ్ఞయిన నీటగడి గెదనని ప్రార్థించిన, నాతండు సమ్మతింపక నన్నీరూపమున నీభుజమున వహించి మోసికొనిపోయి పురవీథిని తీసికొనిపోయి యిల్లుజేర్చుము. పెద్దవాడనగుటచే నడువజాలక నిన్నీకష్టము నకు బాల్పడజేయుచున్నాడ. శీతబాధ భరింపజాలమి నీట గడగు వ్యాపారమునకు సమ్మతింపనైతి. గృహమున కేగిన తదుపరి నీయిష్టమువచ్చి నటుల జేయవచ్చునని యాజ్ఞపించు టయు, నెట్టియసహ్యములు దలసూపనీక నక్లేగావించి కూర్ర పరీక్షలో గడతేరినాడు. తదాది నిట్టిపరీక్ష లే చేయు చుండెనట.

నేను యోగిగారిని దర్శించుతరి గోవిందుడు గావించిన భజనవలనను అప్పుడు జరిగిన యితరకార్యములవలనను గోవిం దుని పరాకాష్టయు యోగిగారియందున్న భక్త్యాధికమును వెల్లడియైనది.

(శ్రీ)వారిని దర్శించుటకయి నాకంటె నొకరోజుముందు రామచంద్రపుర నివాసులగు కొందఱు మహమ్మదీయులును, రాజోలు తాలూకా నివాసులగు బ్రాహ్మణ క్షత్రియ లిద్ద ఱును వచ్చి కొత్తలంకయందు విడిసియున్నారు. యోగిగా రూరలేక నెక్కడనో నారికేళవనములందు గుర్మరుచున్నారు. ఈనారికేళవనములు క్రొత్తవారికి దుష్ప్రవేశములగుటచే గోవిందుని సహాయమున కార్యసాధన చేసికొననెంచి వారు

యాతని నాశ్రయించిరి. వారికోరిక కొనసాగించుటకుగాను గోవిందుడు ప్రజోత్పత్తి వత్సర మార్గశీర్ష బహుళ షష్ఠియుదయము యోగి నారయుటకేగి నాడొంటిగంటకు (అనగ) నేనూర ప్రవేశించిన కొంతవడికి యోగిగారిని కొత్తలంక బ్రవేశపెట్టినాడు. ఆతని యనుగ్రహము పేర్మి నాకశ్రమమున యోగిదర్శనము లభించినది. కృతార్థుడనైనాడ. ఇట్లుండ సాయంత్రము మూడుగంటలైనది. గోవిందుని యింటిముందు గల వేదికపై పరచియున్న కంబళముపై సన్ననిగుడ్డ ముసుగిడి కొని పరుండిన యోగి పాదములొత్తుచుండిన గోవిందునితో గొంతసేపు భజనానందమున నన్ను దేల్చుము, త్వరపడుమని యాజ్ఞాపించె. వెంటనే గోవిందుడు చితారును చిటికెలను మోగించుచు యోగిగారి శిరోభాగమునకంటి కూరుచుండి భక్తిప్రవత్తులుల్లసిల్ల గ్రమముగ రామదాసుచరిత్రయందు గల కీర్తనలెల్ల సాయంత్రి మేడుగంటలవఱకు పాడి కృతార్థుడయ్యె.

ఈ కీర్తన జరుగుచుండు కాలమున గోవిందుని తమ్ముడు గౌరయ్య నమ్రతమై యోగిగారిని జేరి కీర్తన యాపమనెదరా యని ప్రశ్నించినప్పుడు, యోగిగారు భక్తిరసము కడుపునిండు నటుల పాడనిమ్మని వెలువరచిన వాక్యమును బట్టియు, నా కీర్తనలలో "కావు కావు మటంచు గాకాసురుడురాగ గాచిరక్షించినా వయ్య రామప్రభో ॥ పాహి ॥" అను పదమును గోవిందునిచే తిరిగి తిరిగి పాడించుకొని యానందించు విషయమునుబట్టియు, యోగిగారు కబీర్ దాసునకువలె రామ

భక్తిపూరితులనియు కీర్తన ప్రారంభించినది మొదలు కొంర వడని భక్తిశ్రో రమారమి నాలుగుగంటల కాలము విసుకు విరామము లేక గురువర్యుని మనోభావానుసరణి భజనగావించి నాటిరేయి యంతయు దేశికాచార్య సేవానిమగ్నుడై యుం డుటచే గోవిందుని శుశ్రూషాపరాకాష్టయు విస్పష్టమైనది. నాడు రేయి నాలుగుగంటలకు యోగిగారు నే పరుండియుండిన వేదిక సమీపమునకు వచ్చుచున్నారని తెలిసికొనినవాడ నగుటచే నా ప్రదేశమును ఖాళిచేసి ప్రక్కనున్న వేదికపై కేగితిని. అంత యోగి నా యభిప్రాయమున కనుగుణముగ నా వేదికపై బరచియున్న తాటియాకుల చాపపై ముసుకు పెట్టుకొని పరుండిరి అప్పుడు నేనిట్లు దలంచితి. ఇప్పుడు శ్రీవారి కెరుకబరపక పాదములొత్తు కార్యమున బ్రవేశించిన గ్రొత్త వాడనగుట నాయనకోపమునకు గురికావలసివచ్చునేమో ముందు నన్నెఱింగించుకొని తత్కార్యమున కున్ముఖుడనగుట సమంజసముగా నుండునని యోచించి భయకంపములు మన మున దోలుకొడ వినయవాక్యముల 'బాబూ! తమకు చలి బాధ నడంగుట కీదుప్పటి కప్పమనెదరా'యని యొకటి రెండు పర్యాయములు విశదపరచిన శిరంబెత్తిచూచి 'దుప్పటి నే కప్పుకొనియున్నాడ; నినిచాలు'నని జబాబు చెప్పిరి. అంతట నే నూరకొనక, 'మీరు కప్పుకొనినది దుప్పటికాదు. సన్నటి గుడ్డ; అది చలి నాప లేదు. ఈ దుప్పటి మొద్దుగానుండుట జలి నాపగల'దని చెప్పుచుండు నంత, కోపమున నరుగు దిగి

పాద్మని మందలించిరి. అంతట నే భయాక్రాంతుడనై సమీప మునను్న మఱియొక యరుగుపై కూరుచుండి శేషించిన రాత్రి వెళ్ళించితిని. కోపముచేతనైనను శ్రీవారిని నాతో మాట్లాడించిన భగవానుని వేనోళ్ల వినుతించుచున్నాడ నాడు శ్రీవారు గావించిన యమానుషచిత్రము నొకటి వినగలిగితిని. ప్రొద్దున లేచి భక్తావతంసుడును, సుగుణాగణాలంకారుడును, భూసురవరుడునగు ఆకుండి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని దర్శించుటకు నేను కేశనకుఱ్ఱు (కాశీనకురు) కేగితిని. గతరాత్రి శ్రీవారి దర్శనార్థమేతెంచిన, భక్తులుకాక నాటి యుదయమున కాకినాడ నర్సాపురములనుండి సంపన్న గృహస్థులేతెంచి యోగిగారిని సమీపించి, యతని యనుమతి లేకయ భక్తి పెంపున బాదములనంటి నమస్కరించుటచే జనసమ్మర్దమున కిష్టపడని వారై, విజనస్థలవాస సంపద బురికొల్ప నెవరితోడను జెప్ప యేక నారికేళవనముల వైపునకు బరుగెత్తికొని పోయిరట. చూపరులెల్లరు శ్రీవారిని వెంటనంటి కొంతదూరమేగి వారిని కలసికొనజాలక తిరిగి గ్రామమున కేతెంచిరి. వారిలో ముళ్ళ పూడి పాణియ్యావధూతస్వామి [గోళ్ళబుచ్చిరాజావధూత గారి శిష్యకోటికి జేరినవారు] మాత్రము శ్రీవారిని వెంటనంటి పోవుచుండెనట. యిట్లు కొంతదూరమేగిన శ్రీవారు పిచ్చి పిచ్చి నడకలతో బోవుచు నొకదడి చాటున కేగిరట. వెంటనే యవధూతగారు నాదడి దరిసి చూచునప్పటి కచ్చట యోగి గారు ఈ చిత్రమున కబ్బురపడుచు, అందందు వెదకి యెందున గానక, మార్గమునం దగుపడిన వారినందరిని యోగిగారి పోబ

డిని గుఱించి ప్రశ్నించియు, వారివలన తగు సమాధానము బడయఁజాలక భగ్నప్రయత్నుడై యింటికివచ్చి తన ప్రయాస మంతయు విఫలమైనదని నాతో జెప్పి విచారపడినాడు.

నాటి సాయంత్రము మేమిద్దరము గోవిందుని పురస్కరించుకొని, నారికేళ వనములన్నిటిని తిరిగి తిరిగి యెందునను శ్రీవారిని గనుగొనజాలక, సన్న్యాలవలన శ్రీవారి నివాసప్రదేశ మెఱుంగదలించి మార్గస్థుల నలుగురైదుగురిని ప్రశ్నించిన 'కూతపమున్న శ్రీవారుగలరు, త్వరగబోయిన సందర్శింపగల'రని చెప్పిరిగాని. మేమెంత వడి వడిగ నడచినను శ్రీవారిదర్శనము లభింపక విఫలమనోరథులమైతిమి.

యోగిగారి కన్నభాషలయందును ప్రవేశముగలదు. అందులో నురుదు తెలుగు ప్రధానభాషలుగా నున్నవి. ప్రాపంచికు లడుగుశుభాశుభ ప్రశ్నలకు సమయానుగుణముగ జబాబు లిడుచు లోకాపకారము గావించుచున్నారు. ఒకప్పుడు గేదెల వెంకటరత్నముగారు చనువుమై 'మీారు నల్లకొండ సీమనుండి రాగతమేమి?' యని యడిగినప్పుడు, ప్రారబ్ధము గొట్టుకవచ్చినది యని జబాబు చెప్పిరట. వీరు నాగపూరులో దేహముచాలించిన బాబా తాజుద్దీనునకు మిత్రులనియు, నక్కడ కొంతకాలము వసించియుండిరనియు తెలియుచున్నది.

'కొద్దిరోజుల క్రిందట పచ్చమట్ల రామకృష్ణం రాజు గారి కొబ్బరితోటలో, బుట్టయొద్ద యోగిగారు పరుండియుండ సర్పమొకటి శిరమువద్దజేరి తన శరీరము చుట్టచుట్టుకొని పడగచే శ్రీవారి మోామున కెండతగులనీక నడ్డము పట్టియుండుట

మేము చూచితి'మని బసవ నారాయణస్వామి. పొత్తూరి వెంకట సోమరాజు మఱికొంద ఱీడిగెలు చెప్పిరని కొండపల్లి యజ్ఞన్న గారు చెప్పుచున్నారు. యోగి నప్పుడప్పు డూరిలోనికి దీసికొని వచ్చిన మారుమాటాడక వచ్చును గాని అట్లుజరుగని యెడల నాహారమేమియు గొనకనే విజనస్థలమున సర్వకాలము నివ సింపగలడు

తాను పరమార్థావలోకనము చేయుకాలమున నెవరే యూరికిదీసికొని పోయినను మారుమాటాడక బోవుచుండు వారట. ఒకప్పు డమలాపుర వాస్తవ్యులు కొంద ఱాలోచించి శ్రీవారిని చేయిబట్టుకొని తీసికొని వెళ్ళి, బండిమీద గూరుచుండ బెట్టి, తమ గ్రామమునకు దీసికొనిపోయి ఒకయింట విడియించి యుత్సవప్రయత్నము జేయుచుండిరట. ఇంతలో శ్రీవారు బహిర్ముఖులై వారినందఱ వంచించి యెందేనియు జనిరి. ఇది యెఱింగి ఆయూరివారు శ్రీవారి నెందుననుగానక, తమ ప్రయ త్నము వ్యర్థమగుటకు పరితాపపూరితులై వెంటనే కొత్తలంకకు వచ్చి విచారించి, శ్రీవారిని దర్శించి భయాశ్చర్యముల నొందినారట.

ప్రియశిష్యుడగు గోవిందు డొకప్పుడు యోగిగారి నను మతివడసి తిరుపతి మొదలగు పుణ్యస్థలముల సేవించి వార ణాసి కేగ దలంపుగలవాడై, దీర్ఘప్రయాణమున విశాఖపట్ట ణము జేరియుండునంత, నింటికిబోవలయు నను యభిలాష వొడమి ధూమశకటారోహణముజేసి నాటిరాత్రి పండ్రెండు గంటలకు ద్వారపూడి దిగి మరునాడుదయము 10 గంటలకు

సమారమి ఇరువది క్రోశముల కెక్కువదూరముననున్న స్వగ్రామమునకు జేరి, యింత యచిరకాలమున దీర్ఘ ప్రయాణము చేయుట కబ్బురపడుచునుండి, తనభార్యాబిడ్డలు కిందః3 రోజుదయమున శ్రీవారిని దర్శించి, తమ ప్రియశిష్యుడేగి చాలాకాలమయినది, 'వారి వియోగము మాకు భరింపరాక యుండుటచే నలమట నొందుచున్నారమని. యచిరకాలమున రప్పించి మమ్ము ధన్యులగావింపుమని, ప్రార్థించిన, రేపు 10 గంటలకు రాగలడని చెప్పి వారిసమాధాన పరచినారని యతనికి తెలియవచ్చుటచే, విశాఖపట్టణములోనున్న తాను నేటనే యోగిచే, యాకర్షింపబడి, సకాలమున కింటికి రాగలిగితినని దలంచి శ్రీవారి ప్రభావమును నిరంతరము స్మరించుచు వారి పాదసేవ చేయుచున్నానని గోవిందరాజు చెప్పుచున్నాడు.

మఱియు శ్రీవారికి భక్తిచే చేయబడిన భజన పరమాహ్లాదజనకమగుటచే నెంతటి విద్వాంసులే తెంచి సంగీతము పాడుట కనుజ్ఞయిమ్మని ప్రార్థించినను ఆప్రార్థన లంగీకరించు వారుగారట. గాని శిష్యుడు గోవిందుని యొక్కయు సుంకరి రామదాసుగారి యొక్కయు భజన స్వామివారి నెంతయు మోదాంబుధి దేల్చివేయు నని తెలియుచున్నవి. వీరు సంగీత విద్వాంసులు గాకపోయినను గాత్రమాధుర్యము, లేనివారైనను వారిని ప్రేమించినట్లు భజనలో మఱియొకరిని ప్రేమించుట లేదని గూడ తెలియుచున్నది.

అనేకమంది స్త్రీలు పుత్రభిక్ష మర్థించి మనోరథ సిద్ధులు గడించి పిల్లవాండ్ల కెట్టిపేరులు పెట్టవలయునో

తెలుసుకొనుటకు శ్రీవారిని కోరిన, రాముని పేర్లు బెట్టునట్లా జ్ఞాపించువారట దీనివలన రామభక్తి వీరి హృదయమున నెట్లు నాటుకొనిపోయినదియో విశదమగుచున్నది. వీరిని ప్రేమించు వారు బ్రాహ్మణులు తప్ప, శేషించిన యన్నిపక్షములవారును గలరనియు, బ్రాహ్మణులలో గొద్దిమందిమాత్రమే గలగనియు ఆకుండి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు చెప్పుచున్నారు. ఈ కొత్త లంక యమలాపురము తాలూకాకు చెందియున్నది. యిందు గల పెద్ద కాల్వకట్టన శ్రీవారు వచ్చుచుండగ, నాతని వెదకుచు పోయిన శిష్యుడు గోవిందుడు కట్టనెక్కి చూచి, తనకు రెండు ఫర్లాంగుల మేరలో యోగిగారు వచ్చుచున్నారని తెలిసి, యక్కడనే నిలచి చూచుచుండ, నకస్మాత్తుగా కాలువ కివలి యొడ్డునుండి యావలికి జేరి శరీరము తడియకనే యావలికట్ట మీద చూడగలిగితిరనియు, నిరువది గజముల వెడల్పున బారు చున్న కాలువ నతిప్రయాసమీద నీది, నేనావలిగట్టునకు జేరి యోగిగారికి నమస్కరించి శరీరము తడియకనే ఈవలిగట్టున కెట్లు రాగలిగితిరని ప్రశ్నించిన, బల్లకట్టుమీద దాటితినని జెప్పి రనియు విచారించిన అక్క డెచ్చటను బల్లకట్టుగాని సంగడీ గాని లేదని తెలియవచ్చినదనియు గోవిందరాజు చెప్పు చున్నాడు. ఈ గ్రామమందుగల బ్రాహ్మణ బ్రాహ్మణే తరులందఱు శ్రీవారి భక్తులైయున్నారు. చాలా దూరదేశము నందుండు భక్తులుగూడ నప్పుడప్పుడు యోగిగారికి ఫలహార ముల బంపుచుందురు గాని, ఇష్టమైనయెడల నా పదార్థముల గొద్దిగ స్వీకరించుటయు స్వీకరింపకపోవుటయు గలదు. నే నీ

గ్రామమునందున్న సమయమున దాదాపు పదునైదు క్రోశముల దూరమునందున్న కపిలేశ్వర పు॰ వాసియగు శ్రీమతి వెంకటనరసమ్మగారు మనిషిచే జున్ను పంపిరి. దానిని శ్రీవారు గ్రహింపగలిగిరి. వీరి మహాప్రభావములును చర్యలును లెక్కింప నాకోటి వశములు గావు గాని నిక యొకటి రెండు విషయములజెప్పి ముగించెద. నొకప్పుడు యోగిగారి కాలిమడమకు మడిమె మండెయను రణము లేచి చీము నెత్తురలతో నావరించి యున్నను, మామూలు ప్రకారము నారికేళారణ్యములయందు సంచారము జేయుచు, రణమును దడపుచుండిసను యెట్టిమందును వేయకుండగనే యచిరకాలమున మానిపోయినదట. ఇప్పటికి రెండుసంవత్సరముల క్రిందట నొకనాడు యోగిగారిని కొందఱు గ్రామస్థులు వెంటబెట్టుకొని వచ్చుచుండగ మార్గమధ్యమున పామొండు కాలునచుట్టుకొని బలముగ కరచిన, యోగిగారాపామును బలవంతముగ లాగిపారవేసిరట అంతట నదిపోక తిరుగ పడగెత్తుకొనివచ్చి యోగిగారిని కరచినదట. అది చూచి సమీపవర్తులు దాని చంపనుంకించిన, మానిపించి గ్రామమున కేతెంచి యెట్టి బాధయు లేకనే నాటిరాత్రి శ్రీవారు వెళ్ళించిరి. ఆపాము మరునాటికి నిష్కారణముగ చచ్చియుండుటను చూచి పురజనులు యోగిగారి ప్రభావమున కబ్బురపడిరట. అహింసావ్రతదీక్షాపరుని గాంచినంత సహజ వైరస్వభావములు గల జంతువులు మిత్రత్వము నెరపునని పెద్దలు చెప్పుచుండ, యోగిగారిని సర్పమెట్లు కరవగలిగినది? లేదు, లేదు. అది పాముగాదు. భగవానుడు సర్పరూప

మునుదాల్చి యోగి యహింసావ్రతమును బరీక్షించి, తత్పరీక్షలో నుత్తీర్ణులయిన యోగిగారి ప్రభావము లోకమున కెఱింగింప, సర్పశరీర మంద విడచి స్వస్థలమున కేగియుండనోపు నని దలంచెద. ఇదియే నిజము.

యోగిగారి వయోనిర్ణయమును గుఱించి విచారింప అకుండి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిట్లు చెప్పుచున్నారు. తన చిన్నతనమున కుందలేశ్వరములో యోగిగారి ప్రథమదర్శన సమయమున ఈయనగారికి దాదాపు ముప్పది సంవత్సరముల వయస్సుండుననియు, ముప్పది సంవత్సరములు కుంద లేశ్వరమునను పదునారు సంవత్సరములు కొత్తలంకయందును వసింప గలిగిరనియును. ఈ లెక్కనుబట్టి చూచిన యోగిగారి వయస్సు రమారమి డెబ్బదియారు లేక యెనుబది సంవత్సరములయినట్లు తెలియుచున్నది. యోగిగారిని చూచినవారి కిదియే నిజమగునని తోచగలదు. ఇదియింకను విచారణీయాంశము.



# ప్రతాప కోటయ్యశాస్త్రి

రచయిత :- చంద్రమౌళి చిదంబరరావుగారు

స్రక్చందనాది భోగంబుల నాసింపక బ్రహ్మానంద మనుభవించువా డాత్మారాముడు. ఈత డనుభవించు సుఖము బయటి నుండి వచ్చినదిగాదు; బయటిసుఖ మస్థిరమైనది. విషయము లస్థిరములగుట, వీటివలన వచ్చు సుఖమునకు స్థిరత్వమెట్లు లభించును ?

పరబ్రహ్మ సత్యవస్తువు మార్పు లేనిది, నశింపనిది, వికారములు లేనిది. పరసుఖ మనుభవించి యానందించువాడు, బాహ్యమును తేరిపార నైనను జూడడు సాధకుడు తన ఇంద్రియములకు విషయములతో పొత్తు తప్పించి పరమాత్మప్రాప్తి హత్తించి నచో పై ఇంద్రియములకు దివ్యత్వ మలవడి స్వస్వరూపానుభూతి సంపాదించినవా డగుచున్నాడు. ఇప్పు డీతడు జీవుడుగాదు, ప్రత్యక్ష పరబ్రహ్మము. బురదలోని కుమ్మరిపుర్వువలె సంసారమున వర్తించుచున్నను, ద్వంద్వరహితుడై, విషయానందములకు సాక్షిమాత్రు డగుచున్నాడు. వీనికి అనర్థరూపమైన ద్వైతమునశించినది అద్వైతానందభాగహారి ఇట్టివారు మనకోటయ్యశాస్త్రిగారు. తండ్రి జోగయ్యశాస్త్రిగారు. నివాసము బాపట్ల తాలూకా, నాగండ్ల. చిన్నతనమునుండియు విరాగియు నిరపేక్షియునై జీవయాత్ర సాగింపుచుండువారు. బాల్యమున తెలుగుబడిలో నించుక విద్యా

భ్యాసము చేసెను గాని అందు విశేష నైశద్యము గాంచియుండ లేదు. ఉపనయనమైనపిమ్మట వేదాధ్యయనము సలిపెనో లేదో స్పష్టముగా, తెలియదుగాని వీరి జీవితమందు ప్రధానముగా గమనింపదగిన యంశములు నిరపేక్షత్వము, వినయ వివేకాది సద్గుణసంపత్తి, అతిశాంతము, నిరంతరానందానుభవము, సమత్వము. జననీ జనకులు ధనవంతులుగాక సామాన్య స్థితిగతులలోనుండి భూమిసాగుచేసికొని జీవించుచు వచ్చిరి. కోటయ్యగారికి మాత్రము వ్యవసాయమందు శ్రద్ధ లేక తలిదండ్రుల వత్తిడిచేత పొలమునకు వెళ్ళుచువచ్చుచు నుండిరి. గాని తక్కిన కృషీవలులవలె పంట పండింపవలెనను నాసక్తిగాని, యుత్సాహముగాని, పండినవేళల సంతోషము గాని, యెండినవేళల విచారముగాని లేక, నిస్పృహులై కాలక్షేపము జేయుచువచ్చిరి. జొన్న, మొక్కజొన్న మొదలగు సస్యములు పండినసమయములలో దారిఁబోవువారిని పిలిచి జొన్నకంకులును, నూచబియ్యమును యిచ్చుచు సంతసింపుచుండిరి. పొలముకావలికై తానున్న సమయమున పొలములో పశువులుపడి మేసినను, ఆకాశమున సంచరించు పిట్టలెన్నివచ్చి కంకులను తినుచున్నను వానిని చూచుచుండియు వారింపక, అన్నిజీవరాసులు తనచేలో పంటతిని సంతుష్టిగాంచుచున్నవి గదా యని యపరిమితానంద ప్రవాహమున నోలలాడుచుండురు. వీరిచర్య తలిదండ్రులు గమనించి యప్పుడప్పుడు కోపించుచు వచ్చినను స్వాభావసిద్ధమగు నతని యుదాసీనవృత్తి మారలేదు. పొలముపనికి పనికిరాడనియెంచి యింటిపనుల

యందుఁ బ్రవేశపెట్టిన నిరుగుపొరుగువా రేవస్తువు కావలెనని కోరిన నయ్యది నిరభ్యంతరముగా నిచ్చుచువచ్చెను. తలిదండ్రులు మందలింపఁగా వినయముతో సమస్త జీవరాసుల నిరంతరము పోషించు భగవంతుఁడు మనలమాత్రము పోషింపఁడా యని సమాధానముఁ జెప్పుచుండును. అట్లు కొన్ని సంవత్సరములు గడచి యిరువది యేండ్ల ప్రాయము రాగా గొల్లపూడి కాపురస్థుఁడు కూరపాటి వెంకటాద్రియుఁడు తనకుమార్తె మహాలక్ష్మమ్మను కోటయ్య శాస్త్రిగారికిచ్చి వివాహముచేసెను. పిమ్మట కొన్నాళ్ళకు తండ్రి కుమారుని పిలిచి, మనకు ఋణబాధ యధికమైనది. భూములు దక్కునట్లు లేవు. నీభార్య కాపురమునకు రానున్నది నీవు సోమరిపోతువై యింటను డరాదు. యెచ్చటికేనిపోయి ద్రవ్యము సంపాదింపవలసిన దని తీవ్రముగాను, ఖండితముగాను పలుకగా, కోటయ్యశాస్త్రి మారుమాటాడక మరునాడే ద్రవ్యార్జనాకార్యభారవాహియై, ఆకాలమందు బీదబ్రాహ్మణులు తరుచుగా ధనార్జనకై పోవుచుండు నైజామురాష్ట్రమునకేగి, సికిందరాబాదులో నొక సత్రము పంచలోఁజేరి యారాత్రిగడపి, మరునాడొక వీధిని పోవుచుండగా గుబ్బము నారాయణయను నొక ధనవంతుడగు వర్తకుడు జబ్బుపడి యనేకమంది వైద్యులు మందిచ్చినను, రోగము నెమ్మదింపక వ్యాధిబలమై జీవితాశవదలిన పరిస్థితులలో, పలువురు బంధుమిత్రులు చూచుటకు వచ్చుచు పోవుచు సందడిగానుండుటచే, కోటయ్యశాస్త్రిగా

రాజనసంకులము చూచుట తటస్థించినది. అది యేమో యని దలంచి తానును లోనికి వెళ్ళి చూచెను. శాస్త్రిగారి జీవచరిత్రయందొక గొప్ప పరివర్తన కానున్న యోగముం డుటచే కాబోలు వ్యాధిగ్రస్తుని సమీపబంధు వీకోటయ్య శాస్త్రిగారి నొకగొప్ప వైద్యునిగా దలంచి రోగిసిచూచి యౌషధ మీయ వేడిరి. శాస్త్రిగారు తనకు వైద్యమందు నైపుణ్యము లేదని చెప్పినను వారదినమ్మక బలవంతపెట్ట సాగిరి. అంతట శాస్త్రిగారీశ్వరునిపై భారము వేసి తనయొద్ద నున్న యక్షతిలకుప్పెను నీటిలో నరగదీసి ఈతీర్థమే రోగికి సంజీవి యగుంగాతయని సంకల్పించి యిచ్చెను. అట్లు రెండు మూండు దినము లాతీర్థమివ్వగా రోగికి రోగము తగ్గినందున రోగికిని యాతని బంధువులకును శాస్త్రిగారియం దత్యంత భక్తిశ్రద్ధలు గలిగెను. అట్లు కొలది రోజులకు వ్యాధి పూర్తిగా నెమ్మదింప నారాయణ సంతసించి, శాస్త్రిగారిని సత్కరింప నెంచి కావలయునదెల్ల నిత్తు, గోరుమని చెప్పగా నిరపేక్షాధ నుండగు నప్పరమసాధుశిఖామణి తాను కాశీచేరుటకగు వ్యయమిమ్మని యడిగెను. నారాయణ, కోటయ్యశాస్త్రిగారి యల్పసంతోషమున కబ్బురపడి అట్లే చేయింతునని చెప్పి శాస్త్రిగారిని కాశీకంపి కొంతిధనము శాస్త్రిగారి తలిదండ్రులకు గూడ పంపెను.

ఇట్లు మనకోటయ్యశాస్త్రిగారు కొలది రోజులలోనే కాశీపట్టణముచేరి. ఉత్తుంగ తరంగయగు గంగాతరంగిణిం

గాంచి మనం బుప్పొంగ, నుత్తరవాహినియై ప్రవహించు నాత రంగిణీ భంగములుగల మణికర్ణికలో మునింగి, యభంగ భక్తి పారవశ్యముచే నోలలాడి విశ్వనాథుని దర్శించి యన్నపూర్ణా దేవింగాంచి ప్రణమిల్లి, మైమరచి యానందరస కల్లోలినీ భంగ ములలో నీదులాడుచు, చాలసేపచ్చట సంపూర్ణ ధ్యాన నిమగ్నుఁడై విశ్వనాథుని తన మనోవీథిఁ జదునిల్పి పూజిం పుచు సంతసింపుచు, అనిర్వాచనీయానుభవావేశ పరవశుఁడై పడియుండి, తుదకు గ్రమ్మఱ ప్రపంచజ్ఞాన స్ఫురణచే నొడలు తెలిసి పలుమారు తనయదృష్టమును బొగడుకొనుచు, తనను ప్రయాణమునకు పురికొల్పిన తండ్రిని. ధనమిచ్చిన వర్తకుని కృతజ్ఞతతో నభినుతించుచు నన్నపూర్ణ సత్రమున కేగెను. ఇట్లు నిత్యము ప్రాతఃకాలమున లేచుచు గంగాస్నాన మొనర్చుచు విశ్వేశ్వరు దర్శించుచు గంగాజలంబులు నభిషేకముఁ జేయుచు, నన్నపూర్ణా విశా లాక్షింగాంచి యాజగజ్జననీ పాదపద్మములకు భక్తిపరవశుఁడై వందనము చేయుచు, ధ్యానము చేయుచు కతిపయ మాసంబు లచ్చట గడపుచుండెను. అట్లుండ నాతని సుకృతపరిపాకవశం బున శ్రీ బాలసరస్వతీస్వామి కోటయ్యగారి యోగ్యత తిల కించి, విరాగిత్వ ముపలక్షించి శమాదిసంపద కలరి భక్తికి మెచ్చి తనయనుగ్రహమునకు పాత్రుఁడనియెంచి యొక నాఁడు కోటయ్యగారిం గాంచి, 'నాయనా! నీవు దేవి యను గ్రహమునకు పాత్రుఁడవైతివి రమ్మని' చెప్పి యాతని తనయాశ్రమమునకుఁ దోడ్కొనిపోయి త్రిపురసుందరీ మహా

మంత్రముపదేశించి, దానికవసరమగు నంగన్యాస కరన్యాస పూర్వకవిధానము నభ్యాసము చేయించెను. సద్గురు కటాక్ష మహిమచే కోటయ్యగారు మంత్రసిద్ధియు, యోగసిద్ధియుగడించి పూర్వమునకంటె నధికవిరాగియై, భక్తియుక్తుఁడై యుండి కతిపయవత్సరంబులకు స్వదేశమునకు రా పయనమయ్యెను. ఈలోగా తమ తనయుని వృత్తాంత మెఱుంగక తలిదండ్రులును, అల్లు డేమయ్యెనో తెలియక అత్తమామలును, భర్త యెచ్చట నున్నాఁడో వినరాక భార్యయును పరితపించుచు, దైవమును నిందించుచుండిరి. ఇట్లుండ కొన్నాళ్ళకు కోటయ్యగారు తండ్రి కోరిపంపినట్లు ధనముతోగాక సంపూర్ణ భక్తిజ్ఞానధనములతో వచ్చిన, మృతుఁడైనవాఁడు పునరాగతుఁడైన యట్లెంచి జననీ జనకులు నత్తమామలు భార్యయును సంతసింపుచుండిరి. బంధుజనములును సంతుష్టచిత్తులైరి మిత్రులానందమందిరి. అంత మామగారు కోటయ్యగారిని తనయింటికి దీసికొనిపోయి యతని వినయ సౌశీల్యాది గుణములకు సంతసించినను ప్రపంచమునకు మాత్రము పనికివచ్చువాఁడుకాఁడని యెంచి యసంతుష్టుండయ్యెను. భార్య కాపురమునకు వచ్చినను కోటయ్యగారు తామరపాకుమీఁది నీటివలె ప్రకృతి నంటియుండక సంచరించుచు ఆత్మనిష్ఠా నిమగ్నమానసుండై యుండెనుగాని, తక్కినవారివలె ప్రపంచ సౌఖ్యలోలుఁడు గాకుండెను ధనసంపాదనాశక్తిగాని, సంసారభార సంచలనముగాని పొందక వైరాగ్యముతో సంచరించుచు వచ్చెను. అట్లుండ నతనికి ప్రథమపుత్రోదయముఁ గలిగెను. జన్మనక్షత్రము మంచిది

కానందున గ్రహశాంతిఁ జేయవలసివచ్చినది. ఈసందర్భమున కోటయ్యగారి యమానుషశక్తి కొంత ప్రకటితమయ్యెను. శాంతిచేయుటకు వలయుధనము లేదని కోటయ్యమామగారు స్పష్టముగాఁ జెప్పిరి. కోటయ్యగారికి సంపాదనలేదయ్యె. ఇఁక ద్రవ్యము సమకూర్చుటెట్లు? కోటయ్యగారుమాత్ర మధైర్యముఁ జెందలేదు. తనయందు విశ్వాసముగల కాకుమాను వాస్తవ్యుఁడు మాజేటి శేషయ్యయను వర్తకుని కడకేగి, తన పుత్రుని జన్మనక్షత్రశాంతికై నలువదిరూప్యము లప్పయిమ్మని కోరెను. గాని శేషయ్య అప్పిచ్చుట కిచ్చగింపడయ్యె. అప్పిచ్చినచో తిరిగి కోటయ్య అప్పుతీర్ప జాలఁడను సందేహముచే నతఁడు ఋణమీయఁదలంపలేదు. కోటయ్యగారు శేషయ్యచే తిరస్కృతుఁడయ్యును సంతోషముతో గొల్లపూడి కేగెను. పిమ్మట శేషయ్య తన మామూలుప్రకారము సాయంకాలము శివాలయమున కేగి స్వామినిదర్శించి గుడిముంగిటఁ గూర్చుండి ... చింతుకసేపు కూర్చునియుండ, ననన్యసామాన్య సౌందర్యాతిశయములచే నలరారు నొకజవ్వని మవ్వంపు కాంతులతో తనకు ప్రత్యక్షమై, "నాభక్తునకు నలువదిరూప్యము లప్పీయక నిరాకరించితివా?" యని యడిగి యదృశ్యయయ్యెను. అతం డచ్చెరువంది మేను వడవడ వడంక, 'కోటయ్యగారి యుపాస్యదేవతయగు త్రిపురసుందరీదేవి కాబోలు,'నని తలంచి మరునాడు కోటయ్యగారున్నచోటి కేగి 'అయ్యా! మీకు శాంతికి కావలసినదెంత?' యని యడిగెను. కోటయ్యగారు కావలసిన సామగ్రి యెంతయో? యెఱుంగని వాడగు

టంజేసి స్వల్పముగా, నేబదిమందికి మాత్రము జాలునామగ్రి చెప్పెను. శేషయ్య తానా వస్తుసంభారమును శాంతినాటికి గొల్లపూడికి చేర్చెదనని చెప్పెను. అంతట కోటయ్యగారు తనదారి నేగెను కోటయ్యగారు శేషయ్య వస్తుసామగ్రిం దెచ్చునను ధైర్యముతోడనో లేక సహజమగు నుదాసీన భావముతోడనో శాంతికగు ప్రియత్నముచేయకయే యున్న కుండెను. శేషయ్య తన వాగ్దానముసంగతి మఱచి తన స్వంతపనులమీద బాపట్లకేగెను. శాంతి సమీపించెను. బాపట్లలో నతఁడు కోర్టువ్యవహారముమీద నిలువవలసి వచ్చెను. శాంతిమాట మఱచిపోయినందున వస్తుసామగ్రి గొల్లపూడి చేర్చ ప్రయత్నముచేయుట సంభవింపలేదు. శేషయ్య శాంతి మాట మఱచినను, కోటయ్యగారికి కార్యభారమందు శ్రిద్ధ లేకున్నను, భక్తపరతంత్రయగు త్రిపురసుందరీదేవి తనవిధాయక కృత్యమును మాత్రిము మఱువలేదు శేషయ్యకు తిరిగి తన దివ్యసుందర శరీరమును చూపెను. 'తత్క్షణమేగి తనభక్తునకు చేసిన వాగ్దానము తీర్చు' మని యాజ్ఞచేసెను. శేషయ్య భయకంపితగాత్రుఁడై యదరిపడి తనదావా వాయిదా కోరుమని ప్లీడరుగారికిచెప్పి త్వరిత ప్రియాణముతో నింటికేగి యారాత్రివేళనే ధాన్యము దంపించి కావలసిన తక్కిన సామగ్రితో తాను బండిమీద తెల్లవారువేళకు గొల్లపూడిచేరెను. ఆపూట శాంతికి వస్తుసామగ్రిలేదు, కోటయ్యగారికి ద్రివ్య సంపాదనాశక్తి సున్న. ఇట్లుండియు కోటయ్యగారంతకు మున్నె లేచి బ్రాహ్మణుల పిలిచివచ్చుటకు చుట్టుపట్ల గ్రామ

ములకేగెను. ఈపరిస్థితులలో భార్యయును బంధువులును తహ తహలాడుచు డిరి. అంతలో శేషయ్య వస్తుసామగ్రితోం జేరగానే బంధువులకు ప్రాణములు లేచివచ్చెను. శాంతి ప్రయత్నములు చేసిరి. కోటయ్యగారింటికి జాముప్రొద్దెక్కి వచ్చిరి. శాంతి జరిగెను. బ్రాహ్మణభోజనములు మాత్రము కాలేదు. ఇన్నూరుమంది బ్రాహ్మణులు గూడిరి. ఏబదిమందికి మాత్రము వంటచేయబడెను శేషయ్య నిప్పచ్చరముగ నిల్లు చూచి, ప్రయత్నముచూచి, వస్తుసామగ్రిచాలమి చూచి, ప్రయత్నము చాలదని శంకించి భయపడి కోటయ్యగారినిపిలిచి, ''స్వామీ! వంటకములు చాలనట్లున్నవి యెక్కడికైనా వెళ్ళి బియ్య మప్పుఅయినా తెమ్మన్నారా?'' అని యడిగెను. కోటయ్యగారు నవ్వి, భయము లేదు అందఱికిసరిపోవును. అనిచెప్పి లోనికి వెళ్ళెను. బ్రాహ్మణులు బారులుతీర్చి కూర్చుండిరి. ఇంట్లోవారు పదార్థము చాలదని విస్తళ్లువేయుటకు జంకుచుండిరి. కోటయ్యగారు అన్నపురాసిని చూచి తలయూచిరి. తనకు అత్తవారు శాంతిపీటలమీద పెట్టిన క్రొత్తవస్త్రములను గిన్నెలోనున్న నేతిని జేర్చి అగ్ని హోత్రములో వేసిరి. హవ్యవాహనుడు సంతుష్టుడయ్యెనని కోటయ్యగారు సంతసించిరి. తక్కినవారతని వెఱ్ఱితనమునకు నగచి పలువురు బలు మాటలాడిరిగాని కోటయ్యగారామాటల గమనించి లేదు. దేవికి అన్నపురాసి నైవేద్యముపెట్టి మంత్రపుష్పమిడిరి. ధైర్యముతో కోటయ్యగారు వడ్డనచేయుడని హెచ్చరించి అన్నపు

రాసివద్ద తానునిలవబడి పళ్లెరము లందిచ్చుచుండెను. వడ్డన పూర్తియయ్యెను. యేబదిమందికి మాత్రముచేసిన పదార్థ మిన్నూరుమందికి వినియోగింపగా నింకను మిగిలెను అప్పుడు బంధువులకును నింటిలోనివారికిని కోటయ్యగారిశక్తి తెలియ వచ్చెను ఆనందపరవశులైరి శాంతి నిర్విఘ్నముగా నెరవేరెను. శేషయ్యా సంతసించి తనయూరుచేరెను.

కోట్యయగారిట్లు నిర్లిప్తవృత్తితో సంచరించుచు ద్వాదసీవ్రతమనుష్టించువాఁడై ప్రతిదాద్వశినాఁడును బ్రాహ్మణ సమారాధన చేయుచూవచ్చెను. ఆరోజున తనకునచ్చిన గృహస్థుకడకేగి ద్వాదశికి కావలసిన పదార్థములు సమకూర్చుచు వచ్చెను వీరిముఖారవింద దర్శనముచేలోభికూడ త్యాగియై కోరినపదార్థముల నొసంగుచుండెడివాడు. అడిగిన వారిచ్చినను యీకున్నను రాగద్వేషములు లేక జయాపజయములయందు సమత్వముగల్గి యానందము చెందుచు తనసౌమ్య స్వభావముచే సమస్తజనుల చిత్తాకర్షణముచేయ గలిగినమహనీయుఁడను ప్రసిద్ధిగాంచెను.

శాస్త్రిగారికి విద్యాపాటవముగాని, సంస్కృతభాషాజ్ఞానముగాని, శాస్త్రపరిచయముగాని, తాదనాపటిమగాని, వాగ్జాలముగాని, ఆత్మశక్తిచూపు ప్రయత్నముగాని, వేషభాషలుగాని లేకున్నను జనులుమాత్ర మాతనిమహానుభావుఁడనియెంచుచుండిరి. ఎచ్చటికేగినను తానువచ్చినసంగతియేయెఱుంగనిరీతివర్తించుచు వచ్చెను. ఇట్లుండ కొన్నాళ్లకాయన మన్నవగ్రామము

నకు వచ్చెను. మన్నవ పలువురు బ్రాహ్మణ గృహస్థులున్న నొకచిన్నగ్రామము. ఆగ్రామ వాస్తవ్యులు వేదాధ్యయన మందాసక్తులై కర్మిష్ఠులై యతిథిపూజలందాసక్తులై యుండు వారు. అభ్యాగతులెందరువచ్చినను నిరభ్యంతరముగా భోజన సత్కారము చేయుచుందురు. అట్టి మన్నవగ్రామమునకు కోటయ్యశాస్త్రిగారు రాగా? తమ సహజసత్కారకార్యస్వభావము ననుసరించి, మన్నవవాస్తవ్యులాతని గౌరవించి యాదరించిరి. తక్కినయూళ్లలో నొకదినమునకంటె నిలువని మన శాస్త్రిగారాయూరుచూచి యచ్చటిబ్రాహ్మణుల ధర్మాసక్తి గాంచి, వేదాధ్యయనపాఠకులగు బాలుర తిలకించి, తన యందు వారికిగల యా ద ర ము ప ల క్షిం చి స్నాన పాన యోగ్యమగు నీటివసతిఁ బరికించి వరిధాన్యముపండు ఫల వంతములగు కేదారములంగని యానందించి తనకు నిలువనీడ యగు స్థలముగావిశ్వసించియచ్చటనిలువనిచ్ఛగించియుండెను భోజనవేళ కే గృహస్థుడాతనిఁగాంచుట తటస్థపడిన నతఁడా యోగిగారిని పిలిచి భోజనమిడుచు వచ్చెను. ఇట్లు కొన్నిదిన ములు, మాసములు గడచెను. అచ్చట సప్తాహ మొనర్చు సంకల్పమాతని కంకురించెను. ఆయూరువారామాటవిని సంతసించిరి. ధాన్యరూపమగు చందా వేసిరి కొంతధాన్యము పోగు చేసిరి. కాని ధాన్యమంతయు సమకూడి ధనముచేరి సప్తాహ ప్రయత్నము నిర్విఘ్నముగా జరిగి దైవపూజాదులు పూర్తి యగువఱకు శాస్త్రిగారు వేచియుండగలరా! అతనికి దైవపూజ కంటె భూతతృప్తిచేయుటయే ముఖ్యము. సప్తాహ సంకల్పము

మొదలుకొనియే అన్నప్రదానముచేయ నారంభించెను. ఏ దినముచేరిన ధాన్యమాదినముననే బ్రాహ్మణసమారాధనకు వ్యయమగుచువచ్చెను అందువలన సప్తాహనామక యజ్ఞము జరుగ కాతసి సమారాధనము దీర్ఘసత్రముగాపరిణమించెను. అట్లుండ శాస్త్రిగారి నాయూరస్థిరముగా నిలుపుసంకల్పము మన్నవగ్రామవాసులకుగలిగి శాస్త్రిగారిభార్యబిడ్డలనుగూడ నచటికిరప్పించి యొకయిల్లుగాపి వారికికావలసిన జీవనముగూడ కల్పించిరి. భార్యాపుత్రు లింటయున్నను శాస్త్రిగారొకచోట నిలుచువారుకారు వారూరూరు తిరుగుచు ద్వాదశీవ్రత మనుష్ఠించుచు వచ్చిరి. శాస్త్రిగారు నల్లగాను, యెత్తుగాను, స్థూలముగనుండి యత్యంత మందగమనముగలవారై యుండిరి. వీరు దయాత్పూర్వమే తటాకమున స్నానముచేసియొడ్డునగూర్చుండి నిమీలితనేత్రులై జపమొనర్చుచుండువారు శాస్త్రిగారు వేసంగివేళల నెండవేడిమికిగాని, గ్రీష్మవాయువునకుగాని, వర్షాకాలమున జోరునకురియు వర్షధారకుగాని లెక్కసేయక తనశరీరము మరచి ధ్యానసమాధి నిష్ఠలో నిమగ్నుడై సమస్త ప్రపంచమును ప్రపంచవాసనలనువిడచి యుండువాడు. లేకున్న శీతాతపవర్ష బాధలాతనికి లేకుండునెట్లు? ఒక్కొక్కవేళ దిగంబరుడై యుండువాడు. వస్త్రధారియైయుండు వేళలగూడ మూరెడు వెడల్పుగల యొకచుట్టువరగని చిన్న యంగవస్త్రము మాత్రమే మొలధరించి మఱియొక కొల్లాయిగుడ్డ భుజముపై వేసికొనుచుండువాడు. బీదవారెవ్వరైన కనుపడి వేడినచో తనకొల్లాయిలనుగూడా వారికిచ్చి తానుదిగంబరియై యింటికి

నచ్చుచుండును. శాస్త్రిగారు యోగ్యుఁడని యెంచిమంచివస్త్ర ములను యితర గృహస్థులిచ్చిన నవిగూడ బీదసాదల కిచ్చివే యుచు తనకొల్లాయిలోనే తాను సంచరించుచుండును. ఈమహా నీయుఁడు దూషణ భూషణ తిరస్కార గౌరవములు సమాన ములుగా దలంచుచు సంతతానంద పరవశుఁడై యుచ్చైరవుగల్పిం చుచుండును సమస్తభూతప్రియుండై నిరంతర మన్నదానము జేయుచు మానవులయందేగాక శ్వానమార్జాలాది సకలజంతు జాలములయందత్యంత ప్రేమజూపుచు నూకలను బియ్యమును చీమల పుట్టలయొద్ద చల్లుచుండును కోపమనునది శాస్త్రిగారి కడ నెన్నడును జూచియుండలేదు. పరదూషణమెన్నడును లేదు బిగ్గరగా మాట్లాడుటయన నతండెఱుంగడు. ఇతరులు పొగడి నచో తన యల్పజ్ఞతనుగూర్చి ముచ్చటించునుగాని స్తోత్రప్రి యత్వ మేకోశమునను లేదు. శాస్త్రిగారి స్వభావమును దెల్పు నొకటి రెండంశముల నుదహరించవలసియున్నది. చిన్నతనమున పదునారువత్సరముల యీడుగలిగినప్పుడొక గృహస్థు తనబం ధువు యింటికొక యఱిసెలకావడియును రవికెలను చీరెలనిచ్చి తమపురోహితుని కుమారుడగు మనశాస్త్రిగారిని బంపగా దీసికొని వెళ్లుచు మార్గమధ్యమమున నొకచెట్టునీడ నించుక విశ్రమించెను. అచటికి సమీపమున చేలలోనున్న పలువురు బాలురచ్చటికి వచ్చిరి. గర్భవతియగు నొక యానాదిస్త్రీ చిని గిన గుడ్డలతో నచటపడియుండెను వారినిచూచికొన్నరవికెలను చీరెయు నాయానాది వనితకిచ్చెను. చేలలోని పిల్లవాండ్రకు అరిసెలు చాలభాగము పంచిపెట్టెను. మిగిలియున్నకొలదియఱి

సెలను, రవికెలను మాత్రము తీసికొని గమ్యస్థానము చేరెను. అచ్చటివా "రిదియేమయ్యా" ఇంతహైన్యముగా పంపినారని యడిగిరి. అంతశాస్త్రిగారు యజమానుల లోపము లేదని యును తానుమార్గమధ్యమున నవి, దీనదశలోనున్న వారికిచ్చి తినటయును చెప్పిరి వారు చేయునది లేక యూరకుండిరి. పూవు పుట్టగనే పరిమళించు నన్నట్లు చిన్నతనమునుండియు మానవుని స్వభావము వెల్లడియగుచుండును. మన్నవగ్రామములో నతఁ డున్న దినములలో తరుచుగా! నభ్యాగతులను తనయింటికి భోజనమున కాహ్వానముచేయుట చూచితిమి. ఒకనాడు ఇంట తండులములు లేవు, వ్యంజనములు లేవు, ఆపూట యెట్లు గడచునాయను తహతహతో భార్యయుండెను. అట్టిస్థితిలో వీధిని నలుగురు బ్రాహ్మణులు పోవుచుండగా శాస్త్రిగారు చూచి వారిని భోజనమునకు తనయింటికిఁతీసికొనివచ్చి భార్యను వంటయైనదా? యని ప్రశ్నించెను. ఆమె భర్తను ఆయన వెంట నున్న బ్రాహ్మణులను చూచి తన భర్త వారిని భోజనమునకే గొనివచ్చెనని తలంచి యింట నేమియు లేకుండుటచే భయపడి, వంటయగుట కింటనేమున్నదని బదులు చెప్పెను. అంతట శాస్త్రిగారా వచ్చినబ్రాహ్మణులను చెరువున కేగిస్నానములు చేసిరమ్మని చెప్పి తాను తనకు పరిచయముఁగల మన్నవ బాప య్యగారి యింటికేగెను అప్పటికి రెండుజాముల ప్రొద్దెక్కెను. శాస్త్రిగారు భోజనముచేసినట్లు లేదు. ఆసమయమున శాస్త్రి గారువచ్చుట కర్థమున్నదని గ్రహించి ఏమయ్యా! అన్నము తినకుండా వచ్చినావని యడిగెను. నలుగురు బ్రాహ్మణులు

వచ్చినారు వారన్నముతిన లేదు. నాయింట యేమియు లే ు
అందుచేత వచ్చినానని శాస్త్రిగారు చెప్పిరి. శాస్త్రిగారిస్వభా
వమెఱింగినవాఁడగుటచే బాపయ్యగారు మూఁడుతవ్వల బియ్య
మిచ్చి పంపిరి. శాస్త్రిగారా తండులములు దెచ్చి భార్యకిచ్చెను,
ఆమె స్నానముచేసి యన్నమువండెనుగాని వ్యంజనములు లేని
యన్నమూమె పెట్టుటెట్లు? అంతట శాస్త్రిగారు చుట్టుపట్లునున్న
గృహస్థులయిడ్డకేగ నచ్చటివారు కావలసిన పచ్చళ్లనిచ్చిరి.
అవి తెచ్చి బ్రాహ్మణులకన్నమిడి పంపెను. ఇది శాస్త్రిగారి జీవి
తములోని యొకనాటియుందతము. ఇట్లే తఱుచుగ శాస్త్రిగారు
తనయింటవంటకు పదార్థములేమియు లేకున్నను దారినబోవు
వారిని భోజనమునకు పిలుచుచుండువారు. ఎట్లో దైవకటాక్ష
ముచే నాహారపదార్థములు సమకూరుచు వచ్చెను

ఈ మహామహుని జీవితకాలమునందొకప్పుడు భార్య
సమేతుఁడై భద్రాచలయాత్రకేగి శ్రీరామమూర్తిని సేవించి
బ్రహ్మానందవార్ధి నోలలాడుచు శ్రీరామసేవా తత్పరుఁడై
యుండి యొక్కనాడు గౌతమిస్నానమునకేగిన సికిందాబాద్
నగరవాస్తవ్యుఁడగు వర్తకుడొక్కఁడుసువర్ణసురభిని సవత్స
కముగా గౌతమీతీరమున బ్రాహ్మణునకు దానమీఁదలంచివచ్చి
సత్పాత్రాన్వేషింపుచు పూర్వార్జిత పుణ్యావిశేషముపేర్మితనకు
పూర్వపరిచితడగు మనశాస్త్రిగారింగాంచి సంతోషాతిశయం
బతిశయింప సమీపించి నిజాభిప్రాయంబెఱింగించి గోదానము
స్వీకరింపఁబ్రార్థించిన శాస్త్రిగారు చిరునగవుతో సమ్మతించె.

అంత నావర్తకుడు తనకు సత్పాత్రి లభించినందున కానందించుచు యథావిధిగా శాస్త్రిగారి కుచితదక్షిణలతో స్వర్ణగోదానము గావించి కృతార్థుడయ్యె.

ఇట్టుల గోదానమునందిన కోటయ్యగారు తనసమీపము నందు గూర్చుని జపముఁజేసికొనుచుండు బీదబాపనొకనిసమీపించి వినయాతిశయఁబుట్టిపడ సేతులుజోడించి తనయొద్దనున్న సువర్ణసురభినిజూపి, అయ్యా! నేనెప్పుడేనియు నింటనుండక నేం దేనియుం దిరుగుచుండువాఁడనగుటచే నీసురభినిపూరిసీరము లిడి పోషించుజాల నందుకు సమర్థుడగువాడుగాని గోదానము నందరాదని పెద్దలనెదరుగాన దయయుంచి దీని తాముభరింప వలయునని ప్రార్థించుచు వర్తకునివలన తానుపొందిన దక్షిణలతో నాస్వర్ణసురభిని యాబ్రాహ్మణున కర్పించిన, భార్య మహాలక్ష్మమ్మగారు చేతులుజోడించి దేవా! మనముకుటుంబీకులము బీదవారము. ఇట్టి స్థితిలో నయాచితముగా లభించిన సువర్ణసురభిని యన్యులకర్పింప మీకు మనం బెట్టులొప్పినది మీనిర్లిప్తత్వము మనకుటుంబమున కంతకును ముప్పుఁదెచ్చుచున్నది. గాన నేటినుండియైనను దర్వ్యార్జనాపరులై మెలంగకుంటిరేని మన పసిపాపల పోషించుట దుస్తరంబగునని మనవి జేయుచున్నదాననన, శాస్త్రి గారు చిరునవ్వు మోమున తాండవమాడ ఇంతీ!

కం. హరియుందు జగములుండును
హరిరూపము సాసు స్త్రీమందుండు శివం

కరమగుపాత్రము గలిగిన
నరవరగ నదిపుణ్యదేశ మనఘచరిత్రా ॥

(భాగవతము)

అనువట్లు సత్పాత్రలభించిన దొరిసిపుచ్చు టెట్లు? ఇంకొకసమయమున చాలినంత ధనములభింపవచ్చునుగాని ఇట్టి సత్పాత్రము మనజీవితకాలమునందు లభింపఁగలదా ? పసిపాపల పోషించుటకు నీవుగాని, నేనుగాని కర్తలమగుదుమా?

కం. రక్షకులులేనివారల
రక్షించెదననుచుఁ జక్రి రాజై యుండన్
రక్షింపుమనుచు నొకనరు
వక్షముఁ బ్రార్థింపనేల యాత్మజ్ఞులకున్ ॥

(భాగవతము)

అనుటచే ప్రాణుల జీవితభారమంతయు భగవానుడే భరింపగలఁడనుట. ఇదియుగాక,

మ॥ జనకుం డెవ్వఁడు జాతుఁ డెవ్వఁడు జని ♦ స్థానంబు లెచ్చోట సం
జననం బెయ్యది మేనులేకొలది సం ♦ సారంబు లేరూపముల్
వినుమా, యింతయు విష్ణుమాయ దలఁపన్ ♦ వేరేమియులేదు మో
హనిబంధంబు నిదానమింతటికి జా ♦ యా విన్నబో నేటికిన్ ॥

మ॥ చెలియే మృత్యువు చుట్టమే యముఁడు సం ♦ సేవార్థులే కింకరుల్
శిలలం జేసెనె బ్రహ్మదమ్ము దృఢమే ♦ జీవంబునో చెల్లరే
చలితం బొట రొయుంగకీ కపట సం ♦ సారంబు నిక్కంబుగా
దలచున్ మూఢుఁడు సత్యదాన కరుణా ♦ ధర్మాది నిర్ముక్తుఁడై ॥

(భాగవతము)

అనునట్లు కపటసంసారంబును నమ్మి సత్యదాన కరుణా ధర్మాదుల వీడనాడుట శ్రేయోదాయకముఁ గానేరదని సమాధానముఁజెప్పి యొప్పించి తన నిర్లిప్తత్వమునకు వన్నెపెట్టినాడు. పునరావృత్తిరహిత శాశ్వతబ్రహ్మలోకము గడింపఁ దలంచిన వారలకిదియే మార్గము గనుకనే,

సీ॥ ఎవ్వనిగరుణింప ♦ నిచ్ఛగించితివాని-యఖిలవిత్తంబు నే ♦ నపహరింతు
సంసారగురుమద♦స్తబ్ధుఁడై యెవ్వఁడు-దెగడి లోకము♦నన్ను ధిక్కరించు
నతఁడెల్ల కాలంబు ♦ నఖిలయోనులఁ బొందుఁ-బుట్టును దుర్గతిఁ♦బొందుఁగాని వప
విత్తవయోరూప ♦ విద్యాబలైశ్వర్య-కర్మజన్మంబుల ♦ గర్వముడిగి ॥

తే॥ ఏకవిధమున విమలుఁడై ♦ యెవ్వఁడుండు
వాఁడు నాకూర్మి రక్షింప ♦ నలయువాఁడు
స్తంభలోభాభిమాన సం ♦ సార విభవ
మత్తుఁడై చెడనొల్లఁడు ♦ మత్పరుండు ॥

అని భగవానుఁడు వచించియున్నాఁడు, గాన సందేహముడుగుమని భార్యకుఁ జెప్పెనట.

ఇట్టి మహాపురుషులు లోకము నుద్ధరించుట కప్పుడప్పుడవతరించు చుందురను యార్యోక్తి యథార్థమయ్యెగదా.

ఇట్లు శాస్త్రిగారు కొన్నిరోజులు భద్రాద్రియందు నివసించి భగవదాజ్ఞఁ గైకొని మన్నవగ్రామమునకు విచ్చేసిరి.

శాస్త్రిగారు మహిమగలవానివలె గనుపడువారు కారు. కాని యొకటి రెండు పర్యాయములు సరిజలాయన కద్భుతశక్తిఁ గలిగినట్లు తెలిసికొనిరి. వల్లూరు జగన్నాథరావుగారింట

నవరాత్రములలో కలశము పెట్టి పూజసలుపుచుండిరి. ఆరోజు లలో శాస్త్రిగారాయూరకునకరుగుట సంభవించినది. శాస్త్రి గారు జగన్నాథరావు గారింటికేగగనే భోజనమునకాహ్వా యము చేసిరి వచ్చెదనని చెప్పి వెళ్ళిరి. గాని యేవేళకును రాకైరి అందఱును వేచియుండిరి. వేచి వేచి విసిగి చెరువునకు స్నానమునకు వెళ్ళియుండవచ్చునని తలంచి అచ్చట నేమైన యపాయముఁ గలిగిన దేమో? యని శంకించి శాస్త్రిగారిని వెద కుటకై నాగేశ్వరరావుగారిని పంపగా నాచెఱువు మరగొమ్ము సమీపమున విజనమైన ప్రత్యేకముపోయి చూచినగాని కను పడని యొక మరుగుప్రదేశమున శాస్త్రిగారిని చూచిరి. శాస్త్రిగారు పలుకునట్లు లేదు. అచ్చట నిమీలితనేత్రుఁడై ధ్యాన నిమగ్నుఁడై యుండెను. శరీరమందంతయును గండు చీమలు ప్రాకుచుండెను. బెల్లపుగడ్డపై మూగినట్లు చీమలాతని యాపాదమస్తకము నావరించియుండెను. చూడవచ్చిన నాగే శ్వరరావుగారు నివ్వెరపోయిరి. భయపడిరి. తహతహ చెందిరి. శరీరమున కంపము జనించె. అట్టిస్థితిలో శాస్త్రిగారిని పిలుచు టకు సాహసింపలేకపోయెను. ఇంటికేగి యీసమాచారముఁ దెలుప పలువురచ్చటికేగి చూచిరి. కొంతసేపటికి బర్హిర్ముఖుఁడై శాస్త్రిగారు కనులువిచ్చి తన తనువుపై నావరించి యున్న చీమల దులుపుకొని గ్రామముచేరిరి. శాస్త్రిగారు తఱచుగా తనువుమఱచి యంతర్ముఖులై యుండువారు.

(ఈ నాగేశ్వరరావుగారు పాండ్రిపాటి గ్రామాధికారియని పాఠకులెఱింగెదరు గాత.)

పైన దెల్పినట్లు శాస్త్రిగారికిగల సుగుణములలో నిర పేక్ష సమత్వము, అన్నదానము, ధ్యానము ప్రధానములై యున్నయవి. సకల ప్రాణులకు నన్నదానము చేయుచుండుటచే శాస్త్రిగారెచ్చటికేగినను నచ్చటికి కుక్కలు వెంటఁబడుచూ వచ్చెను. తనకులేకున్నను వస్త్రవిహీనులకు తానుకట్టిన వస్త్ర ములనెల్ల నిచ్చుచు కొన్నివేళల దిగంబరులై యింటికి వచ్చు చుండువారు. డంబముగాని, యహంభావముగాని, లేక సాధు జీవనుఁడై యుండెను. నిత్యసంతుష్టి నిత్యసంతోషము శాస్త్రి గారి స్వభావమున ప్రధానాంగము. ఇట్లు శరీరయాత్రగడపి శరీరము చాలించు సమయమాసన్నమైన తఱి నెఱింగి "కాశ్యాంతు మరణాన్ముక్తిః" యను విశ్వాసమున కాశీ యాత్రకేగ నిశ్చయించెను. తాను గర్భవతియగు భార్యతో గూడ వారణాసికి పయనమై వెళ్ళెను. అచ్చట సకుటుంబ ముగా విశ్వేశ్వరు దర్శించి, గంగానదీ స్నానమాచరించి ప్రయాగకేగి యచట కొన్నిదినములుండి త్రివేణీ సంగమ మందు ప్రతిదినము స్నానమాచరించుచుండిరి. ఈ త్రివేణీ సంగమ స్నానసమయమున శాస్త్రిగారి యద్భుతశక్తి గాను పించెనని వెంటనేగిన పాండ్రపాటి నాగేశ్వరరావుగారు చెప్పుచు వచ్చిరి. వెంటనున్నవారిని విడిచి తానొంటిగా త్రివేణిసంగమ

పరిదేశమున అతి గంభీరమగుచోటికేగి యచ్చట స్నానము చేసి మనుష్యులకందని నీటిపై తేలి ధ్యానని మగ్నుఁడై యుండె ననియు, శాస్త్రిగారే వేళకును రాకుండుటచే తాను త్రివేణీ తీరమునకేగి చూడ నట్టేట జపముసేయుచు నతడుండెననియును పిమ్మట కొంతసేపటికి బహిర్ముఖుఁడై తీరమునకు రాగా నట్టేటి లోని కేటికేగితిరని ప్రశ్నింపగా అచ్చట లోతులేదని శాస్త్రి ప్రత్యుత్తరము చెప్పెననియును. ఆ వి ష య ము నమ్మక విచారించిన మీదట త్రివేణీసంగమ మచ్చట అగాధ జల పూర్ణమని నిశ్చయముగా తెలిసెననియును మున్నగు సంగ తులు నాగేశ్వరరావుగారు చెప్పుచున్నారు. అటనుండి గయా క్షేత్రమునకేగి యాత్ర సేవించుచుండ జ్వరమువచ్చెను. 4వ దినము భార్యతో నేనిక నీశరీరము చాలించెదను నాకై నీవు విచారింపకుము. "జాతస్య మరణమ్ ధృవం" అను వాక్యము సత్యముగదా నాపని దీరినది గర్భవతివగు నీకు పుత్రికగలుగు నని చెప్పుచుండ బ్రహ్మరంధ్రము భేదించుకొని ఆ యన 1896 గంగాపుష్కరిణీకాలమున తన నలుబది రెండవయేట పరంధామము జేరిరి. అంతట భార్యాపుత్రులు మన్నవగ్రామ మునకు వచ్చి యచ్చట నివసింపుచూ వచ్చిరి. ఇట్టి పరమ యోగి నిటీవల గనివిని యెఱుంగము శాస్త్రిగారి కిరువురు పుత్రులు నొకపుత్రికయును గలదు. వారు సుఖముగానున్నారు.

---

# తూమాటి రామభొట్లు

అజ్ఞాన పిశాచి అనుచరులలో కీర్తికాంక్షయొకటి. ఇదియు కామాది రాక్షసులవలె సాధకుని పతనానికి కారణ మగుచున్నది. దారి దప్పించి ఆదర్శనమునకు దూరము చేయును. భక్తుని మోసపరుచుటలో అతిసమర్థతగలది దీనికిలోబడనివారు చాలాతక్కువ. విషవృక్షమునకువలె చేదుకాయలనే కురియు చుండును. ఈవృక్షమునకు స్వార్థముబీజము పైకిమంచి దేగాని విచారించిన బరమాపకారి. ఇది చేయించుపనులలో కొన్ని మం చివే గాని లోలోన జెడ్డభావించుచునేయుండును. ఇంతియే కాదు! ఈర్ష్యాసూయాదుల వృద్ధిజేసి భగవంతునినుండి వేరు చేయుటలో దీనికి సాటి మఱియొకటి లేదు.

స్వాహంకార ప్రతిష్టాపనయే "దీనిలక్ష్యం" సత్క్రి యలసాధనములుగాగొని తనపని నెరవేర్చుకొనును ఇదిపరాభి ప్రాయదాసి. అదేగాని ఆదర్శంగూడ ధర్మాధర్మము లందు బాటులో నున్నదానినే గ్రహించును. ఏదియైనను సరియే! కీర్తిగలిగినజాలు పలుకుబడిలో నేదియుండిన నదియే దీని లక్ష్యము దీనికిసత్యావివేచన లేదు, సాధకుని నపకీర్తిపాలుజేయు టలో సందె వేసిన చెయ్యి దీనిసహచరి "కపటము" పేరుప్రతిష్టల వెంట బరువులెత్తు స్వభావము గలది అయినను సత్క్రియా పరాయణుండగు రామభొట్లుగారికి కీర్తికాంక్ష లేనిస.

తండ్రి నరసింహచౌదరి తల్లి చిలకమాంబ. 19వశతాబ్ద మందు పుట్టుక. వీరి జననగ్రామము మద్దిరాలపాడు. ఒంగోలు

త్రాలూకా. భార్య పేరమాంబ గురువు అద్దంకి తాతా చార్యులుగారు ఒకప్పుడు గురువునకు సాష్టాంగపడి దేవా! మానసలక్ష్యమగు జపముచే, నేమహామహుని ధ్యానింపక నవిద్యోద్భూతములగు జన్మాదులనందునట్టి మానవులు బంధవిముక్తులై స్వర్గాపవర్గాది నానాఫలములను బొంద గలరో యాజపవిధుల విశేషాంశములు వివరింప వేడు చున్నాఁడ ననఁ నాచార్యుఁ డత్యానందమునందుచు పుత్రా! స్థావరజంగమాత్మకమగు సర్వప్రపంచమునకుఁ బ్రభుండును దేవాది దేవుండును త్రివిధపరిచ్ఛేదరహితుండును క్షరాక్షర విలక్షణుండును, పూర్ణుండును సర్వాంతర్యామియును షడ్భావవికారశూన్యుండును సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వ సర్వ వ్యాపకత్వాది గుణపూర్ణుండును అగు పరబ్రహ్మమును గుణకీర్తనముల నెడు స్తోత్రములచేత సర్వకాలములయందును సత్కారపూర్వకమగు పూజను మానవుఁడు సేయుటయే సకల వేదములలక్ష్యమగు ధర్మములలో నుత్తమము. అట్టి సగబ్రహ్మ మును మతసాంకేతికముల ననుసరించి, విష్ణువనియును, శంకరు డనియునుఁ జెప్పనొప్పు మానవులు కొంచ తీరహాస్యము నెఱుంగక మతవైషమ్యములకు బద్ధులై యన్యోన్యదూషణ తిరస్కారాదులఁ గావించుకొనుచుందురు. ఇట్లుండుటచే నర కానుభవంబు తప్పజాలదు. సర్వభూతాంతరస్థితుండగు పర మాత్మను సర్వసమత్వావేశపరుండై భజించినఁగాని మాన వుఁడు కృతార్థుఁడు గాఁజాలఁడని పెద్దలు వచింతురు. ఇదియునుంగాక —

శ్లో॥ మద్భక్తా శంకరద్వేషీ ।
మద్వేషీ శంకరప్రియః ।
తావుభౌ నరకం యాంతి ।
యావచ్చంద్ర దివాకరమ్ ॥

నాకు భక్తుఁడుగానుండి శంకరుని ద్వేషించినవాఁడును శంకర భక్తుఁడుగానుండి నన్ను ద్వేషించినవాఁడును వీరలిద్దరు సూర్యచంద్రులున్నంతకాలము రౌరవాది మహానరకయాతనల నొందగలరని పురాణముఖతా శ్రీకృష్ణభగవానులు వచియించి యున్నారు. గాన నీవు శివకేశవభేదమును విడనాడి చరించునది యనివక్కాణించి చౌదరిగారికి తారకమంత్రము నుపదేశించిన నాతండెంతయు సంతోషపారావారంబునఁ దేలియాడుచు గురువర్యునకు పునః పునః ప్రణామంబులాచరించి వినయ వినమితవదనుండై నిలచిన, తాతాచార్యులు మందహాసపూరిత వదనారవిందులై శిష్యునిఁదిలకించి పుత్రా! నేను మీవంశపరంపరా గురుపీఠాధికారినై యుండుటయేగాక నీకిపుడు కారణగురువునుగూడ నైతిగదా! నాకు గురుదక్షిణ నేమీయఁజాలెదోయనిన చౌదరి దేవా! నాసర్వస్వము మీయదియ భవదుచ్ఛిష్టము మాత్రము నేనును నాపరివారంబును భుజించి జీవితముల సార్ధకపరచుకొనెదమనిబలికి నిలచిన, వాని యౌదార్యమున కాశ్చర్యాయత్తచిత్తుండై యాచార్యులు పుత్రా! నాకీ బాహ్యసంపలతోఁ బనిలేదు నేను కోరునది నీవీగలిగినచో వెల్లడించెద ననవుడు వల్లెయన నీవు నిరంతర భూతసేవా తత్పరతమై మెలంగుటయ నాకు గురుదక్షిణయగు

ననుడు చౌదరిగారందునకుఁ దన యామోదమును దెల్పి బ్రిమాణం బాచరించె. ఇట్లు కొన్నిదినంబులు తాతాచార్యులుగారాయూరనివసించి సచ్ఛిష్యలాభమును గడించి నిజపురవరంబగు తక్కెళ్ళపాడున కేగె.

అంత మరునాఁ డరుణోదయంబున నరసింహచౌదరి తన యగ్రతనయుండగు రామభొట్లుగారింజీరి తండ్రీ! నేను వృద్ధుడ నగుటచే కుటుంబపోషణ వ్యాపారంబును చదలవాడగ్రామాధికారత్వ పదవియు భరింప నసమర్థుండనగుట నీ వెఱింగిన విషయంబేగదా నాపూర్వపుణ్య విశేషంబుచే సుగుణాఖనివగు నిన్ను జ్యేష్ఠపుత్రునిగాఁ బడయఁగలిగితి, గాన తదీయభారవాహివై నాకు విరామంబిడిన (కలౌస్మరణాన్ముక్తి,) అను న్యాయము ననువర్తించి భగవద్దయా పాత్రుండనయ్యెదనని జెప్పి యొప్పించి తనయందుగల యధికారద్వయంబును బుత్రున కొప్పగించె.

ఇట్లు తండ్రిచే ననుజ్ఞవడసి శుచియై పూజాద్రవ్యంబులం గైకొని యుచితపరివారంబు వెంటనంటిరా భక్తిప్రపత్తులుల్లసిల్ల చదలవాడయందు వేంచేసియున్న శ్రీసీతారాము సన్నిధికేగి యర్చకులచే షోడశోపచారవిధులం బూజలు గావింపించి మంత్రపుష్పంబిడి తదీయమూర్తిని హృత్కర్ణికామధ్యంబున నిల్పి నిమీలిత నేత్రుండై,

కం. నీపాద కమలసేవయు
నీపాదార్చకులతోఁడి • నెయ్యము నిత్యం

తాపార భూతదయయును
తాపసమందార నాకు • దయసేయఁగదే ॥
(భాగవతము)

అని వరంబర్థించి శ్రీపాదతీర్థ ప్రసాదంబుల గ్రహించి యందుండి తన్నగరంబునంగల శివాలయంబున కేగి పార్వతీ సహితుండగు శంకరు నారాధించి, తీర్థప్రసాదముల గ్రహించి నిజనగరంబున కేగి విజనస్థలంబున పటంబొండుఁ బరపించి యందు నానావిధ శకుంతంబులు మెసవుట కనుకూలంబగు వరిగెబియ్య మొకకుంచెడు పోయించి తత్పటంబునకు నలుప్రక్కల నుచితపాత్రంబులతో నీరంబులిడిఁ దానికి దూరంబుగా నొకసేవకుని కాపుంచి వానికి నిరంతర మటుల గావించుచుండునటుల కట్టడిగావించి నిజగృహ ప్రవేశంబయి భోజనంబు లభింపక యూరియందెందేని తిరుగులాడు బీదజనంబులఁ బిల్వఁబంచి వారి కుచితరీతుల నన్న సత్కారంబులఁగావింపించి తదుపరి తానునుభుజించి సుఖోపవిష్టుండై భగవత్కథా కాలక్షేపంబులఁబ్రొద్దుఁలుబుచ్చుచుండె. నాఁడు మొదలిటులఁ బ్రతి దివసంబు నేతత్కృత్యంబులఁజరుపుచు జగద్విఖ్యాతకీర్తినార్జించి కృషిక్రియాసముపార్జిత విత్తంబుల వెచ్చఁబెట్టి చదలవాడ యందు వేంచేసియున్న శ్రీశితికంఠునకు ధ్వజ ప్రహారీ ప్రతిష్ట లును చదలవాడనుండి పోతవరమునకుఁబోవు మార్గమధ్యమునను, మద్దిరాలపాటియందును తటాకద్వయ నిర్మాణమును "స్వదత్తాదధికం పుణ్యం పరదత్తానుపాలన" మను సూరి జన వాక్యమందు విశ్వాసపూరితుండై పానకాలచెర్వు, చంద్రాయ

చెర్వు, రావలగుంట, చిత్రిచిత్రగుంట, రామనచెర్వు, లింగాయచెర్వు, అర్వగుంట లను బాగుచేయించి మార్గాయాసమన్వితులగు శకటారోహకులకు భోజన సత్కారంబును తద్వాహనంబులకు పూరినీరంబులిడుటయు మతవర్ణ విచక్షణ సేయక భోజనమజ్జనాది సత్కారంబుల గావించి భూతలోకమును బరితృప్తిఁబరచుటయు నిత్య కృత్యంబులుగా జరుపుచు సర్వ జనాహ్లాదకరముగా నిచాకారంబును నిర్వహించుకొనుచు నిహపరములయందు సమభావముంచి తనజీవితమును సార్థకపరచుకొనుచుండె.

ఇట్లుండ కొంతకాలంబునకు చీర్వానుప్పలపాటి నివాసియగు కుమ్మర వెంకటాద్రియు, మద్దిరాలపాటి గ్రామ నివాసియగు గుడ్డివీరడును చౌదరిగారి గృహంబునంగల ద్రవ్యమును తస్కరకృత్యంబుచే నపహరింపఁదలచి బంధుమిత్రపుత్రిపౌత్ర సమన్వితమై శతాధికమగు నాలమందలచే పరివేష్టితమై యొప్పారు నేతద్గృహప్రవేశము గావింపవలనుపడక సమయాన్వేషణము గావింపుచుండ నొకనాడు చౌదరిగారి భృత్యుఁడొకఁడు గ్రామంబునంగల కూలిపనులు చేయువారల కొందఱినిజీరి చౌదరిగారి గృహంబుపైన పెంకు గప్పించుచుండ నాకూలివారలలో వెంకటాద్రియు వీరడును జేరిరి. పగలంతయుఁ పెంకునందించుచుఁ బనిముగించి సాయంతనమున కందఱికూలీలతో తమతమగృహంబులకేగక యింటి మండువాయందు దాగియుండి రాత్రి యామద్వయం బతిక్రమింప

గృహంబునం దందఱు నిద్రాపరవశులగుట నెఱింగి యెటులో నింటఁబ్రవేశించి, ధనాగారంబునంగల యమూల్యాభరణం బులఁ దస్కరించుకొని తిరిగి మందువాకులంఘించి మనోరథ సిద్ధియగుటకు సంతసింపుచు తమతస్కరక్రియాకౌశల్యమున కుబ్బుచు బారిపోనెంచి మార్గాన్వేషణము గావింప గృహో పరినుండు వెన్నుగాడిపై,

సీ॥ గజసింహగమనుల ♦ ఖడ్గతూణీధను ర్ధరుల శార్దూలవి ♦ క్రములరాజ
సింహులగుణరూప ♦ చేష్టితంబులఁబరస్పరసమానులఁజారు♦చంద్రముఖుల
రమణీయమూర్తుల ♦ కమలపత్రవిశాల నయనులసురభవ ♦ నంబువిడచి
ధరణికిచ్చిన ♦ సురలక్కైవడిఁ గ్రాలు వారివీరులభంగి ♦ వరలువారి

గీ॥ రాజభానులకీర్తియదివ్య ♦ తేజమునహ
రిన్ముఖాయము వెలిగించు ♦ చున్నవారి
గ్రిమతర కాకపక్షముల్ ♦ గలుగువారి
మహితకీర్తుల రామల ♦ క్ష్మణులఁజూచి ॥

తమచైదము లెఱింగి పట్టిబంధింప నేతెంచిన చౌదరిగారి సేవకులుగా దలంచి నలుదిక్కులందును నీదివ్యరూపులే ప్రకా సింపుచుండుట చేయునదిలేక మూలలయందుగల జలదారు లలో తమమేనులు జొప్పించి పదేపదే తలలెత్తి నలుదిక్కులం బరికింపుచు నిష్పురుషపుంగవు లప్రమత్తులై యుండి రిక నెట్లీ దేహంబులు బ్రతికి బయటఁబడగలవని పరితపించుచు మనవంశ బులం దెవ్వరుచేయని నీ చౌర్యవృత్తి నవలంభించుటచేఁ దగిన ప్రాయశ్చిత్తమైనది. ఇకముందిట్టి కార్యములయందుఁ బ్రవే శింప రాదని మనంబులకు బుద్ధిఁజెప్పుకొనుచు దురాశయెట్టి

ముప్పును సమకూర్చినది. దీనిని దప్పించువారెవ్వరేనియు లేర
గదా!యని లోలోనవిలపించుచు కదలిన చప్పుడగు దాన దూర
ముననున్న కష్టం బిప్పుడే రాఁగలదని దలంచి మేనుల గుదించు
కొనుచు నిట్టి స్ఫురదూ్రిపుల, నీగృహమునందెన్నడును జూచి
యెఱుంగనే, నేడెందుండివచ్చిరని, యబ్బురపడుచు, వారిరూ
పము లెంతేఁజూచినను మనమునకు తనివిదీరమి కన్నులు
మూతలిడక నాదివ్యాకారంబుల గనుచు సంతోషదుఃఖ
భయంబులు ముప్పిరిఁగొన నాటి రేయి వెళ్లించిరి. తెల్లవారినది
రేయి తాము చూచిన కావలివారలు కనుపింపలేదు గాని
యింటివారు నిదుర లేచుటయు భృత్యులు వారివారి పనుల వెంట
గృహముచుట్టుముట్టి సంచరించుచుంటయు, తమపనిసాగమి
రేయి వోలె జలదారుల వీడజాలకుండిరి. పగలంతయు
నన్నము లేదు. ప్రొద్దుగ్రుంకినది. గతరాత్రి తమకు గనుపించిన
పురుషపుంగవులిరువురు నెన్నుగాడిపై పచారు చేయుచుండిరి. ఇక
నేమిదారి, తిరిగి రెండవరేయి రెండుజాములకు మించినది. ఊరం
తయు మాటుమణిగినది. ఇప్పుడు గృహములోనికిదిగి తప్పించుక
పోదమనితలంచి ప్రయత్నంచిరిగాని గృహమునందుగూడ
నిద్దరు పురుషులు శరశరాసనములతో పచారుచేయుచుండు
నటుల గనుపించి వారి నోతయువారించినది. ఇంటిపైనను
యింటిలోనను మనుజులు సంచరింపని సమయమే వారికి గనుపిం
పదాయె. ఏమిగతి, మతే? యింకెక్కడి జీవితాశ, యిక్కడ
మన్నుగావలసినదే? యెటుబోవుటకు వీలు లేదు. పరాత్పరా!
దీనదయాపరా! యాపద్బాంధవా! మేముచేయరానిపని చేసినం

దుకు తగిన శాస్తిగావించితిరి. మా జన్మావధిలో నిట్టికార్యము లెప్పుడును మేముచేయఁబోము ఈ విపదబ్ధి నుండి యావలకుఁ దాటింపుమని భగవానుని బ్రార్థించుచు రెండవ రేయి కడపిరి. తెల్లవారినది. కమలబాంధవుడు తూర్పునఁబొడసూపె, తస్కరు లాకలిదప్పుల కడలుచు మృత్యువు తమకు దప్పదని దలంచి నిశ్చితంబూని గృహంబునుండి దిగనెంచి వెన్నుగాడిపైకివచ్చిన భృత్యులుగాంచి దొంగలు దొంగ లని కేకలిడిన చౌదరిగారి కుమారుడు శేషయ్యగారరుదెంచి, వారల నందునుండి దింపించి పరిహారణమ్ముల సమ్మానింపదలచిన, చౌదరిగారు వారించి వారలచే గత దివసద్వయంబునను జరిగిన యావద్వృత్తాంత మునువిని వారుసత్కరించిన యమూల్యాభరంబులనుగాంచివిస్మ యాకులచిత్తుండై వారలకు గనుపడిన పుణ్యపురుషులు రామ లక్ష్మణులని గ్రహించి తస్కరకృత్యంబు లొనరింప నే తెంచిన వారికి భగవత్సాక్షాత్కారము లభించుటకు పూర్వపుణ్య విశేషంబుండితీరవలయునని దలంచి—రామమూర్తినుద్దేశించి,

చ॥ ఇలఁగల నింద్రజాలికుల ♦ నెందఱినో కనుఁగొంటి గాని ని
స్తులగతి నిన్నుఁబోలుదురె ♦ తోరపుజాలకళా విశేషతన్
నిలయముఁగన్న మాయఁగను ♦ విప్పగ స్పష్టియులేక సత్యమున్
గలిగి యసత్యమున్గొలుపు ♦ గారడీపెద్దవునీవు రాఘవా ॥

ఓ దయామయా! ఈ యల్పుని యస్థిరసంపదనురక్షింప దూతకృత్యము చేయుటకుగూడ సిద్ధపడి నీ యవ్యాజకరుణ నాపైఁజూపితివా? జగత్కర్తవగు నీవలన పనులఁ గొన

నెంచిన నా జన్మమేటికి కాల్పనా? పరమపావనా! భవదీయః దివ్యదర్శనా సౌభాగ్య మర్థించితిగాని యెన్నడేనియు మద్రివ్య సంరక్షణాభారము నీపైనుంచితినా? అన్న మభ్యర్థించు క్షుధాతురుని వస్త్రదానముచేఁ బరితృప్తిపరుప నెంచినట్లు, తావకీయః దివ్యమంగళ స్వరూప దర్శనాభిలాషినగు నన్ను సంపద్రక్షణా వ్యాపారోపకృతిం గావించి సంతృప్తిపరుప నెంచితివిగా? ఇదియేమి? ధనమువలన ధర్మము దానివలన నైహికాముష్మిక సుఖంబు లభించునదైయుండ నరునకు ద్రవ్య విముఖత్వము కార్యకారిగాదని సూచింపనెంచి యీ పనిగావించితివేమో? అట్లయిన జన్మపరంపర సమకూర్పఁజాలు నీ యిహసంపదలతో నాకవసరము లేదు. పునరావృత్తిరహిత శాశ్వత బ్రహ్మలోక పదవిసంఘటింపఁజేయు సుజ్ఞానధనం బభివృద్ధిపరచి తస్కరపాళులు తద్ధనాపహరణము గావింపకుం డునటుల గాపాడి నన్నుద్ధరించుము. విద్యావిహీనులైన నాబోటుల కిహసంపదల నర్థదాయకములగుట నన్ను తల్లోలుని గావింపక. త్రిమూర్త్యాత్మకమై త్రిజగదానంద సంపూరిత నీల నీరదాకారంబై సుందరమందహాస సందీప్యమాన ప్రసన్న వదనారవింద విరాజితంబై సర్వశుభలక్షణ సమన్వితంబై కపట మానుషాకారంబై యోగిజన భాగధేయంబై దివిజ యక్ష కిన్నర కింపురుషాది సిద్ధజన సేవితంబై తనరారు భవదీయ దివ్య మంగళస్వరూప సందర్శనభాగ్యంబు లభింపజేయక ఇతర హోమపకృతు లెన్నొనరించినను నా మనశ్శాంతిఁ గాజా

లదుగాన, నోయాపద్బాంధవా ! దీనదయా పరమమూర్తీ ! మన్మనోరథసిద్ధియగునటు లాశీర్వదించి సంసృతి సంజనిత కల్మషాతి రేకములు నన్నంటకుండునటు లనుగ్రహింపుము. అని యనేక రీతుల వినుతింపుచు తస్కరులజూచి,

ఓ తస్కరులారా! మీరలతిపుణ్యాత్ములరు, పావనమూర్తులరు, ఏ పరమపురుషుడు యీలోకమునను పరలోకమునను సకలభూతములకును అంతర్యామియై నియమించుచున్నాడో ఎవని భయమువలన వాయువు విసరుచున్నదో, సూర్యుడుదయించుచున్నాడో ఇంద్రాగ్ని వరుణాదులు తమతమ కార్యములను జేయుచున్నారో, అట్టి మహామహుని మోక్షదాయకుని దివ్యమంగళ స్వరూపుని, అవాఙ్మానసగోచరుని ఆర్తత్రాణ పరాయణుని దివ్యస్వరూపము జూడజాలితిరి. ఇట్టి మిమ్ము స్తుతింప నాతరమగునా? మీపవిత్రస్వరూపములఁ జూచుటచేత నా జన్మము కృతార్థత వహించినది. మీపాదస్పర్శచే నాగృహము పావనమైనది.గాన భేదవృత్తిం గైకొనక మద్గృహంబునంగల వస్తుసముదాయంబున మీకుకావలసినవి గైకొండని నుడివిన, వారలు గతరాత్రియందుఁదమకు కనుపించినవారలు శ్రీరామ లక్ష్మణులనియు భగవానుడు చౌదరిగారియందును వారి వస్తురక్షణయందును గడు శ్రద్ధవహించియుండునటుల నెఱింగి.చౌదరిగారి భక్తికబ్బురపడుచు నిట్లనిరి.

దేవా! మీద్రవ్యము శ్రీరామ సంరక్షితంబై సద్వినియోగ యోగ్యంబై యుండుటచే మాబోటి దుర్మార్గులంటదగి

నవి గాదుగాన నీవస్తురాజములతో మాకు పనిలేదు. మేమింతటినుండి స్వార్జిత విత్తంబుల జీవయాత్ర సాగించువారమని జెప్పుచు నందుండి వెడలిపోజూచిన రామభొట్లుగారు వారించి నాడు వారలకభ్యంజనములు గావింపించి రుచిరాన్నాదుల బరితృప్తిపరచి యమూల్యవస్త్రములొసంగి నూతనబంధువుల సాగనంపిన వడువున బంపఁదస్కరులు తమతమ గృహంబుల కేగిరి. (1. ఇందుఁజెప్పబడిన వీరడు మాలవాడు. ఇప్పుడు వీని కుమార్తె మద్దిరాలపాటియందు గలదు. 2. కుమ్మరి వెంకటాద్రి రామభొట్లుగారు పరమపందించిన తదుపరి నాయూరు విడచి కుటుంబమును వెంటకొని యెటకో వెళ్ళినాడని చెప్పెదరు.) ఇట్లు చౌదరిగారు తనజీవితమును సార్థకపరచుకొని తన డెబ్బదియవయేట శాశ్వత బ్రహ్మలోక సౌఖ్యమనుభవింపనేగిరి.



# గుంటూరు నల్లమస్తాన్ సాహెబు

గీ॥ బాలుని విధంబునను ♦ పిచ్చి వానిభంగి
అందమేది పిశాచంబు ♦ పిందమునను
అనుభవజ్ఞాన యోగి యీ ♦ యవని యందు
సంచరించుచునుండు ని ♦ శ్చంచలమతి ॥

పరమాత్మ శాంతిస్వరూపి జీవులహృదయములు ఈ శాంతి స్వరూపుని గ్రహింపజాలవు. మానవుని మనస్సు పరమాత్మయందు లీనమైనపుడు తచ్ఛాంతి బయలు పడును. ఈశాంతి (అనగా) ఆత్మశక్తి హృదయాకాశమును చిత్రాతి చిత్రముగా బ్రవేశించి క్రమముగా ఆహృదయమంతటను వ్యాపించి యాక్రమించుకొనును. ఇదియే మహాయోగరహస్యము. ఋషులయందు నిబిడీకృతమైన శక్తి రహస్యముగూడ నిదియే!

శాంతి ప్రవేశించినవెంటనే సర్వోపద్రవములనుండి సాధకుని భగవచ్ఛక్తి రక్షించుచుండును. ఆత్మశాంతియే ఆత్మశక్తి. ఈ శక్తిపూరితుని దాకినవెంటనే శరీరమానసిక రుగ్మతలు పటాపంచలగును ఇట్టిశక్తిని జీవులుస్వయముగా సృష్టించుకొని పరమశాంతిని బొందజాలరు. ఈశక్తిప్రతిజీవుని హృదయమందును గలదు. భగవదనుగ్రహము సంపాదించి స్వస్వరూపావలోకనము జేయుచు సుఖదుఃఖాది ద్వంద్వములదాటి లోనికేగిన బరమశాంతి, నిత్యతృప్తి, విశ్వప్రేమ, అద్వితీయధైర్యము, నిర్వికారము, అద్వయానందము జీవుడుగ్రహింపగలడు. గంగ భూమిలో బ్రవహింపు చున్నట్టు ప్రతిహృదయమందును ఆత్మ

శక్తి ప్రవహింపుచున్నదని తెలిసినవాడు గుంటూరు నల్ల మస్తానుగారు.

గుంటూరు మండలమున "మస్తాన్" గారి పేరువినని వారరుదుగానుండును. మస్తాన్‌గారి "ఉరుసు" అను పేరుతో నామహాత్ముడు సిద్ధిపొందిన దినమున గుంటూరు పట్టణమున అతని దరగాయొద్ద పెద్ద యుత్సవము చేయుదురు. ఈయుత్సవమునకు మహమ్మదీయులను హిందువులలో నెల్లవర్ణముల వారును స్త్రీలును, పురుషులును, బాలురును అత్యంత శ్రద్ధాభక్తులతో నేగి యుత్సవమునుదర్శించి వచ్చుచుందురు. హిందూ మహ్మదీయ వివక్షత లేక సమస్తజనులును మస్తానుగారి యురుసునకు భక్తితో జనుటకు కారణమేమని పాఠకులు ప్రశ్నింప వచ్చును. అందునకు కారణము లేకపోలేదు. మస్తాన్‌గారిని స్వయముగా కన్నులజూచి ముచ్చటించి యీమహామహుని మహాత్మునిగా తెలిసికొన్నవారు గుంటూరులోను, దానికి చుట్టుపట్టు గ్రామములయందు ననేకులు నేటికిని జీవించి యున్నారు. ఈమస్తాన్‌గారు మహమ్మదీయ కులమునజన్మించినారు. సయ్యదు వంశస్థులు వీరుదక్షణదేశములోనున్న తిరుచినాపల్లిలో జన్మించి బాల్యమున నచ్చటనే పెరిగినట్లు వారి శిష్యుడొకరు చెప్పుచుండువాడు. వారు బుట్టిపెరిగినది యెక్కడైనను సుమారు 100సంవత్సరములు గుంటూరులోను తత్పరిసర గ్రామములందును వారుండిరి. శ్రీవారు ఇప్పటికి 33సం॥రములకిందట సిద్ధినొందిరి. అప్పటికి గుంటూరులో కడువృద్ధులగువా రనేకులు తమచిన్నతనములోనే మస్తాన్‌గారతి వృద్ధు

లుగా నుండిరనియును. గత 80 సంవత్సరములనుండి యశ్లే మార్పు లేక నున్నారనియును చెప్పుచువచ్చిరి వారి యద్భుత శక్తిమాత్రము నెవ్వరు సంశయింపలేరు. వీరికి కీర్తి యెట్లు వచ్చెనో తెలుపుటకతని యద్భుతమగు చర్యలుగాక వేఱుకారణములు కానరావు. ఆయనసామాన్యముగా నెవరితోడను మాటలాడువాడుకాడు. మౌనముద్ర బూనియున్నట్లు చూపరులకు తోచుచుండును. మాటలాడినప్పుడు సైతము క్లుప్తముగా నొకటి రెండు మాటలుతప్ప యెప్పుడును మిక్కిలి మాటలాడి యెఱుగడు. రోగపీడితులుగాని, తమగ్రహచార విషమై తెలిసికొనగోరువారుగాని శ్రీవారియొద్దకేగి పడియుండగా, పడియుండగా, రెండు మూడు దినములకొకమాట చెప్పించుచుండును. ఆమాటయదార్థమై భావి శుభాశుభ సూచకమై యుంటూవచ్చెను. ఆయనకు శాస్త్రపాండిత్యముగాని, వాచాప్రౌఢిమగాని,యుక్తులుగాని, డాంబికముగాని యెన్నడూ లేదు. సిద్ధిపొందునాటి కామహానీయునకు రెండువందల యేబదియేండ్లు వయస్సుండునని యూహించుచూ వచ్చిరి. అధమము రెండు వందల యేండ్లకు తక్కువయుండదని ఘంటాపథముగా శత వృద్ధులు చెప్పుచుండిరి.

వీరికి నెల్లూరు జిల్లాలోని పామూరు కాపురస్థుడు షేకు మదార్ సాహెబ్ 1880 సం॥ మొదలు శిష్యుడైయుండి శ్రీవారు సిద్ధిపొందిన పిమ్మటగూడ చాలకాలమతని దరగారొయొద్ద అర్చన చేయుచు 1920 సంవత్సర ప్రాంతమున దేహయాత్ర చాలించెను. ఈ శిష్యునివలన మస్తాన్‌గారొనర్చిన మహత్తర కార్య

ములును, వారిజీవిత రహస్యములను కొన్ని తెలియవచ్చినవి. గుంటూరువాస్తవ్యులలో కొందరు శతవృద్ధులు మస్తాన్‌గారి యద్భుతచారిత్రమును గురించి చెప్పుచూ వచ్చిరి. మస్తాన్ గారు సామాన్యముగా పిచ్చివానివలె నుండువారు, వీరు ప్రథమములో నొకకావడి మోయుచు తిరుగుచుండిరి. ఆ కావడిలో నొకప్రక్క చిలపరాళ్ళ గంపయును, రెండవప్రక్కన చింపిగుడ్డల గంపయును మాత్రముంటూ వచ్చెను. ఆయనకు తన వెంటనున్న రెండు కుక్కటములును, నొకమేకయును సదాయామహాత్మునకు సహచరులైయుండెను. చిలపరాళ్లు చింపిరిగుడ్డలుగల కావడిని మోయుటలో నొకపరమార్థమున్నట్లు తోచుచున్నది. జనుల పాపములనెల్ల తానను భవించి జనుల పాపపరిహారమునకై యేసుక్రీస్తు తాను చిలువపై మరణించెననిక్రైస్తవ మతస్థులు చెప్పుచుందురు. అట్టే మస్తాన్‌గారును పాపుల పాపభారము తానువహించి వారినుద్ధరింప దలంచి సంచరించుచున్నట్లు లోతుగావిచారించి చూచువారికి తోచుచుండెను. కొన్నాళ్ళకాకావడి తీసివైచి యొక చిన్నబండిపై గూర్చుని శిష్యులీడ్చుచుండ కొన్నాళ్లు చరించువారు వీరి చారిత్రమునందు మిక్కిలి యద్భుతములైన దుర్ఘట కార్యములను కొన్ని యుదహరించెద :— ఒకనాడు భవానియను పేరుగల యొకరసపుత్రస్త్రీ శ్రీవారికోడిని దొంగలించి దానిని చంపిదాని మాంసమును వండి తినవలయునని యెంచి మాంసము ముద్ద జేసి వంటకై యచ్చుటపెట్టెను. మస్తాన్‌గారు వచ్చి కోడిలేకుండుటజూచి దివ్యదృష్టిచే ఆమెచేసిన దుండగమును సహింప

జాలక ఆమెనుద్ధరించుతలంపుతోనో యున్నట్లు మస్తాన్‌గారా కోడిమాంసపు ముద్దవంక చేజాచి "భో భో" యనిపలికి పిలిచెను. వెంటనే యాకోడి పూర్వాకృతితో జీవించిన కోడియై గంతులు వేయుచు మస్తాన్ కడకు వచ్చెను. భవాని ఈ సంగతి కన్నారగాంచి యబ్బురపాటుజెంది మస్తాన్‌గారి పాదపద్మములకు ప్రణమిల్లి తనపాపము బాపుమని ప్రార్థించెను అది మొదలు భవాని అహింసావ్రతముబూని శ్రీవారికి శిష్యురాలై చెప్పదగిన భక్తురాలయ్యెను ఈయద్భుతచర్య వీరు సిద్ధిపొందక ముందు సుమారేడెనిమిది సంవత్సరములక్రిందట జరిగెనని తెలియుచున్నది. దీనివలన మస్తాన్‌గారియమానుషశక్తి లోకమునకు వెల్లడికాకమానదు.

వీరు మహానుభావులని తెలిసికొన్న పెుక మహమ్మదీయ వర్తకుడు కడప గ్రామనివాసి శ్రీవారియందు భక్తితాత్పర్యముగలవాడై వారచ్చటచ్చట పడియుండుటజూచి నివాసయోగ్యమగు నొకగృహము సమర్పింపదలచి గుంటూరుసంగడి గుంటలోనిల్లుకొని శ్రీవారికి సమర్పించిరి. ఆయింటిలో మస్తాన్‌గారును వారి శిష్యుడును నివాసము చేయుచు కొన్నాళ్లు కాలక్షేపము జేయుచు వచ్చిరట. శ్రీవారి దరగాయొద్దకు అర్చనాదికమునకు వలయుపూజాద్రవ్యములను నేటికిని ఆయింటియొద్ద నుండియే తీసుకొని వెళ్లుచుందురు. మస్తాన్‌గారు నూతనముగా గుంటూరువచ్చిన దినములలో వైద్యశాలకు సమీపమున నొకచోట నివసించుచూ, వచ్చిరి. అచ్చట నొక మునగచెట్టుక్రింద వారుకూర్చునియుండగా కారుమబ్బులుపట్టి, యురుములు

మొయిలు సాగి వర్షము ప్రారంభమయ్యెనుగాని శ్రీవారెచ్చ టికిని కదలక ధ్యానముతో నచ్చటనే నిలిచిపోయెను. వర్ష మధికమయ్యెను. ఆవర్షబాధకు వారియొద్దనున్న మేక నిలవలేక యఱచుచుండెను ఇంతలో నురుములధికమై పెళపెళధ్వనితో నొకపిడుగు సమీపములో పడెను ఆపిడుగుపాటునకా మేక చని పోయెను. అచటికి దూరముననున్న మఱియొకమనుష్యుడుగూడ చనిపోయెనట. ఇందు విపరీతము లేదుగాని శ్రీవారుకూర్చున్న స్థలముమీద మాత్రము వర్షముకురియుటను వారికేవిధమైన బాధగలుగ లేదు. ఆమహాత్ముడా వర్షసమయమున యోగనిద్ర లో నున్నట్లు చూచినవారికి దోచెను. కొంతసేపటికి వానతగ్గి పోయెను. చుట్టుప్రక్కలనున్న జనులు గుంపులుగూడి శ్రీవారు న్న చోటికి వచ్చి చూడగా మస్తాన్‌గారున్న ప్రదేశము తడువ కుండుటజూచి యచ్చెరువందసాగిరి. కొంతసేపటికి శ్రీవారు లేచి చూచునంతలో తన మేక చచ్చిపడియుండుట కాన్పించెను. ఆ మేకను నచ్చోటనుండి లాగిపారవేయుట కచ్చటికి వచ్చినవారు ప్రయత్నపడగా శ్రీవారు వారిని వారించి తానా మేకను సమీపించి దానిప్రక్కగూర్చునికన్నులుమూసు కుని భగవధ్ధ్యాన మొనర్చి లేచి మేకచుట్టును మువ్మారుతిరిగి యామేకను స్పృశించి దాని మేనెల్ల నిమిరి "ఉఠో" యని లేవదీసెను. అంత నామేక నిదురించిలేచినట్లు లేచి తనపై బడిన వర్షపునీరు విదలించుకొనుచు తనచుట్టు మూగిన జనమునుజూచి భయపడి శ్రీవారి గాళ్లసందునదూరెను. అంత నచ్చటిజనులెల్ల రత్యంతాశ్చర్య నిమగ్నులై శ్రీవారిని పొగడుచు ఆయనపాద

ములకు ప్రణమిల్లుచు చాలసేపాయనను వదలకుండిరి. ఈ యద్భుతచర్య పట్టణమునందెల్లవారు చెప్పుకొనసాగిరి. ఆవల రెండుగంటలైన పిమ్మట శ్రీవారియొద్దకు పిడుగుపడి చనిపోయినవాని తల్లివచ్చి పాదములమీదపడి తనకుమారుని బ్రతికింపుమని వేడుకొనగా శ్రీవారచ్చటికేగి దైవధ్యానముచేసి చనిపోయిన వానిని తన దివ్యహస్తములతో తాకి యాలింగనముజేసి లేవనెత్తెను. చచ్చినవాడు జీవించెను. అంతట శ్రీవారి కీర్తి దిగంతములు వ్యాపింపగా వాడవాడలనుండి జనులు వేనవేలు రాసాగిరి కాని శ్రీవారు వారితో మాటలాడ నిచ్చగింపక మౌనసముద్రిబూనియుండెను, యోగాభ్యాసమునందు నిరుపమానమగు ననుభవముగల్గిన మన మస్తాన్‌గారు తమ యోగమహిమ ననేక నద్భుతకార్యములు చేయుచుండువారు. ఒకనాడు నల్లపాడు గ్రామసమీపములో నొక వైశ్యునిపొలము దరిని శ్రీవారు పడియుండెనట. మొండె మొకచోటను కాళ్లు మఱియొకచోటను, శిర మొకచోటను భిన్నమై పడియుండెనట. ఆవైశ్యుడు తనపొలము చూడవచ్చి యాశవఖండములను చూచి భయపడి యింటికి పరువెత్తి తానుచూచిన విషయము గ్రామస్థులకు తెలుపగా వారా వైశ్యునితో గలసి యాపొలము సమీపమునకు వచ్చుచుండిరి. ఆసమయమున శవఖండములు లేకనే కొల్లింటియాకారముదాల్చి మస్తాన్‌గారు నిలిచినజూచి యిదియేమని గ్రామస్థులు వైశ్యుని ప్రశ్నింప జొచ్చిరి. అంతలో శ్రీవారు వైశ్యునివంకజూచి భయపడితివా యని యడిగి చిరునవ్వు నవ్వెనట ఈ యద్భుత కృత్యమునకు పర

మాశ్చర్యపడి వారాతనిపాదముల పైబడి తమయూరిలోనికి రమ్మని ప్రార్థించిరి. గాని శ్రీవారుమాత్రము తాను వెళ్ళక గుంటూరు వచ్చెనట. యోగవిద్యలో ఖండయోగమున నిట్టి యమానుషచర్యలు జరుపుచుందురు. ఈచర్యలచే స్వాతిశయమును పెంపొందించుకొనుటగాని, ధనసంపాదన జేయుటగాని కోరనివారయ్యును యోగులాయభ్యాస పాటవమునకు కాబోలు తామాకార్యముల జేయుచుందురు. అట్టి కార్యములొకప్పుడు జనుల కంటపడుచుండును. దానిచే మహత్తర యోగవిద్యాశక్తిగలవా రున్నారనియును అట్టిశక్తి సాధింపవచ్చుననియును జనులు తెలిసికొనుట కవకాశముగలుగుచున్నది.

గుంటూరు మండలమునుండి యొకయాత్రికుడు కాశీయాత్ర జేసికొనుటకేగి కాశీలో గంగాస్నానముజేసి విశ్వనాథునిదర్శించి కొన్నాళ్ళచ్చట నివసించి కాశీపట్టణమంతయు చూచి యానందించుచు నొకచోట నొకవృద్ధుని జూచెను. ఆతడొక మశీదుముందున్న ఖాళీస్థలమునందు గూర్చునియుండెను. ఆమశీదొక దివ్యభవనముగా కనుపట్టెను. అదిచూచు కుతూహలముతో మనయాత్రికుడు ఆవరణములోనికి వెళ్ళిచూడగా నచ్చట ముసలివా డీయాత్రికునివంక తేరిపారజూచి చేసన్నతో రమ్మనిపిలిచెను; ఆయాత్రికుడు ముసలివాని యొద్దకు వెళ్ళి యేమికావలెనని అడుగగా నీది గుంటూరు కదా ! యని యడిగెనట అతడెవరో తనకెఱిగినవాడనియును

గుర్తించి పిలిచినాడని యును దలంచి ఆవును మాది గుంటూరు దగ్గిరయూరే అని చెప్పెను. అంతట నావృద్ధయోగి సంతసించి నాయనా! గుంటూరులో నాస్నేహితుడు డొకడున్నాడు బాగు న్నాడా? యనెను. ఎవరాస్నేహితుడని యడుగగా నేనాతని రెండువందలసంవత్సరముల క్రిందటచూచితిని వాడు నాబాల్య మిత్రుడు మస్తాన్ అనుపేరుగలవాడు అని చెప్పెను. మన యాత్రికుడును మస్తాన్‌గారి నెఱింగినవాడగుటచే వెంటనే తెలిసికొని మస్తాన్‌గారిని నేనెఱుంగుదును బాగానేయున్నాడని చెప్పి యాశ్చర్యపడెనట.

ఈ వృద్ధుని సంభాషణముచేత మస్తాన్‌గారు దీర్ఘాయుష్మంతుడును, మహాత్ముడునగుట యేగాక తానును రెండువందల సంవత్సరములకు మించిన వయస్సుగలవాడై నట్లు తేలుచున్నది అందువలన మనయాత్రికుడు భయభ్రాంతుడై యా వృద్ధుని ముందుగూర్చుని యాతని పొగడ నారంభించెను. హిందూదేశ మున సామాన్యజనులలో నెవ్వరును నూరుసంవత్సరములు మించి జీవించువారుండరు. అట్టి విషయములో రెండువందల సంవత్సరములు మించిన వయస్సుగలవారుండుట దుర్లభము. ఎక్కడైనను అట్టివయస్సు గలవారున్నను యీవృద్ధుడును మస్తాన్‌గారును వారిలోవారైనను యొకవింతగాదు గాని యెన్నడునుచూడని మనయాత్రికుని చూచి యావృద్ధుడు నీది గుంటూరుకాదా? యని ప్రశ్నించుటవలన నావృద్ధుడు మహాత్ముడని స్పష్టముగాక తప్పదు. అనంతరము మనయాత్రికు డావృద్ధ యోగివద్ద సెలవుతీసికొని కొన్నాళ్లకు గుంటూరుచేరెను. గుంటూరులో మస్తాన్‌గారున్న చోటికతడు ప్రియత్నపూర్వ

కముగా వచ్చెనుగాని మస్తాన్‌గారు ధ్యానమగ్నులైయుండుట చేత పలుకరించుటకు వీలు లేక వేచియుండెను. ఇంతలో మస్తాన్‌గారిని దర్శించుటకు పలువురుజనులు వచ్చికూర్చుండిరి ఆజనులలో మనయాత్రికుడుడొకడైయుండెను. అట్లొక గంటకాలము కనిపెట్టుకొనియుండగా మస్తాన్‌గారు ధ్యానసమాధి చాలించి కనువిచ్చిచూచువరకచ్చటికి వచ్చినవారు తమతమ వ్యాధులను గూర్చియు గ్రహచార సంభవమైన విపత్తులనుగూర్చియును చెప్పుకొనసాగిరి. ఇట్లు వారి మొరలనువిని అవసరమైన సమాధానములనొసంగి పంపివేసెను. పిమ్మట మనయాత్రికుని గాంచి నా స్నేహితునిచూచి మాటాడివచ్చినావా? నాక్షేమ సమాచారమునుగూర్చి నిన్నడిగిన స్నేహితుడు బాగున్నాడా, అనెను. మనయాత్రికుడాశ్చర్యపడి వారిరువురిలో నొకనికంటె యొకరు మహానుభావులనిదలంచి, చిత్తము మీదర్శనముచేసి మీస్నేహితుడు మీక్షేమసమాచారమడిగెనని చెప్పుటకే నేనిచ్చటికి వచ్చినాను. మీరిద్దరు మహానుభావులు. మీవయస్సువారే నాకు సెలవిచ్చిరి. ఇట్టి మహానుభావులని తెలియక సామాన్యయోగులని మాత్రమే నేనుదలంచితిని. నన్నుచూడగనే నీదిగుంటూరు కాదాయని మీస్నేహితుడును ప్రశ్నించెను. ఆతనిశక్తి యెంతయని చెప్పగలను! ఈస్తోత్రము ప్రారంభింపగనే మస్తాన్‌గారు విననొల్లక నిమీలితలోచనుడై ధ్యానముజేయదొడంగెను. కం॥ "తనులోకము గొనియాడగ వినియుబ్బడుసజ్జనుండు" అను నార్యోక్తి యాతనియందు వ్యక్త

మయ్యెను. అంతనాయాత్రికుడు కొంచము సేపచ్చటనిలచి మస్తాన్‌గారు కన్నులు తెరువకుండుటచే తనయూరున కేగెను.

ఈ మహానుభావుడు పరుండుట యెన్నడు నెవ్వరుజూచి యుండలేదు. నిరంతరము కూర్చునియుండి మేలుకొనుటగాని ధ్యాననిమగ్నుడగుటగాని మాత్రమేగలదు. ధ్యానమనునది నిద్రయేయని మనమెంచినను పరుండుటమాత్రములేదు. కూర్చుండియే నిద్రించుట మేల్కాంచుట మాత్రము గలదు.

ఈతనిగుఱించి చెప్పుకొను వింతచర్యలలో మఱియొక టికలదు. ఒక మహమ్మదీయ యువకుడొకనాడీ మహాత్ముని చూచి పిచ్చివాడని వాదించెను. తెలిసినపెద్దలు వద్దనివారించి నను వినక గట్టిగా పిచ్చివాడేయని మొఱుగబల్కెను. పాప మాయువకు డదేపాటగా పిచ్చివాడు పిచ్చివాడు పిచ్చివాడని గుక్కతిప్పకుండా విరామములేకుండా నరచుచు తిరుగనారం భించెను. అందఱుచూచి వానికి పిచ్చిపట్టినదని యెంచి పట్టిబం ధించి యొక్క గదిలోనుంచి తలుపు మూసిరి. కాని పిచ్చితగ్గి నదికాదు. అట్లు రెండుమూడు దినములావిధముగా నుంచినను వాని పిచ్చిధోరణి తగ్గనందున తలిదండ్రులు కారణమరసి మస్తాన్‌గారి యొద్దకాపిల్లవానిని తీసికొనివెళ్ళి ఆయనపాదముల మీద పడవైచి తాముసుపడి అపరాధముక్షమింపుడని వేడ జొచ్చిరి. అంతటమస్తాన్‌గారు వారి మొరలు నాలించిపిల్లవాని ధోరణిచూచి దగ్గరకుపిలిచి నోటిమీద తనహస్తమునుపెట్టెను. వెంటనే పిచ్చిధోరణి యాగిపోయెను. చెడిన మనస్సు తిరిగి

బాగుపడెను. ఆయువకుడును భయభక్తులతో మస్తానుగారికి వందనముచేసి యాతని యనుగ్రహపాత్రుడై యింటికేగెను.

మస్తానుగారి యద్భుతశక్తి విషయమై మఱికొన్ని గాథలుకలవు. వీరొకదినముదయమున నొకవర్తకుని దుకాణము నొద్ద కౌపీనధారియై కూర్చునియుండెనట. ఇతని వికారాకారమును వృద్ధత్వము నుపలక్షించి యసహ్యపడి లేచిపొమ్మని రెండుమూడుపర్యాయములు చెప్పినను అతడులేవక యట్లే కూర్చుని యుండినందున కోపముతో, నావర్తకుడొక కఱ్ఱతో నతని బలమైన దెబ్బకొట్టెనట. ఆదెబ్బకు మస్తాగారి దేహము తునకలై ఖండఖండములుగా శరీరము చెదరి వేరువేరుగా పడి పోయెనట. ఆసంగతి చుట్టుపట్ల జనులుచూచి గోలపెట్టగా పోలీసువారువచ్చి విచారించి యావర్తకుని పట్టిబంధించి చెరసాలకు తీసికొని వెళ్ళిరట. తునకలై పడియున్న యాతనిశరీరము చేర్చి విచారణచేసి ఖననము జేయ ప్రయత్నించగనే, ఆశరీర శకములన్నియు జేరి జీవవంతమగు దేహముగా మారినందున మస్తానుగారెప్పటివలె తన పూర్వరూపముతో కూర్చునియుండెనట. అంతట నీవింతయంతయు చూచినవారచ్చెరువంది పోలీసుకచ్చేరికి వెళ్లి జరిగినయుదంతయు సాంతముగా తెల్పగా నాహంతకుడు నిర్దోషియని విడిచిపుచ్చిరట. ఇట్టి యమానుషచర్యలవలన మస్తానుగారి మహిమ మండలమెల్ల వ్యాపింప జొచ్చెను. ఇంతకంటె నెక్కువ వింతసంగతులు గాకున్నను అతనికిగల మఱికొన్ని ప్రజ్ఞలుగూడ చదువరులకు హృదయరంజకముగా నుండకపోవసయెంచి యుదహరించుచున్నాడను.

వినుకొండగ్రామకాపురస్తురాలగు నొకయువతిసంతాన ము లేక పలుపాట్లుపడి ప్రయోజనము లేక నిరాసనొంది తుద కొకనాడు గుంటూరురాగా, నచ్చటివారివలన మస్తాన్‌గారి మహిమవిని తనకాతని యనుగ్రహముచేత సంతానము లభింప వచ్చునను పేరాశతో నాతనిసన్నిధికేగి రెండుమూడుదినములు పడియుండ నొకనాడతని కనుగ్రహముగల్గి యొక మొగశిశువు గల్గునుపొమ్మని యనుగ్రహించెనట. అంత నాకాంతతనయింటి కేగెను. కొలది రోజులలోనే గర్భముధరించి పిమ్మట నొక మొగశిశువునుగాంచెనట. శిశువుగల్గిన కొన్ని మాసములకా శిశువును మస్తాన్‌గారికిచూపి తనకృతజ్ఞతా సూచకముగ వందనసమర్పించి యాతని యాశీర్వాదమందు కోరికతో గుంటూరు కేగుటకు పయనమై రైలుస్టేషనుకు వచ్చెనట. అచ్చట రైలుస్టేషను ప్లాటుఫారముమీద నొక మూల మస్తాన్‌గారు కూర్చునియుండిరట. అదిచూచి యావెలది పట్టరానిసంతోషముతో నతనిపాదములకు సాష్టాంగపడి పిల్లవానినికూడ పడవేసెనట. అంతట మస్తాన్‌గారామెతో నీవు గుంటూరు వెళ్లుము అచ్చట పెద్దయుత్సవము జరుగును. అదిచూచి యానందింపుమని చెప్పిరట. ఆమహాత్ముని యుత్తి రువుచొప్పున నాకాంత గుంటూరుకేగి విచారింపగా మస్తాన్ గారు చనిపోయిననారనియును అందుకై గుంటూరుపురవాసు లెల్లరు పెద్దయుత్సవము జేయుచున్నారనియును తెలిసి యచ్చటి కేగి యుత్సవము దర్శించెనుగాని యామెకాతడు చనిపోయినట్లు విశ్వాసము గలుగలేదు. ఆరోజుననే తాను వినుకొండ స్టేషను యొద్దచూచి మాటలాడివచ్చిన మస్తాన్‌గారు మరణించినట్లు

ఆపూటనే వినుటచేత, నామెకు నమ్మకమెట్లుగల్గును ? ఆమె తానామహాత్ముని రెండుమూడు గంటలక్రిందట వినుకొండలో చూచివచ్చితినని యెవ్వరితోనో చెప్పెను. ఆమెమాటవినువారు లేరైరి. అంతట నాయింటి యుత్సవముచూచి మస్తాన్‌గారి కళేబరముచూచి తానుచూచినమహాత్ముడు వేరొకపురుషుడేమో ! యని సందేహపడుచు స్వగ్రామము జేరి యచ్చటవిచారింపగా తాను స్టేషనులో చూచిన పురుషునిచూచినట్లు చెప్పువా రెవరును లేరైరి. మస్తాన్‌గారు మరణించిన పిమ్మట సహితము కొన్నిరోజులవఱకు కొందఱి కాత డచ్చటచ్చట కనుపించుచు వచ్చెనను వదంతి వ్యాపించియుండెను.

మస్తాన్‌గారొక దినమున బెజవాడలో కొందఱు పెద్దమనుష్యులు కూర్చునియుండ, తానచ్చటికివచ్చి మాటలాడుచు తనచేతనున్న బుట్టనచ్చటపెట్టి మక్కాకు వెళ్ళి వెంటనేవచ్చెదననియును అంతవఱకు బుట్టను చూచుచుండవలసినదనియును చెప్పి వెళ్లెను. అచ్చటివారతనిమాటలు తమకర్థముగాక మక్కా యెక్కడ బెజవాడయెక్కడ, అతడు వెళ్ళివచ్చుట యెక్కడ అని సందేహపడుచు తమషాగా మాట్లాడి యెచ్చటికో వెళ్ళినాడని తలంచుచు తమమాటల ధోరణిలో తాము పొద్దుపుచ్చుచుండిరి. పిమ్మట రెండుగంటలకు మస్తాన్‌గారు తిరిగి వచ్చి తనబుట్టను తీసుకొనగా నచ్చట గూర్చుండియుండిన పెద్దమనుష్యులు పరిహాసముగా మక్కాకు వెళ్ళివచ్చినావా ? యని ప్రశ్నించిరట. మస్తాన్‌గారు ఆయిప్పుడే వెళ్ళివచ్చినాను అచ్చట పెద్దయుత్సవము జరుగుచున్నది అచ్చటికి మహాత్ములు

వచ్చినారు వారిని దర్శించి వచ్చినానని" ఉత్తరము చెప్పిరట. ఆపెద్దమనుష్యులంతట నాతనిమాట యదార్థమును పరీక్షింపనెంచి ఆతేదీయును గంటయును వ్రాసిపెట్టుకొని మక్కాలో తామెఱింగినవారికి తంతీవార్తమూలముగా నాదినమున ఆసమయమున మక్కాలో నేమిజరిగినది తెలుపవేడగా వారచ్చట జరిగిన సమాచారమును మస్తాన్‌గారచ్చటికివచ్చిన విషయము తెలుపుచు జవాబుపంపిరి. ఆయద్భుత సమాచారమును విని భయభ్రాంత మనస్కులై వారందరు మస్తాన్‌గారి వెంటబడి ఆయననూరేగెంచి పవిత్రమహమ్మదు నపరావతారమని వేనోళ్ల స్తోత్రముజేయసాగిరి.

ఇంకొకపర్యాయము మస్తాన్‌గారు గుంటూరులోనున్న రోజులలో పోలూరు పాపరాజను నొక జ్ఞానయోగిగారి శిష్యుడు ఉన్నవ నందయ్యగారను నాయన తనగురువుగారి యనుజ్ఞచే మస్తాన్‌గారిని సందర్శింపనెంచి గుంటూరునకేగి మస్తాన్‌గారున్న చోటికేగెను. అచ్చట మస్తాన్‌గారొక మఱ్ఱిచెట్టుక్రింద కూర్చునినిమీలితలోచనులై యుండెను. అతనిసన్నిధానముననొక బీదవాడు రుగ్జరాబాధితుడై యుండి మస్తాన్‌గారి యనుగ్రహమునకై వేచియుండెను. నందయ్యగారచ్చటికేగిన ఒక యరగంటకు మస్తాన్‌గారు కన్నులుదెఱిచి యచ్చటతనకై వేచియున్న బీదవాని ననుగ్రహించి పంపుచు నందయ్యగారివంక చూచి, నీయొద్దనున్న నాల్గణాడబ్బు లాబీదవానికిమ్మని సెలవొసంగెను. నందయ్యగారియొద్ద మస్తాన్ చెప్పినట్లు నాల్గణాలు మాత్రమే యుండెను. ఆపావలా నందయ్యగారు వెంటనే

యాబీదవృద్ధున కొసంగెను. అంతటమస్తాన్ మందస్మితముచేసి 'పాపరాజుగారు నిన్ను పంపినారా'అని యడిగెను. నందయ్య గారాశ్చర్యపడి ''చిత్రము'' అని బదులు చెప్పెను. అంతట మస్తాన్ 'పాపరాజుగారు చాలమంచివారు, హిందువుల యిం డ్లలో పితృదినములలో నితరులకెవరికి బిచ్చమైనను పెట్టరు కాని పాపరాజుగారు తనతండ్రి యాబ్దికమురోజున ముందుగా నాకన్నముపెట్టెను. అనిచెప్పిరట. ఈమహాత్ముడు తానత్యంత నిరాడంబర జీవనుడై మానావమానములకు విముఖుడై నిరం తర ధ్యానరతుడై దేహయాత్ర నడపుచుండెను.

ఈ మహాత్ముని యపారమహిమ దెలుపు మఱియొక యుదంతముగలదు. నిజాంరాష్ట్ర నివాసియగు నూరుల్ ముస్తాఫాఖాదర్ అనునొక మతగురువు దేశసంచారము జేయుచు శిష్యకోటిని సంపాదించుచు ధనసంపాదనము జేయుచుండిరి. ఆయన యొకదినమున మస్తాన్‌గారున్న గ్రామమునకువచ్చి యచ్చటి మహమ్మదీయులెల్ల మస్తాన్‌గారి మహిమనుగూర్చి స్తోత్రముసేయగా సహింపలేక నతని నిందించుచు నిరసించుచు ఆత్మభూషణము గావించుకొనసాగెను అంతట యుభయులకును సన్నిధి గలిగించు తలంపుతో నా పురవాసులు కొందఱు మస్తాన్‌గారున్న చోటికా మహమ్మదీయ గురువును తీసికొని వచ్చిరి. అమిత వాచాలుడగు నామతగురువు మస్తాన్‌గారి మౌన ముద్రను, నిమీలిత లోచనములను వికారస్వరూపమును వృద్ధాప్యదశను చూచి సులభముగా నతని తనమాటకారి

తనముచేత నోడింపవచ్చునను పేరాసతో విజృంభించి ఖురాను నుండి తానువల్లించిన కొన్ని మంత్రముల చదివి వాని యర్థము చెప్పగలవాడని మస్తాన్‌గారిని ప్రశ్నించెను. అందుకు వానియర్థము తనకు తెలియదనియు, తెలియనక్కర లేదనియు నుత్తరముచెప్పగా మతావేశము తెప్పించుకొని అచ్చటనున్న మహమ్మదీయులకు నచ్చునట్లుగా గంభీరస్వరముతో కోపముతో "ఖురాన్ వ్యర్థమా" నీవు మహమ్మదీయుడవుకావా? కాఫర్ వా? అనిగద్దించెను. దానికి మస్తాన్‌గా రుత్తరముచెప్పక కనులుమూసుకొనెను. అచ్చటనున్న వారిలో మస్తాన్ గారి మహిమనెఱింగిన వారు కొందఱు "అయ్యా! మస్తాన్ పండితుడు కాకపోవచ్చునుగాని అతడు మహాయోగి మహిమగలవాడు" అనిచెప్పిరి అంతట నామత గురువు కోపోద్దీపితుడై, "ఈమహిమలు యీయోగము వట్టి టక్కరితనముగాని నిజముకాదు నిజమైన దైవభక్తిగలవాడు ఖురాన్ వల్లించి అందుల ధర్మముల పెద్దలవలన తెలిసికొని ఆధర్మముల నాచరణలోపెట్టి దేశసంచారముజేసి మతవ్యాప్తి గావించవలెను. అదియే ప్రవక్తగారి సందేశము" అనెను. ప్రవక్తగారి సందేశ మెట్టులుండినను ప్రత్యక్షముగా గానుపించుచుండు మహిమల విచారింపవలదా? ఆమహిమ లట్లుంచుడు. భక్తియన భగవానునియందు విడివడని యనురాగము. భగవానుడు విశ్వస్వరూపుడు అట్లగుటచేతనే యొకభక్తు డిట్లు భగవానుని వర్ణించినాడు.

క॥ విశ్వము నీలోనుండును
విశ్వములోనుండువీవు వేరుపడక నా
విశ్వమునీవే నివే
విశ్వము భేదంబులేదు వీసంబైనన్ ॥

ఇదికాక (శ్రీవిష్ణు సహస్రనామ భాష్యమున విశ్వ నామమున కిట్లుత్ప త్తిదెల్పినారు—

సీ॥ బ్రహ్మకారణము ప్రపంచానికా కార
ణము కార్యమును యభిన్నంబయగుట
సగుణ నిర్గుణ శూన్యసంగతి విశ్వంబు
విస్తరిల్లుట సర్వ విశ్వశబ్ద
ములు సమనార్థకం ♦ బులఁబ్రవర్తిల్లుట
బ్రళయంబునను భూత ♦ పఙ్క్తి బ్రహ్మ
మందుఁ బ్రవేశింప ♦ నలకారణ ప్రభూ
తంజగు బగము స ♦ ర్వంబునందు

గీ॥ జీవరూపంబునను బ్రహ్మ ♦ చేరియుంట
బ్రహ్మశబ్దంబు నీయందు ♦ వర్తిలుటను
విశ్వనామంబు నీకగు ♦ వేదవేద్య
రమ్యగుణసాంద్ర శ్రీరఘు ♦ రామచంద్ర ॥

కనుక భగవంతుడు విశ్వస్వరూపుడనుట నిర్వివాదాంశము. భక్తుడు భగవానునియం దనురాగము గలవాడనిన విశ్వమునందనురాగము గలవాడనుట. విశ్వమునంతయు నారాధించు భక్తుడొక మతబద్ధుడగునా? మతబద్ధుడేయైనచో నిష్కామియై మెలంగుటకు వీలులేదు. ఎందుకన మతవ్యాప్తి

జేయుటగూడ నొకకోరికయై యుండును. గనుక అందునుంచి భక్తుడన్ని మతములందును సమానభావముంచి స్వపర భేదములెన్నక, స్వాభిమానరహితుండై విదేహుని యట్ల మెలం గుచు. తనకు ఫలాభిరతి లేకుండినను లోకోద్ధరణమునకై కర్మము లాచరించుచుండును. కోపమును వీడినవారికి మాత్రి మీమహాత్ముని సాధుత్వ మెఱుంగబడుననీ యచ్చటనుండు ప్రివక్తలలో నొకరనిరి. దానికి మఱింత కోపించి కాఫరుల శాస్త్రములతో మాకు పనిలేదు. ఏమహమ్మదీయుడు హిందూమతానుసారము వర్తించి స్వమతమున కపకీర్తి గలిగిం చును. మీతో మేము వాదులాడుటకు రాలేము నిజముగా మీ మస్తాన్ మహిమగలవాడే యయినచో, విదేహుడే యయినచో దృష్టాంతము చూపగలడా! వట్టిమాట లేనా! అట్లు చూపు నెడల మేమును మీమస్తాన్‌కు శిష్యులమయ్యెదము. లేదేని మీరు మామతమును స్వీకరింపగలరా! యను ఖాదర్ గారి వాక్యములకు భయపడి, చాలామంది నిరుత్తరులై యుండిరి. గాని అందులో మస్తాన్‌గారి ప్రభావము సంపూర్ణముగా నెఱింగిన నొక హిందూవృద్ధుడు, 'అయ్యా ఆచారములు భేద ముగానుండిన యుండవచ్చునుగాని యన్ని మతములవారికిని ధర్మశాస్త్ర మొకేరీతి నుండును. అనగా మా వేదమునకును మీఖురాన్‌కును భేదముండదు. జ్ఞానులన్ని మతములయందును గలరు. వారలందఱొకేధర్మము నాశ్రయించినవారై యుం దురు. కీర్త్యపకీర్తుల లెక్కింపక యథార్థమెఱింగి వర్తింతురు. మీకెట్లు వాదములో పనిలేదో అట్లే మాకును పనిలేదు. నిజ

ముగా మస్తాన్ మహిమగలవాఁడే "విదేహుఁడే" దృష్టాంతము చూడనెంచిన చూపగలను. వట్టిమాటలుగావు. నిజముగా వారిమహిమలు చూచినచో మీరు? శిష్యులగుటకు వెనుదీయ రని ఖండితముగా చెప్పగలను. మస్తాన్‌గారియందు మహాత్మ్య లేదని మీరు ఋజువుపఱచు నెడల నేను మీ మతమును స్వీక రించుటకు సిద్ధముగా నున్నా, నని చెప్పి నిలచిన, ఖాదర్ గారు చిరునవ్వు నవ్వుచు, దృష్టాంతము చూడ మనియెదవా? మస్తాన్ గారిని పరీక్షించుపట్ల ప్రమాదము సంభవించిన నేను జబాబు దారుఁడనుగానని చెప్పుచు, నొక్క పెద్దపాత్రను తెప్పించి దానిని తైలముచే నింపి పొయియందుంచి సలసలకాచి, ముం దా కాగుచున్న తైలము కొంత తెప్పించి సమాధిమగ్నులై యున్న మస్తాన్‌గారి దేహముపైన పోయించెనుగాని, దాని కాపురుషోత్తముఁడు చలింపలేదు. సమాధి నిష్టాగరిష్ఠులకు దేహభ్రాంతి నశించుటచే నాసమయమం దెట్టికష్టములపాల్గా వింప నెంచిన నవియన్నియు నిరర్థకములై పోవును. కనుక నేఁ? మున్నొకపరి శ్రీరామకృష్ణ పరమహంసగారు నిర్వికల్పసమాధి యందు నిలచియుండ మూర్ధాగ్రేసర చక్రవర్తి యొక్కం డరుదెంచి, పరమహంసగారి స్థితి కపటంబని తలంచి, నిజమెఱుంగ నొక యినుపకమ్మి నెఱ్ఱగ కాల్చి తెచ్చి పరమహంసగారి తొడ యందుంచెనట. ఆకమ్మి నావరించియున్న హవ్యవాహనుఁడు శ్రీవారితొడ నంగుళములోతువఱకు కాల్చినాఁడట అట్లు తన తొడ కాలిపోవుచున్నది పరమహంసగా రెఱుంగరు. అక్రూర కార్యము గావించిన మహానుభావు డాచిత్రమునుగాంచి

యపడి, పరమహంసగారు సమాధినుండి లేచువఱకందు గారుచుండియుండి వారు బహిర్ముఖులగుడు తనతప్పు నెఱిం ంచి క్షమాపణము గోరిరట. అంతవఱ కెందుకు? బ్రహ్మశ్రీ పత్తాప కోటయ్యశాస్త్రిగారు సమాధియందున్నపుడు చీమలు దేహమంతటను వ్యాపించి సంచరించుటగాక నప్పుడప్పుడు ర్పములుగూడ వారి దేహమందు చుట్టుకొనియుండునని న్నవ నందయ్యగారు చెప్పుచుండువారు. అట్లే మస్తాన్‌గారి నందు హావ్యావాహానుదేమియు తన నైజకృత్యమును జూపి యుండ లే[illegible] అట్లు మస్తాన్‌గారు చలింపకుండుట ఖాదర్‌గారు కాంచి, నూనె బాగా కాగలేదని దలంచి, నిరుత్సాహముం గొనక తిరిగి నూనె మిక్కుటముగా కాయించి, తప్తతైల మును తెప్పించి యాపాదమస్తకము మునుంగునటుల పోయిం చెను. అప్పుడుగూడ మస్తాన్‌గారు చలింపలేదు. చలింపక పోవుటగాక, దేహమున బొబ్బలెక్కుటగాని కందుటగాని చివ ఱకు నైజకాంతినుండి విడివడుటగాని జరుగలేదు. ఏమి విచిత్రము! మున్ను హిరణ్యకశ్యపుడు తప్తతైలమున ముం చిన, నిర్బాధకుడై చెలంగిన ప్రహ్లాదునివలెనె మనమస్తాన్ గారు ప్రకాశించిరి. దానితో ఖాదర్‌గారికి భయాశ్చర్య విషాదములు ముప్పిరిగొనినవి. మస్తాన్‌గారికి కోపమువచ్చి తనను శపింపగలడని శంకించుచు, వారు సమాధినుండి లేచు వఱకు వేచియుండి సమయమరసి తనతప్పును వెల్లడించి క్షమాపణగోరుచు, శిష్యునిగా స్వీకరింపఁ బ్రార్థించెను. ప్రత్యక్ష శిష్యబృందమును సేకరించి తద్వారా నిజకీర్తి చంద్రి

కల లోకమంతయు వ్యాపింపజేయవలయునను కోరిక లేనివాడగుటచే, సమాధానము చెప్పక ప్రసన్నదృష్టితో వానిని విలకించెను.

మస్తాన్‌గారెందఱికో గురువుగానుండెనుగాని వారికి మాత్ర మొక్కడేసియు శిష్యుడులేడు. తన నడవడి ననుసరించి మానవులు కృతార్థులగును గాకయని నమ్మువాడగుటచే ప్రత్యక్షశిష్యులను చేర్చలేదు. మదార్ పిన్నటనుండియు, తన ననుసరించి కష్టములకోర్చి నిరంతరము సేవజేయుచు దిరుగుచుండినను పరతత్వ మిట్టిదనిగాని, నీవిటుల చరింపవలయునని గాని వాగ్రూపముగా నెప్పుడును చెప్పియుండలేదు.

ఖాదర్ గారిట్లు మస్తాన్‌గారిచే ననుగ్రహింపబడి శ్రీవారి యాజ్ఞానుసరణి స్వదేశమున కేగి తానుచూచిన యద్భుతవిషయము లాదేశమంతటను వెల్లడిజేసిరి.

ఈఘనుడెవరే పని జేయుచుండినను తానును వారితో గలసి నాయాపనులు జేయుచుండువాడు. వీరికి పీపాలుకొలది సారాయి త్రాగు నాచారముగలదను కింవదంతి కలదుగాని, విచారించిన నీనింద విరోధులుకొందఱు గలిగించియుండినట్లు తెలియవచ్చినది గాన నిజముగాదు. అష్టసిద్ధుల గడించిన వారిలో ప్రథములు. వీరు గుంటూరులో సిద్ధిబొందిన దివసముననే సామాన్యముగు మానవాకారమూని చుట్టుపట్టులనుండు గ్రామములలో బొడసూపి, 'నేడు గుంటూరు నల్లమస్తాన్ సిద్ధిబొందినాడు. అందుచే నక్కడ గొప్పయుత్సవము జరుగనున్నది. ఆయుత్సవమును దిలకించుటకు నేనుబోవుచున్నాను.

అని అన్ని గ్రామములలో నొకేపర్యాయము జెప్పినట్లాయుత్స వముఁజూడ నేతెంచినవారు వెల్లడించినారని ఆయూరిలోని పెద్దలు చెప్పుచున్నారు.

వీరు సిద్ధిబొందుటకు ముందైదురోజులుగా నే నెల యిర్వదిమూడవతేది పగలు పదిగంటలకు నేనీదేహము చాలిం చెదనని ప్రకటించుటచే నాదివసమునకు తదుత్సవదిదృక్షాపేక్ష త్వరపెట్ట పలువురు ప్రేక్షకులరుదెంచి మస్తాన్‌గారిని దర్శించి శ్రీవారు సుఖముగానున్నటుల నెఱింగి నిర్ణిష్టకాలమున కెదురు చూచుచుండిరి పదిగంటలయినది. తనపాదసేవజేయుచు గూరు చునియున్న మదారుగారికి తనపోకడ చేసన్నతో నెఱిగించుచు పరమపద మలంకరించిరట. ఆచిత్రము కనులారాజూచి ప్రేక్ష కులాశ్చర్య విషాదములకు లోనైరనుటలో వింత లేదుగదా!

ఈవార్త యచిరకాలముననే వ్యాపించిపురమునంతయు విషాదమున ముంచి వేసినది. మస్తాన్‌గారు జ్ఞానులైనను జాతిన మహమ్మదీయులగుటచే మహమ్మదీయ మతానుసారముగ సమాధిజేయుట మంచిదనియెంచి, శ్రీవారిసమాధికి నగరం పిచ్చయ్యగారు సమర్పించిన స్తలమున సమాధిపనులు సాగింప నెంచిన యారోగ్యశాఖాధికారరుదెంచి పురసామీప్యమున శవశరీమును పూడ్చివేసిన పురవాసుల కనారోగ్యము కలుగును గాన వీలులేదనియు నిర్ణిష్టస్థానమున ఖననము గావింపవలయు ననియు చెప్పుచు నిరోధించిరి. ప్రభావసంపన్నుడగు మస్తాన్ గారి శవము సామాన్యమానవ శవమట్లు స్మశానమున బూడ్చుట కిష్టము లేక పురిలోని హిందూ మహమ్మదీయులందరు

తహతహ జెందుచుండిరి. పగలు నాలుగుగంటలయినది ప్రొద్దు లేదు. సమాధివద్ద జరుగవలసిన క్రియలనేకములుండుటయే గాక రాత్రియైన నన్యగ్రామములనుండి రాబడిన ప్రేక్షకులకు తగినయేర్పాట్లు చేయకుండుటచే వారు భోజనసన్నాదులకిబ్బంది పడవలసివచ్చునని గూడ నాయకులు పశ్చాత్తాపపడుచుండిరి. ఈలోపల కారణములేక నాఆరోగ్యశాఖాధికారికి కుక్షిశూల సంభవించి బాధపెట్టుచు గిల్‌దొరగారివలన ప్రబోధింపబడి తనవ్యతిరేకాభిప్రాయమును సవరించుకొని యారోగ్యపూరి తుడాయెను. వెంటనే సమాధికార్యములు ప్రారంభించి యచిర కాలముననే పూర్తిగావించిరి. తోడనే సుగంధద్రవ్యములతో నాగర్తము సగమువఱకు నింపబడెను. ఆగర్తమున మస్తాన్‌గారి కళేబరమునుగూరుచుండబెట్టి మహమ్మదీయ శాస్త్రానుసరణి క్రియలగావించి యావఱకాకళేబరమునకు గప్పియుంచిన వస్త్రముదొలగించి చూచిన యాకళేబరమున ప్రేతకళలే బ్రహ్మతేజము విజృంభించి చిరుచెమటల నొప్పియుండుట ప్రేక్షకులెల్లరు గాంచి యానందనృత్యము గావించిరి. 23-5-1895 తేదీన నాగర్తముపైనొకపరుపుబండను పఱచిదాని పైచిత్రవిచిత్ర కట్టడములకట్టించి పూర్తిగావించి గుంటూరు పురవాస్తవ్యులు కృతార్థులైరి. ఇది భక్తిలతా గ్రంథమాల నుండి సంగ్రహింపబడినది.



—————

# అమరవాది

శ్రీ కాకళ్ళ రామానుజాచార్యులుగారు

గీ॥ అవని రామోత్సవ ప్రక్రియావిధాన
మాగమోక్తానుసారంబు గాగ్రహించి
రామచంద్రున కర్పించి రామమునిన
అనఘు వెంకటరామాను జార్యుగొలిచి
రామచంద్రుని గాంతుదు ర్భవమడంతు ॥

భగవానుడెట్లవాఙ్మనస గోచరుడో భగవన్నామ మట్లే అవాఙ్మానస గోచరము తెలిసియైనను తెలియకయైనను భగవన్నామసంకీర్తన గావించిన వారిపాపములు జలమునం దుంచిన లవణమువలె హరించిపోవును. భగవన్నామమునందు బుద్ధి నుంచువాడు నరక మనుభవింపడు నామకీర్తనాపరునకు స్వర్గ సుఖముగూడ స్వల్పాతిస్వల్పమే. ఘోరకిరాతులైనను భగవత్స్మరణమువలన ముక్తినందెదరన బుణ్యాత్ములమాట జెప్ప నేల? అగ్ని నార్పుటకు నీరును చీకటిని బోగొట్టుటకు సూర్యుడును చాలియున్నట్లు, పాపముల నశింపజేయుటకు భగవన్నామము జాలియున్నది. రోజున కొకక్షణకాలమైనను, నిశ్చలచిత్తముతో భగవన్నామము జపించినవారికి శాశ్వత సుఖము లభించునని స్వానుభూతిపరు లనుచున్నారు. ఇక

సర్వకాల సర్వావస్థలయందును, విడువక జపించు వారి కెట్టి యుత్తమస్థితిలభింపగలదో ఎఱింగింప నేరితరము.

భగవంతుని పాదముల కొక నమస్కారముజేసిన పది యశ్వమేధముల యవబృంధములతో సమానమైనదట గాని యజ్ఞముల ఫల ముత్తమజన్మలకు గారణ మగును. గాని జన్మరహితస్థితి గూర్పలేదని తెలిసినవారగుట నాచార్యులవారు రాకపోకల నరికట్టి జాలిన శ్రీరామనామము నాశ్రయించి తరించినారు.

గోలకొండ రాష్ట్రము ఔరంగజేబుచే భంగపడిన యనంతరము పదియు నేడవ శతాబ్దియందు భద్రాచల మొక జమీందారుచే బాలింపబడుచు, శ్రీరామ కైంకర్యములు కొడవడక జరుగుచువచ్చినవి. ఈ జమీందారు పేరుగాని, వంశముగాని తెలియబడదు. ముందు దెలిసికొనదగిన యాధారములుగూడ నెక్కడను ఎట్టివియు గనుపించుట లేదు. ఈ క్షేత్రమున అమరవాది కామళ్ళ వెంకటరామానుజాచార్యుల వారను దివ్యపురుషులు జన్మించిరి. తల్లి దండ్రుల పేర్లు తెలియవు విచారించిన నీ వంశమువా రిప్పటివఱకును భద్రాచలముననున్నట్టి వినికిడి ప్రయత్నించి ముందు బాలక లోకమున కెఱింగించుభాగ్యము లభించుగాక ద్వితీయ, తృతీయ సంతానములు నష్టపడుటచే దల్లిదండ్రు లీ పిల్లవాడు జన్మించిన వెంటనే ! శ్రీరాముని కర్పించిన నాతండు శ్రీరామానుగ్రహమువలన రామాభిషేకమునకు రాబడు గోక్షీరముల వలనను కొంతకాలము రామాలయమున బ్రతిదివసము విధిగా

వేయుచుండు వాయసబలి మెతుకుల వలనను క్షున్నివారణ జేసికొనుచు రామపాదతీర్థముచే దాహశాంతి గావించు కొనుచు దినదినాభివృద్ధి నందుచుండె.

ఈ మహాత్ముడు సహజ పాండితీపటిమ గలిగి సర్వ కళా కోవిదుడై నాడు. గర్భాష్టమందుపనయన మైనది వయో వృద్ధి యైనకొలదియు రామభక్తి విస్తరించినది. సర్వకాల సర్వావస్థలయందు గూడ రామనామము మరచువాడుగాడు. అభినవ ప్రహ్లాదుడై నాడు నిద్రనుండి లేచిన వెంటనే కాల్య కృత్యములు తీర్చి షోడశోపచార విధుల రాము నర్చించి ప్రసాదము స్వీకరించి విజనస్థలము నాశ్రయించి భగవ ద్విచారము జేయుచు దాను తరించి యాశ్రితుల దరింపజేయు చుండువాడు.

ఒకప్పుడు సంప్రజ్ఞాత సమాధియందుండు తరి శ్రీరా ములు సాక్షాత్కరించిన దర్శించి ఆనంద భాష్పధారావిలసిత కపోలతలుండును గద్గదస్వర పూరిత గీర్వాలంకృతుండును పులకీకృత సర్వాంగుండు నగుచు మైమరచి వినుతు లొనరించి నమ్రుడైన నిజభక్తునిగాంచి ప్రభువు వత్సా! మదుత్సవ ప్రక్రియ నంతయు నాగమశాస్త్రోక్తవిధి బొందుపరచి మూల గ్రంథమునకు ఖండవర సలిఖించి మదీయాభిలాష నెర వేర్చు మని విన్నవించి యంతర్హితుండైన బండితవర్యుల కలవిగాని యేతత్కార్యము బూర్తిగావించి తన సహజపాండిత్య ప్రక ర్షను వెలయించినాడు. మన ఆచార్యులు యీ యుత్సవ ప్రక్రియ ననుసరించియే? నేటికిని భద్రగిరియందు శ్రీరా మోత్సవములు జరుగుచున్నయవి.

ఒకప్పుడు ధర్మకర్త స్వామిదర్శనమునకు వచ్చినపుడు తన కాచార్యులు తగు మర్యాద జేయ లేదని కినిసి తన పాలన క్రిందనుండు గ్రామములయం దెక్కడను నిలువరాదను క్రూర శిక్ష విధించిన జేయునది లేక రామాజ్ఞనంది భగవద్విశ్లేషమున కోరుచు పాలవంచ జేరి మృత్తికతో సీతారామమూర్తుల నిర్మించి ప్రాణప్రతిష్టకళావాహనాదులు గావించి పెక్కు రీతుల నుతించి స్తుతించి సుముఖుని గావించుకొనిన రామ మూర్తి సాక్షాత్కరించి పుత్రా, మద్వియోగమువలన నీ వెట్టి వెతగుడుచుచుంటివో ? నీ విశ్లేషమువలన నేనును తీరని పరి తాప మొందుచుంటి నీవు లేని యాశూన్యగ్రామము నం దడుగిడక నిందయుండెద నని సెలవొసంగిన నాచార్యులు పరి తృప్తులై భగవత్సేవా పరాయణులై యుండిరి.

మరుదిన ముదయమునకు భద్రిగిరి రామాలయమునం దర్చామూర్తులు లేమి చూచి తన యపవ్యక్తమునకు పరితప్తుడై జమీందారు స్వయముగా పాలవంచకు పాదచారియై జని యాచార్యులవారి ప్రార్థించి క్షమింపుడని విన్నవించి సమ్మతి పరచి తెచ్చి భద్రగిరి జేర్చి ధన్యుడైనాడు.

ఒకప్పుడు యవనభటులు పలువురు భద్రిగిరి ముట్ట డించి యాలయము ప్రవేశింప జూచుచుండిరని వినిన వా డగుట జమీందా రాచార్యుల సమీపించి రానున్న విపత్తు నెఱింగించిన తురుష్కులవలన నెట్టి యాపదయు రాదు వారు క్రూరకర్ములగుట బ్రజల హింసింపగలరేమో ? యని సంశ యించుచుంటివి వారట్లు గావించిన గర్మశరీరము లను బంది

నాలనుండి విడివడిన వారమగుదుము అంతటి పుణ్యము నకు లభించునా? నిజముగ లభింపదు, ఎన్నాళ్ళు బ్రతికి ను మరణము తప్పదుగదా? భయమెందులకు కాదగిన ర్యము భగవానుడే!" తీర్పగలడు నిశ్చలులై యుండుడని ర్యముజెప్పి జమీందారుని బంపివేసి దానొంటరిగా కోనల ప్రవేశించి భజన గావించుచుండె.

అంత యవనభటులు కోనెల యట్టి కలకలము లేవిఱ వారించి యొకరిద్దరుమాత్రము దేవాలయములో ప్రవేశించి గాచిరిగాని అందువారికి విగ్రహము లగుపడలేదు. నిరీశ్వరా కుమని తలంచి తిరిగివెళ్ళినారు. యవనబాధ యంతరించి . గోదావరీపరిసరసీమ ననుసరించి వెళ్లినారు. యవను దలు నాటనుండి నిర్బాధకముగా భగవదారాధన జరుగు న్నది.

పై విపత్సమయము ననుసరించి భయాతిరేకమున చార్యుల వారి కెఱుకబరపకయే అర్చకబృంద ముత్సవ ములను గౌతమీ నదియం దొకచో, దాచి యవనుల బారి ండి తప్పించిరి. గ్రామము నిష్కంటక మైనవెంటనే తమీ ప్రవాహ మతిశయించుట నుత్సవమూర్తుల వెలికి యుటకు వీలుచిక్కినది కాదు. కొంతకాలము జరిగినది. ల్లువ తగ్గినది గాని దాచినచోట నామూర్తులు కనుపింప దు. నిష్కారణముగ నుత్సవబేరమును గోల్పడుట కడలుచుండ కనాడు కొందఱు రైతులు జమీందారునికడకేగి ప్రతిదివస ర్ధరాత్రియందు గోదావరి నీటినుండి యెవ్వరో? తన తమ్ముని

బిలచినట్లు శబ్దము వినవచ్చు చున్నది. యెంత బ్రయత్నించి నను వా రెవ్వరయినది తెలియవచ్చుట లేదు. అని చెప్పి వెళ్ళినారు. కారణమరయు తలంపున విచారించి ఆలయము నం దుత్సవభేరము లేదని తెలిసి అర్చకుల యవివేకమునకు జించించి గోదావరినుండి పిలుచువాడు రామమూర్తియని నిశ్చయించి మన యాచార్యుల కెఱింగింప నాతం డిట్లనియె. రాజా ! రేపు మధ్యాహ్నమున కుత్సవబేరము గోదావరి నీటిపై కేలియాడుచుండును కైకొనిరండన వారట్లుగావించి కృతకృత్యులైరి. కాని బేరమున సీతావిగ్రహమగుపింపలేదు. కారణ మెఱింగింపవేడిన రామచంద్రుడు, సీతను గౌతమి కొసంగినాడు. కాన నైజామురాష్ట్రమునగల ఫణిగిరి ఆల యమునుండి జానకీవిగ్రహమును గొనితెండని యానతిచ్చిన వారట్లే "కావించిరి. ఇది తెలిసి ఫణిగిరి ధర్మకర్తలు బలవంతు లగు జమీాందారులగుట నెత్తివచ్చి భద్రగిరి ముట్టడించిరి. నాటిరాత్రి ఫణిగిరి జమీాందారునకు స్వప్నమున శ్రీరాముడు సాక్షాత్కరించి నాయాజ్ఞమీాద జరిగిన సంఘటనమునకు నీవడ్డు గల్గింపలేవు, విరమించుకొమ్మని సెలవొసంగిన వాడట్లు గావించె, ఇప్పటి సీతావిగ్రహము ఫణిగిరినుండి తెచ్చి ప్రతి ష్టించినదియే" యని పాఠకుల కెఱింగించి సెలవర్థించెద. ఇట్లా చార్యులవా రమానుషప్రభావములజూపి తనదెబ్బదియవయేట బరమపద మలంకరించినారు.

# అల్లూరి వెంకటాద్రిస్వామి

భగవంతుడు కరుణామయుడు, శాశ్వతసుఖమును గలిగించుటకై యధికారియగు జీవుని వెంటనంటి సమయమరసి జ్ఞానోదయభాగ్య మొదవించును. ఇచ్ఛామాత్రముచేతనే "తా నన్ని జీవుల నుద్ధరింప జాలినవాడే" గాని, తన యచింత్య లీలలచే మానవుని భక్తిమార్గమునందు బ్రవర్తింపజేసి యందాతడు కావించు స్వప్రయత్నములయందు దానంతరంగోపదేశకర్తయై భక్తునుజ్జీవింపజేయును.

ఈ రహస్య మెఱింగియే, "రామదాసాదిభక్తులు తీవ్రతమమైన భగవద్భజనలో బాల్గొని సులభముగ భగవదనుగ్రహము గడించినారు. భగవద్భజనలో బాల్గొనిన భక్తులకు గొంతవడికి సప్రయత్నముగా దద్భజన నిలచిపోయి కనిపిని యెఱుంగని దుఃఖమున మునిగి మఱికొంతవడికి దశదిక్కులు భగవన్మయములగుటచే దుఃఖమునవ్వగా" మూరి యా వెనుక నాత్మజ్యోతి పొడగట్టుటచే సంతోషాతిశయమున, గంతులు వేయుచు నావల భగవద్భావాపూర్ణుడై తద్గుణకీర్తనమున బ్రారంభించి సాగించి అదియు నప్రయత్నముగ విరమించి భగవద్గుణగణోపన్యాసమున మైమరచి సంప్రజ్ఞాతసమాధిలో నిష్టమూర్తి దర్శనములభింప భక్తుడు కృతకృత్యుడగుచున్నాడు.

ఇట్టి భజనానందమున స్వానుభవపూర్ణుడు శ్రీ అల్లూరి వెంకటాద్రిస్వామి ఆరువేల నియోగి బ్రాహ్మణుడు జననము క్రీ. 1862 సంవత్సరములు. జననస్థలము కృష్ణామండలములోని

వరిటాలజెంతగల అల్లూరగ్రహారము. శ్రీవత్ససగోత్రము. తండ్రి వెంకయార్యుడు. తల్లి వెంకమాంబ. ఈతడు పంచవర్ష ప్రాయమునుండి ఆగ్రామమున వేంచేసియుండు నృసింహ స్వామివారికి భక్తిప్రపత్తు లుల్లసిల్ల బుష్పమాలా కైంకర్యము జేసి పూజించి భజనగావించి యానందించుచుండువాడు.

ఈ కాలమున జరిగిన విచిత్రభగవల్లీల వినిపించి ముందున కేగెద. స్వామివారు గోపాలురతోఁగలిసి తన పెంపుడావును మేపికొనివచ్చెదనని దలంచి తలిదండ్రులతో జెప్పకయే బీటికి జని పసిపిల్లవాడగుట నావును బీటవిడచి యొక పొదరింట బండుకొని నిద్రించెను. ఆసమయమున సూర్యుడు తీవ్రరూపము వహించి ప్రకాశించుట నెండవేడిమి మనస్వామివారి మొగమునకు దాకినది కందిపోయినది ఆ వేడిమి నడ్డగించుటకుగాబోలు నల్లత్రాచుపా మొకటి జని, తన పడగచే స్వామివారి మొగమునకు నీడను గల్పించినది. తోడి బాలకు లది చూచి భయపడి పరుగెత్తివచ్చి తలిదండ్రుల కెఱింగించిరి. వారును రోదనములతో గుండెలు బాదుకొనుచువచ్చి నిద్రించు పుత్రుని జూచిరిగాని సర్పములేదు, విచారింపగా బామిప్పుడే యీ మార్గమున బోయినదని గుర్తులు జూపిరి తోడిబాలురు. ఈ గోలతో స్వామివారు నిద్దురనుండి లేచినారు ఆతని వెంటగొని గృహమునకేగుచు బ్రశ్నింప నిట్లనె నిద్రలో నాకు కల వచ్చినది ఇద్దరు పురుషు లొకమంచి అమ్మాయిని వెంటగొని కోతితో వచ్చిరి. అందు బెద్దవా

డేమేమో? చెప్పగా? రెండవవాడు నా నాలుకమీద నేమో మో? వ్రాసినాడు మెలకువ వచ్చినది. ఇంతికెక్కుడు నాకు దెలియదని చెప్పినాడు తల్లి దండ్రుల యాశ్చర్యములతో స్వప్నకథ ముగిసినది. దీనిఫలముగ సహజపాండిత్యమబ్బుట బ్రత్యక్ష నిదర్శనము

గర్భాష్టమం బుపనయనమైనది. భక్తి విస్తరించినది భజనలు మితిమీరినవి నమ్రభావమతిశయించినది సత్యదీక్ష పెరిగినది. కామమంతరించి ప్రేమ విస్తరించినది వేయేల మనస్వామి అపరప్రహ్లాదుడైనాడు శ్రీమాన్ తూము నరసింహదాసుగారు భద్రగిరికేగుచు మార్గమధ్యమందు గల ఆయూర నొకటి రెండు రోజులుండుట తటస్థించినది స్వామి వారికి మహాపురుష సమాశ్రయ భాగ్యమబ్బినది. రామతారక మంత్రోపదేశమిచ్చి తంబుర తాళము లొసంగి భక్తివిధాన మును బోధించి దీవించి దాసుగారు భద్రగిరి కేగినాడు.

చిత్తమా ? నీవు ధన్యత జెందనున్న
నియతిమై ప్రత్యహంబును నిదుర లేచి
మొదట రామజపంబూని పిదప రామ
నామసంకీర్తనము జేయ క్షేమ మొదవు ॥

అనునట్లు వేకువ నిదురనుండి లేచి పడకయంద గూరు చుండి మానసికముగ రామజపముతో మైమరచి సూర్యో దయమునుండి కాల్యకృత్యముల నిర్వర్తించుకొని భోజన భాజనముల మరచి రోజంతయు భజనానందమున దేలియాడు చుండువాడు.

ఒకప్పుడు సీతాకళ్యాణమహోత్సవ దిదృక్షాపేక్ష బైకొన జననీ జనకులతో జెప్పకయే బయనించి భద్రిగిరి జేరి కళ్యాణరాముని సేవించి భజనానందసాధ్ధోధిమునిగి అందలి భక్తులసహాయముతో సంతర్పణముగించి రామకోటివ్రాసి పదిసంవత్సరములందుండి రామాజ్ఞగొని యెడనెడబయనం బుల నల్లూరు జేరి తల్లిదండ్రుల కాహ్లాదమొసంగినాడు.

స్వామివారి భజనకు రోజున కిరువదినాలుగు గంటలు చాలుట లేదు భాగవతసేవ మిన్నుముట్టినది. యౌవనహంకు రించినది తన వివాహప్రయత్నములో దలిదండ్రులున్నట్టు కనిపెట్టి నిష్కామియగుట దప్పకొననెంచి గరుడోత్సవవ్యాజ మున దలిదండ్రుల సమ్మతిపై బయనముసాగించి తిరుమల వెంకటేశ్వరుదర్శించి యానందించి కంచి జేరి పెరుందేవీ సహిత వరదరాజస్వామిని సేవించి సంతసించి అందేనివసించుచు మధు కరవృత్తితో జీవయాత్ర సాగింపుచుండె.

కర్ణాకర్ణి తలిదండ్రులు పరమపదించినారని యెఱింగి బంధవిముక్తి కానందించుచు దేహపటుత్వమున్నంత కాలము భగవత్కైంకర్యముచే గాలము బుచ్చనెంచి దివసమున కధమ పక్షము పదిరూపాయీలు జేరక భుజింపనని పట్టుబట్టి అను యాయులు వెన్నంటనగరసంకీర్తనముతో గ్రామస్థులమేలు కొల్పుచు వచ్చిన ద్రవ్యముచే, గంచివరదుని కైంకర్యమున ముంచెత్తిన భక్తాగ్రిణి మనస్వామివారు.

మఱియు దన కఠినతర నియమమువలన జనించిన బహువిధ కష్టములకు లోనై అప్పుడప్పుడు భజనానందసం

జనిత సంప్రజ్ఞాతసమాధి ద్వారా లభించిన భగవదాజ్ఞాను సారము ద్రవ్యమార్జించి కంచివరదరాజస్వామికిని పెరుందేవి గారికిని బ్రత్యేకవ్రత్యేకముగ రెండు పుష్పవనములును స్వామి వారిశయ్యాగృహమునందుంపదగిన పాలు, జున్ను పరిమళవిడి యము మొదలుగాగల శాశ్వత కైంకర్యములనే కాక గోపుర మండపప్రాకారాదుల జీర్ణోద్ధారణగావించి సన్నిధియారాధ నాదికార్యములకు మామందూరునం దైదు వేలరూపాయిల విలువగల భూమిని స్వామివారి కర్పించి దివ్యరత్నమయం బైన వైరముడియు నుభయదేవేరులకు రత్నకిరీటములును, సమ ర్పించుటయే కాక గంచియందలి దివ్యస్థలముల జీర్ణోద్ధారణ గావించి భగవదాజ్ఞననుసరించి చక్రాంకితమహాభాగ్యమును గడించి అందుగల వైష్ణవలోకగురు వైనాడు శ్రీస్వామివారు.

మఱియు నొకప్పుడు శ్రీరంగేశుడు సాక్షాత్కరించి బంగాళాదేశవాసియగు మాధవదాసుకడ నున్న మరకతమణి దెప్పించి మిగిలిన రత్నసంచయమును సేకరించి ప్రయత్నపూ ర్వకముగా "చాండియనొ్కండె అను దివ్యకిరీటము దయారు చేయించి తనకర్పింపవలశినదిగా" నాజ్ఞాపించుకారణముగ బహు ప్రయాసకులోనై రత్నములును ద్రవ్యమును సమకూర్చి రంగ ని దివ్యకిరీటధారినిగా జేసెన ప్రత్యక్షరంగనాయకస్వామి వెంకటాద్రిస్వామి

తదుపరి అయాచితముగ శ్రీభూమతల్లుల గిరీటధార ణునుగా జేయుటయే కాక మకరకంఠిని సమర్పించి శ్రీరంగ నాథుని యభిలాషదీర్చినాడు. శ్రీస్వామివారి యారగింపునకై

అతిరసావిపదార్థాసేకరణమునకు తిరుప్పళాతుడై అన్నగ్రామము తీసి శ్రీరంగేశుని కర్పించిన యౌదార్యశిఖామణి మనస్వామి
1 నెల్లూరి రంగనాయకాలయజీరోద్ధరణము మహాబలిపురదివ్య స్థలఖిలంబును జక్క జేసిన సజ్జనానందగామి మనస్వామి పిస్తోలు ప్రేలుటచే శ్రీవారి శిష్యుడగు వెంకటస్వామి నాయుడుగారి కుమారునికి సంభవించిన నేత్రావరోధమును తొలగించిన స్వామివారి పాదతీర్థప్రభావమేమని వర్ణింపనగు.

మఱియు ఒంగోలు తాలూకా నూనెవారిపాలెమునందు వేంచేసియున్న స్వామివారి రథ నిర్మాణముకొఱకు గొనబడిన యినుపయిరుసులు సెంట్రిల్ స్టేషన్‌కు జేర్చబడినవి లగేజీ కార్యక్రమమం దాలస్యమగుట రైలుసాగినది. అది చూచి మన వెంకటాద్రి తలపంకించినాడు ఇతరకారణమేమియు లేకనే ఘూమశకటమాగినది. అంత నాయిరుసు లెక్కింపబడినవి. హేతురహితముగ బండిసాగి గమ్యముజేరి చూపరుల కాహ్లాదము గల్గించినది.

విల్లిపుత్తూరున వేంచేసియున్న ఆండాళమ్మ దేవికి "రాజముడి కుంభప్రసాదముల సమకూర్చి సుందరరాజస్వామికి దివ్యవిమానమర్పించి శ్రీరంగము జేరి ప్రియశిష్యులకు దంబుర తాళములొసంగి రంగనారాయణజియ్యంగారిసన్నిధి సన్యసించి "తిరువెంగడరామానుజజియ్యం" గారను ఆశ్రమనామధారియై చరమదశగ్రహించి అన్నలూరినారాయణదాసుగారిసమక్షమున 1877సం॥ ధాతవత్సర మాఘబహుళ సప్తమి అనూరాధనక్షత్రయుక్తసోమవారమర్ధరాత్రి విష్ణుసాయుజ్యమందిరి.

భక్తులెల్లరు సన్నిధి మర్యాదలతో నూరేగింపుగావించి కొళ్ళడముతీరమున, "శ్రీ ఆళవందారుపడుత్తురై" సన్నిధి స్థలమున సమాధిగావించి యానందించిరి.

సీ॥ విఖ్యాతేధాతువర్షే దివసపరిగ్రృగే
కుంభగేకృష్ణపక్షే
తిథ్యాంసప్తమ్యభిఖ్యాయుజశశిదివసే
మైత్రితారాసమేతే
శ్రీరంగే శాంఘ్రిపద్మేసతతవిరచితా
శేషకైంకర్యలక్ష్మీః
శ్రీమాన్ రామానుజాచార్యః పరమపదమగాత్
వెంకటాద్రీర్యతీంద్రః ॥



# శ్రీ తుంగదుర్తి బుచ్చయ్యగారు

వెనుకటి జన్మమున బ్రహ్మవిద్య సాధింప యత్నించి సమ్యంబు జేరక దేహమువిడచిన వాడు మరుజన్మమున విధిగా దేశికాగ్రణి కృపకు బాత్రుడై యోగసిద్ధి గడించు చున్నాడు వీడు దేవతల కసాధ్యమయిన శాశ్వతసుఖసంపా దనా పరులలో మొదటివా డగుచున్నాడు సత్యసంధుడు ప్రతివిషయమును శాస్త్రదృష్ట్యావిచారించువాడు వేదవిహితా చారసంపన్నుడు స్వధర్మాచరణదక్షుడు ఈశ్వరచింత దప్పని వాడు ఆత్మశక్తిపూరితుడు నగుగృహస్తునకు పుత్రుడుగా పుట్టును ఈతనికి జన్మతోపాటు జ్ఞానోదయమగుచున్నది. బాల్యావస్థయందే యితనియందు సర్వజ్ఞత్వాదులు దోచు చుండును. వీనికి సమస్తవిద్యలు లభించును. శాస్త్రపరిచయ మధికమగును. వేయేల సిర్జరదుర్లభమగు మానవజన్మ వీనిదే యన సాహసముగాదు. అంజనధారి ధనరాసులు గనిపెట్టి నట్లు శాస్త్రరహస్యములన్నియు వీనికి హస్తగతములై కాను పించును కేవల గురూపదేశమాత్రమున సర్వసమర్థు డగు చున్నాడు.

శమదమములు వీని స్వాధీనములు మనస్సు వాయు వుతో నేకీభవించి చిదాకాశమునగలిసి సమరసపూరితమగును. అందువలన నీజన్మమునందు జేయు అభ్యాసము తోడ్పడి యీతని నీస్థితికి దీసికొనివచ్చును. ఇప్పుడితడు వేదవేత్త పూర్ణవైరాగ్యమూర్తి సుగంధచందనరూపి అష్టసిద్ధులీతని వరించినవి ఇట్టి వారలలో మన బుచ్చయ్యగా రొకరు.

వీరిజననము క్రీ 18వ శతాబ్దము జనస్థలము కురుచేడు వినుకొండతాలూకా. తలిదండ్రుల పేర్లు వివరముగ దెలియ వనియు ఏడవయేడు వచ్చులోపలనే మాతాపితృవియోగ మైనట్టు వింటామనియు నా గ్రామవాసులు చెప్పిరి. ఆగ్రామ మున సన్నిహితబంధువు లెవరును లేని కారణముచేతనో? మఱి యేహేతువు ననుసరించియో పిల్లవా డొంటిగాబడి యొం టరిగా నెట్లో? చేజర్ల కపోతేశ్వరాలయప్రాంగణమున జేరియుం డుట పురివాసులాదరించి పోషింపుచువచ్చిరి. పగలంతయు బురిబాలకులతో నాడుకొనుచు నెందెందో? గుడుచు చు రాత్రికి కో నెలముఖమంటపమున బరుండుచుండువాడు గాని, బలవంతపరచినను గృహస్థులయిండ్ల కేగువాడుగాడట ఎనిమి దవ సంవత్సరము వయస్సు దాటనున్నది.

కుంకలగుంట బసవయ్యగారు రచెంచి బ్రహ్మతేజో పూరితుడై చేజర్లవీధులలో దిరుగు పిల్లవానిని జూచి చేరజీరి నీ వెవరిపిల్లవాడ వని యడిగిన గపోతేశ్వరుని కొడుకునని చెప్పి నాడు ఆమాటకు సంతోషించి యెత్తిముద్దిడుకొని మా యిం టికివచ్చెదవా? అని అడుగ దలయూచినాడు కొడుకులు లేనివాడగుట "బ్రాహ్మణబాలుడని తెలిసికొని దత్తపుత్రు నిగా మనస్సున సంకల్పించి చంకదింపకయే తనయింటికి గొని పోయి కపోతేశ్వరప్రసాదమని చెప్పుచు భార్యకప్పగించినాడు ఆమెయు నౌరసునికివలె పోషించినది. ఉపనయనముగావించి చదువులబడికి పంపిరి సంవత్సరము దిరుగక పూర్వమే సమస్త విద్యాపారంగతుడైనాడు గాని, తలిదండ్రులుగాని యుపా

ధ్యాయులుగాని, తెలిసికొనజాలరైరి. బడికి సరిగా పోకపోవు టయేగాక నింట నల్లరిపనులు జాస్తిగా జేయుచుండువాడగుట దెలియరైరి గాబోలు! భగవదనుగ్రహము గలిగి జన్మముతో నెన్నంటి వచ్చిన విద్యాబుద్ధులుగలవారికి జదువులబళ్ళేమిటికి? గురుబోధ లెందులకు? ఇవి యన్నియు నిరుపయోగము లే గదా? చదువు లేకపోయినను బ్రహ్మతేజోసంపన్నుడగుట దనయింట నున్న జాలునని అన్నింటికి నోర్చి పిల్లని గంటికి రెప్పవలె గాపాడుచు బసవయ్యగారు పరితృప్తులగుచున్నారు.

ఇట్లుండ నొకరేయి నున్నట్టులుండి పిల్లవా డదృశ్యుడైనాడు. బసవయ్యగా రూరంతయు గలయ వెదకినాడు. బావులు, సమీపారణ్యములు రోసి? రోసి? ప్రయోజనము లేదని తలచి, పుత్రవియోగదుఃఖము బట్టజాలక మంచముబట్టి నాడు తండ్రి. వీరిస్థితి నెఱింగి గాబోలు, తలవనితలంపుగా, నొకరేయివచ్చి తండ్రి మంచముపై గూరుచుండి నిదురించు జనకుని లేపి "నాన్నా? నీకేమి పిచ్చియా? కబోదీశ్వరునాన మెలంగునాకై యడలవలదు. ఇంతటినుండి పండ్రెండువత్సరములు జరిగిన వెనుక నీ చేజెర్లనివాసినై జీవితాంతమువఱకు నిన్ను గనిపెట్టియుండెద. అడుగో! కబోదీశ్వరుడు. నిన్నారడింప వచ్చినాడు కనులు దెఱచిచూడుము, లెమ్ము. స్వామివారికి నమస్కరింపు" మని త్వరపెట్టిన, లేచి బసవయ్యగారు బిడ్డని కౌగలించుకొని కనులు తెఱచి కొడుకు జెంతనిలచియున్న తేజోమూర్తి కబోదీశ్వరుని తిలకించి మంచమునుండి లేచి

నమ్రుడై నమస్కరించి, స్వామివారి పాదములబడి "నాకీ పుత్రవియోగదుఃఖము గట్టిపెట్టదలచితివా ? నీ సంకల్పమెట్లో అట్లే జరుగుగాక ! అద్భుతపురుష నే నెంతవాడ ! అజ్ఞాని నగు నాకు మీదర్శనభాగ్యమబ్బినది. చాలు. ధన్యుడ. కోరినప్పుడు వీడు నాకంటబడునటుల మాత్రము వరమిమ్ము. చాలు. దాన దృప్తుడ నయ్యెద" నన, "అట్లే యగుగాక!" అని చెప్పుచు నీశ్వరుడు పిల్లవానితో నదృశ్యుడైనాడు.

ఇంత మనబుచ్చయార్యులు శ్రీగిరికేగి కాయల గడ్డలమెసవుచు నారువత్సరంబులు తపంబుండి, యేడవవర్షమున జనన స్థలమగు కురుచేడు జేరి యొక దేవాలయమున నివాసము జేసినాడు. ఆ గ్రామ వాసి యగు అయ్యవారప్ప శాస్త్రిగారు దరిదెంచి బుచ్చయ్యనుగాంచి నమస్కరించి "గతరాత్రికలలో నొకదివ్యపురుషు డగుపడి తపస్సంపన్నుడగు తుంగదుర్తి బుచ్చయ్య, దేవాలయ ప్రాంగణమందున్నాడు. పూర్వమతడు మీగ్రామవాసియే ! మీదగ్గిరబంధువుగూడ ! సబహుమానముగ నాతని దోడ్తెచ్చి, యతిథిసత్కారము గావించు" మని చెప్పి యంతర్హితుడైనాడు గాన, దయయుంచి నా గృహము పావనముజేయుమని వేడుకొని సమ్మతింపరచి తన యిల్లుజేర్చి యతిథి సత్కారమున దృప్తుని గావించె.

ఈ అయ్యవారప్పశాస్త్రి ప్రాణాయామ సిద్ధిగడించిన పుణ్యమూర్తి. మహాతపస్వి. వీరికి ముగ్గురు కొడుకులు గలరు. వారిసంతతి యిప్పటికిని కురుచేడునందు గలదు. మన బుచ్చ

యార్యులు శాస్త్రిగారింట గొన్ని దివసము లుండి బయలుదేరి చేజెర్ల బోనున్న తరి శాస్త్రి అడ్డగించి నా కెనుబది యేండ్ల వయస్సు కొద్దిరోజులలో శరీరముజాలింప దలంపు గలదు. (శరీరము జూపి) "దీని కావలకంపి పయనింపుడన నిప్పు డది జరుగదు. తిరిగి నచ్చెద. అప్పుడు నాసమక్షముననే జరుగును" తప్పదని చెప్పి, పయనించి చేజెర్లకబోదీశ్వరుని దర్శించి, పాలకతండ్రికడ కొన్ని దినములుండి సెలవుగొని శ్రీశైలమున కేగి తపంబుండె.

ఇట్లుండి యొకనాడు భ్రమరాంబా దర్శనమున కేగిన తరి అంబసాక్షాత్కరించి బింబము కదలినది. తిరిగి ప్రతిష్ఠించు మని యాజ్ఞాపించిన వల్లెయని ఆత్మకూరునుండి విప్రుల రావించి బింబమును సమంత్రకముగ స్థానమునుండి తొలగించి సక్రమముగ బునశ్చరణ జరిపించిన తదుపరి యెక్కువగా ద్రవ్య మిచ్చిననే సహాయమిచ్చెదమని విముఖులైన బ్రాహ్మణుల కోడుగొనకనే తన తపోప్రభావ సహాయమున బింబమును నిల్పి ప్రతిష్ఠా కార్యము బూర్తిచేసినాడు. ఇప్పుడర్చించు భ్రమ రాంబాబింబము బుచ్చయార్యులచే బ్రతిష్ఠింపబడినదే యని చెప్పుచున్నారు.

ఒకతరి భ్రమరాంబ సాక్షాత్కరించి కబోదీశ్వరాలయ మున దేవీప్రతిష్ఠ గావించి ధన్యుడవగు మని యాజ్ఞాపించిన నాడే పయనముసాగించి చేజెర్లజేరి ఈశ్వరునకు భ్రమరాంబా యానతి నెఱింగించి తదీయాలయమున పార్వతీప్రతిష్ఠ జరిపించి త్రికాలవేదియగుట తద్వారా లోకసేవజేయుచు జీవయాత్ర సాగించినారు మనబుచ్చయ్యగారు.

ఇతని కాకాశగమనాది సిద్ధు లుగ్గుబాలతో నలవడిన వగుట నే పుణ్యక్షేత్రములందుండినను శివరాత్రి లింగోద్భవ కాలమునకు గభోదీశ్వరాలయమున తప్పక ప్రత్యక్షమగుచుండు వాడు. ఇట్లే కాశీ, దక్షిణకాశీ, రామేశ్వరము శ్రీశైలము, మొదలగు దివ్యక్షేత్రములయందు శివరాత్రి లింగోద్భవము నకు సరిగా బ్రత్యక్షమగుచుండు రనిగూడా పలువురు చెప్పు చున్నారు. ఇట్లే ముక్కోటిపుణ్యదినమున భారతదేశమునంగల విష్ణుక్షేత్రములయందతటను బ్రత్యక్షమగుచుండిరట వీరిజపస్థల ములు 1. కభోదీశ్వరాలయము 2 గుత్తికొండబిలము 3. శ్రీశై లము. పూర్వమిడిన వాగ్దత్తానుసార మెక్కడనుండినను, నెల కొకసారి యైనను వచ్చి తండ్రిని దర్శించి పోవుచుండువాడు. సహజపాండితీ గరిమ విరాజిల్లువాడగుట నాధ్యాత్మికభావ పూరితములగు గేయములను శ్లోకములనుబాడి శిష్యలోకము నానందింపజేయు ప్రత్యక్షసచ్చిదానంద పరబ్రహ్మమని పేర్వ డసిన పుణ్యమూర్తి. అయ్యవారప్పశాస్త్రి గారి కిడిన వాగ్దత్తా నుసారము తన దివ్యసమక్షమున దేహయాత్రముగింపించి క్రీ॥శ॥ 18-19 శతాబ్దములసంధి కాలమున దేహము చాలించినారు. శ్రీవారిసమాధియొద్ద ప్రతియేటను వార్షికోత్సవ మతివైభవ ముగ జరుగుచున్నది.



# కృష్ణానందావధూత

లక్కవరము శివారు, నాగభొట్లపాలెము, నెల్లూరుజిల్లా.

భగవంతునికి రూపములు మూడు 1. అరూపము, 2. విశ్వగర్భస్వరూపము, 3. విశ్వరూపము. విశ్వరూపము అగుపడు ప్రపంచము మనమందఱ మీవిశ్వరూపములోని వారమే! మనము, నిరంతరం మాచరించు కార్యకలాపము లన్నియు విశ్వమునకు సంబంధియున్నవియే. ఇట్లగుట విశ్వరూపోపాసన మత్యంతసులభము సుకరమునుగూడా విశ్వగర్భోపాసనకు ముందుగా నహంకార; మమకారముల వదలి ప్రయత్నింప వలయు. భగవద్దర్శనమున కేగెడి బ్రతికో నెలముందును బలిపీఠమును దర్శించి, అంగు మనయందుండు అహమ్మల నాపీఠమునకు బలిసెుసంగి కో నెలలోని కేగి స్వామిని దర్శింపవలె. లేకున్న దర్శనభాగ్యమువలన లభించుఫలము శూన్యంబగునని దాని భావము. దీనిరహస్య మేమి? ముందహంకార మమకారముల వదలి విశ్వగర్భోపాసన జేయవలయును ఇది అసాధ్యమైన పని గదా? విశ్వమునందు భగద్దృష్టి నలవరచుకొనుచు నుపాసన ప్రారంభించిన క్రమముగ నహంకార మమకార లడంగి నిర్వికారానుభూతి లభించి సాధకుడు కృతార్థుడగును. ఇట్టి సాధన యలవరచుకొని స్వప్రయత్న మేమియు లేకయే.

క. లోకంబులు లోకేశులు

లోకస్థులు తెగినతుది లోకంబగుపెం

జీకటి కవ్వల నెవ్వం
డేకాకృతి వెల్గు నతని, నే సేవింతున్ ॥

అనునట్లు, ఇంద్రియములు ఇంద్రియాధిదేవతలు ఇంద్రి వృత్తులుగూడ నశించి నిర్వికల్పసుఖమును గడించిన పావన మూర్తి మన అవధూతస్వామి.

ఈతడు క్రియాద్వైతియగుట విధినిషేధదూరుడు. అష్ట సిద్ధులీతని వెన్నంటియుండు. సర్వప్రాకృతికవిద్యలు పీఠ గరస్థములు.

సీ॥ ఒకవేళ దనయందు సకలప్రపంచంబు
గల్పితంబని యెంచి కాంచినవ్వు
ఒకవేళ సర్వభూతోపాధితతి యందు
దనుజూచిమిగులసంతసము జెందు
ఒకవేళ దేహాదులొప్పుగావిహరింప
సర్వసాక్షినటంచు సంభ్రమించు
ఒకవేళ నన్యమించుకలేదోకండనే,
న, ని నిర్వికల్పసమాధినందు ॥

గీ॥ లిప్తమాత్రంబ విద్యాని్ర్లిప్తమాత్రు
డయిన ఘను నెన్న లేరు బ్రహ్మాదులనగ
క్షణము సర్వజగద్వ్యాలక్షణతనందు
వాసినుతియింప దరమె యెవ్వానికైన ॥

వీరు 18వ శతాబ్దమున నెల్లూరుమండలమునందలి లక్క-వరము శివారు నాగభోట్లపాలెము జేరినారు, వీరి తలిదండ్రు లెవరో, ఎక్కడుండినారో? తెలియదుగాని, బ్రాహ్మణు డనియు, వేదవిదుడనియు మాత్రము దెలియుచున్నది.

భోజనభాజనములలో వర్ణ భేదమును గణించు వారుకారు. దేహాపేక్షను వర్ణనాతీతము డెబ్బదవపడికిమించినవాడయినను దినమునకు మూడామడ నడచు సామర్థ్యముగలవాడు లక్క-వరపుమల్లపరాజుగారు శివరాత్రిమహోత్సదిదృక్షాపేక్షలైకొని శ్రీశైలయాత్రకు బోనెంచి ఆశీర్వాదముగైకొన నవధూతను సమీపించి నమస్కరించి నిలచిన జూచి "ఏమీ! నీవు శ్రీశై లమునకేగ సంకల్పించివచ్చితివా? మంచిది. పోయిరమ్ము. మల్లికార్జునస్వామివారికి నానమస్కారముచెప్పు" మనిన అవ ధూతగారి వాక్యముల కబ్బురపడి "దేవా! సన్నిధికేగి న కారణమునేజెప్పకయే తెలిసికొని యాశీర్వదించితిరి. మీ ప్రభావ మబ్బురము. సాక్షాన్మల్లికార్జునులైన మీకు దెలియరాని దేమి యుండును!'' అని అవధూతగారిని బొగడి యనుజ్ఞవడసి, కొం దఱి మిత్రులతో నెడనెడ ప్రయాణంబుల నైదవదివసమునకు శ్రీగిరిజేరి, ధూళిదర్శనము కొఱకు ఆలయాధిపతుల నాజ్ఞవడసి గుడిలో బ్రవేశించిరి. అవధూతగారును దేవునిదర్శించి మల్లప రాజునకెదురేగిరి.

అవధూత చిఱునగవుతో "ఎంతసేపైనది? ఎవరెవరు వచ్చినారు? అని అడిగినాడు, మల్లపరాజుగారికి కల గనినట్లై

నది. నిశ్చేష్టితుడైనాడు. ఎగాదిగాచూచుచు నిలువబడిపోయినాడు. "ఏమట్లు మాచెదవు? తెలియదా! నేను కృష్ణావధూతనని. మీ వెనుకనే బయలుదేరి వచ్చుచుంటి. శిఖరేశ్వరము రొద్ద మిమ్ములజూచితిని. గాని నడువలేనేమో! అనుభయముత నే నక్కడగూర్చుండలేదు." అని మల్లపరాజును వీపుదట్టుచు నవ్వినా డవధూత. తిక్కదెలిసినది. చేతులు ముకుళించి, మీరు సర్వజ్ఞులు. సత్యసంకల్పులు. సర్వశక్తిపూర్ణులు. సర్వాంతర్యామియగు సచ్చిదానందమూర్తి కసాధ్యమెందైనను గలదా! అని సవినయముగ బలికి శ్రీవారి యాజ్ఞవడసి ధూళిదర్శనము గావించి శివరాత్రిమహోత్సవములో బాల్గొని యాత్రముగించి అవధూతతో నిల్లుజేరి యాత్రావిశేషముల స్త్రీ ములకెఱింగించి తన జీవితమును సార్థక మునర్చుకొనినాడు మల్లపరాజు.

యాత్రావిశేషముల విసినవారెల్లరు అవధూతవారు మాతో అయ్యపరాజుగారి శివాలయములోజరిగిన అభిషేకమున నాడు పాల్గొని నారని వచించి శ్రీవారి ప్రభావమున కుబ్బుచు వేనోళ్ళగొనియాడినారు.

అవధూతగారికి ప్రతిరోజురాత్రి నిసీథమున బయలుదేరి ఋషుల నివాసమని చెప్పు సీమకుర్తికొండకేగి మరునాదుదయమునకు నాగభొట్లపాలెము జేరు నలవాటుకలదు. ఇదికనిపెట్టి అన్నంభొట్లశాస్త్రి అవధూతగారి వెన్నంటజూచెనుగాని యెన్నడును సందర్భపడలేదు. ఒకనాడు తనప్రయత్నసిద్ధినాశించి

అవధూతగారు పయున్న గృహమున నే శాస్త్రియుబయున్నాడు. అవధూతమాత్రము మామూలు ప్రకారము లేచి బయటికి వెళ్ళుచు తలుపు దగ్గరకు నెట్టిపోయినాడు శాస్త్రిచూచి శ్రీవారి వెన్నంటబూచెను. గాని ఎంత బయటికి త్నించినను తలుపు రా లేదు. సమీపమునయున్న యింటివారిని కేకలతో లేపిన వారునువచ్చి తలుపు నెట్టిరిగాని అది సందివ్వ లేదు. ఉతికనెత్త బ్రయత్నించి విఫలులైరి. పిట్టలుపీచుపీచను నప్పుడు తలుపు దానంతటదియే తెరువబడినది శాస్త్రిబయటికివచ్చి దిక్కుల బరికించుచు స్వగృహమునకు వేళ మునరించినాడు. మామూలు వేళ కవధూతగా రేతెంచిరి.

శాస్త్రిమరునాడు రేయి గూడ యెందో దాగియుండి మామూలు వేళ కవధూతగారి వెన్నంటి పోనాగినాడు. కాని అవధూతగారి పోబడియే లేదు. పరికించి చూచుచుండ నొక పెనుభూత మాతని కంటబడినది భయముచే శాస్త్రి భూమి కొరిగినాడు. తెల్లవారినది నిద్రనుండి లేచినవానివలె లేచినాడు అవధూత దర్శనమైనది వారిపాదాలబడి జరిగిన యుదంతమంతయు జెప్పి క్షమింపవేడినాడు ప్రసన్నుడైనా డవధూత. ఇకమీద నిట్టిప్రయత్నము జేయకు బ్రమాదమగునని మందలించినాడు. నాటినుండి బుద్ధి మార్చుకొని అవధూతగారి యనుగ్రహమునకు బాత్రుడైనాడు శాస్త్రి. మహాత్ములచర్యలతిచిత్రములు గదా!

సీతజ్వరముతో బాధపడునట్టి యవధూతగారి జూచుటకు లక్కవరపుర వాస్తవ్యులు కొందఱేతెంచిన వారల గూర్చుండ నియమించి యొక కఱ్ఱ తెప్పించి తాస్వయముగా వారలముం దఱ్ఱముగా బడవేసిన గొంతెనడికది గడగడ వడక ప్రారంభించినది. ఈచిత్రమేమని ప్రశ్నించిన బ్రారబ్ధవశమున (తనను జూపుచు) వీనినాశ్రయించిన వ్యాధిని ఈ కఱ్ఱయం దు బ్రవేశపెట్టుట వడకుచున్నయది. ఇప్పు డీశరీరము వ్యాధిలేని దగుట నారోగ్యముగనున్నది. నాబాధయంతయు నీకఱ్ఱ అనుభవించుచున్నది నన్నువ్యాధిగ్రస్తుని చూచుటకు వచ్చియుంటిరి పాపము! వీనికివచ్చినవ్యాధి స్వాధీనమైనదని మీకు జూపుటకే యీ పని జేసినాను పరితాపపడకుడు మాయస్వాధీనమైన వారికి వ్యాధులుగూడస్వాధీనములగు మాయయొక్క యదార్థ స్వరూప మెఱింగినవానికి దానిబాధ లేనిదగును మాయ లేనిదై ఉన్నటు లగుపడు స్వభావము గలదగుట లేనిదానిని లేనటుల జూచినవారే మాయను జయించినవారు. మనకు సంభవించు సుఖదుఃఖములు మాయావినోదములు, ఈ రహస్యమెఱింగిన సాధకులు మాయావికారములకు లోను గాడు గాన, కష్టసహనశక్తి యలవరచుకొని ధన్యులు గండని బోధించి పంపివేసినా డవధూత.

ఒకప్పుడు శిష్యులకు దేహయాత్ర జాలింప నున్నానని తెలిపి ఈ శరీరమును లక్కవరమున సమాధి గావింపు డని సెలవొసంగుచు వెంటనే కపాలభిన్నముతో బరమపదమలంక

రించినారు. స్వామివారి భౌతిక దేహమును శ్రీవారు సెలవొసంగి నట్లు గావించినారు శిష్యులు. సమాధికి జరుగు నిత్యనైవేద్య దీపారాధనాది కార్యములకు గ్రామస్థులు పదునెనిమిది యకరముల భూమినిగూడ సమర్పించినారు. ప్రతిసంవత్సరము పుష్య మాసములో శ్రీవారికి వార్షికోత్సవము జరుపబడుచున్నది. వీరిశిష్యులలో ముఖ్యులు లక్కవరపు అయ్యపరాజదంపతులు వీరు పాతకమూరు నివాసులయ్యును కొన్ని కారణములచే నూతనముగా 'లక్కవరము' అనుపేరుతో ఊరుకట్టించి అందు శివప్రతిష్ఠగావించి అత్యంత భక్తితో లింగమూర్తినుపాసించి శంకరసాక్షాత్కారభాగ్యముగడించిన పుణ్యమూర్తులు. ఈ దంపతులిరువురు రొకే. ముహూర్తమున నిరాయాసముగ లింగైక్యమయిన భక్తాగ్రిణులు. వీరి వంశమునందలి యెనిమిద తరము వారీయూర నిప్పుడు వశించుచున్నారు.



# తరికుండ వెంకమాంబ

"మంత్రము" సంసార సాగరమునుండి తరింపజేయునది. సప్తకోటి మహామంత్రములలో "ప్రణవ" రామ తారకము, ఉత్తమములు. ప్రణవమొటు లేకాక్షరమంతమో? తారకముగూడ నట్లే ఈ రెండిటికి భేదమాత్రమయు లేదు. ఏకాక్షరమంత్రములు ధ్యానధారణములకు సులభసాధ్యములైనవి మంత్రాక్షరముల మనస్సున కలిపించి భావమును జేర్చి ధ్యానములో నిలుపుటకే యుపాసన యనిపేరు. సహజస్థితిని బొందినపుడు సాధకుని ప్రయత్నము లేకయే; అవస్థాత్రయమందును ధ్యానము సాగుచుండును ఈస్థితి మాయామూలముగ నాశనమైనప్పుడే లభించునది యగుట శతవిధముల ప్రకృతిని జయించియే ధ్యానసాధనమునకు బూనవలయు. మాయను జయించుట ఈశ్వరానుగ్రహ మనశ్య కర్తవ్యము. గాన! మంత్రజపము కోట్లకొలదిగా నుండునట్లు ప్రయత్నింపవలయు. మాయను జయించిన వాడే ఈశ్వరుడని పెద్దలనెదరు. "నావిష్ణుః విష్ణుమర్చయేత్" అనుట సర్వులకు దెలిసినవిషయమే,, ఉపాసకు డుపాస్యుడగు సూత్రమిదియే. దైవకృప లేమియే పతనమునకు గారణము. మంత్ర, మంత్రార్థ, మంత్రభావముల నిరంతరమను సంధించుటచే భవసాగరముదరించి సాధకుడు ముక్తుడగుచున్నాడు ఇట్టి ముక్తసంగులైనవారలతో దరికుండ వెంకమాంబగా రొకరు.

ఈమె నివాసము తఱికుండ. (పెనుగుకడప), రాయదుర్గవాసులు క్షామబాధ భరింపజాలక నిండ్లనువదలి యాబాల

గోపాలముగా, జలసౌకర్యసమృద్ధిగల ప్రదేశమున నిలుచుటలం దున బలపరించుచు మార్గమధ్యమందొక్కెడ నడకబడలిక తీర్చుకొనదలచియుండిరి. అది గ్రీష్మఋతువు అందొకతరి ఒక బ్రాహ్మణముత్తైదువ పెరుగు విక్రయించుచు నాపెరుగుకుండలో నొకరాయి పలుమారు కవ్వమునకు దగులుచుండె ఇదేమి? యని కుండయందు దన చేయిబెట్టి చూచిన నదేమియు గనుపింపలేదు? తిరిగి పెరుగు దఱువ మునఁడిన గవ్వమునకు రాయి అడ్డుపడజొచ్చినది కారణమరయక భయవిహ్వలయై భర్తకెఱిగింప నాతి వేసినాచిన నృసింహవిగ్రహము కనుపడినది. ఈ విచిత్రసంఘటనము కుబ్బుచు దోడివారల కెఱింగించి సంతసించుతరి "భక్తులారా! మీ మీ కష్టములబాపి ఇష్టఫలసిద్ధి గూర్చుటకే నేనీ తఱికుండయం దుద్భవించితి మీరందఱును ఎపెంచి శక్తిగొలంది ఆలయమును నిర్మించి నామూర్తినందు బ్రతిష్ఠించి యారాధింపుడు తఱికుండ నృసింహనామమున బిలువంబడెద ననుమాట లాకసమునుండి వినవచ్చినది అట్లే కావించి గ్రామీణులు దుర్భిక్షబాధ నుండి తప్పించుకొనినారు. నాటనుండి యాగ్రామమునకు "దఱికుండ" అనిపేరు వచ్చినది.

మన వెంకమాంబతండ్రి కృష్ణయామాత్యులు. తల్లి పేరు తెలియదు. కాలము క్రీ॥ 18వ శతాబ్దము. ఈమె కష్ట వర్షప్రాయమున దఱికుండ నృసింహమూర్తి స్వప్నమున సాక్షాత్కరించి ప్రణవ ముపదేశించి రోజునకు బదివేలకు దక్కువ పడకుండునట్లు శతకోట్లేబదిలక్షల జపము గావింపుమని

యాజ్ఞ నొసంగి యంతర్హితుఁడైనాఁడు. మరురోజుదయమే జపదీక్ష వహించినది. గాని కృష్ణయామాత్యుఁ డాపన్నమునసే బిడ్డకు వివాహముజేసి కన్యాదానఫలము దక్కించుకొన నెంచినాఁడు.

ఇది తెలిసి వెంకమాంబ తండ్రిని జేరి స్వప్నవృత్తాంత మెఱింగించి మీరుసల్పు ప్రయత్నము తన మంత్రజపసిద్ధి కంతరాయమని నొక్కి చెప్పినది. గాని లెక్కసేయ లేదు. వరాన్వేషణము గావించి శుభముహూర్తమున బిడ్డ కిష్టము లేనిపెండ్లి చేయించినాఁడు. ఐదువత్సరములు గతించినవి. అమ్మ పుష్పవతి యైనది. నిషేక ముహూర్తము నిశ్చయింపబడినది. లగ్నకాలమునకు బంధుపుత్రులతో వరుఁడరుదెంచినాఁడు. అమ్మ సభక్తితో విభుని సమీపించి నమస్కరించి స్వీయాభిలాష నెఱింగించి సన్నుతి పరచి వరునివచ్చినదారిని పంపివేసినది. తపోభంగ మొనరింపు పాపమున కొడిగట్టుకొనలేక బంధువుల దూషణవాక్యములతో దిరిగిపోయి యిల్లుజేరి మరుదివసమే అమ్మగారిభర్త శరీరయాత్ర చాలించినాఁడు దైవనిధి నెవరుతప్పింపగలరు? భర్తకుత్తరక్రియలు ముగిసిన మరురోజుననే మదనపల్లివాసియగు "రూపావతారము సుబ్రహ్మణ్యశాస్త్రి నాశ్రయించి జపవిధానం బెఱుంగుటయే" కాక దత్త్వమునుగూడ గ్రహించి యిల్లుజేరి నృసింహాలయ ప్రాంగణమందుగల ఆంజనేయ స్వామివారికి వెనుకనలరు రహస్యస్థలమున గూర్చుండి జపదీక్ష సాగింపుచున్నారమ్మగారు.

అర్చకుడు గాంచినాడు మాయమాటలతో భర్త నావలకంప్రట యోకాక చంపివేసిన భర్తృహంతవు నీ మొగము జూడరాదు. లెమ్ము? స్వేచ్ఛావిహారిణివై తిరుగుచున్నావా? ఊరునాడు రోసినపాపివి కపటవేషముతో స్వామివారి వస్త్రాదికములు దొంగిలింప వచ్చినదానికివలె నున్నావు లెమ్ము! అవలకు బొమ్ము? అని అరచుచు అమ్మను కొట్టి నెట్టినాడు

చేయునది లేక దన జపదీక్షవిరమించి తండ్రిని జేరి అర్చకునివలన దనకుగలిగిన పరాభవ మెఱింగించిన నాతండును లోకుల మాటలు నమ్మినవాడగుట నిజపుత్రి ప్రవర్తనను శంకించి రక్కసీ? నీ కారణముగా మగడు దిగులుపడి చనిపోయినాడు లోకదూషణముల విని సహింపజాలకుంటి గాన! శిరోజముల బరిత్యజించి వికారివగు మటులైన సమ్మతించెద లేనిచో నాయింట నడుగుబెట్టరాదు. పొమ్మని నెట్టి వేసినాడు.

తండ్రీ! నావలన దప్పులుండిన క్షమించుము నేను నృసింహమూర్తిని వరునిగా వరించితి. ఈపని మానసికముగా జరిగినది. నీయల్లుని మరణమునకు దైవవిధియే కారణము. గాని, వేరుగాదు సర్వజ్ఞులకు మీరునన్ను బాధించుట ధర్మము గాదు నాభర్త చచ్చువాడుగాడు శాశ్వతసుఖస్వరూపి చచ్చినది నీయల్లుడుగాని? నాభర్తకాదు? నీయిష్టమెట్లో? అట్లే గావించెద నని చెప్పుచు శేషాచలాధిరోహణము గావించి అందలి తుంబురుకోనలో నిరాహారదీక్షతో జపయజ్ఞమును పూర్తిగావించి అవబృధస్నానానంతరంబు స్వామిపుష్కరిణి

కుత్తరమునగల మండపమున గూర్చుండి 1. రాజయోగ సారము, 2. వేంకటాచలమాహాత్మ్యము, 3. ముక్తికాంతా విలాసము, 4 భాగవతద్వేషద అను కావ్యచతుష్టయము లిఖించి ధన్యతగాంచి నారమ్మగారు.

అత దండి కృష్ణయామాత్యుడు పుత్రియుదంత మెఱింగి శేషాచలమున నివసించు తనూజాతను సమీపించి యజ్ఞానబలమున దాగావించిన పరాభవమునకు క్షమింపుమని ప్రార్థించిసమ్మతిపరచి స్వగృహమునకు దోడ్తెచ్చి సబహుమానముగ బోషింపుచుండె

వంకమాంబ తండ్రియిలుజేరినదని తెలిసి పూర్వాచారపరాయణులు జనుదెంచి కృష్ణయామాత్యునితో నీ పుత్రి యొంతటిజ్ఞానియైనను వంశాచారమునను సరించి ముండనకర్మ గావించుకొనవలసినదియే? తప్పదు! అట్లుగావింపనిచో మీకుటుంబమును బహిష్కరించెదమని చెప్పుటయే కాక బుష్పగిరిపీఠాధిపతులకుదెంచిన వారికెఱింగించిన శంకరాచార్య స్వామి అమ్మనుపిలిపించి వ్యాఖ్యకారణమెఱింగించి జవాబు జెప్పుమని నిర్బంధించినారు.

అమ్మస్వామివారికి నమస్కరించి మీ యభిమతాను సరణి ననువర్తించెద నని చెప్పుటయు నంబష్ఠుని బిలిపించి పనిగొన నాజ్ఞాపింప నాతం డమ్మగారియొద్దగూర్చుండి భయముతో వెంటనేలేచి, కేకలుబెట్టుచు భూతము, అదిగో భూతము, చచ్చితి జచ్చితి నని అరచుచు బయటకెత్తినాడు.

శంకరాచార్యు లీ విపరీతస్థితి జూచి వెంకమాంబగారి దిలకించిన కనులుమూతపడి గడగడవడకుచు నృసింహామూర్తి యన యేసందియము లేదు నిజముగా నృసింహామూర్తి యే! యని అకున మొదలిడినాడు. చూపరులు నిశ్చేష్టితులైనారు అరగంట కాల మా ప్రదేశమంతయు నిశ్శబ్దమైనది కొంతవడికి బరిసర మంతటికిని బాహ్యదృష్టి యలవడినది చూపరులంద అమ్మగారి ప్రభావమున కబ్బురపడుచు బొంగిపోయిరి. అమ్మగారు దిక్కులు ప్రతిధ్వనించునట్లు భగవన్నామకీర్తనము గావించుచు దుర్గమారణ్యమార్గము బట్టి పయనెత్తి తుంబురు కోన జేరినది.

అప్పటినుండి కొన్ని వేళలమునియై, కొన్ని వేళలభజన సేయుచు, కొన్ని వేళల భగవంతునితో మాటలాడుచు, బహ్మానందమునమునిగి తేలుచున్నా రమ్మగారు. అడవిమృగ ములునూ ప్రేమించుచున్నవి. ఆమృగముల నీమెయు ప్రేమించు టయు జరుగుచున్నది. ఈకాలముననే "తరికుండయందు గొలనునిర్మింపబడినది ఈకొలనులో నీరెండుటయనునదే" లేదు ద్వాదశవర్షక్షామమైన నూరివారికి నీటిభయము లేదు.

ఈకొలను దరి నమ్మగారి సమాధిగలదు దీని కీవలదరి మఠిమొకకొలనున్నది. ఆజలము సమస్తరోగహారి ఈతరి కుండ తిరుపతికుత్తరమున వాయల్పాడునకు దొమ్మిది మైళ్లలో నున్నది. అనేకమంది యాత్రికులచే సేవింపబడుచున్నది. సమాధి వెంకమాంబగారి పేరుతో వెంకటేశ్వరస్వామివారికి పాత్రకాలపు హార తిప్పటికిని సమర్పింపబడుచునే యున్నది.

# లక్కవరపు అయ్యపరాజు

అత్యంతశ్రద్ధతో జెదరనిచిత్తముగలిగి భగవదుపాసనము జేసి జీవితముల సార్థకముల జేసికొనినవారుత్తమోత్తములు, ఇట్టి యుత్తమస్థితి నార్జించుటకు సాధకుడు ప్రతిదినము దాను గావించు లౌకి కాలౌకిక గర్మఫలముల నన్నింటిని భగవానున కర్పించుచు రానురా నవియే నిష్కామ్యములుగామారుటబ్రేమోత్కృష్టమై గాలక్రమముగ నాప్రేమయే "జ్ఞానరూపము ధరించి గమ్యమున జేర్చును, పిందె కర్మ భక్తి కాయ జ్ఞానము పండు పిందెలో గాయ పండును కాయలో; బిందె పండు, పండులో? బిందెకాయయు నెటులుండునో కర్మలో భక్తి, జ్ఞానములును భక్తిలో గర్మజ్ఞానములును జ్ఞానములో గర్మభక్తులును గర్భితములై యుండుననుట ఇట్లు గర్మ, భక్తి, జ్ఞానములు మూడును విశ్వాకారునిజెంది గ్రమముగ విశ్వగర్భితమైన యవ్యక్తసిద్ధి లభించుచున్నది. అనగా విశ్వరూపమును ప్రేమించుచు రాగా? సమస్తభూతములు విశ్వరూపమునకు జెందినవగుట సమబుద్ధిగలవాడై సాధకుడు భూతములన్నింటియందును భగవద్భావము జేయుచు బాహ్యమునదోచు నానాత్వమం దేకత్వమును ఏకత్వమందు నానాత్వమును గని కృతార్థుడగుచున్నాడు, ఇదియే సగుణాద్వైతము.

వీడు సంసారియే గాని, నిజమైనసన్యాసి, దేహముండియు లేనివాడు. వస్తుదృష్టిలేనివాడు. రైతులలో రయితు,

సంసారులలో సంసారి, భక్తులలో భక్తుడు, జ్ఞానులలో జ్ఞాని, యోగులలో యోగి, కనికననివాడు విని విననివాడు, చేసి చేయని వాడు చచ్చి చావనివాడు వేయేల త్రిగుణాతీతుడన వీనికే జెల్లు వేదముల కందనివాడు.

ఇట్టివాడే అయ్యపరాజుగారు ఇప్పుడు చెప్పబోవు మాట రెండువందలపది వత్సరములనాటిది ఒకశరదృతువులో నెల్లూరుమండలమునందలి పోతకమూరుగ్రామమునకు బశ్చిమ మందుండు భావిచెంత మఱ్ఱిచెట్టునీడ నొక యవధూతగారు సుఖాసీనుడై కూరుచున్నాడు దారినబోవువారందఱు జను దెంచి నమస్కరించి యాశీర్వాదములంది వెళ్ళుచున్నారు.

ఈ సమయమునం దయ్యపరాజుగా రరుదెంచి బ్రహ్మ తేజోపూరితుడైన అవధూతనుగాంచి మహాపురుషుడని తలంచి సమీపించి ప్రదక్షిణ నమస్కారముల గావించి నమ్రుడై నిలచి నాడు తనకనుసన్న కూరుచుండిన అయ్యపరాజును దిలకించి అవధూత, నీపేరేమి? అయ్యపరాజు, అవ॥ అయ్యరాజు మీదీయూరేనా? నీకిద్దరుతమ్ములున్నారుగదూ? నీకుతల్లి లేదుగా? సంపన్నగృహస్థుడనుకుంటాను వినుము ప్రారబ్ధ మనుభవింపక తప్పనిదగుట నీవు పూర్వభవమున శ్వానహింసా రూప పాపముజేసియున్నావు తత్ఫలముగా, సంతాననష్టము గలుగుచున్నది. శివప్రతిష్ఠగావింపుము దోషముహరించియిహ పరసుఖము లనుభవింప గలవు అని వచించిన అవధూతగారి బోధవిని అయ్యపరాజుగా రబ్బురపడి తాజెప్పకయే” సర్వ

మెఱింగించుట త్రికాలవేది అని శ్రీవారికి తిరిగినమస్కరించి పాదములబడి తనయానందవారిచే శ్రీవారి పాదప్రక్షాళనము జేయుచుండ నవధూత నవ్వుచు లేవదీసి ఆలయనిర్మాణమున కనువగు స్థలమునిర్దేశించి ముహూర్తనిశ్చయము గావించి నేనటయుండియే ఆలయనిర్మాణకార్యక్రమము సాగింపజేసెద ననియు నీయందు భగవదనుగ్రహము మెండుగ గలదనియు వచించిన అయ్యా ! తమ పూర్వాశ్రమనామధేయ మెయ్యది నివాసమెక్కడ నని అడిగిన నీవా ప్రశ్నలవేయరాదు నేను జెప్పనురాదు. అదియట్లుంచుమని చెప్పుచు రేపటియుదయము నీతో వచ్చి కార్యక్రమములో బ్రవేశింప జేసెద ననివిరమించి నాడు.

మరునాడుదయమున నయ్యారాజు నెంటనంటి పురిలోని కేగి అం దాలయనిర్మాణమున కనువగు స్థలమొందును లేమి గ్రామమునకు నాలుగుమైళ్లలో నున్నట్టియు అయ్యపరాజు నకు జెందినట్టియు బదివందల యెకరముల కండ్రికలో నను కూలస్థలమం దొకచో నాలయనిర్మాణమునకును నివాసగృహ మునకును శంఖువుల నాటించి యచిరకాలమున గట్టడముల రెండింటిని నిర్మింపజేసి శివప్రతిష్ఠ గృహప్రవేశోత్సవమును గావింపించి రాజదంపతు లిరువురకును క్రమముగ, పంచాక్షరీ, గౌరీపంచాక్షరీ, మంత్రోపదేశములిచ్చి ధన్యుల గావించినా డవధూతగారు.

గ్రామముగ నాలయపరిసరములందు బీదరయితుల నూతనగృహములునిర్మించుకొని నివశించుట నిర్మానుష్యమగు

స్థల మూయగా మారినది ఇదియే లక్కవరము. ఇట్లు మహా త్కార్యనిర్మాణ కర్తయై అయ్యపరాజు నిజకుటుంబకార్యముల సోదరులకప్పగించి నిర్విచారుడై తాను శివాలయమందును, భార్య నిజగృహమునన్గల దేవగృహమందును గూర్చుండి యుపాసనలనాగించి దేశికాచార్యాజ్ఞననుసరించి సిద్ధియు సంతానవృద్ధియు గలిగి విరాజిల్లుచుండిరి. నానాటికి లక్కవర పురిపెరిగి భక్తి పరిపుత్తుల కునికిపట్టైనది దంపతులకు గౌరీశం కరులు సాక్షాత్కరించుటయేకాక బిలిచినపలుకుచుండిరి. ఇట్లుండియు జపములు మానలేదు అతిథ్యభ్యాగతసేవలు విస్తరించి నవి రాజుగారుకట్టించిన మంగళసూత్రములు వందలకొలది అవారిగా షోడశ మహాదానములు గావించినా డయ్యపరాజు పేరుప్రతిష్టలతో దిక్కులుమారు మోగినవి.

ఒకప్పుడు గురతలభిక్షుడును తపుతలవాసియు నైన కృష్ణానందావధూత యాన నీపుణ్యాదంపతులు నాగభొట్ల వారి ఇంటిమునకేగి నమస్కరించి నిలిచిన అయ్యపరాజా? రేపటి యుదయమున నే మీభౌతిక దేహమును విసర్జించి పరమపద మలంకరింపగలము, నీయనుయాయుల నందఱ బిలుపబంచి భజనలతో నన్ను సాగనంపుము. ఈ భౌతిక దేహమును లక్క వరమున సమాధిగావించి నిత్యనై వేద్యదీపారాధనములకను వేర్పరచునది. అని సెలవొసంగి నియమితకాలమునకు విదేహా నైవల్యమంది నా డవధూతగారు.

అంత గొంతకాలమున కొకనా డయ్యపరాజు కాల్యా కృత్యముల నిర్వర్తించుకొని శివాలయమున కేగినాడు భార్యా

దేవగృహంబున జపించుచున్నది. నాటియుదయము ప్రథమ యామము దాటినది.

పిల్లవా కొకండు బరుగెత్తివచ్చి పెద్దతాతయ్య చని పోయినాడని ఆతురతమై వచించినమాట విన్నది భార్య కన కమ్మ కూయుచున్నది. కూరుచుండినట్లే శివైక్యమొందినది దంపతు లిరవుర నొకేచితియందుంచి కుమారుడు నరసయ్య దహనసంస్కారకర్మల సక్రమముగ జరిగించి ధన్యుఁడైనాడు. ఈ వంశపురోభివృద్ధి నాశించి భగవంతుని గీర్తించుచు సెలవు గొనెద లక్కవరపువంశీయులే యిప్పటికిని లక్కవరపు కరణములు.



# కైవారము బాలాంబ

భూతము లన్నమువలన బుట్టుచున్నవి. అన్నమువలననే పెరుగుచున్నవి. ఈ కారణమును పురస్కరించుకొనియే సత్క్రతువులన్నియు నన్నదానపూర్వకములై ప్రవర్తించుచున్నయవి. గనుకనే దానములలో నన్నదానమునకు బ్రధానస్థాన మీయబడినది అన్నము ప్రత్యక్షభగవత్స్వరూపము అన్నసారము ప్రాణాధారమును, ఆత్మబలసమగ్రమునైయున్నది. అన్నము లేనిచో బ్రాణము శుష్కించి తద్వారా దేహమున కపాయము సిద్ధించును దేహబలమనోబల సంపాదనమున కన్నపానములత్యంత సహాయకారులు, మనోదేహములు వేరు వేరు పదార్థములు, కావు దేహముయొక్క సూక్ష్మరూపము మనస్సు మనస్సుయొక్క స్థూలరూపము దేహము దేహమారోగ్యవంతమైననే మనశ్శుద్ధి లభింపగలదు. మనశ్శుద్ధిలేనివారికి నాత్మశక్తికలలోనివార్ని ఆత్మశక్తి మనశ్శుద్ధివలన నేర్పడును. మనశ్శుద్ధి దేహారోగ్యమువలన లభించును. దేహారోగ్యమన్నమువలన లభ్య పడుచున్నది. గనుకనే "అన్నంబ్రహ్మ" అని వేదమాత చెప్పుచున్నది సత్క్రతువులన్నియు నన్నదానపూర్వకములుగ జరుపుటకు కారణమన్నమాత్మశక్తి గర్భితమై యుండుటయేయగు దామానుకొనియైనను, అతిథినిగుడువబెట్టిన యజమానిపుణ్యము వర్ణింపతరముగానిది జాతిమత విచక్షణసేయక గావింపబడు అన్నదానము విశేషతమము.

మఱియు నన్నము దినుట వలన ధాతువృద్ధిసమకూడును. ధాతువృద్ధి శరీరారోగ్యసంపాద శరీరాభివృద్ధికిని ఆత్మాభివృద్ధికిని గూడ అన్నమవసర మగుననురహస్య మెఱింగిన మహాతల్లి కనుక నేనిరతాన్నదాన వ్రతపారీణయై జీవయాత్రసాగించి యాంధ్రావనిపేరు గాంచిన సద్గుణ కదంబ మన బాలాంబ.

ఈమె మనశ్శుద్ధికిని, సత్యసంకల్పములకును కాణాచి కార్యదీక్షా సౌశీల్యములకునికిపట్టు పరార్థైకప్రవృత్తికి నిలయము దూరశ్రుతమైన క్షుధాకులిత దీనాలాపశ్రవణమాత్ర దన్నివారణోపాయమును క్రియారూపము ధరింపజేయు నారీమతల్లి మన బాలాంబ ప్రతిదివసమును తన మంచము క్రింద సిద్ధపరచి యుంచిన భోజనపదార్థములతో నన్నాతురుల రేయియంతయు సంతృప్తిపరచు సద్గుణగణ శారదాంబ బాలాంబ.

ఈ మహాతల్లిభర్త కైవారము సుబ్బావధాని సత్యదీక్షాదురంధరుడు మృదుమధురహృదయుడు విబుధజనాహ్లాదకరుడు సాధుజనప్రియుడు మితభాషి కలిగినకలిమి కులుకక తృప్తినందుచు నిర్వికారత్వమూను సమానచరిత్రుడు ఎట్టివిషమస్థితి దాపురించినను చేజాచి యెఱుంగని నిర్లిప్తుడు ఇట్టి మహామహితుడగు భర్తతో బదునెనిమిది వర్షములు జేసిన కాపురమున సంతానభాగ్యము బడయజాలమి భావగారి కుమారుడగు, నారాయణను, అల్లారుముద్దుగ లాలింపుచు బాలింపుచుండె.

ఈతడు బాల్యమునం దాడుకొనుచు కాలుజారి నూతగూలినాడు. ఈ ఘోరవార్త విని బెగడొందక నృసింహానామ

స్మరణతో గూపమును సమీపించి నారాయణా! ఎందు న్నావురా! నాయనా! అని పిలచినవెంటనే, అమ్మా! భయ పడకుము "ఎవఁడో, దివ్యపురుషు డొక డరుదెంచి నీటమునుగ నున్న నన్నెత్తి మెట్టున గూరుచుండబెట్టి యంతర్హితుం డైనాడు", అనుమాటలు భావినుండి వినవచ్చినవి. అమ్మ భగవదనుగ్రహమున కుబ్బుచు నా కుఱ్ఱవాని వెలికిదీయించి సంతోషపారావారమున దేలియాడినది.

ఎంతటి వారికైనను, ప్రారబ్ధ మనివార్యముగదా! తన నలుబదవయేట అనగా, క్రీ. 1888 వత్సరమున భర్తసుబ్బావ ధానపరలోక గతుడగుట చింతాసాగరమున మునింగి ఎట్ట కేలకు శాంతివహించి భర్తకపరక్రియలు ముగింపించి దినము నకు రెండుపూటలు నృసింహస్వామివారి దర్శనము జేయుచు, నొకశుభదివసమున బులిహాళ్ళనరసింహాచార్యులగారి వలన తిరుమంత్రోపదేశము గ్రహించి మంత్రసిద్ధియు భగవత్సాక్షా త్కారభాగ్యమును గడించిన జగదంబ బాలాంబ.

ఇట్లు దినములు గడపుచుండ నన్యమతావలంబుని వలన మంత్రోపదేశ మందిన కారణము నూతగానొని పురిబ్రాహ్మణ బృందము గనలి పీఠాధిపతికెఱింగించిన స్వామివారమ్మగారిని స్వయమున బరీక్షించి నిష్కల్మషయని నిశ్చయించి బ్రాహ్మణ బృందమును మందలించి తరిమివేసినారు.

అంత బాలాంబ పానకాల నృసింహగిరిపై నిత్యనివాస మేర్పరుచుకొని తపస్సుజేయుచుండిరి. ఈ స్థితియం దుండు తరి

నొకనాడు కుంభవర్షము కురువ మొదలిడినది. తలదాచుకొన నెంచి అమ్మ బయలువెట్టుచు నొకగుహచెంత కేగి లోన బ్రవేశింపనున్నతరి. గుహాద్వారమునుండి బురదనీటి వెల్లువ యెదుర్కొని అమ్మను నెట్టివేసినది. ఆ త్రోపుతో ! స్మృతిదప్పి అందొక గుంటగూలి చేతనరహితయై మైమరచినది. వర్షమాగిన వెంటనే బురదచే గప్పబడుట శరీరమునకు గనుపింపరాని స్థితి యేర్పడినది.

ప్రతిదివస మమ్మగారి క్షేమమారయ వచ్చిపోవుచుండు హనుమంతయ్యగా రరుదెంచి పోబడి తెలియక నందందు వెదకి బురదలో గూరుకొనిపోయిన శ్రీవారి దేహమును విశ్వ ప్రయత్నముపై బయటికి దీయించి సమయానుకూలోపచారముల స్మృతి గలిగించి ధన్యుడైనాడు.

మఱియొకతరి పురిప్రత్యర్థు లరుదెంచి అమ్మ నడవడి శంకించి కారులాడుటవిని సహింపజాలక ప్రాణత్యాగము జేసికొన నుంకించి అగాధమగు నూతబడినది. వెంటనే నృసింహ మూర్తి సాక్షాత్కరించి తదీయాపదనుండి తప్పించి అంత ర్హితుడైనాడు.

నృసింహానుగ్రహమబ్బుపడ లెక్కకెక్కుడగు ప్రయాసల నవలీలదాటి తపస్సిద్ధి గడించి బ్రహ్మతేజో విరాజమాన మూర్తియై విరాజిల్లుతరి నృసింహమూర్తి పంచాబ్దముల బాలుడై వచ్చి అమ్మా! నాకన్నము బెట్టవా! ఆకలి బాధించు చున్నది. మాట్లాడవేమి తల్లీ! అనుడు అమ్మ గ్రహించి చేతులు జోడించి నమ్రవదనయై నృసింహదేవా! ఈ యబ

లను పరిహాసింపదలంచి బాలుడవైవచ్చితివా! "నాయనా! ఇదేమి వేళాకోలమా! తండ్రీ! విశ్వగర్భుడవైన నీకన్నముబెట్ట నే నెంతదాన జనకా! అని దీనాలాపముల పాదములబడి మైమరచిన బాలాంబకు స్మృతిబ్రసాదించి లేవనెత్తి నిజరూపుజూపి వినుతులందిఅవ్వా! నేటినుండి నీవలన నిర్విఘ్నముగ నన్నదానయజ్ఞమవారిగా సాగున ట్లనుగ్రహించితి. ఆర్తదోషదూషితవు గాకుందువుగాత. నీ దీక్ష కంతరాయము గలుగకుండుగాక! అని వచించి యంతర్హితుడైనాడు నృసింహుడు.

అన్నదానమహాయజ్ఞము సాగుచున్నది. యాచింపకయే భోజనపదార్థములు కుప్పలు తెప్పలుగా వచ్చిపడుచున్నవి. ఈ స్థితినిజూచి సహింపలేని ప్రత్యర్థులు, శిరోజముల నదలించుకొనుము లేకున్న వెలిబెట్టెదమని బెదరించిన వల్లెయని క్షౌరకునిముందు కూర్చున్నది గాని, అంబష్ఠునికి జేయ్యివడక మొదలిడుటయే కాక లక్ష్యము చెడినది కారణమరయ దనముందమ్మలేదు. అబ్బో! సింగము, సింగము చచ్చితి, చచ్చితి నని పెనుబొబ్బలిడుచు బరువెత్తిపోయినాడు.

వీడొకతరి మహాలయపక్షపు దినములలో నొక సాయంత్రి మైదుగంటల కమ్మగారి దర్శింపగలిగినాడు. రాకకు గారణమెఱింగించి (శ్రీ) మల్లాది సుబ్బదాసుగారి జీవిత గాథ నర్థించి దెలిసికొని తృప్తి నందిన వీనినిగాంచి అమ్మగారిట్లనిరి.

మహాలయపక్షము పితృప్రీతికర మగుట చేయి భోజనమా, ఫలాహారమా, ఫలాహారమే" అన్నాడు పిండిచేయింప

మనెదవా, ఔనన్నాడు, రాత్రి యేడుగంటలకు మడిగట్టి శ్రీవారి యాజ్ఞ ప్రకారము భోజనశాలజేరి సుఖాసీనుడైనాడు మఱియొక అతిథి వీడిప్రక్కన గూర్చుండె నిరవురకమ్మగారు విస్తరులవేసి, దోసెడు దోసెడు నెడల్పుగల అరిసెలు వడ్డించిరి ఆరెం ఢరిసెలతోడనే క్షున్నివారణమైయెనది. కాని నంటనే రెండు పెరుగు, గారెలు ప్రత్యక్షమైనవి. తదుపరి రెండు లడ్లు వీటితో గడుపునిండి వ్రేలుపెట్టిన అందునట్లైనది. ఉత్తరాపోసనమునకు సిద్ధపడునంతలో నేపునుపిండికొనివచ్చి, నాయనా, పిండిచేయమంటివే, అనిచెప్పుచు విస్తరిలో గుమ్మరించి చిక్కని మజ్జిగబోయ నుంకించుట గోపమువచ్చి వీడిట్లనియె అమ్మా! నిన్నేమియు ననజాలగాని అన్నదానవ్యాజమున నతిథుల ప్రాణాపహర్తవైనావు. ఇదియేమి విపరీతము కొంచెమైనను సందు లేని యీ పొట్టలో మజ్జిగజేరిన పిండి పట్టుటెట్లు? అని విసుకుకొనుచుండ నవ్వి నాయనా! నరసింహనామస్మరణజేయుము. కడుపు నలితిఁజూపునని చెప్పి యొప్పించి వీడిచే మూడు పర్యాయములు నృసింహనామ మంత్రోచ్చారణము జేయించినారమ్మగారు. వెంటనే పొట్ట వెలితిజూపి భుక్తాయాసమంతరింప అమ్మగారియాజ్ఞ ననువర్తించి కృతార్థుడైనాడు. ఇది అమ్మగారి ప్రభావమా? నరసింహనామమంత్రప్రభావమా? అను సందియం బిప్పటికిని వీనిని వదలినది గాదు గాని శ్రీవారి చిత్తము భగవన్నామాయత్తమగుట, నామినామముల కభేదము కనుక నాచిత్తము భగదాకృతి ధరింపు కారణముగ వెలువడిన యాత్మశక్తియని నిరూపించుకొనినాడు.

మఱియొకతరి సంక్రాంతిదివసమున సత్రావరణమందు బ్రాహ్మణులు భోజనములు చేయుచున్నారు. అమ్మగారు పర్యవేక్షణ కాముకులై పంక్తులవెంట దిరుగుచున్నారు. ఈసమయమున నొకవంటవాడు వచ్చి అమ్మా దొడ్డి గుమ్మమునుండి పంచముడొక్కండు తొంగిచూచి క్షుదార్తుడై కేకలు వేయుచున్నాడు. బ్రాహ్మణభోజనములు పూర్తియగువఱకు కాగునటుల లేదు. అని చెప్పిన విని వెంటనే పరుగునవచ్చి క్షుధాతురు నాదరించి దొడ్డియందొకచో గూర్చుండ నియమించి వానికి భోజనపదార్థము లిడినారు. వాడును తృప్తిగా భుజించి అన్నదాతా సుఖీభవయని దీవించి అమ్మ చూచుచుండగనే అంతర్హితుడైనాడు. పానకాల నృసింహమూర్తియే అంత్యజుడై తనకు సేవనొసంగినందుల కుబ్బుచు మైమరచి ఆనందతాండవము గావించినారు.

ఒకప్పుడు మంగళగిరి తిరునాలకు వేలకొలది యాత్రికులేతెంచి కళ్యాణమహోత్సవము సేవించి నాటిరేయి బాలాంబగారి సత్రములో విందు లారగించినారు.అమ్మగారు యాత్రిక బాలబాలికల బాలభోగమునకై పదునైదు మానికెల బియ్యముతో వండింపబడిన గుండిగ నిలువయుంచిరి. నాడు తెల్లవారి పని బాలభోగమునకు దాదాపు పదారువందలమంది బాలులు వచ్చి పంక్తులుదీర్చి కూరుచున్నారు. ఉన్నది పదునైదు మానికెలబియ్యపుటన్నము వచ్చిన అతిథులారువందలమంది సరిపోవదని వంటవాడు తహతహపడుచున్నాడు. వార్ధక్యదశలోనున్న అమ్మగారెఱింగి బిరబిరవచ్చి అన్నము రాసిపోయించి కపూర్హారతిడి తానై పళ్లెరములతో నన్నమెత్తిపంపు

చున్నారు. ఆరువందలమంది యాత్రికులు భుజించి తృప్తులై అమ్మగారిని వేనోళ్ల పొగడినారు. ఇది యంతయు నృసింహమూర్తి ప్రభావమని చెప్పుచు దన నిష్కామసేన వెల్లడించినారు.

ఒకప్పుడు బ్రాహ్మణసమారాధనమున నెయ్యిపాత్రాభికరణమునకుగూడ లేదు వంటలైనవి వేలకొలంది యతిథులు బారులుదీరి భోజనమునకు గూరుచున్నారు. వడ్డనలైనవి అన్నాభికరణమునకుగూడా నేయి లేమి వడ్డనవారు గుసగుసలాడ మొదలిపెట్టిరి. అమ్మగారు చూచిరి. కర్పూరము వెలిగింపబడిన పళ్ళెరముతో వాకిటిముందుండు కొనేటిరెయొడ్డునకు జేరి పానకాలరాయుని మంగళహారతితో దృష్టిపరచినారు. వెంటనే నేతిడబ్బాలబండి ప్రత్యక్షమైనది. ప్రైవేటు స్టేషను పోర్టు తొకడు కర్నూలునుండి సెల్పార్డరుతో రాబడిన ప్యాసుతో వచ్చి అమ్మగారికి నమస్కరించి డబ్బాలు వప్పగించి రశీదు దీసికొని వెళ్ళినాడు సంతర్పణ పూర్తియైనది. యాత్రికులు అమ్మగారి ప్రభావమును వేనోళ్ల గొనియాడి తృప్తులై వారి వారి స్వగ్రామములకు పోయినారు.

ఇట్టి మహిమ లింకెన్నియో గలవని చెప్పిరిగాని, వీనికి లభించినవఱ కెత్తింగించినందులకు జనువసులు క్షమింతురుగాక!

నాటనుండి అమ్మగారి జీవితాంతమువఱకు నృసింహమూర్తి వెన్నంటి దిరుగుచు సేవకుడై అన్నదానమహాయజ్ఞము కొనసాగించి డెబ్బదితొమ్మిదవయేట దనలో జేర్చికొనినాడు.

—•••••—

# మహర్షి పీరోజీ

సర్వవ్యాపకుడగు పరమేశ్వరుండు సకలమానవ హృదయాకాశాంతర్గత దివ్యమండపమున ప్రేమానందామృతఘనస్వరూపుండై సర్వదాచిచ్ఛక్తితో రమించుచుండుట బాహ్యాడంబరముల యాచారములచే గాని, అస్థిరరూపములతో గాని, సత్కారమాన పూజాప్రదములగు విద్యలచేగాని అవసరములేక సకలభూతములయం దేకైకభావము, గలిగి ప్రేమపూరితహృదయుడై, దృశ్యమంతయు దానుస్మరించు నామాధిష్ఠాన దైవముయొక్క దివ్యమంగళవిగ్రహముయొక్క రూపమే" యనెడు అరూఢభావముచే నస్థిరభోగాశ త్యజించి వైరాగ్యభూషణుండై మూర్తీభవించిన భక్తిస్వరూపుండై సంతతానందరసపానముచే సంతృప్తుండై సంసారియైనను అసంసారివలె నిజజీవితముగడపి యంత్యమున శ్రీరామనామజప ఫలసిద్ధిగాంచిన దివ్యపురుషుడే" మనపీరోజిమహర్షి.

తండ్రి సరోజీ. తల్లి సర్యూబాయి. తమ్ములు 1. వెంకోజీ, 2. గోపాలరావు. జననము క్రీ॥ 1829 సం॥ విరోధి సంవత్సరామాఘశుద్ధైకాదశి వీరికి బాల్యమునుండి పరమాత్మ నెఱుంగ నభిలాషమెండు భగవత్పాదసేవ భాగవతారాధనము సర్వభూతదయ వీరి సహజగుణములు. వీరికి దశవర్షప్రాయమునకే, సంస్కృతాంధ్రపాండిత్య మలవడినది. ద్వాదశవయః ప్రభృతివీరిని కవితాకన్యవరించి కాపురముచేయుచున్నది. సహజపాండిత్య పరీక్షగలవాడు.

ఒకనాడనాహూతుడై చిదానందయోగి యేతెంచి పీరోజీమహాశయుని యఖిలమిత్ర మొజింగి తారకమంత్రి ముపదేశించి దీవించి జనియె. అత్యంతభక్తియుక్తి దన్మంత్రపునశ్చరణ యందు సిద్ధిగడించి ఆచార్యశతకము రచించి గురువున కర్పించినాడు.

పదునైదవయేట వీరాబాయిని భార్యగా వరించిరి. ఈమె పతిసేవాపరాయణ, సుగుణఖని సుశీల సాధ్వీశిరోమణి ఈ అనుకూలదంపతులు చంద్రచంద్రికలవలె వెలుగుచు భగవత్కార్య కలాపములందు బొద్దులుపుచ్చుచు నిజజీవితముల బవిత్రవంతములు గావించుకొనుచుండిరి.

రాను రాను సద్గ్రంథరచనాభిలాషయు దత్త్వ గేయ నిర్మాణశక్తియు, శతకగద్యపద్యాదిరచనా కౌశల్యములుగలిగి, భద్రాచలయాత్ర గావించి యిష్టమూర్తి నర్చించి పరమానంద సుధారహరి దేలియాడుచు, స్వీయకృతుల శ్రీరామున కర్పించి కృతార్థతగడించిన పుణ్యమూర్తి పీరోజీచక్రవర్తి, స్వానుభవసిద్ధములగు పరమార్థ రహస్యముల శిష్యుల కెఱింగించి కృతార్థులగావించెడి ధీమణి వీరి శిష్యులలో సిద్ధరు పంచములుగూడ గలరు. నానాటశిష్యబృంధమెక్కువైనది శిష్య బృంధముతోపాటు మహిమలు పెరిగినవి విస్మహిమలద్వారా, సత్తెనపల్లి జమీందారుగారి సత్కార మతిశయించినది తాలుమ్నాబాదు నివాసియగు మాణిక్యప్రభువు వీరి శిష్యకోటికి జెందినవారు.

వీరు 1889 జులై శొమ్మిదవ తేది అనగా విరోధివత్సరాషాఢశుద్ధైకాదశిరాత్రి లింగోద్భవకాలమందు రామనామస్మరణతో బరిమపదమలంకరించిరి. వార్షికోత్సవములు జరుపబడుచున్నవి వీరికృతులు, 1. నవకుసుమమాల, 2. పన్నగాచలనాయకశతకము, 3. గజేంద్రమోక్షము, 4. పరమానందసుధాలహరి, 5 దశావతారదండకము, 6. శేషగురుశతకము, 7. నమశ్శివాయగేయము, 8. శ్రీరామశతకము, 9. నాత్రిజితీయము, 10. పంచీకరణము, 11. స్వప్రకాశము, 12 ఆచార్యశతకము 13. తత్వసంగ్రహము, 14. ప్రహ్లాదచరిత్ర.

శ్రీవారి మహిమలు

భవిరిశెట్టి ఓబయ్య యను వైశ్యుడొకడు తన పంటపొలమును మేసినవను నెపముతో నాలగాపరిని దిట్టుచు, నాలగొట్టుచు గొన్ని పశువుల బందెకుదోలుకొనిపోవుచుండుట జూచి కటకటబడుచు పాపమీతడీనాడు రానున్న యాపదనెఱుంగడు పామునోట జిక్కిన కప్పవలె దనగతిగానక మోసపోవుచున్నాడు అనుచు శ్రీవారు తలపంకించినారు నాటిరేయి ఓబయ్య కలహించి భార్యనింట నుండనీక బజారునకు నెట్టి తలుపులు బిగించుకొని యురిబెట్టుకజచ్చినాడు. దీనివలన మనఋషి త్రికాలవేది యనక తప్పదు.

ఒకప్పుడు కార్యాంతర మనుసరించి వేశ్యావీధి నరుగుచుంటజూచి కామవికారమునకు లోనైన "శ్రీహరి" అను వేశ్య, మహాదరముట్టిపడ శ్రీవారిజేరి దనయింట గూరుచుండబెట్టి పరిచర్యలదన్నుచు దన తుచ్ఛాభిమతంబెఱింగింప జలింపక జిరునగవుతో సోదరీభావముట్టిపడ జ్ఞానబోధగావించి ప్రేమదృష్టి బ్రసాదించినాడు. నాటగోలె గామదృష్టివర్జించి ఆవేశ్య యోగినియై తరించినది. దీనివలన వీరు జితేంద్రియు లనుట సాహసము కాదు.

మఱియొకతరి అడవినిమేయు జమీందారుగారి ఆవుల మంద గల పశువునొకదాని పులిబట్టు నెఱింగి పురివీధి భక్త గోష్ఠిలోనున్న శ్రీవారు చేతికఱ్ఱ ఝుళిపించుచు, ఛస్, ఛస్, అనుశబ్దముతో నదలించుటగాంచి ప్రశ్నించి కారణమెఱింగి విచారించి నిజమునుగుర్తించి సంతసించినారు. చూపరులు, దీనివలన ఋషిగారు సర్వజ్ఞులని తెలియగలరు.

నా యొద్దనిలువయున్న నీలిమం దిప్పుడు విక్రయించిన లాభమా! నష్టమా! అని ప్రశ్నించిన కోట అప్పయ్యగారిని తొందరపెట్టుచు లాభమో! నష్టమో! వెనుక విచారితము గాని వెంటనే నీ నీలిమందుకొట్టు కాళీజేయుము. లేనిచో బ్రమాదపరిస్థితి నెదుర్కొనగలరని నొక్కిచెప్పుచు నట్లే గావింపించినాడు మరునాడుదయమున కది పరశురామప్రీతికి గురియైనది దాన యజమాని సంతోషవార్ధినోలలాడినాడు.

దేవునిజూచుమార్గ మెఱింగింపుమని పరిహాసవాక్యములాడిన వంథ్యా కోటప్పను పిచ్చివాడా! పో! పొమ్మని యద

లించిన కారణముగా నాతండు పిచ్చివాడై గంతులుబెట్టసాగి నాడు. ఆతనిబంధుగులు ప్రార్థింప వానిపిచ్చిని భక్తిగామార్చి శిష్యకోటిత జేర్చి యాదరించిన సిమ్హశంకమూర్తి పీరోజి చక్రవర్తి.

భార్యా సర్స్వాబాయిగారు కలరావ్యాధికిగురియైనారసి వచ్చిన యుత్తరము ననుసరించి యమవసనిశి చిలుకలూరు పేటనుండి సత్తెనపల్లి కేగుచుండ మార్గమధ్యమున నలుగురు దొంగలడ్డగించిరి. భయపడక నాచోరుల ప్రత్యక్షరామలక్ష్మణ భరతశత్రుఘ్నులనుగా భావించి "ఎంతో బ్రహ్మానంద మాయెనే! మన చింతాలన్నియు దీరిపోయెనే" అని పాడుచు నృత్యము జేయుచుండుటగాంచి దొంగలు తమతమ క్రూర బుద్ధుల మార్చుకొని భక్తిభావము లుట్టిపడ తమతమ తప్పుల మన్నింపప్రార్థించి ప్రసన్నుని గావించుకొని పయనమున శ్రీవారికి దోడ్పడి సత్తెనపల్లె జేర్చుటయే, గాక వారు శిష్యు లయినారుగూడ

పైవిధముగ సత్తెనపల్లి జేరి మరణశయ్యనున్న భార్యను స్తన్యములు లేక గృశించు పుత్రుని కలరాభయమున కడలు పురివాసులను గాంచి వెంటనే తటాకమున గుంకులిడి వార్చి మహాలక్ష్మీ వృక్షచ్ఛాయగూరుచుండి తపంబుండె నాటి సాయంత్రికి సత్తెనపల్లి నెల్లెడ శాంతిలత నల్లిబిల్లిగా నల్లుకొని యుల్లసిల్లినది. స్వీయపరకీయులెల్ల రారోగ్యపూరితులై కలరా భయదూరులై మహానందభరితులైనారు.

భద్రాచల యాత్రసందర్భమున శ్రీవారు భక్తబృందముతో రాత్రి ప్రథమ యామమున మొంకలపల్లి మకామున జేరి వంటప్రయత్నము సాగింపనెంచిన బండిలో బియ్యపు మూట కనుపడలేదు. అది మార్గమధ్యమున నెందైనను జెక్కుడనో, పడిపోయినదని దలంచి తన ప్రయత్నమాపినాడు వంటవాడు. ఇంతలో నొకనూతనవ్యక్తి బియ్యపుమూటతో బరుసెత్తివచ్చి దారిలోదనకు దొరకినదని చెప్పుచు దానిని శ్రీవారిముందుంచి యంతర్హితుడైనాడు. శ్రీరామానుగ్రహమున కుబ్బుచు పాచకున కెటింగించిన వాడు వంటసాగింపించి యచితకాలమున భుజించిరి. భక్తబృందమానందించినది. ఈ సంఘటన శ్రీవారి యేబది నాల్గవయేట జరిగినది.

ఎంతనిర్దయమానసుడవు నే నెంత వేడిన గనువడవు అని పాడుచు భద్రగిరిజేరి రాముసేవించి కృతార్థుడైనాడు సీరోజీ మహారాజు.



# భక్తమణి పాటిబండ్ల వీరయార్య

కర్మయోగాచరణమున నే గమ్యము లభించునో, జ్ఞాను శ్రేయోగజ్ఞానము లను వివేకనౌక నాశ్రయించి దాటరాని సంసారసముద్రము నవలీలగా తరింపజేసి మానవునికి స్వస్థిని గల్పించునో, మహావాక్యశ్రవణము జ్ఞానులకే శాశ్వతపదవి గల్పించి తరింపజేయునో! ఏది భక్తులకు, భక్తివిషయమో! యాజకులకు యజ్ఞాధిష్ఠాన దేవతయో, ఏది సర్వులకు సర్వ కాలములందును బూజనీయమో, అట్టి శాశ్వతస్థానమును జేరి సుఖయించిన పుణ్యమూర్తులలో మన పాటిబండ్ల వీరయార్యు లొకరు.

ఈతండు భక్తి, భజనల నొకే పరబ్రహ్మస్వరూప ముగా సేవించి యారాధించిన సిద్ధమూర్తి చకోరములకు చంద్రుని వలె దోడిభక్తుల కానందమిచ్చి తరింపజేసిన ముక్తజీవి.

వీరి నివాసము గుంటూరుమండలమునగల సత్తెనపల్లి యుపమండలాంతర్గత దీపాలదిన్నె పాలెము. కమ్మవంశాలంకా రుడు తండ్రి బాపయ్య. తల్లి బాపమ్మ. భార్య వెంకట నరసమ్మ. జననము క్రీ. 1867 సంవత్సరము వీరు చిన్నటనుం డియు రామభజనములో బాల్గొనుచుండువారు.

అష్టవర్షప్రాయమున బులహారి పీరోజీబాబు, దీపాల దిన్నెపాలెమువచ్చి శిష్యులకోరికపై వరుసగా నాధ్యాత్మికోప.

న్యాసములు వారంమురోజులు. ప్రతినిత్యము గావించు చుండుట విని. తానును భక్తినార్జించి ధన్యుడనయ్యెదననితలంచి గాబోలు, బిలువకుండగనే, ఆసుదెంచి గురుసేవ జేయ మొదలిడినాడు.

పిదప గురుమూర్తి యరుదెంచి నప్పుడె తిరొమో! భక్తి ప్రపత్తులుట్టిపడ నమ్రభావముతో శ్రీవారి వెంటనంటి సేవల గావించుచు, దేశికాచార్యానుగ్రహము గడించినాడు

పండ్రెండవయేట, దేవాభక్తుని అచ్చమాంబగారి నాశ్రయించి గురువుగారిచే నుపదేశమిప్పింపుమని యర్థించ నామె కరుణించి దేశికాచార్యున కెఱింగింప నాతండు వీరయ్య గారినిజేరి త్వరపడకు తచ్ఛుభసమయమునకై వేచియుండుమని చెప్పిన గురువకు నానతిశిరమునధరించి తదీయ శుభముహూర్తమున కెదురుచూచుచుండె.

పదునైదవయేడు వచ్చినది కబురంపి శిష్యుని బిలిపించి కారణమొసంగినారు గురువుగారు నాడు మొదలు వగలంతయు గృహకృత్యములయం దప్రమత్తుడైయుండి తలిదండ్రుల కుల్లాసము గలిగించుచు ప్రతిదివసము రేయి ప్రథమయామమున భోజనానంతరము స్వపురివదలి సత్తెనపల్లిజేరి గురువును సమీపించి వినయవిధేయతలతో తదీయసేవాభాగ్యము నార్జించి దేశికాచార్యునాన సూర్యోదయమునకు సరిగా. స్వపురిజేరి కుటుంబకార్యకలాపముల మెలగుచు నిట బితరులను అట గురువుగారినిగూడ సంతసపరచుచు, నిహపరముల రెండింటి

నేకదీక్షతో సాధించిన పుణ్యమూర్తి మన పీరయార్య చక్రవర్తి.

ఇట్లు మూడు వత్సరములు నడచినవి. ఈ మధ్యకాలమునం దొకనాటి గురుసేవలో నిద్రాదేవత నెత్తికెక్కి మైమరపించినది. కొంతవడికి మెలకువగాని పరితాపముతో, ఆహా! నేడట్టి ప్రమాదముసంభవించినది. అపరాధి నపరాధిని "అపరాధినిమాత్రమే" గాదు. నీచుడ దుర్మార్గుడనుగూడ లేదేని గురుమూర్తియందు సామాన్య మానవబుద్ధి సేయగలుగుదునా? ఈ తుచ్ఛవృత్తి నాయందె దో. దాగియుండి ప్రమాద పరిస్థితి గలిగించినది. అర్చామూర్తియందు విగ్రహభావమును మంత్రమునం దక్షరభావమును గురువునందు మనుష్య భావమును గలిగిన శిష్యుడెప్పుడును బాగుపడజాలడు అని తనలో దాను పరితపించుచు గురువర్యునిపాదాలబడి విలపించు శిష్యుని బ్రశ్నించి కారణమరసి చిరునగవు మోమున దాండవింప బుత్రా! లెమ్ము భయపడకు ఎంతటివానికైనను పొరపాటు రాక తప్పదు. ఇట్టి ప్రమాదముముందెప్పుడును గలుగకుండునట్లు వరంబొసంగితి శాంతించుమని బుజ్జగించి శిష్యుని తృప్తిపరచిన సుస్థిరానందసుఖభోజి మన పీరోజి.

పీరయార్యు లుపదేశమంది రెండేండ్లుగడచి మూడవ యేడు వచ్చినది ఒక్కెడ దేశికార్యుసేవలదన్నుచు అయ్యా! మీ పేరు శాశ్వతముగానుండున ట్లేదేని మాహాత్మ్యమును జూపి దానికి స్థిరత్వముగలిగింపుడు అనిన, శిష్యా మానవనిర్మిత కార్యము లెట్లు శాశ్వములుగాగలుగును సృష్టియు నశాశ్వత

మైనదియే గదా ? ప్రభావమున వేఱు లేదు ఏకత్వమందు నానాత్వమును గుర్తించుటయే యగునని వచించుచు హస్త మస్తకసంయోగము గావించి వీరయ్యగారి ననుగ్రహించినాడు. నాటనుండి మనదాసుగారి కేకత్వమందు నానాత్వములక్షించు భాగ్యమలవడుటయేగాక యోగసిద్ధిగూడ లభించినది.

నాటనుండి ఆత్మశక్తి నిజదేహమందు సంచారము జేయుచుండు కారణముగ సాత్వికలక్షణములు పొడసూపుటయేగాక నప్పుడప్పుడు మైమరచుటగూడ సంభవించినది. ఈ స్థితియందుగూడ వ్యవసాయకార్యముల నేమరువాడు కాడు. ఒకనాటి యుదయమున బాలభోగ మారగించి దుక్కిదున్నుట కరక కోటేరుతో పొలమునకు బోయినాడు కాని గతరాత్రి కొద్దివర్షము పడుట దున్నుటకు వీలుగామి బీటినేతకు వృషభములవిడచి యొకతుమ్మచెట్టునీడ నధివశించి శ్వాసలమండగింప జేసి ఖేచరీముద్ర నాశ్రయించి నిశ్చంచలతవహించి సమాధినధిగమించిరి. ఎద్దులు బీటినేతగొని తృప్తిబడి యందుండి బయలువెడలి యిల్లుజేరినవి. తండ్రి బాపయ్యగారరుదెంచి వృషభముల వెంట గుమారుడురామి విచారించి యెద్దులగట్టివేసి పుత్రనిరాకకై యెదురువారాచి చూచి ప్రయోజనముగుపడమి బయలుదేరి జిరాయితిప్రదేశమున కరిగి అందు నిశ్చలుడై సమాధిసుఖ మనుభవించుచున్న కుమారునిజూచినాడు. తుమ్మమొద్దుపై విస్సాలవిడిగా చిరుగు లాగున వాని శరీరముపై గండుచీమలు వేలకొలంది విహరించుటగూడ. గాంచినాడు. దిగ్భ్రమునుబొంది పుత్రుని జేరి

తన పైవస్త్రముతో జీమల దులుప మొదలిడినాడు. ఈ సంఘటనతో వీరయ్యగారు బహిర్ముఖులై చినగవ్వుతో గతరాత్రి నిదుర లేని కారణమున నిద్రవచ్చినది అని లేచి బీజీకై జను చుండ జూచి బీట నెద్దులు లేవు ఇంటికివచ్చినవి రమ్ము పోద మని చెప్పుచు బుత్రునితో నిల్లుజేరినారు బాపయ్యగారు.

పుత్రు డనుభవించినది నిద్రసుఖముగాక సమాధిసుఖ మని గ్రహించినవాడగుట నాటనుండి వ్యవసాయమును మాన్పించి అందు మఱిరెుకని నియమించి పుత్రుని ఆధ్యాత్మికసాధనమునకు సంపూర్ణదోహద మొసంగినారు. బాపయ్య గారు నాడు మొదలు వీరయార్యులు సత్తెనపల్లిజేరి గురుసేవ జేయుచు నాధ్యాత్మికరహస్యము లెఱుంగుచు సంతృప్తులగు చుండిరి.

ఇట్లుండ బీరోజీగారికి సంజువ్యాధి యంకురించి యంత కంత కతిశయించుచుండె మందులు పనిజేయుట లేదు. కంటికి రెప్పవలె గురువుగారిని కనిపెట్టియున్నాడు వీరయ్య 8-7-1886 సంవత్సర ఉదయం 8 గంటలకు తండ్రివద్దనుండి యుత్తరము వచ్చినది చూచినాడు తండ్రి బాపయ్యగారు తీవ్రవ్యాధిగ్రస్తులైనారని తెలిసి దేశికాచార్యానుమతి దీపాల దిన్నెపాలెమునకేగి జనకుని కారోగ్యము సంపాదింప బలు పాట్లుబడుచు, గురువును సమీపింపలేకబోయినాడు 19-17-86 సంవత్సరము నాడుదయు మొనిమిదిగంటలకు బీరోజీ పరమపదమలంకరించినారు.

నాటబగలంతయు వీరయ్యగారు పితృసేవలో నిమగ్నులై యుండుట వలసి రాత్రి పదిగంటలకు పండి కనుమూసిరి. వెంటనే గురువుగా రగుపడినారు నేను హరిసన్నిధిసేవలో మునిగి మైమరచితి నని చెప్పి యంతర్హితుడైనాడు నెంటనే మెలకువగొని స్వప్నవృత్తాంతము దండ్రికెఱింగించి సెలవుగొని యప్పుడ బయలుదేరి సత్తెనపల్లిజేరి గురువియోగమున కడలుచు గొంతవడి నిశ్చేతనుడై యుండి యెట్లో! మనస్సమాధానమంది అనుయాయులతో గలసి నాడు జరుగవలసిన సమాధికార్యకలాపముల బూర్తిగావించుకొని భర్తృవియోగదుఃఖమున మునింగిన వీరాబాయిగారిని గురుపుత్రులను, ఓదార్చి, విజనస్థలిజేరి గురువియోగమునకు బరితపించుచు దుఃఖాశ్రువులు వెల్లిగొన మైమరచినతరి గురుమూర్తి సాక్షాత్కరించి పుత్రా! మదీయవియోగబాధ కడలుచుంటివి ఊరడిలుము, నేను నిన్నువిడచి యెక్కడికిని పోలేదు. పోవువాడనుగూడా? కాను, మధ్యవచ్చిన శరీరము మధ్యనే పోయినది. దీనికై విలపింపదగదు. నేను శాశ్వతుడ, నీవుగూడ నట్లే శాశ్వతుడవు నీవు జీవన్ముక్తుడవు, నేవిదేహముక్తుడ గాన నూరడిల్లుము మనమిరువురకు గమ్యమొక్కటియే! అని పలుకుచు నంతర్హితుండైనాడు.

అంత వీరయార్యులు మెలకువనంది స్వప్నవృత్తాంతమంతయు స్వీయులకెఱింగించి సంతోషాయత్తచిత్తుండై గురుపల్లె సెలవంది యిల్లుజేరి జననీజనకులసేవయందు జాగరత

గలిగి మెలంగుచు సత్తెనపల్లియందలి గురుకుటుంబమునుగూడ నొకకంట గనిపెట్టియుండె.

పరమార్థాభిలాషియగుట బ్రహ్మచర్యవ్రతమున కడ్డగు నని యెంచి పితరులయాజ్ఞ నిరాకరించి వీరయార్యులు వివాహము మానుకొనినాడని యెఱింగి గురుపత్ని మీరాబాయిగా రేతెంచి గురువర్యులు సాగించిన సాంసారికయాత్ర శాస్త్రదూష్యము గాదని తెలిపి సమ్మతిపరచి "వెంకటనరసమ్మ" అను అనుకూలకన్య నొకరితెనుగూర్చి వీరయ్యగారికి వివాహము గావింపించినారు. అనుకూలవతియగు భార్యతో గలసి మెలసియుండి ఒకేపుత్రికాజననముతో నాత్మసన్యాసదీక్ష గైకొని జీవితాంతమువఱకు బ్రహ్మచర్యవ్రత మనుష్ఠించిన ధీశాలి మన వీరయార్యులు.

నాటనుండి వీరిదృష్టి నిజపాదాంగుష్ఠమున లగ్నమై చెదరక నిలచినది. మితభాషి, నిరాడంబరి బ్రహ్మావలోకనాదక్షుడు గురువుగారి సమాధి కధ్యక్షతవహించిన లక్ష్మమ్మజీ గారికి నంజువ్యాధి యంకురించినది పెదగోవిందరావుగారితో గలిసి గురుపుత్రుని పిఠాపురమునకు దీసికొనివెళ్ళి మందిప్పించి నానుగాని రోగశాంతి లేదు. లక్ష్మమ్మజీగారి యభిమత మెఱింగి వీరయ్యగారు తత్పీఠాధిపత్యము వహించిరి. లక్ష్మమ్మజీయనంతరము గురుపత్నియగు మీరాబాయిగారి సహాయముతో నాశ్రమకార్యముల దిద్దుచు నభివృద్ధికి దెచ్చి స్వీయకృషితో గీర్వాణాంధ్రభాషలభ్యసించి ఆశుధారాకవిత్వమలవడ గురుపరముగ గేయపద్యములు విరచించి పవిత్రజీవితము సాగించి పిదప

దేశికాచార్యులమనుమడు పీరోజీబాబుగారికి మఠాధిపత్యమొసంగి దుందుభిసంవత్సర కార్తీక శుద్ధ పంచమి (9-11-22)హరి నామస్మరణతో బరమపదమలంకరించినాడు వీరయార్యులు.

నిర్యాణాత్పూర్వమే తనకు జరుగవలసిన యుపర్క్రియల నిరూపించి చెప్పుచు గురుప్రదత్త యచలాద్వైతగ్రంథమునొద్ద యుంచుకొని మననముచేయుచు సంపూర్ణ వివేకముతో దేహమువదలినారు భార్యా వెంకటనరసమ్మగారు నాకేమి సెలవిచ్చినారన ఐహికమే లేదు. సర్వవ్యాపకమైన సచ్చిదానంద పరబ్రహ్మముమాత్రమున్నది దాని ననుభవింపుచు జీవితము సార్థకపరచుకొమ్మని సెలవిడినారు. పునర్దర్శనభాగ్యము లేదుగదా ? అని ప్రశ్నించిన పత్నికి నేశాశ్వతుండ గురుసేవా పరాయణుడనై అదృశ్యాకృతితో, గురుసమక్షమం దుండెద నప్పుడప్పుడు నీకుమాత్రము నాదర్శనములభించుగాక.

వీరయార్యుల భౌతికశరీరము బాబుగారి సమాధియెదుట పీరోజీమఠమునందే సమాధిగావింపబడినది. విధనిషేధదూరుడైన యినగంటి పున్నయార్యులు వీరి శిష్యకోటిలో నొకను.

ఒకప్పుడు గురువుగారింట బెలుగుచుండు శునకంబొండు తలవని తలంపుగా వచ్చిన దానిని తనయిష్టదైవమునకువలె భావించి పాదప్రక్షాళనాది సత్కారములగావించి రెండు దినసముల కావల దానిని వెంటబెట్టుకొనివచ్చి గురువుగారి కప్పగించిన ధన్యజీవి. ఈ సంఘటనమువలస శ్రీవారి గురుభక్తి యెంతటిదియో ? తెల్లమగుచున్నది.



# చిదంబరమిళ్ల సుబ్రహ్మణ్యముగారు

గతజన్మమున యోగసిద్ధిగడింప యత్నించి పూర్తిగాని మరుజన్మమున దత్సిద్ధికొఱకు పుణ్యాత్ముల గృహమం దుద్భవించి పనిగొని మానవుడు ధన్యుడగుచున్నాడు.

వీడు ప్రతిబంధముల నన్నింటిని క్రమముగ దాటుచు గోట్లకొలది జన్మములసాగించి చివఱకు యోగభ్రష్టుడై పుణ్యుల గృహమునం దవతరించును. ముక్తికి సాయపడు సమస్తసాధనములు దమంతదామె వీని వెన్నంటును యతిరాజని పిలువదగినవాడితడే, వీడే; పరబ్రహ్మముతో గలిసి యేకరూపమున్నొందిన పరమధీరుడు వీడే; చిత్తమునకుగల యవిద్యావరణము దొలగినవాడు వీనియందు చిదాకాశ మస్తమించినది వీనికి శబ్దాతీతమగు సుఖములభించినది, వీనిని వర్ణించుటకు భాషచాలదు ఈతడే, వర్తమానశరీరధారియైన సచ్చిదానంద పరబ్రహ్మము.

ఇట్టివాడే" మన చిదంబరమిళ్ల సుబ్రహ్మణ్యముగారు. తల్లి అంబమాంబ తండ్రి నరసయ్య గురువు అద్దంకి తాతాచార్యులుగారు. జననము క్రీ॥ శ॥ 19 వ శతాబ్దము. వీరిప్రధాన రచన వేదాంతసారసంగ్రహబోధిని. నివాసము దుర్గిధర్మవరము.

ఈమహాత్ముని తల్లి తండ్రులు చదువుకొఱకు బడికి బంపినారు సంవత్సరము వెళ్లులోపలనే చదువుపూర్తిఅయినది పూర్వజన్మాభ్యాసపటిమ తోడ్పడిన మహాత్ముల చరిత్రలు చిత్రములగునుగదా ? పంతులుగారి వలన జెప్పబడిన పాఠ

ములు వినుటయే గాని తిరిగి దానిని వల్లనవేయుటగాని మనసిం చుటగాని యెఱుంగనే" యెఱుగడు బడిలోనున్న కాలమం తయు మౌనవ్రతధారియై యుండునుగాని కోడిపిల్లలతో మాటలాడుటగాని ఆటలాడుటగాని దెబ్బలాడుటగాని నెయ్యాల "నోగువిప్పుటయే." యెఱుంగడు ఈకారణమున నందఱి చేతను "మొద్దబ్బాయి" అని పిలువబడుచుండువాడు. పంతులు గారు కోపికాడు కాని లేకున్న, దినమునకెన్నితిట్లు ఎన్ని దెబ్బలుపడుచుండువాడో ? దేవునకెఱుక.

ఒకనాడు పంతులుగారు నరసయ్యగారిని కలిసి అయ్యా మీ అబ్బాయి నేనిడిన పాఠమెట్లో? పెదవులబెట్టుకొని యొప్ప గించునేగాని పాఠపాఠములు వల్లింవడు నెత్తిన నోరుబెట్టుకొని కేకలువేసినను నోరెత్తడు పాఠములు చదువకుండిన బోనిమ్ము తోటిపిల్లలతోనైనను మాటలాడడు పాఠములు జదువు మన్న వ్వాడు పుస్తకము వైపునకు దన జూపుద్రిప్పి మొద్దువలె గూరుచుండును. ఈస్థితిలో జదువెట్లురాగలదు నీని నేదండింప జాల మీరలైనను శిక్షించి దారికితెండు అదిమీవలన గాని యెడల బాలముపనిలో బ్రవేశపెట్టుడు యీమందమతి పోవు నేమో ! చూతము అని నొక్కిచెప్పెడి పంతులు మాటవిని నరసయ్య చిరునగవుతో మా అబ్బాయి విషయమైవిన్నాను మేమందఱము నిదురించిన పిదప దీపముయొద్ద గూరుచుండి తెల్లవారువఱకేదో, చదువుచునో, వ్రాయుచునో, పుస్తకము ముందుబెట్టుకొని కూరుచుండునుగాని ఊరకొనుటలేదే. చదు వకపోయిన బాఠము లెట్లొప్పగింత పెట్టగలడు మీ మాటలు

వింతగానున్నయవి. ఐననుమిమ్ములగాదనక ప్రయత్నించి చూచెదగాని నేజదువు లేనివాడనగుట మీారలే యొకపరిదయచేసి, పరీక్షింపుడు అనిన వల్లెయని పంతులుగారు నాటిరేయి పండ్రెండు గంటలకు నరసయ్యగారి యింటికి కేతెంచి యితులకు గనుపడకుండునట్లు దాగియుండి పిల్లవాడేదో! వ్రాయుచున్నట్లు గురుతించి తృప్తిపడి వెళ్లినారు.

పైగనుపరచిన స్థితిని గమనించిన సుబ్రహ్మణ్యముగారెనిమిదవ వత్సరప్రాయమునుండి ప్రతిదినము రేయి, దీపము కడ గూరుచుండి భక్తిజ్ఞానయోగపూరితములయిన పద్యములనో, కీర్తనములనో, వ్రాయుటగాని, నిశ్చంచలుండై ధ్యానసమాధిసుఖ మనుభవించుటగాని జరుగుచుండినదని తెలియుచున్నది.

పదియవ యేటియం దొకనాడు సుబ్రహ్మణ్యంగారు తన నియమనానుసారము దీపమునకెదుటగూరుచుండి ధ్యానానందమగ్నుడైనాడు తెల్లవారినది. తల్లిచూచి పలుకరించినది, కాని జబాబులేదు. భయపడి పర్వెత్తి వెళ్ళి భర్తకు చెప్పినది. అతడు వైద్యునిబిలిచి తెచ్చినాడు. అబ్బాయిచేయిచూచినాడు. నాడిచిక్క లేదు. వదనమునందు బ్రహ్మతేజము విస్తరించుటధ్యానమగ్నుడై యున్నాడని గ్రహించినాడు వైద్యుడు, భయపడకుడని తలిదండ్రులకు జెప్పుచు బిడ్డస్థితిని వెల్లడించి ధైర్యమువారికి గలిగించినాడు. కొంతసేపటికి శైత్యోపచారముతో సుబ్రహ్మణ్యం బహిర్ముఖుడైనాడు. స్త్రీయులుపురుషులును సంతోషించినారు. తదుపరి తండ్రి పుత్రుని గౌగలించుకొని నాయనా! నిదుర

వచ్చినదియా : నిద్రవచ్చిన, మంచముపై బరుండగూడదా ! అన్నాడు. జబాబు లేదుగాని నవ్వు మొగముతో దలయూచి నాడు సుబ్రహ్మణ్యము లోకులీతడు యోగభ్రష్టుడగుట వదిబూర్తి జేసికొనుట కవతరించిన జ్ఞానమూర్తియని జెప్పికొన సాగినారు తెలియనివారు కొందరు జీతనికి రోగమని పరితాప పడుచుండిరి. ఈస్థితి రెండు, మూడు రోజులకొకమారు వచ్చుటయు వచ్చినప్పుడు రెండుగంటలుండుటయు సంభవించుచున్నది. ప్రాకృతవిద్య సన్నగిలినది. పరవిద్య బలపడినది. అబ్బాయిగారికి పండ్రెండుసంవత్సరములు నిండినవి. బడికి పోవుచునే యున్నాడు నవరాత్రములు వచ్చినవి పిల్లలతో గలిసి గడలుపట్టుకొని గోపాలస్వామ్యాలయమునకు బోయినాడు.

పిల్లవాండ్రెల్లరు శ్రీ స్వామివారిపై దసరాపద్యాలు చెప్పుచున్నారు. గాని అందు సుబ్రహ్మణ్యము పాల్గొనలేదు గ్రామపెద్దలామహోత్సవము జూడవచ్చిరి. పక్కనభాగస్థుని సుబ్రహ్మణ్యమునుజూచి యెగతాళిజేయుచు, నీవు జదువవేమి మూగ మొద్దుగా నిలువబడినావా? చదువు.చదువు, మని గద్దించినారు.గానిమాట్లాడలేదు. అప్పుడు పంతులుగారువచ్చి చేతులుబట్టి నా మర్యాద దక్కించుమని నొక్కిచెప్పినాడు. సమ్మతి జూపుచు బిల్లలనాపి నూటయెనిమిది ప్రార్థనారూపకందపద్యములాశువుగా " కేశవ " మకుటముతో జెప్పి గోపాలునర్పించినాడు. ఈచిత్రము జూచి చూపరు లాశ్చర్యపడినారు తెలిసి తల్లి దండ్రులును సంతోషించినారు.

తన యాధ్యాత్మికసాధన యిష్టదేవతాలయమున సాగింపదలచి తల్లిదండ్రుల మెప్పించి అపరరాత్రి బయలుదేరి గోపాలస్వామివారి యాలయమునకేగి ముఖద్వారముకడ నిలచి భక్తిపెంపున స్వామిని ప్రార్థించినవెంటనే తదాలయపు తలుపులు బిగింపబడినవైనను గోపాలుని దయవలన దాళము లూడిపడెడివి. సుబ్రహ్మణ్యములోన బ్రవేశించి స్వామిని దండకరూపమున ప్రార్థించి ప్రసన్నుని గావించుకొని ప్రభునాన స్వామివారి కెదుట గూరుచుండి నియమితకాలమువఱకు సాధన సాగించి తృప్తుడై నిజగృహమున కేగువాడు. ఇట్లు కొన్నిరోజు లేగిన దాను స్వయముగ బిగించిన తాళములూడి తలుపులు తెరువబడియుండుట శంకించి దొంగనుబట్టు తలంపున మామూలుప్రకారము దలుపులుబిగించి ఆ యాలయావరణము నందొకమూల దాగియున్నా డర్చకుడు నియమితకాలమునకు సుబ్రహ్మణ్యముగారు వచ్చిరి. స్వామిని ప్రార్థించిరి. తాళాలు తెగిపడినవి. ఆలయములో బ్రవేశించి జపముముగించుకొని యింటికేగినాడు దాసుగారు.

ఇదియంతయు స్వయముగాగాంచిన యర్చకుడు మరునాటిరేయి ధర్మకర్తను వెంటగొని మఱి ముగ్గురు స్నేహితులతో దేవాలయావరణమునగల రహస్యస్థలమున దాగినాడు. నియమితకాలమునకు సుబ్రహ్మణ్యముగా రేగిరి. ప్రయత్నమేమియు లేకయే తాళములూడిపడి తలుపులు తెరువబడినవి. లోనికేగినాడు స్వరచితగీతములతో స్వామిని ప్రార్థించినాడు.

గాని ప్రసన్నుడుగా లేదు తన గుట్టెఱుంగుట కితరు లేవు రాల యావరణమందు దాగియుండినటు లంతర్వాణి ప్రబోధమున నెఱింగినాడు. ఆలయప్రదేశమంతటను నదకి యొకచో వారిని జూచినాడు చూచి "మీ కేమిపిచ్చియా, పొండు పొండు" అని వారిని మందలించి తిరిగి కోనెలలో జేరి స్వామిని బ్రస న్నునిజేసికొని తత్ప్రసాదమున నియమితకాలమువఱకు సాధన సాగించి కృతార్థుడై ప్రభువాజ్ఞ స్వగృహాప్రవేశియైనాడు.

అంతకు ముందు తనకొఱకై గాచియున్న పురవాసి యొకడే తెంచి మీ యాధ్యాత్మిక సాధనమున కంతరాయము గలిగింప యత్నించిన మూర్ఖులు నల్వుర కున్మాదవ్యాధి సోకినది తన్నివారణ మర్థించుచున్నారు దయచేయుడని ప్రార్థిం చుట, కనుమతి బ్రకటించి భగవానుని చిత్రచక్షుమునకల రుచు వానిసెంటజని భగవత్ప్రసాదతీర్థముల నున్మాదగ్రస్తుల కిడి నంత వ్యాధివిముక్తులై క్రమముగ సంపూర్ణారోగ్యమతు లైనారు. నాటనుండి జీవితాంతమువఱకు దీర్థప్రసాదములతో నివారింపజేసిన శారీరికమానసికవ్యాధులు వేలకు మించి యున్నవన నతిశయోక్తిగాదు ఇప్పటికిని శ్రీవారి సమాధికి గావించెడి ప్రదక్షిణ ప్రాణాచారములతో నెమ్మతించెడి వ్యాధులు లెక్కకు మిక్కుటముగనున్నయవి.

క్రమక్రమముగ దాసుగారి కిరువదవయేడువచ్చినది. బ్రహ్మచర్యవ్రతముచే జీవితముగడుప వలయునను సంక ల్పము గలిగినది. గాని గురువు తాతయాచార్యులవా రదు

దెంచి నైష్టికబ్రహ్మచర్యవ్రత మత్యంతకఠినమగుట భక్త లోకము గార్హస్థ్యబ్రహ్మచర్యమునే యవలంబించి తరించినదని జెప్పియొప్పించి సుబ్రహ్మణ్యమును గృహస్తునిగావించిరి. వీరి మునిమనుమడగు సుబ్బయ్యగా రన్నివిషయములయందును తాతగారితో దీటయినవారు. ఈ సుబ్బయ్యగారిభార్య సజీవి.

మన సుబ్రహ్మణ్యముగారు వ్యవసాయవృత్తితో జీవయాత్రసాగించుచు పునరావృత్తి రహితశాశ్వత బ్రహ్మపద మలంకరించిరి వీరి వలన జేయబడు వ్యవసాయకాలములో నొక విచిత్రసంఘటన జరిగినది పండిన వరిగచేను కోయుటకు త్రిపురాంతకమునుండి కూలీలు వచ్చినారు. తానొద్దనుండి కోత మొదలుపెట్టించి భోజనమున కింటికివచ్చినారు. సుబ్రహ్మణ్యం గారు కూలీలలో నాయకుడు పురుషోత్తమదాసను పంచముడు గలడు. ఇతడంతరంగభక్తుడు. మనస్సు భగవంతునకర్పించి శరీరము వరిగెకోతకు నియమించినాడు. కోటికూలీలందఱు నాయన ననువర్తించిరి.కోతజరుగుచున్నది.భగవన్నామముతో దిక్కులు మారుమ్రోగుచున్నవి. గట్టుగనుమ లేవియు వారికి దెలియుటలేదు. వంచిన నడుములెత్తకుండ పనిసాగించు చున్నారు. భూస్వామిగట్టుదాటి కాడిగట్టునగల యితరరయితు భూమి చివరకుపోయినది. మునుము, సుబ్రహ్మణ్యముగారు వచ్చి కోతనాపి మందలించిన పురుషోత్తమదాసు నమ్రుడై తన మనస్సు భగవంతునివైపునకు దిప్పుకారణముగా హద్దు మీరితిననియు దననసుసరించి అనుయాయులు పనిగొనుట

ప్రమాదముజరిగినదనియు జెప్పుచు క్షమాపణముగోరిన సుబ్రహ్మణ్యముగారు పురుషోత్తమునకు నమస్కరించి నీవునాకొక దేశికాచార్యుడవైతివి యిప్పటి నీమనోవృత్తి ననుసరించి ధ్యాననిష్టసాగించి ధన్యుడనగుదునని వచించి ధ్యానసమాధి నార్జించినాడని చెప్పెదరు.

ఈ పురుషోత్తమదాసు పుట్టుపూర్వోత్తరము లేమియు దెలియవచ్చుటలేదు. లభించిన రెండవసంపుటమున జేర్చి ధన్యుడనగుదునని మనవి.

సుబ్రహ్మణ్యముగారిచే రచింపబడిన గ్రంథములు

1. కేశవశతకము (ఆశుధార)
2. సగుణనిర్గుణతత్త్వకందార్థములు
3. గోపాలశతకము
4. గోపాలశతకము (నిందాస్తుతి)
5. త్రిలోకవందితశతకము
6 చిత్రాశతకము
7. భక్తివశవర్తినీశతకము
8. విజ్ఞానదండకము
9. నీతిబోధ (సూత్రాలు)
10. వేదాంతకీర్తనలు

శ్రీవారు తనయెనుబదవయేట పరమపద మలంకరించిరి.

—

# ఉన్నవ ఆనందరామదాసుగారు

నిత్యనైమిత్తికాది కర్మలు నియమముగ నెరవేర్చుచు నాధ్యాత్మికదృష్టిగలిగి "నే నెవడను, ఎందులకు వచ్చితి, ఏమి చేయుచున్నాడ, ఎవనియాజ్ఞ మెలగుచున్నాడను, ముం దెక్కడికి బోవలె" మొదలగు విషయముల దర్కించి, తర్కించి తెలియని రహస్యముల బెద్దలవలన నెఱింగి తెలిసిన విషయముల మరువక గ్రమముగ స్వానుభవమునకు దెచ్చుకొనుచు, యమనియమాదుల బరిశుద్ధమానసుడై సత్యశౌచాదిసద్గుణ గణముల నార్జించి స్వార్థబుద్ధి నడంచి పాపభీతిగలిగి, అవ్యయానందమును, సర్వసమ్మతభావమును, నిర్భయత్వమును, నిశ్చంచలచిత్తమును, నిరుపమానగాంభీర్యమును, వాసనాత్రయవినాశమును, సాధించి తాను అనునది, వినునది, పల్కునది, తలచునది, నేను, నాది అనునది వేయేల సర్వము పరబ్రహ్మయొక్కటియే అని తెలిసికొనిన జీవుడే, దేవుడగుచున్నాడు.

ఇట్లే, తనయందు విశ్వమును, విశ్వమునందు దనను, జూచుమహాత్ముడు మన ఆనందరామదాసు. వీరినివాసము బాపట్లతాలూకా చినలింగాయపాలెము. తల్లి వెంకమాంబ. తండ్రి పానకాలుశర్మ. కుమారులు సీతారామాంజనేయులు, ప్రసాదరావు, వెంకటకృష్ణయ్యలు. జననము క్రీ॥ శ॥ 1856 సంవత్సరము, గురువు పోలూరి పాపరాజుగారు.

ఈతడు బాల్యమున భగవల్లీలాదికములగు నాటల, పాటలచే గడపి బడియందుండు కాలమునందు గాని, ఇతర సమయములందుగాని చెడ్డపిల్లవాడనిపించుకొనుటయే కాక వేళకింటికి భోజనమునకు రాక గ్రామబహిః ప్రదేశమందుగల సావడులలోను, ఇతర రహస్యస్థలములను గూర్చుండి గోపాలనామస్మరణజేయుచు దన్మయానంద మనుభవించుచుండువాడు. తలిదండ్రులు ప్రయాసపడి, వెదకి తెచ్చినగాని యింటికివచ్చువాడు గాడు

ఎట్లో బడిచదువు పూర్తియైనది. పానకాలుశర్మగారు కుమారున కుపనయనము గావించినారు. పౌరోహితుడువచ్చి వడుగును గూర్చుండబెట్టి ఆపవిత్రపవిత్రోవా అను శ్లోకమును పూర్తిగా జెప్పి చదివించినాడు. దాసుగారు భక్తిశ్రద్ధలతో జదివి, దీనికి దాత్పర్యమెఱింగింపు డని వినయముతో మనవి జేసినాడు. గాని ఆపురోహితు డర్థముదనకు దెలియదని చెప్పుట, దలయూచి నిరుత్సాహపడక నచిరకాలమున సంధ్యావందనము కంఠస్థము జేసి, అర్థములేని చదువు వ్యర్థమను ఆర్యోక్తి రొంతరవో, కలువరపరుప దృప్తిగొనక, దాత్పర్యమెఱుంగు తలంపుమిన్నుముట్ట సమయమున కెదురుజూచుచుండె. దాసుగారికి బదునైదవయేడు వచ్చినది ఏండ్లుపైబడుకొలది విజ్ఞానభాగ్యము రేకెత్తుచున్నది. జ్ఞానాజ్ఞానులకు జనుపుత్రి నిమిత్తము లేదనుట సర్వులెఱింగినవిషయమే గదా. నేనెవడను, తల్లిగర్భమున బ్రవేశించుటకు ముందు నాకీదేహముగలదా,

లేదుగదా, అటులైన నీ దేహమెట్లువచ్చినది. ఎందులకు వచ్చినది దీనిపెంచుచుండువాడెవడు ముందొకప్పు డీదేహము లేని స్థితి నాకేర్పడవచ్చునుగదా! దుఃఖముల కాకరమగు యీ దేహము రాకుండగ జేసికొనుట కేదేని యుపాయము గలదా మొదలుగాగల ప్రశ్నల దనలో దా నూహింపుచు సమాధానముల జెప్పుకొని సంతసపడుటయో, సరియగు సమాధానముల రామి పరితాపపడుటయో, జరుపుచు ఎట్లో కాలము నెట్టివేయుచుండె, ఇట్లుండ వివాహమైనది. భార్య బాపమాంబ కాపురమునకు వచ్చినది.

ఇరువదేండ్లవాడైనాడు, దైవాద్యావిజ్ఞానశిరోమణి యగు పోలూరి పాపరాజుగారరుదెంచి దాసుగారి జిజ్ఞాస నెఱింగి ఆతడడుగు ప్రశ్నములకన్నింటికిని దగు సమాధానము లిడి సందేహములదీర్చి సంధ్యావందనమునకు దాత్పర్యము విశదముగావించి నాయనా! నిత్యకర్మల గొరవడనీక ముగించు కొనుచు నైమిత్తికములయందశ్రద్ధవహింపక సక్రమముగ సాగించుచుండిన జిత్తశుద్ధిగలుగు దద్వారా గాయత్రీమహా మంత్రోపాసన సిద్ధించు, గాయత్రీమంత్రసిద్ధి లభించిన వెంటనే నీప్రయత్నమేమియు లేకయే సప్తకోటి మహామంత్రసిద్ధి కరతలామలకమగు దాన యవ్యక్తోపాసనమలవడి పునరావృత్తి రహిత శాశ్వతబ్రహ్మలోకప్రాప్తి లభించి ప్రత్యక్ష సచ్చిదానందస్వరూపివై యలరారగలవు. ఇదియే స్థితప్రజ్ఞస్థితి. అని సాదరముగా విశదపరచిన గురువుగారితో "అయ్యా మఱి

యొకమనవి. పిన్నటనుండి వీడికి శ్రీరామకృష్ణనామమునుపై నభిమానము మెంతు భవదీయాజ్ఞ ననుసరించి గాయత్రీ జపము సాగించిన నిష్టమూర్తిని నిరాకరించినట్లుగు నేమో! అని శంకించెద ననుటయు, జిరునగవుతో! బిడ్డా! గోపాలమంత్రోపదేశము గావించెద గోపాలగాయత్రీమంత్రములలో నీ కభిమానముగల మంత్రమును ప్రధానముగా జేసికొని మిగిలిన మంత్రమను సంధింపుము అనుసంధానమంత్రమువలన ప్రధానమంత్రమునకు బలమేర్పడి త్వరలో సిద్ధిలభించు దాన గృతార్థడవయ్యెదవని తెలిపిన సంతసించి పనిగొని దక్షిణలచే దేశికాచార్యుల సత్కరించి సబహుమానముగ నంపి గ్రమముగ మంత్రద్వయసిద్ధి గడించినారు దాసుగారు.

దాసుగారి గృహములోని వాతావరణ మనుకూలముగా నుండకపోవుట గారణముగ సాంసారికచిక్కులలో దగుల్కొననివాడై యెక్కువకాలము మౌనదీక్షవహించుచును కొంతవఱకు బ్రియశిష్యులచే క్లేశకారణముల విదల్చుకొనుచు తనబ్రహ్మనిష్ఠను నిర్బాధకముగ సాగించిన పుణ్యమూర్తి అపకారుల కుపకారములు జేయుస్వభావముగలవాడగుట దన కెవనివలన నెట్టియాపదవచ్చినను సహించి మహోపకారములనే కావించుచు,

పరులునిందించుపట్ల గోపంబుగొనక
శాంతమునుభూని వినయపు ష్కతలనూని
ఖిహితసంభాషణంబుల వెలువరించి
స్వాంతమా? వారిసంతస పఱుపుసతము.

అనుసమర్థుని వాక్యానుసరణి బనిగొని తృప్తిపడుచు నహంకృతి నడంచుకొనిన సత్యమూర్తి. దాసుగారు ప్రాణాయామసిద్ధివలన జిత్తైకాగ్రత సంపాదించి తద్వారా బ్రహ్మైవ లోకనమహాభాగ్య మలవడ సర్వశక్తిసంపన్నుండును నిరాడంబరజీవియునగుట దత్తన్మహాశక్తుల శిష్యకోటి కందించుచు సాధుజనవంద్యుడై విరాజిల్లిన యశోవిశాలుం డానందరామదాసు వీరి శిష్యకోటి శతాధికము అందు ముఖ్యులు ప్రతాప రామావధాని, కృష్ణమూర్తి, బాణాల భద్రయ్య, మాదిరెడ్డి వీరభద్రరావు, భాగవతుల కృష్ణదాసు, కుసుచేటి వరదమ్మ గార్లు ముఖ్యులు.

దాసుగారు తన డెబ్బదియవయేట నొకనాడు వివిధ గ్రామములనుండి శిష్యులరావించి గోష్టి సాగించి నేడీభౌతిక దేహము విడచి స్వధామమగు పరమపదమున కేగనున్నాడ గాన వినుండు పరమపద మభిలషించువారెల్ల రే జీవికిగాని కష్టదాయకులు కారాదు. సత్యదీక్ష వహించి ధన మార్జించి ధర్మకార్యములకై వెచ్చింపుచు గామక్రోధములకు లోనుగాక భూతమైత్రి సంపాదించి నిష్కాపట్యధారులై నిర్భయస్వరూపులై అసూయారహితులై వర్తించుటముఖ్యము.

ఈ గుణము లలవడనిచో ఆత్మానాత్మవస్తువివేకము ఇహాముత్రార్థఫలభోగవిరాగము శమాదిషట్క సంపత్తి ముముక్షుత్వములను సాధనచతుష్టయసంపత్తి లభ్యపడదు.

ఇవిలభింపనిచో ముక్తి దుర్లభము, కేవలభగవన్నామసం కీర్తనముచే ముక్తినార్జింప దలంచినవారుగూడ యమ నియ మాదులు గష్టించి సాధించిననే యిష్టార్థసిద్ధి లభించుట, లేనిచో గగనపుష్పమేయగు మీలో నేను, నాలో మీరుస్వాను భవమున దోచుటయే? అద్వైతసిద్ధి ఈసిద్ధిని బాహ్యమునకు జూపుటయే, సన్యాసము మరణకాలమందు గ్రహించునట్టి ఆశ్రమస్వీకారమున కాతురసన్యాసమనిపేరు ఇప్పుడు నేను మానసికముగ సన్యసించితి గాన మీరంద ఱైకకంఠముగా భగవన్నామసంకీర్తనము గావింపుఁడు, అనిబోధించి శిష్య బృంద మనువర్తింప భజనచేయుచు క్రీ॥ శ॥ 1935 సంవత్సర మందు వచ్చిన భాద్రపద శుద్ధ తదియరోజు జీవబ్రహ్మైక్య మును పొందినారు వీరి కుమాళ్ళయం దిటువురు సత్సంతాన సంపదలతో దులదూగుచున్నారు.



# మాల ఓబులు.

మానవుడు తనకులభించిన ధర్మక్షేత్రమైన మానవ దేహమును బూదియందు ద్రేల్చబడిన నేతికివలె వ్యర్థ పరచు కొనుచున్నాడు. ఇందునకు గారణము స్వీయధర్మమును విడి పరధర్మమనుష్టించుటయేయగు జీవితగమ్యము గ్రహింపగలి గినచో, హృదయమం దానందమును గృహమునందు దృష్టి దేశములో వృద్ధి లోకములో శాంతి లభించితీరును. ఈ శాం తియే మోక్షము మానవగమ్యము బ్రహ్మసాక్షాత్కారము ?

అపరోక్షానుభవముతో, మోక్షమును చవిజూచు టయే, అన జన్మరాహిత్యము జేసుకొని స్వస్వరూపానంద మనభ వించుటయే, పునరావృత్తిరహితశాశ్వతబ్రహ్మపదము కాని సామాన్యమానవుడు ఆత్మవిచారణాశూన్యుడై దుర్లభమైన మానవజన్మ తనకెందుల కెవనివలన నీయబడినదో, తెలిసి కొన జాలకున్నాడు, నిత్యసత్యుడైన దైవమునుమరచి అనిత్య ములైన విషయూల వెంటనంటి సంసారసాగరమునమునిగి పోవు చున్నాడు. అస్థిరమైన దేహమే తాననుకొనువాని కీగతిగాక శాశ్వతసుఖమెట్లు గలుగును? నిజముగ నాత్మవిచారణసేయు వాడు కోటికొక్క డేనియు దొరకడు వీడు స్వాత్మపరీక్షగావించు కొనుచు దానుగమ్యము వైపునకు బయనముసేయుచున్నదియు లేక నధోగతిమార్గముబట్టినదియు దెలిసికొనగలడు. తన ప్రస్తుతస్థితి గ్రహించినప్పుడే, భావిస్థితి వృద్ధిజేసుకొని తరింప వచ్చు కాలమమూల్యము చిందిపోయిన పాలకై చింతింపక

తమమానవధర్మము నిలబెట్టుకొన బ్రయత్నించి కృతార్థులైనవా రన్నిజాతులయందును కలరు. వీరలలో మన మాలఓబు లొకడైయున్నాడని నుడువుభాగ్య మబ్బినందల కెంతయు గర్వించుచున్నాడ.

ఈతని నివాసము కడపమండలమునందలి ఒంటిమెట్ట. తల్లి పేరు౦దేవి. తండ్రి మునిస్వామి క్రీ. 19వ శతాబ్దము ఈ దంపతుల కినుప తునక చెకుముకిరాయికి నగ్నిపుట్టినట్టుల మన ఓబులు పుట్టినాడు ఈతడు దినదినాభివృద్ధినందుచుండి పరిపూర్ణయౌవనవంతుడైనాడు తరుచుబురాణములు జరుగు స్థలములకు హరికథలుజరుగు ప్రదేశములకు భజనలుజేయుచుండుపట్టులకుబోయి తత్కాలక్షేపముల రేలంతయు గడపుచు బగలు వ్యవసాయదారుల పనిపాటలకు గూలికేగి ద్రవ్యమార్జించుచు ఇటులిహమును అటు పరమునుగూడ సంపాదించుకొనుచున్నాడు. సత్కాలక్షేపములలో బాల్గొనుటచే నోబనికి భక్తిజ్ఞానము లలవడినవి.

నేను ఎవడను, ఎందుకుబుట్టితి. పుట్టినవారంద ఱేమగుచున్నారు. నేను, పరమాణువునని, జ్ఞానానందస్వరూపుడనని, పాపరహితుడనని, శాశ్వతుడనని, ముసలితనమును చావును లేనివాడనని, నిత్యుడనని, శోకరహితుడనని, ఆకలిదప్పులు లేనివాడనని, సత్యకాముడనని, సత్యసంకల్పుడనని, శాస్త్రములు చెప్పుచున్నయవి నా కింద్రియములే లేవట లేని నెట్లువచ్చినవి. ఆకలిదప్పులేల నన్ను బీడించుచున్నవి. పరమాణువుగానుండు నా కింతటిదేహ మెట్లువనచ్చినది. ఎందులకువచ్చి

నది ఈ లక్షణములు నావిగావు. దేహలక్షణములు నేను; దేహినిగాని, దేహమును కాను. ఇంటిగోడకు సున్నముగొట్టిన యింటనున్నవానికి సున్నముగొట్టినట్లగునా! ఇంటిగోడను త్రివ్విన నింటనున్నవాని దవ్వినట్లగును ఇల్లు పడి పోయిన నింటివాడు పడిపోయినట్లగును. ఇల్లుకాలిన నింట గలవాడు కాలినట్లగు అ తెలిసినది. ఈ యిల్లు నాదను కొనుటచే నింటికి దగిలినవన్నియు నాకు దగినట్లే! అభిమాన ముచే ననుకొనుచున్నాను దీనికి గారణము లహంకారమమ కారము లే! దేహము, నేను కాదు. శాశ్వతుడ ఈ దేహమో! అశాశ్వతము, నాకింతకుముందటి దేహములు, రాయిగానో, చెట్టుగానో, పశువుగానో ఉండెనట. పుణ్యాత్ములు నాపై బసుండుట చేతను దేవునకు టెంకాయ గొట్టుటలోనగు పుణ్య కార్యముల నన్నుపయోగించుట చేతను రాతిజన్మముబోయి వృక్షజన్మలభించెను. వృక్షముగా నుండునపుడు పుణ్యాత్ములు నా నీడను నిల్చి గాలిపీల్చుట చేతను నా ఆకులు, పూవులు, కాయలు, పండ్లు నుపయోగించుట చేతను దిక్కులేని పక్షుల కాశ్రయము నై యుండుట చేతను నఱికినను పరులకపకారము గావింపకుండుట చేతను వృక్షజన్మము విడచి పక్షిజన్మవచ్చినది. పపుణ్యోదయము చేతనో, రామ, రామ, అనుట చేతనో, పక్షి జన్మముపోయి పశుజన్మవచ్చినది. అందు లభించిన గడ్డిగాద ముల దిని పాలచేతను, పేడచేతను లోకులకు సాయపడు భాగ్యములభించి ఈ మనుష్యజన్మవచ్చినది. తెలిసిచేసినను తెలియకజేసినను పుణ్యపాపము లూరకబోవు మనుష్య

డగుటచే నితరజన్మములయందులేని జ్ఞానమొక్కటి యెక్కువ
యైనది. మనుష్యజన్మ దుర్లభమనుట కిదియే కారణము. ఇట్టి
జన్మము వృథా జేసికొని అధోగతిపాలగుట సరిగాదు. మానవు
నకు దుర్గతులుమూడు. హింస కామ్యకర్మ పరదూషణ ఈ
మూడింటిని వదలి భగవంతునాశ్రయించెద. దన నెవ్వరుమరువ
కుందురో, తాను వారిమరువబోడట ఇది సమర్థునివాక్యము
దీనిననుసరించి ధన్యతగాంచెదగాక. తల్లిదండ్రులసేవ మరువ
కుండెదగాక. అని నిశ్చయపరుచుకొని భగవన్నామమును
జిహ్వాగ్రమునుండి విడిపోనీక గడుజాగరూకుడై మెలంగుచుండె.

ఇట్లుండ గొన్నిదివసములకు చైత్రశుక్లాష్టమి నారం
భించి శ్రీసీతారామబ్రహ్మోత్సవము జరుగుచుండ మనవీబులు
సంజీవరాయుని కోవెలముందు శ్రీరాముని కభిముఖముగ
నిలచి తంబురచిటికలతో శృతిలయలేకము జేసి.

ముఖారి — ఆది

ఎపుడు దర్శనమిచ్చెదో కృపతోడ రఘురామ
అపరాధిననినీవు నెపములెంచకు దేవ ॥ ఎపుడు ॥
జడుడను, బాలుడ, జాల్ముడమత్తుడ
గడుబాపచిత్తుడ, గరుణింపవే, రామ ॥ ఎపుడు ॥
అంజలిముందునే, నంజనాసుతవరద
రంజిలజేసిన, రాదుగానీపుట్టు ॥ ఎపుడు ॥

అని పాడుచు, నార్తుడై భజనసేయుచుండ, ఆతాలూకా
తహాశ్శీల్దారు, నిజసతీసుతులతో, మడుగులుగట్టుకొని, దేవా
లయమునకు బోవుచు, భజనసేయుచుండు వీబులునుగాంచి,

ఉత్సవకాలమున స్వామిదర్శనార్థమై వచ్చినవారికి స్పర్శదోష మంటదని, తెలియని వాడగుటయు, జలపాత్రిజేనున్నచో, జండాలాదిస్పర్శన సల్లాపదోషములు లేవని, తెలియని వాడగు టయు, అధికారదోషము నెత్తికెక్కమైలబడితినని, తలంచి, కోపించి భృత్యులచే నోబనిగెంటించె.

అంత, ఓబడు, దనపరాభవమునకు జింతింపక భగవ త్సాన్నిధ్యము బాసిపోవుచు,

ఆనందభైరవి — ఆది

ఇకనాకెవడుదిక్కు, ఇందిరారమణి
ఇకనాకుదిక్కెవ్వరు, రామా, రామా ॥ ఇక ॥
ఇకనాకుదిక్కెవ్వ । రిందఱుజూడగ
ప్రకటితముగనీవే, పదపదయన్నితోయ ॥ ఇక ॥
నీవేనాదిక్కని, నెరనమ్మినందుకు
ఈవిధిమర్యాద, లెసగించితే, రామ ॥ ఇక ॥

రామా ! ఇదియంతయు నీలీల, అని చిరునగవుతో తొలగిపోయి, ఆలయపశ్చిమభాగంబునన్గల తటాకములో నిలుచుండి.

ఆనందభైరవి – ఆట

చేరికొలుతు వీరరాఘవా ! కూరిమిబ్రోవు ॥చేరి॥
ఎంతోబాళివెతలజాలి వంతదూలివిలపించిన
స్వాంతమునను జింతమాని ఇంతగనికరింపవేల ॥చేరి॥

ఇట్లు లోబడార్తిమైభజనసేయుచుండె బ్రొద్దుగ్రుంకినది పవళింపుసేవ ముగిసినది. అర్చకులు స్వామివారికి హారతులిడి

సెలవుగొని, పోదలంచిరి. కాని స్వామిప్రసన్నుఁడు కాలేదు. అర్చకులెట్లో? మనంబుల సమాధానపరచుకొని కోవెలతలుపులు తాళములబిగించి నిజగృహములకేగిరి. ఓబులీశ్వర సాన్నిధ్యము గల్పించుకొని తీవ్రముగ భజనసాగించుచుండె, మాలబాలకులుభజనతో బాహ్యాని దేహముల మరచుచుండిరి. రాత్రి మూడవజా మతిక్రమింపకుండ నర్చకులు లేచి కాల్యకృత్యముల దీర్చుకొని మడుగులుగట్టి స్వామివారి ప్రభాతసేవ సాగించుటకువచ్చి కోవెలతలుపులు దీసి లోనికేగి స్వామివారి సమీపించి నిర్మాల్యవిసర్జనకార్యమున బ్రవేశింపదలచి పనిగొన నుంకింప స్వామివారు పశ్చిమాభిముఖులై యున్నారు. ఈవార్త గ్రామస్థులెఱింగివచ్చి చూచి కారణమెఱుఁగజాలక డిల్లపడిపోయిరి. ఈ చిత్రమరయుదలంపున బరిసరగ్రామవాస్తవ్యులు వందలకొలంది పర్వెత్తివచ్చిరి. ఎందఱు వచ్చి ప్రార్థించినను స్వామిపూర్వాభిముఖుఁడు కాలేదు. పైపెచ్చు నొకయర్చకున కావేశముఖుఁడై నాసన్నిధినుండి మదీయభక్తుని వెడదోవబట్టించినారు. నేనాతని వెన్నంటియుండువాఁడనగుట మీరలెఱుంగరు. ముందు నాభక్తుని ప్రసన్నతమీకలవడిన నేనును బ్రసన్నుడనయ్యెద నని ఖండితముగ జెప్పుటయు, చూపరులా బాలగోపాలముగా భజనలతో దటాకమున దేహముమరచి భజనచేయుచుండు ఓబులును సమీపించి ప్రార్థించి సుముఖునిగావించుకొని సబహుమానముగ తోడ్తెచ్చి సన్నిధినిలిపిన శ్రీరామమూర్తియు పూర్వాభిముఖుండై ప్రసన్నుడైనాడు.

నాటనుండి ఓబులు భజనానందమున దేలియాడుచు భగవత్సాయుజ్యమహాభాగ్యము జూరగొనినాడు ఆతని వంశమువారు నేటికిని బ్రహ్మోత్సవకాలమునందు స్వామి ముందు భజనలు జేయుచుందురు.

మ॥ అమలజ్ఞాన సుదానధర్మరతి సత్యక్షాంతి నిర్మత్సర
త్వముల న్యజ్ఞతపోనసూయలగడున్దర్పించు ధాత్రీసురో
త్తముకంటెన్ శ్వపచుండుముఖ్యుడు మనోర్ధఘ్రాణ
వాక్కర్మముల్
సమత న్నిన్నునయించెనేని నిజవంశ శ్రీకరుండయ్యెడిన్.

మనఓబు లారాధించిన రామమూర్తి ప్రభావము లొకటి రెండు జెప్పి కథముగించెద. కడపనబాబగు హిమాన్ బేగు ప్రతిహిందూదేవాలయము దూరి ఆదేవుని పేరుబెట్టి పిలుచువాడట. దేవుడు మారుపలుకకున్న అందలి విగ్రహముల బీకిపారవేయించువాడట. ఆయాచారము ననుసరించి యొకనా డొంటిమిట్టకేగి కోవెలతలుపులు దీయించి లోదూరి శ్రీరామా! ఓశ్రీరామా! అని పిలచినాడు వెంటనే లోనుండి "ఆ" అనుశబ్దము వచ్చినది విన్నాడు. శ్రీరామమూర్తి పలికినట్లు నమ్మినాడు. వాడును శ్రీరామభక్తుడై తనపేరుతో దేవాలయసమీపమునం దొకభావి త్రవ్వించి జలదానము జేయుటయేకాక బ్రాకారమునకు బురుజులు దిమ్మలు కట్టించి ప్రతిదినము దనపేర దీపము వెలిగించున ట్లేర్పాటు గావించినాడు. ఇప్పటికిని అది హిమాన్ బేగుబావి

అని పిలువబడుచున్నది. వంకలో మఱియొక భావి యేర్పడు వఱకు నీభావినీ రే శ్రీస్వామివారి తిరుమంజనమున కుపయోగ పడుచున్నది.

శ్రీరామాభ్యుదయము రచించిన అయ్యలరాజు రామ భద్రుడు, శిశువుగానున్నప్పుడు తల్లిదండ్రులు తీసికొని శ్రీరామ కోవెలకేగి పిల్లవాని నందొకచో బరుండబెట్టి ఎవరికో డనో చూచుచుండు డని చెప్పి, కోవెలలో బ్రవేశించి భక్తిమై స్వామికి నమస్కరించి కానుకలర్పించి తిరిగి ముందువచ్చి తల్లి చూచిన పిల్లవాడ గుపడలేదు తండ్రి చంకబెట్టుకొని వెళ్ళినా డని తలంచి స్వగృహము జేరినది. తదుపరి తండ్రివచ్చిచూచి శిశువును తల్లితీసుకొని వెళ్ళినదని తలంచి యిల్లుజేరినాడు. భార్యా భర్తలుకలిసి పిల్లవానికై గ్రామమంతయు వెదకి, వెదకి వేసారి భరింపరాని దుఃఖముతో గుంగిపోయినారు. తాము కోవెలలో బ్రవేశించుటకు ముం దెవరితో పిల్లవాని కనిపెట్టియుండు డనిచెప్పిరో వారిని మరచినారు. ఇక జేయున దేమి, దుఃఖము మితిమీరినది. ఇంతలో దెల్లవారినది. అర్చకులు మడుగులై కోవెలలో బ్రవేశించి నిర్మాల్యవిసర్జనకు యత్నింప సీతాదేవియొడిలోనుండి స్తన్యము లారగించు బిల్ల వానిజూచినారు. పరుగెత్తిపోయి పుత్రదుఃఖమున గుందుచు చున్న తల్లిదండ్రులకీవార్తతెలిగింప వారరుదెంచి పిల్లవాని గ్రహించి భగవదనుగ్రహమున కలుగుచు రామభక్తులై వారు గడకు సాయుజ్యముక్తులైనారుగూడా!



దుస్సంగతి పతనకారణము. ఇది కర్మత్రయమున కంటెను బలవత్తరమైనది. దాని దరిజేరనీక దృఢసంకల్పముతో భక్తుడు భజనలసేయును భజనలసేయువాని తాపత్రయములంటవు. భజనబ్రారంభించుటకుముందు సత్సంగతి, సచ్ఛాస్త్రపఠనములావశ్యకములు. నమ్మకముగలిగి పట్టుదలతో ననన్యభక్తియుతముగ జేయబడుభజన భక్తునికి దోడునీడగా సాయబడును. సాధనాకాలములో రోజునకొక భక్తుని జీవితగాధనైనను శ్రవణించుచుండు నియమమేర్పరచుకొనవలయును, భగవచ్చరిత్రలవలన గలుగజాలని మేలు భాగవతచరిత్రశ్రవణమువలన గలుగుననుట నిస్సంశయము భగవంతుని బ్రకటింపజేయజాలినవాడగుట భగవంతునికంటెను భక్తుడధికుడు భాగవతులయందు బ్రీతిగలవానికే భగవత్సాక్షాత్కారము. భజనవలనభగవంతుడు భాగవతునకు దర్శనమిచ్చుటయే కాక జూపరులెల్లరకును దర్శనమీయగలడు. భాగవతుని ప్రార్థనననుసరించి యీపని జరుగును. భగవంతుడు నిజభక్తులకొఱ కవసరమైన స్వీయప్రాణములనుగూడ సమర్పింపగలడు. ఆతడు ప్రేమకు వశ్యుడగుట నారాయణతీర్థులతో గలిసి నృత్యముజేసినాడు. భక్తులయిష్టానుసారము మెలంగుట కాతడు సిద్ధపడియున్నాడు. భక్తసమ్మేళనములందు భగవంతుడు ప్రత్యక్షపరోక్షములతో హాజరగుచున్నాడు. ఇట్టిసమయములం దందఱకుగూడ భగవత్సాక్షాత్కారము

సంభవము, పరిపక్వచిత్తులైన భాగవతులు పలువు రొకచో జేరి భజనలునాగించినపుడే యీపని జరుగును.

ఇట్లు జేరినభాగవతులందఱకు నీశ్వర ప్రేమ శాస్త్రోక్తా చారము గలిగియుండవలయు. వీరందఱకును వైరాగ్య మవ సరముగూడ నిర్మలవైరాగ్యము భగవద్భజనవలననే కలు గును పట్టుదలతో జేయంబడుభజన వలన భగవదాసక్తి గలుగు దీనినే వైరాగ్యమనెదరు. భజనసేయకనే వైరాగ్యము గోరువా డతి మూర్ఖుడని చెప్పినతప్పుగాదు

ఇనుముచే నినుమును గోయునట్లు భగవదాసక్తిచే విషయాసక్తి దూరమగును. కాన మన యాసక్తివిషయముల నుండి తొలగించి భగవంతునిపై నిలుపవలయు. విషయవిము ఖత యేర్పడిన వెంటనే విరామములేని భజనసాగును. భజన వలననే భజనయం దభిరుచికూడ గలుగును. ఇట్టి భజనవలన భగవంతుడు పట్టుపడును, ఇప్పు డుపాసకు డొకనూతనదృష్టి సృష్టించుకొనిన వాడగుచున్నాడు ఈ దృష్టివలన నష్టసిద్ధులు లభించుటయే కాక నిర్వికల్పమునుగూడ సాధించినవాడగు చున్నాడు.

పరిపక్వస్థితి లేనివాడు భక్తుడుగాగాని, జ్ఞానిగాగాని కాజాలడు. భజనవలన లభ్యపడని పదార్థమే లేదనుట అతి శయోక్తిగాదు. ఇట్టి మహాత్మునకే దివ్యబృందావనదర్శనము తత్పవిత్రప్రదేశమున నిరంతరాయముగ జరుగుచుండు దివ్య రాసక్రీడాదర్శనము లభించును. దివ్యదృష్టిగలవారికే యిది సాధ్యము ఈ మహాభాగ్యము గడించినవారిలో నద్దంకి వంశ ట్రాయుడుగా రొకరు.

తండ్రి త్యాగరాజుగారు. తల్లి కోటమాంబ. జననము క్రీ॥శ॥ 1900 హేవళంబి ఆర్వేలనియోగి ప్రథమభార్య మహాలక్ష్మమ్మ. రెండవభార్య పేరు తెలియదు. ఈ భక్తాగ్రణిదర్శన భాగ్యము వీడి జీవితములో మూడుమార్లు లభ్యపడినది: అయ్యవి ఎనిమిదవవర్షప్రాయమున పంగులూరులో జరిగిన రాసక్రీడలోను, రెండవమారు వదునైదవయేట గుండ్లాపల్లిలోను మూడవమారు బాపట్లభావనారాయణ స్వామివారి కోవెలలో జరిగిన రాసక్రీడలోను. వీరు ప్రతి దివసమును మూడు పూటలు భజనానందములో మునుంగు చుండువారు: (1) సహ్యామదీక్ష (2) వినయవినమితసంపత్తి (3) నిరుపమానశాంతి (4) ఆధ్యాత్మికకానుభూతి (5) అహింస (6) సాత్త్వికభక్తి (7) సమత్వము (8) బ్రహ్మావలోకనస్థితి మొదలగునుగుణములు. వీరి యమాల్యాభరణములు ప్రభాతపవళింపుసేవలు. ద్వాదశీపునర్వసు దీక్షలు శ్రీరామకృష్ణోత్సవములు వీరి నిత్యవ్రతములు. అభ్యాగతాతిథిసేవలు సదానుష్ఠేయములు.

తండ్రియనంతరము కుటుంబభారవాహియై కలవగూరులో పల్లెకూటాధిపతియై సీలంరాజుజానకీరామ భాగవతారు గారివలన భాగవతశ్రవణమును, గుళ్లాపల్లి వీధిబడిలో నున్నపుడు మల్లవరపు వెంకటేశ్వరస్వామివారి సమక్షమున గాయత్రీమంత్రోపాసనాసిద్ధియు, పమిడిపాటి వీధిబడిలో నుండుతరి ఓనమాముల జియ్యంగారి వలని నష్టాక్షరీమంత్రోపదేశమును, నందిపాటి పాఠశాలకాలమున దక్షిణయాత్రల

గావించు సందర్భమున లభించిన యవకాశమును ననుసరించి కంచిలో నాలూరి వెంకటాద్రిస్వామివారి వలన శ్రీరామ తారకోపదేశమును, శ్రీరంగపురి శ్రీరంగనాధసన్నిధియం దష్టాదిష్టరీ మహామంత్రోపాసనాసిద్ధియు దద్వారా రంగ నాధ సాక్షాత్కారమును అంత శ్రీరంగాజ్ఞననుసరించి దిరు గుపయనమున గంచిగల శ్రీ వెంకటాద్రిస్వామివారి సెలవంది పునః నందిపాడుగ్రామప్రవేశమును జరిగినవి. ఈయాత్రిలో శ్రీలక్ష్మీనారాయణ షట్చక్ర సీతారామ గోపాల సాలగ్రా మముల శ్రీవారి కనుగ్రహించిన వెంకటాద్రిస్వామివారు శిష్యవాత్సల్యమూర్తులు. తన ముప్పదవయేట భద్రిగిరీశుడగు సీతారామసన్నిధి రామతారకసిద్ధిగడించి భగవత్సాక్షాత్కార మహాభాగ్యమార్జించిన పుణ్యజీవి. వీరికి ధనధాన్యలక్ష్మి దాసియైనదని చెప్పుటకు వెనుకాడవలసిన యవసరముండదు. అనన్యాశ్చింతయంతో మామ్ యేజనాః పర్యు పా స తే, తేషాం నిత్యాభియుక్తనామ్ యోగక్షేమం వహామ్యహమ్" అను భగవద్వాక్యము కార్యారూపముదాల్చినది. రాచక్రీడ వీరిజన్మహక్కు. జీవితములో దాదాపేబది రాసక్రీడల గరుప సాక్షాత్కారముతో బూర్తిజేసిన భక్తాగ్రణి. వీరి రాసక్రీడా మహోత్సవముల దిలకించినవారికి శ్రీవారి గోపికాభక్తి వెల్లడి కాక మానదు. ఈ భక్తి బాపట్లలో జరిగిన క్రీడామహోత్స వములో గుర్తింపగలముగూడ.

బృందావనమున నిరంతరము జరుగుచుండు దివ్యరాస క్రీడయే, దాసుగారి దాసక్రీడ. శ్రీవారు పుత్రుల విద్యకొఱకు బాపట్లనుండుట సంభవించినప్పుడు సర్వధారివత్సర కార్తీకమం

వైకుంఠపుణ్యాదివసమున దన్మహోత్సవము జరుగబడినది. ఇప్పటి దాసుగారివయస్సు డెబ్బదిమూడవయేడు సంజువ్యాధిచే శరీర మంతయు బరువెక్కినది. బలమావంతయు లేదు మంచముపై నుండి లేచి కూరుచుండుశక్తిగూడ సున్నయైనది. భోజనమజ్జ నాదులకై లేచుటకు మఱియొకరి సాయమవసరమైయున్నది. ఈ సమయములో నద్దంకినుండి దాసుగారిని జూచుట కను యాయుడగు తొంటిగడప శేషయ్యవచ్చి రెండు దినములుం డుట దటస్థించినది. రెండవరోజు సంభాషణలో దాసుగా రాత్రితో మిత్రమా! మీసహాయముతో నిప్పటికి షుమారు నలుబదేబది రాసక్రీడలు జరిగినవి. ఇప్పుడు జీవితము ముగిసి నది. తుదిరాసక్రీడజరిపి ధన్యుడనగుభాగ్యము గలిగించి నాముచ్చటదీర్పుము లేవలేనిస్థితిలోనున్నానని శంకింపవలదు. నీసహాయముండిన దప్పక భగవదనుగ్రహము రాగలదు. ఇంతవఱకు నీరాకకై ప్రాణములు చిక్కబట్టుకొనియున్నాడ నీవు స్నేహితుడవు భక్తుడవుగూడ పట్టుబట్టుము తప్పక జరిగి తీరును "యద్భావంతద్భవతి" యను ఆర్యోక్తిరిత్తవోవునా! అట్లైనప్పటికిని జరుగదు. రాగల శుద్ధదశమికి చదలవాడ కేశవు లను పిలిపింపుము చిమటరంగయ్యగారీయూరనే యున్నారు. రెండు మృదంగములతో బ్రారంభింతమని పలుకుచు జివా లునలేచి కూరుచున్నాడు దాసుగారు. లేవలేనిస్థితి యెటు పోయినదో! తెలియదు. కార్డు తెప్పించి శేషయ్యగారిచే కేశ వులునకు త్తరము వ్రాయించి చేవ్రాలు జేసినాడు. మూడవ నాటికాతడు వచ్చినాడు కార్తికశుద్ధదశమి రాత్రి తొమ్మిది గంటలైనది. క్రీడారంగమున కత్యుత్సాహముతో జేరిరి. రాస

క్రీడ ప్రారంభమైనది. వినాయకప్రార్థన జరిగినది. క్రమముగ గోపిక లొకరినొకరు పిలుచుకొని బృందావనము జేరి దేవగాంధర్వ మభినయించుచు శ్రీకృష్ణుని దర్శించి భక్తిప్రపత్తులతో బూజించినారు. పిదప గోపికల మందలించి మీ మీ యిండ్లకు బొండని ఖండితముగ శాసించినాడు. శ్రీకృష్ణభగవానులు కృష్ణవియోగమునకు సహింపక గోపికలు వివశులైనారు. ఇప్పటికి కథ రక్తికట్ట లేదు. సభికు లొకరొకరు బయలు దేరి నిజగృహామార్గములు పట్టినారు. తూర్పారలో దాలెగిరిపోయి నది మెరికెలు నిలచినవి. దాదాపు నూరుమందికి దక్కువ గాని సభికులుమాత్రముండిరి ఇంతవఱకు శేషయ్యగారిచే కథ నడుపబడినది. రంగస్థలమం దస్వస్థులై కూరుచుండి యుండిన సంకటాద్రియుడుగారి యందొక నూతనశక్తి తేజో రూపమున బ్రవేశించినది. ఈ చిత్రము సభికులు కనులారా జూచి యానందించినారు.

వెంటనే దాసుగా రితరులసహాయము లేకుండగనే ! లేచి నిలువబడి, ''దాశరథే'' అని పెద్దకేకబెట్టినారు. ఆధ్వని దిక్కులప్రతిధ్వనింపజేసినది. దీనితో సభికుల మానసక్షేత్రములందుగల భక్తిబీజములు మొలకలెత్తి నిముసములమీద వృక్షములై వృద్ధినంది పూత పిందెకాయలతో విస్తరించినవి. శేషయ్యగారు దాసుగారిపదములకు గజ్జకట్టి చిరుతలు చేతి కిడినాడు. ఇరువురు మనుష్యులు మంచమునుండి లేవదీసి నెమ్మదిగ పట్టుకొనివచ్చి రంగస్థలమున గూరుచుండబెట్టిన దాసగా రితరుల సహాయము లేకుండగనే లేచి ''దాశరథే'' అని కేకబెట్టుటయేకాక రాసలో బాల్గొనినాడు, కమ్మనిపాట

ముద్దులొలుకుట ఆటకనుగుణాభినయనము చూచిన దీరవల యునేగాని, చెప్పిన దీరదు. ఇప్పుడు దాసుగారియందు నవ యౌవన ముట్టిపడుచున్నది ఆత్మశక్తి ప్రభావపూరితులకు వార్ధక్యము, యౌవనమగుననుట కిదియే తార్కాణము. అర్చా మూర్తిచే నాలుగులక్షలవరహాలను కక్కించిన శక్తివార్ధక్య మును యౌవనముగా మార్చజాలినదనిన చిత్రమేమి

కథ సాగుచున్నయది. గోపికలంపతియందు నన్నిరూపము లతో దాండవించిన కృష్ణభగవానునకువలె భక్తబృందములో దాసుగారు తాండవించుచున్నారు. రంగస్థలము దివ్యబృందా వనమైనది. సభికులలో నూతనచైతన్య మావిర్భవించినది. ఆనందభాష్పములతో నృత్యములు జేయువారు కొందరు, ఒకరి నొకరు కౌగలించుకొని కృష్ణస్మరణతో నేడ్చువారు కొందరు, విపరీతమైన నవ్వులతో మైమరచువారు కొందరు కృష్ణలీల లనభినయించువారు కొందరు కృష్ణా! కృష్ణా! కృష్ణా! అనుచు నెలుంగులెత్తి దిక్కులు ప్రతిధ్వనింప గేకలు వేయువారు కొం దరు, నృత్యముల మైమరచి భూమిబడి దొర్లువారుకొందరు, జంటలుగా నిలచి చేతులుగలిపి గంతులుబెట్టువారు కొందరు, వేయేల? మార్దంగికులు, మృదంగముల నడుముల బిగించి గంతులిడుచు లయ నతిక్రమించినారు. వంతపాటకులమనం బులు భగవన్ముఖములగుట బిచ్చికేకలతో దప్పతాళము లతో గుప్పిగంతులిడుచున్నారు. రాగతాళయానముల లెక్క సేయక జంత్రవాయిద్యపరులు తమ తమ పనిముట్ల నెట్లో వి ని యో గిం చు చు దలలూపుచు దేహస్మృతులు దప్పి

యున్నారు. దాసుగారు సింగపుపిల్ల వలె రంగస్థలి నటించుచు కృష్ణనామస్మరణములో మునిగితేలుచున్నాడు. కృష్ణాంతర్హిత గాథ వచ్చినది. విపరీతదుఃఖము దాసుగారు వెల్లడించి నారు. సభికులున్నవా రున్నట్లు గోలబెట్టి యేడ్చుచు రంగస్థలి నాటిన చెట్లలో వెదకువారు కొందరు ఆలయ స్తంభముల బరికించుచు గండ్లనీళ్ళు కండ్లకు గ్రుక్కకొనువారు కొందరు ఆలయావరణమంతటను తిరిగి తిరిగి కలయ వెదకువారు కొం దరు కనివినియెఱుంగని చింతామగ్నులైనారు. పిదప "శ్రీకృష్ణ పాదారవిందచిహ్నములివిగోనే" అనిపాడుచు దాసుగారు భూమిబడి పొర్లుటజూచి సభికులెల్ల రున్నవారున్నట్టు లానంద పరవశులై పరుగునవచ్చి శ్రీకృష్ణపాదచిహ్నములపైబడి వందన శతములతో మేనులుమరచిరి. సభకొంతవడి నిశ్శబ్దమైనది. అంతదాసుగారు బహిర్ముఖులైరి. వెంటనే సభికులందఱకు స్మృతులుగలిగి ఖిన్నవదనములతో నుండిరి.

అంత దాసుగా రనుయాయులతో గలసి విజనస్థలి జేరి గోపికాగీతల ప్రారంభించి సూర్యోదయమునకు ముగించిరి. గరుడ సాక్షాత్కారమైనది. రాసముగిసినది. దాసుగారి జీవి తములో నాఖరురాసయిది. మంగళహారతితో భక్తులందరు స్వగృహములచేరినారు. తదుపరి యచిరకాలమునకు గలవ కూరుజేరి తన డెబ్బదినాల్గవయేట క్రీ. శ. 20 విరోధికృతు వత్సరాశ్వయుజ శుద్ధైకాదశి బుధవారము సాయంత్రమైదు గంటలకు మంచిస్పృహతో శ్రీవారు పరమపదించిరి.

---

# మాల పిచ్చమ్మ

అకార ఉకార మకారముల కలయికచే యేర్పడిన ప్రణవము హృదయాంతరాళమందున్న యనాహతచక్రము నందు సదా ఘంటానాదమువలె ధ్వనించుచుండును. ఈ ప్రణవమే సకలజగత్కారణమైన పరబ్రహ్మము.

షణ్ముఖీముద్రిలో గనులుమూసి ఆలింప నభ్యాసకు నకు సక్రమాభ్యాసమువలన ఆప్రణవమే "చిణి" శబ్దముతో వినుపించును ఇట్లే, ఘంటానాదము పిదపశంఖనాదము విన బడును. పై నాదత్రయమువలన నరిషడ్వర్గమడగి శమదమా దులలవడును. తదుపరి సహస్రారమందు వీణానాదము తర్వాత దాళనాదము, ఆవల వేణునాదము శ్రవణింపనగు ఇవి యప రోక్ష సాక్షాత్కారజ్ఞానమలవడ సుషుమ్నానాడినుండి బయ ల్వెడలుచున్నవి

వేణునాదానంతరము భేరీనాదము వినిపించును దీనితో గామబీజనాశనమగును. తర్వాత మృదంగనాదము దీనివలన బ్రికృతిజయము అటుపిమ్మట మేఘగంభీరమైన నాదము ఇప్ప టికి సాధకుడు చతుర్దశేంద్రియములు విషయవిముఖములై చిత్కళాదర్శనభాగ్యములభింప ఆధ్యాత్మికాది తాపత్రయ ములడంగి సుస్థిరానందమూర్తియై విరాజిల్లగలడు.

పైగనుపరచిన ప్రణవము నాదు, బిందు, కళ, అని మూడువిధములుగా విభజింపబడినది. నాదమకారము బిం దుకారము కళ మకారము నాదానుసంధానమైనపిదప గనులు

మూసి భ్రూమధ్యమునగల ద్విదళకమలమున దృష్టినిలిపి యుంచిన హృదయమున (1) గుణరహితాకాశము (2) పరాకాశము (3) మహాకాశము (4) తత్వాకాశము (5) సూర్యాకాశము లనుక్రమముగజూడనగు. ఇందు మొదటిది శబ్దరూపములు లేనిదై యుండు రెండవ పరాకాశము దట్టమైభయంకరమై, అంధకారబంధురమై ఉండు. మహాకాశము ప్రళయకాలమందు ప్రజ్వలించు కారుచిచ్చువలె భీతిదాయకమై యుండు తత్వాకాశము నానావిధ చిత్రవిచిత్రకాంతులచే బూర్ణమైయుండు సూర్యాకాశము సహస్రకోటి భానుదీప్తి గలదై యుండు

పై యాకాశముల నడుమనడుమ మల్లెపూవులవలె దీగ మెఱుపులవలె జిత్కళలు బయల్వెడలుచుండును. ఈపరిక్రమముగ నాకాశపంచకమునందఖండజ్ఞానజ్యోతి విరాజిల్లు తజ్జ్యోతిని దర్శించిన పిదప సహస్రారమున హంససంచార మేర్పడును. ఇప్పుడుద్వంద్వరహితమైన శాశ్వతసుఖానందమును సాధకు డనుభవింపగలడు. ఇతడే జీవన్ముక్తుడు. ఇట్టి వారిలో మన మాలపిచ్చమాంబగారొకరు.

ఈమెగారు పూర్వజన్మసాధనాబలము వెన్నంటిరా సహస్రారమున వీణానాదముతో జన్మించినారు. షణ్ముఖీముద్రాభ్యాసకాలములో వినుపించు దశవిధనాదములలో నైదవదగు వీణానాదశ్రవణకాలములో వెనుకటి జన్మచాలించుటచే దన్నాదశ్రవణము తోడనే, యోగపూర్తికొఱకు నుత్తరజన్మ ధరించిరని తెలియవచ్చుచున్నది. ఏడాదివెళ్ళులోపల నే మాటలాడు శక్తిగలుగుటయే, కాక నాదానుభూతి బైటబడినది.

తండ్రి వరే ముత్తయ్య. తల్లిపీరమ్మ. గ్రామము కృష్ణా జిల్లాలోని బందరు హైదరాబాద్ కోష్టుప్రక్కన గలిగినట్టి కుమ్మద్దాలి. జననము క్రీ॥ శ॥ 19 వ శతాబ్దాంతము ఈమె గారికి ముగ్గురు సోదరులు నొకతోబుట్టువును గలరు. వయస్సు ముదిరినకొలది నాదానుభూతివిస్తరించుట నాతలలో నొదలు పులకరింపజేయు మ్రోతవినబడుచున్నదని చెప్పుచు స్నానము వహించి కూరుచుండువారు. ముఖలక్షణమును బరిశీలించి నానందచిహ్నము లగుపించుచుండెడివి. ఈమెగారి తలనుండి వెలువడుమ్రోత యొకప్పుడెక్కువగను మఱొక్కెడ దక్కువగను ఇంకొకతరి కనుపింపకుండగనుకూడ నుండెడిది. అమ్మగారు ప్రశాంతముగ నున్నతరి ప్రశ్నించిన మ్రోతప్రారంభింపగవే పరులమాట వినంబడదు ప్రపంచమేకనంబడదని జవాబుజెప్పను.

తలిదండ్రు లిది బిడ్డకు రోగమనుకొని వారు మందులిప్పించినారుగాని ప్రయోజనముగనుపింపలేదు. విసుకెత్తి మానినారు కొన్నియేండ్లుగడచినవి బాలికకు దనుకాంతిగాని స్ఫుటత్వముగాని సుంతయు దగ్గలేదు. ఈమెస్ఫురద్రూపి ఆజానుబాహుయుగళ, శుక్లపక్షపాకరునివలె దినదినాభివృద్ధి నందుచున్నయది పిలచినగాని పలుకద్దుకోరినగాని యాహారము గొనదు బాలకులమాటల బొల్గొనదు. నానాదానుభవము జేయుచు నింగిజూచుచు దిక్కులబరికించుచు మఱియొకసారి పాలుద్రావి పరువులిడు గోవత్సముల సొంపుల కచ్చెరువందుచు, నమందానందకందళితహృదయయై యున్నమన పిచ్చ

మాంబను లోకులు "పిచ్చిపిచ్చామ" అని పిలువజొచ్చిరి పదియైదయేడు వచ్చినది ఈపిచ్చామకు పిచ్చిబలమైనది.

ఇంతటి స్ఫురద్రూపి పెద్దకులములలో నెందును గను పడదని జెప్పుట నతిశయోక్తికాదు. పిచ్చిపట్టుటముగాక పూర్వమే వివాహముగావింప దలంచి తలి దండ్రులు తత్ప్రయత్నములు సాగించుచున్నారు. వరాన్వేషణకై తిరిగి తిరిగి తుమ్మలపల్లి నివాసియగు శోభనాద్రిని దెచ్చి పెండ్లి జేసినారు. ఈ పెండ్లితోపాటు సమాధిసౌభాగ్యముగూడ లభ్యపడినది. కాపురమునకు బోయినది. దినమున కిరువది నాలుగుగంటలు గొడ్లసావడిలో నివాసము భోజనముచేయునదే తడవు మిగిలిన యిరువదినాలుగుగంటలు గోసేవయే గృహకృత్యము లన్నియు దోడికోడలు నిర్వహించుచున్నయది. గోవుల మేపుకొన పచ్చిక బయిళ్ళకరిగి పశువుల బీటవిడచి యున్నతస్థలి గూరుచుండి బ్రహ్మావలోకనము జేయుచు దద్భావమం దారూఢత గడించి సమాధి నలంకరించుచుండువారు. గోవులు మేతలు మేసి తనివిగొని ప్రొద్దుగ్రుంకువేళకు గోష్ఠమునకు జేరుటయే గాని యొకరోజైనను గోవులవెంట నమ్మగారరుగుట గలలో వార్తైనది. యొంటరిగా రాత్రి యేవేళకో యిల్లుజేరుటయు భర్త బంధుగులకోపములకు గురియగుటయుగూడ జరుగుచున్నది.

ఇట్లుండ గొంతకాలమున కమ్మగారు గర్భముధరించినారు. నాల్గవమాసము వెళ్ళి వెళ్ళకపూర్వమే శోభనాద్రి పరమపద మలంకరించినాడు. తదుపరి క్రమముగా పది నెలలు

నిండి కుమార్తెనుగన్నది. ఆమెకు భాగ్యమ్మ పేరుపెట్టినది. పుత్రికి నెలవెళ్లులోపలనే బయలదేరి పుట్టిల్లుజేరి నది భర్తయాస్తియందున్యాయముగా దనకురావలసిన స్థిరచరరూపమైన దాయభాగమునందలి సర్వహక్కులను మరందికే యొప్పగించి శుష్కహస్తములతో దల్లికడకేగినది. ఆతల్లియు మరుమాటాడక బుత్రినాదరించి నిజగృహమున దావిచ్చినది. యిప్పటికి దండ్రి గతించినాడు. సోదరు లేఱుపడినారు. తల్లియొక్కరితయే నింటిని బ్రాడింట గాపురము ఆగుడిసెయందు దలదాచుకొనుచున్న దమ్మగారు. ఇప్పుడు కూలిచేసి పొట్టబోసుకొనుచు నాదసుధారసపానమత్తయగుట కష్టాలనే సుఖాలుగా ననుభవించుచు సంతోషపారావారమున దేలియాడుచు ప్రసన్నవదనయై కాలముగడపుచు హరిమయము విశ్వమంతయు హరివిశ్వమయుండు సంశయము బని లేదా హరిమయము గాని ద్రవ్యము పరమాణువు లేదను భాగవత ధర్మదీక్షాపరతంత్రయై బ్రహ్మానంద మనుభవించు సుగుణాకరంబ మన పిచ్చమాంబ.

కూలిపనులలో రయితులమెప్పుగడించి తానార్జించిన స్వల్పద్రవ్యముతో గుటుంబము జరుపుకొనుచు నతిథ్యభ్యాగతసేవల గావించి పేరుపడయుట గ్రామీణు లాశ్చర్యపడుచున్నారు.

పాచిధనమింటనుండ జీమలు బాకినట్లు దేహమందు బాధగల్గునట్టి ఆకారణముగా జేసినకూలి ధాన్యరూపముగా గ్రహించుటయేగాని ద్రవ్యముగాగొనుట మానినారు. ఇట్లు

నొచ్చుగుతిరుగులు లేక జీవయాత్ర సాగుచున్నది. అనారోగ్య కరములగు పదార్థములగాని వస్త్రములగాని గృహమునం దుండరాదు రారాజులయందు లేని తృప్తి కోటీశ్వరునియందు లేని సంతుష్టి మూర్తీభవించినది.

పుత్రి భాగ్యమ్మ యుక్తవయస్కురాలైనది. వక్షెకోలయ్య అల్లుడైనాడు గాని యాతడచిరకాలముననే చనిపోయినాడు. బంధువులకోరికపై బిడ్డకు బునర్వివాహాము జరిగినది గాని అదికలహకారణ మైనందున కూతురు, అల్లుడు ఎడమెడముఖులైనారు ఒకప్పుడు భర్త చే దెబ్బలు తిని భాగ్యమ్మ తల్లికడకేగి పరిస్థితు లుగ్గడించిన భర్తనుపీడి యుంట స్త్రీధర్మమునకు విరుద్ధమని నొక్కివక్కాణించి పుత్రిని బంపివేసినది. ఆమెతిరిగి భర్తకడకేగుచు మార్గమధ్యమునగల భావిబడి మృతినందినది. పోలీసులమ్మగారిని బిలిపించి నీపుత్రి యాత్మహత్యకు గారణమేమనిన బ్రారబ్ధమని జబాబుజెప్పి తన నిర్లిప్తస్థితికి వన్నెబెట్టినది.

దీనితో బాహ్యాబాధములన్నియు వీడిపోయినవి పూర్వ జన్మమున కొఱవడిన యోగమును గుర్వపేక్ష లేకయే సాధన సాగించి యోగసిద్ధిగడించి బ్రహ్మానందమందుచు దనకుగల యాస్తినంతయు దానధర్మములరూపముగా వెచ్చబెట్టి మొలకు చుట్టిన గోనెపట్టతో నిల్లువిడచి రుద్రభూమిని నివాసస్థలముగా జేసికొని సంకల్పరహితస్థితి నార్జించి,

సీ॥ అరసి నిర్గుణబ్రహ్మంబు నాశ్రయించి
విధినిషేధనివృత్తస ద్విమలమతులు

జేయుచుందురు హరిగుణ చింతనంబు
మానసంబులనే పొద్దు ॥

అను భాగవతధర్మానుసరణి ననుసరించి రామభక్తాగ్రిణి హనుమన్నామస్మరణజేయుచు యోగినియై నిరాహార దీక్షవహించి ఒక రుద్రభూమియేగాక బుల్లేటిగట్టునందును లక్కావఝ్ఝులవారి తోటయందును గుమ్మరుచు, శీతోష్ణసమస్థితి నార్జించి ఆకలిదప్పులమరచి రోహిణీకార్తెయెండలకు వర్షర్తువునగల వానలకు హేమంతమునగల చలికి మాకు మసలుచు క్రూరజంతువులకడలక నరణ్యముల దిరిగి తిరిగి చిత్తము పరాయత్తముగానీక నభిమానరహితయై శ్రీరామావధూతనామమున బిలువబడుచు నెట్లో కొంతకాలమునకు గుమ్మద్దాలిప్రాంతము జేరి మసలుచు బరిసరగ్రామములగల భక్తులుపాడుచుండు త్యాగరాజకృతుల వేమనపద్యముల మొవ్వగోపాలపదముల బ్రహ్మంగారి తత్త్వముల సిద్ధప్పగారి కీర్తనముల వినుచు గోనెపట్టచుట్టుకొని సంచరించుట గొందరు భక్తులామెగారిదరిజేరి వేదాంతవిచారము సాగింప జూచిరి. గాని వారిని దరిజేరనిచ్చెడివారుగారు.

ఇట్లుండ గొంతకాలమునకు (శ్రీ)వారి శక్తిని గుర్తించి తదీయగ్రామవాసు లొక తాటియాకులపాకను నిర్మించి యెట్లో అమ్మగారిని ప్రసన్నురాలిని గావించుకొని కొనివచ్చి ఆశ్రమమున బ్రవేశపెట్టిరి. నాడు మొదలు తన వచ్చిరానిభాషతో, వేదాంతోపన్యాస వెల్లువలో నాప్రదేశమంతయు ముంచివేసిరి.

అమ్మగారి దర్శనార్థమై యేతెంచు భక్తులసంఖ్య మితిమించినది. తత్త్వవిచారము మతిశయించినది తలవని తలంపుగా నొకనాడు మౌనమువహించి యొకటి రెండేండ్లవలీలగా వెళ్ళించి, అది ముగిసిన వెంటనే ప్రతిరెండుదినముల కొకరోజును క్రమముగ మూడురోజుల కొకరోజును మౌనముద్రవహించుటయేక పూర్ణసమాధియందుండుట కలవాటుపడిరి. ఈ నియమము జీవితాంతమువఱకు జరిగినది. సమాధినుండి లేచినదివసమున పలువురు భక్తులేగి వేదాంతరహస్యము లెఱింగి పోవుచుండువారు.

వీడొకప్పుడు బందరునుండి బయలుదేరి అమ్మగారి ఆశ్రమమునుండు బస్సుదిగి సాయంత్రమైదుగంటలకాశ్రమము లోనికేగినాడు అది అమ్మగారు సమాధినుండి లేచినదినము పసునెత్తినచ్చి యానందభాష్పములతో గౌగలించి లోన ప్రవేశపెట్టి కూర్చుండబెట్టి నీకాకలియగుచున్నదా, పొద్దున నెప్పుడో బువ్వతిన్నావుగదా! ఆకలి లేకుండునా? అంటూ, గదిలోనికేగి యొకలడ్డుపట్టుకవచ్చి నాచేతబెట్ట బ్రియత్నించినది అప్పుడు నేనిట్లంటి నీవు మాలదానవు వీడు స్వచ్ఛమైన బ్రాహ్మణుడు, నీవిచ్చెడి యీ లడ్డెట్టుదినవలె, వీడికి కులము పోదా! అరే బత్తికికులముగలదంటావ్రే? తిను, తిను, అంటూ నీడి నోటకుక్కినది. సంతోషముతో దిన్నాడు. ఆమె ప్రేమతో నొసంగిన మంచినీటి ద్రాగినాడు పవిత్రుడనైనాడు. అమ్మగారి మాతృప్రేమను గుర్తింపగలిగినాడు వీడినేగాదు

వచ్చెడిభక్తులనందఱిని యాదరించి పంపుస్వభావ ముగ్ధు చాలతో నీమెయందున్నదని విని యానందింపగలిగినాడు.

ఇట్లు కురుమద్దాలియాశ్రమమందు ముప్పదివత్సరములు గడిపి అనేకమంది భక్తులపై నిజవాగమృతమును ప్రోక్షించి ధన్యులగావించి, ప్రాణ పయాణమాసన్నమగు టెఱింగి ఆశ్రితు లకు రహస్యములెఱింగించుచు సంపూర్ణవ్యక్తితో క్రీ॥శ॥ 20వ శతాబ్దము వికృతివత్సర పుష్యబహుళ తదియ రాత్రి యొంటి గంటకు గనులవెంట దివ్యజ్యోతి వెలువడి సర్వవ్యాపియైన పరంజ్యోతిలో నేకమైరి. శ్రీ కొమ్మరాజు లక్ష్మీకాంత యోగివర్యుల యాధిపత్యమున సమాధికార్యము పూర్తి గావింపబడినది అమ్మగారి శిలావిగ్రహ ప్రతిష్ఠతో తత్కార్య కలాపములు ముగింపబడినవి.

## విశేషములు

1 రుద్ర భూమిసంచరించుకాలములో నొకనాడు కపి లేశ్వరపుర హరిజనవాడలోని శ్రీరామాలయములో నమ్మగా రున్నారు. పిన్నమనేని వెంకటనరసమ్మగారు దర్శించి ప్రార్థింప నామెభక్తి ప్రపత్తులకు వశవర్తినియై వెంటవచ్చి శ్రీనరసమ్మ గారిచే బాదపూజలంది సంతసించిరి. శ్రీ వెంకటనరసమ్మ గారే కురుమద్దాలియాశ్రమ నిర్మాతలు, 1925 సంవత్సరమున తదాశ్రమప్రవేశ మమ్మగారు గావించిరి.

2. అమ్మగారి ప్రథమశిష్యులు బుచ్చమ్మగారు. (ఇంటి పేరు తెలియదు) రుద్రభూమి సంచరించు పిచ్చమ్మగారిని వెన్నంటి సేవించి తరించిన పుణ్యమూర్తి.

3. అర్థింపకనే దనమిల్లునకు నైనన్ను నిప్పించుకారణ ముగ పూర్వాపరమునుమరచి మూడవశిష్యుడైన ధన్యమూర్తి పిన్నమనేని సీరయ్యగారు.

4. సంతానమునకు కేడుచూచుచుండు దిట్టకవి రామ కృష్ణయ్యగారమ్మగారి యాజ్ఞననుసరించి భార్యవలన సూర్య నమస్కారములు ఫ్రార్థిగావించి సత్సంతానవంతుడై యిష్టార్థ సిద్ధి గడించిన పవిత్రచరితుడు నాల్గవశిష్యుడు.

5. కుడుమద్దాలి యాశ్రమవాసకాలములో నొకశునక మేగుదెంచి కర్ణపుచ్ఛములాడించుచు నిల్చుటచూచి చిరునవ్వు లొలికి "ఎవతెవేనీవు" యీడికి యేంపని, ఎందుకొచ్చావు చెప్పు, యీడిదగ్గిరుంటావా? అన్నారమ్మగారు. కుక్కవిన్నది తలయూచినది ఆనాటినుండి అది ఆశ్రమవాసియై తల్లియాద రణకు బాత్రురాలైనది. పదేండ్లు జరిగినది. ఒకనాడమ్మ గారు కుక్కనుజూచి. మానవలోకం యిడచిపోతావంటే పో, ముందుమనిషివైతావులే, పో, నాటిరాత్రియే ఆకుక్కశరీరము విడచినది. దానిచర్మమాశ్రమములో నుంచబడినది. కుళ్లు లేదు, దుర్వాసన లేదు అమ్మ నిర్యాణమునకు కన్పియున్నది.

6. ఈడదూడలుంటాయి. నేలుకోండి, అని అమ్మ గారు చూపరులకెఱింగించుచుండువారు. పామొకటి యాశ్ర మమునుండి బయటికివచ్చినది. కొత్తగా వచ్చినవారిలో నొకడు దానిని కట్టెతో గొట్టినాడు. అమ్మచూచి పరుగెత్తి వచ్చి దానితలనుపట్టి లేవదీసి చావబోవుచున్నదని గుర్తించి, ముందు నీవు మానిసివైతావులే; అన్నారు. వెంటనే అది

ప్రాణమువదలినది. ఆసర్వశరీర చర్మ మమ్మగారినిర్యాణకాలము వఱకు కాశ్రమమున నుంచబడినది.

7. వర్షములో దిరుగుచున్నను, శరీరమునకుచుట్టుకున్న బట్టతడియునదిగాదు. ఈమెగారు నడచుస్థలములలోగాని కూరుచున్నప్రదేశమందుగాని చినుకులుపడవు. ఎంతటివర్షమైనను అమ్మగారిని తడుపలేదు.

8. ఆనందాశ్రమవాసులగు కొమ్మరాజు లక్ష్మీకాంత యోగిగారు యాశ్రమమున కప్పుడప్పుడు వచ్చిపోవుచుండిరి అమ్మగారిచే ప్రేమింపబడుచుండువారు. అమ్మగారును ఆనందాశ్రమమునకేగు చుండువారు ఒకప్పుడమ్మగా రానందాశ్రమమునగల శివలింగదర్శనమున కాలయమునకేగి సర్పరాజముచే చుట్టుకొనబడిన లింగమునుదర్శించి నమస్కరించి పామునుద్దేశించి, ఒసే తాసుపామూ, అయ్యభుజమీాద తీపిపోలేదంటే నీకు, అని పలుకుచు జిరునగవులో స్వస్థలము జేరియాసీనమైనది.

9. ఒకప్పుడు తిరుమలకేగి కొండనెక్కి అర్చకుల యంగీకారము లేకనే గుడిలో ప్రవేసించి వెంకటేశ్వరస్వామి భుజముతట్టి "ఏమిరా వెంకన్నా" ఇక్కడున్నావురా, అంటూ, పిల్లవానితో మాట్లాడినట్లు మాట్లాడి తిరిగివచ్చినది చూపరులెల్లరు తెల్లబోయినారు అడ్డుపరచినవారు లేరు.

10. భారతమునగల విజ్ఞానమూర్తుల నెందఱినో సేవించి నారు సంభాషించినారు. ఒకప్పుడు మళయాళస్వామివారితో గలిసి యేర్పేడు జేరి కొన్నిరోజులందుండి బయలుదేరి తిరుమల

జేరినారు, తిరువణ్ణామలకేగి రమణమహర్షి నిదర్శించి, పుదుచ్చేరిలో నరవిందుని వీక్షించి 1924సంవత్సరము వచ్చినప్పుడు మహాత్మాగాంధినిలక్షించి తృప్తిపడినారు.

11. తనను జెప్పుకొనవలసివచ్చినప్పుడు, నీవు అనుచుండునేగాని "నేను" అను చెన్నడెఱుంగము.

12. అహంకారమమకారము లడంగునట కారణశరీరముదాటి మహాకారణమునగలిసి పునరావృత్తి రహితస్థితి నార్జించిన ప్రత్యక్షసచ్చిదానందమూర్తి మన యవధూతచక్రవర్తి.



మూనవప్పుడు. తనసర్వస్వము భగవానున కర్పించుట ఆత్మార్పణమనెదరు అనగా దేహము, మనస్సు, అహంకార మమకారాదులనన్నిటి యందును దనకుండెడి సర్వాధికార ములు భగవదర్పణము చేయుటయే ఆత్మార్పణము లేక శరణాగతి ఇట్టి స్థితిలో త్రికరణశుద్ధిగా తనచే జేయబడు కర్మలన్నియు, భగవంతుడే జరుపుచున్నట్లు భక్తుడు తలంచి నిర్విచారియై యుండును దీనిలో సాధకుని యహంకారయుక్తమైన జ్ఞానము, విశ్వమంతయు భగవల్లీలయను పరిశుద్ధజ్ఞానములో గలసి యంతరించుచున్నది. ఇట్టివానిమనోబుద్ధులు స్వతంత్రించి యేపనియు జేయజాలవు. భగవంతునియిష్టమే? తనయిష్టము భగవంతుని యాలోచనయే, తనప్రవర్తన భగవంతుని సంకల్పమే తన సంకల్పము భగవంతుని వికల్పమే తనవికల్పము.

మనోబుద్ధుల కాధారమైన యంతఃకరణ భగవదాధీనమైనది. కనుక దానిపై దనకధికారము లేదు. సుఖమే రానీ, కష్టమే రానీ అంతయు భగవల్లీలయే ఎట్టి వికారములు లేకుండ ననుభవించుటయే శరణాగతునిపని సర్వభారము భగవంతునిదే సాధకుని యిప్పటిపని యెల్లప్పుడును భగవన్నామము జేయుటయే కార్యాకార్యములన్నియు భగవదాధీనములని వానివిశ్వాసము తాను నిమిత్తమాత్రము భగవానుని చేతికీలుబొమ్మ భగవదాదేశము ననుసరించి ప్రపంచమునే కాదు దేహమునైనను దృణప్రాయముగ

వదలుమెన్నాడు వీనికి భగవత్సాక్షాత్కారము సులభము ఎవనికి భగవత్సాక్షాత్కారమగునో, వానియం దాత్మశక్తి తాండవించుచుండును వీడెంతటికఠినకార్యమైనను జేయగలడు. ఇంతియ కాదు సర్వశాస్త్రములు కరతలామలకములు సర్వవిద్యలు సర్వకళలు సర్వశక్తులు వీని వెన్నంటియుండును. ఇట్టివాడొక్కడుమాత్రమే భగవన్నిర్వ్యాజోపాసనకర్హుడు. వీనికి స్వర్గానుభోగములు తృణప్రాయములు తుదకు మోక్షము గూడా లెక్కచేయడు ఇట్టివాడుగనకనే మనవాసుదాసు సర్వకళాకోవిదుడును క్రూరవ్యాధి విముక్తుడునునై శ్రీమద్రామాయణకావ్యము బంగ్లకెక్కించి ఆంధ్రవాల్మీకియైనాడు ఆత్మశక్తిపూరితున కసాధ్యము లేదను ననుభవోక్తి వీరియందు సార్థకమైనది.

తండ్రి వావిలికొలను రామచంద్రరావుగారు, తల్లి కనకమాంబ. అగ్రసోదరుడు శేషగిరిరావు. తమ్ముడు రంగారావు. తల్లిదండ్రులిడినపేరు సుబ్బారాయుడు జననము 23-1-1863 సరియగు దుందుభివత్సర మాఘశుద్ధచతుర్థి. జననస్థలము కడపమండలమున జమ్ములమడుగు, శ్రీవారి పూర్వులు నైజాములోని వావిలుకొలమాన్యులు పండ్రెండవయేట పితృవియోగము తటస్థించుట బినతండ్రి లక్ష్మాజీరావుగారి వలన బోషింపబడి విద్యాబుద్ధులార్జించిరి. వీరికి శ్రీరామభక్తియు వాక్చతురతయు విద్యాశక్తియు సహజములై యున్నయవి. పదమూడవయేట భయంకర క్షయవ్యాధి పొడసూపి బాధింప మొదలిడినది. ఇట్లు నన్ను ఆంధ్రాంగ్లసంస్కృత



శ్రీమదాంధ్ర వాల్మీకి వాసుదాసస్వామి

భాషలయం దసమాన పాండిత్యమార్జించిరి. ఇందు మాతృ దేవభాషలు రెండును స్వీయకృషి సమార్జితములు పోతన మహాశయునకువలె సహజపాండిత్యబిరుద మందిన ధీశాలి.

హూణభాషలో ప్రవేశపరీక్షయం దుత్తీర్ణులై యం.ఏ. చదువుచుండ క్షయవ్యాధి దుర్భరమగుట బడివదలి యింట నుండియే గీర్వాణాంగ్లభాషలకు వన్నెలుదీర్చి యుభయభాషా కవిత్వ మలవరుచుకొనిరి

బీదకుటుంబమగుట నుదరపోషణార్థము పొద్దుటూరు తాలూకాకచ్చేరిలో నేడురూప్యముల జీతముగల దస్తరబందు పనిలో క్రీ. శ. 1883 సంవత్సరాగష్టుపదియవ తేదీన ప్రవేశించి పనిచేయుచు శ్రీ గంచనపల్లి వెంకటసుబ్బారావుగారి కుమార్తె రంగనాయకమ్మను పెండ్లాడి పరపీడార్థహీనులై యుద్యోగము నిర్వహించుచు క్రమముగ రైవిన్యూసపరీక్షకులుగా జేరి యదృచ్ఛాలాభసంతుష్టిగలిగి కొంతకాలమునకు సేవావృత్తిగర్హ్యమగుట, దెలిసియు నప్పటికుటుంబస్థితికను కూలముగ మెలంగుచు, ఆక్టింగుతహాశ్శిల్దారు పనివఱకు బోయిరి. కాని క్షయవ్యాధి ముదురుట దప్పనిసరిగ నుద్యోగముమాని యిర్వదియైదవయేట కుమారాభ్యుదయమను ప్రౌఢప్రబంధమును రచించుటయే కాక, నెల్లూరినగర పండిత ప్రకాండుల కోరికపై గందపద్యములతో వివిధవిచిత్రకల్పనల జోడించి యొకే పూటలో దప్పగిరిరంగనాయక శతకము విరచించి మెప్పువడయుటయే కాక గజమాలికాబహూకృతు

లంది పిదప కౌసల్యాపరిణయాది గ్రంథనిర్మాతలై భాషాసేవ గావించినారు.

కడపవాస్తవ్యుడును భక్తుడును అగు నన్నేమియా సాహెబుగారి చికిత్సవలన వ్యాధినన్నగిలి యారోగ్యవంతులై చెన్నపురిహైందవోన్నతపాఠశాలాంధ్రోపాధ్యాయులుగా 1901 సంవత్సరమందు జేరి పనిగొనుచు 1904 రాజధానీకళాశాల యందు బ్రధానాంధ్రాధ్యాపకులై పదియారువత్సరములు పనిజేసి క్రీ॥ శ॥ 1920 సం॥ ఉపవేతనము గ్రహించి జీవిత మంతయు భగవత్కైంకర్యమున గడుపనెంచిరి,గాని మూడువం దల జీతముతో నాంధ్రభాషాంతరకర్తగా నయాచితస్వీకర్త ప్రభుత్వముచే నియమింపబడితీరని భాషాసేవ గావించిరి.

తన యిర్వదిరెండవయేట బినతండ్రి లక్ష్మాజీరావుగారి వలన శ్రీమద్రామాయణోపదేశమంది నూటయెనిమిదిమార్లు పారాయణముజేసి దత్ఫలితముగ నాంధ్రవాల్మీకి రామా యణమును దాని నివిశేషార్థములతో సుందరరూపమున విపులమైన వ్యాఖ్యానమునుజేర్చి యాంధ్రలోకమునకు బ్రసా దించి కృతార్థులైరి. చెట్లూరి నరసింహాచార్యులుగా రొసంగిన శ్రీరామతారకోపదేశబీజమే మందరనామక మహావృక్షమై సంసార పరితప్తులకు విశ్రాంతిస్థానమైనది. రామతారక జపము రామనామధ్యానము రామకోటిలేఖనము రామా యణము పారాయణము ఆంధ్ర వాల్మీకిరామాయణనిర్మా ణము శ్రీవారి నిత్యకృత్యములు.

ధర్మమత, నీతిబోధకములగు కృతుల నిర్మించుటయే కాక శ్రీరామకృష్ణలీలామృతము ద్విపదభగవద్గీత ఆర్యకథా నిధులు, ఆర్య చరిత్రారత్నావళులు, హితచర్యామాలికలు భక్తిసూనమాలికలు సులభవ్యాకరణము మున్నగు లోకోపకారకృతులరచించి తన యాంధ్రవాల్మీకిరామాయణకృతిని 1920 సంవత్సరమునం దనేక భక్తకవి పండితసమక్షమున నొంటిమెట్ట కోదండరామమూర్తి కర్పించి విశ్వనాథునివలన నాంధ్రవాల్మీకి బిరుదమందిరి.

క్రీ॥ శ॥ 1910 సంవత్సరమున సంభవించిన భార్యావియోగముతో బంధవిముక్తుడై సంతసించి ఉపదేశమంది యోగాభ్యాసమునకు ఘటికాచలముజేరి సాధన సాగించి యోగసిద్ధిపడసినారు. ఈరోజులలో స్వాప్నికముగ దాను ముండ్లగండ్లలో దిరుగాడుచుండ బయసించు సాధువులందిద్దరరుదెంచి రాజమార్గమున జేర్చినట్లు బొడసూపుకారణముగ ఆశ్రమముస్వీకరించి కౌపీనధారియై ఫలాహారసేవియై యుండె. మఱియొకతరి యిట్లే స్వాప్నికమున నొంటిమిట్ట శ్రీకోదండరామ కైంకర్యమునకు బ్రోత్సహించిన శ్రీరామాజ్ఞనొంది తనకుగల సర్వస్వము దత్కైంకర్యముల కర్పించి ద్రవ్యాభావమువైకొన టెంకాయచిప్పను చేనంది రామభిక్షుకై రామభజనతో బట్టణపల్లెలదిరిగి ధనమార్జించి స్వార్థపరుడు కాక కోదండరామాలయ జీర్ణోద్ధరణము, రథవాహనాదినిర్మాణము, రామసేవాకుటీరస్థాపనము గావించి సాధ్వీ సాధులకు

సకలమభక్తినిబోధించి ధన్యులఁగావించి శ్రీ కోదండరాములకు నిత్యోత్సవ పక్షోత్సవ మాసోత్సవాదుల గల్పించి యొంటి మిట్టను కలియుగవైకుంఠముగా మార్పగలిగిరి. భక్తులనుభ వించుకలలు భావిశుభసూచకంబులైయుంట జాగ్రత్స్వప్న సమాధులని పాఠకులు తలఁతురుగాక.

ఒంటిమిట్టయందు నిర్మించిన శ్రీరామసేవాకుటీరమే కాక శృంగశైలముపై నాశ్రమం బొండుకల్పించి నిరతాన్న దానమహాయజ్ఞము సాగించుచు 1926 సం॥ కోదండరామ సేవక సమాజమును దాని కనుబంధముగ వైద్యశాలయు నేర్ప రచి యాశ్రితులకు దేహమనోవ్యాధుల దీర్చిరి.

1929 సంవత్సరమున గజ్జా సిద్ధయ్యగారి ధనసహాయ ముతో భక్తసంజీవని పత్రిక ప్రారంభించి జీవితాంతమువఱకు నడిపిరి. యామర్తి సుబ్బదాసుగారి సంపాదకత్వమున నిప్పు డది నడచుచున్నది. సద్భక్తులసంకల్పము లమోఘములు గదా! ఆంధ్రదేశపర్యటనకాలమున రచించిన టెంకాయ చిప్ప శతకమున శ్రీవారి యాధ్యాత్మికానుభవములెన్నియో గలవు గ్రంథవిస్తరభీతి నిందు జేర్చకుంటి నావంటి యల్పజ్ఞుడు శ్రీవారి శక్తిసామర్థ్యముల వర్ణింప నెంచుట దీపముచే సూర్యుని జూపబ్రయత్నించినట్లు పరిహాసపాత్రుడనయ్యెదనేమో అను భయము వెంటాడు కారణముగ దదీయజీవితగాథ ముగింప నుంటినని మనవి.

శ్రీమద్వాల్మీకి రామాయణము నూటయెనిమిదిమార్లు పారాయణముజేయుటయే కాక నూటయెనిమిది సీతాకల్యాణ

ములు, అన్ని పట్టాభిషేకములుగావించి ఆ సేతుసీతాచలమున గల ఐదువందల పుణ్యానదులయు చతుస్సముద్రములయు దీర్థ రాజములతో శ్రీరామచంద్రసామ్రాజ్యపట్టాభిషేక మహోత్స వమును గన్నులపండువుగ జరిపి భక్తకల్పద్రుమా అను మకు టముగల నూటయెనిమిది పద్యసుమములతో కోదండరాము నర్చించి యిహపరము లార్జించిరి. తదుపరి ఒంటిమిట్ట కోదండ రామసన్నిధి రామాయణబాలకాండమును, మేల్పట్టునందుండి అయోధ్యాకాండమును, నడిగడ్డపాలెమునందుండె అరణ్యా కాండమును, లక్ష్మీనరసాపురమునందుండి కిష్కింద సుందర యుద్ధ ఉత్తరకాండములును, మందరరూపమున వ్యాఖ్యా నము వ్రాసి ముగించి భద్రాచలరామునకు కౌసల్యాకళ్యాణ నర్పించి తనజీవితమంతయు దేశదైవభాషాసేవల కర్పించి చెన్న నగరమున 1-8-36 ధాత సం॥ మాఘ శుద్ధ చతుర్థి శరీరము జాలించినారు.

# భక్తశిఖామణి సింగరిదాసుగారు

భావమహాభావములని సమాధులు రెండువిధములు సగుణసిద్ధి కాలవాలమైనది. భావసమాధి దీనినే తన్మయ మనిగూడ ననెదరు. తన యుపాసనామూర్తిని యెల్లచోటుల యందు దిలకించుచు నానందడోలిక నూగులాడుట మహాభావ సమాధి దీనిని సంప్రజ్ఞాతసమాధి అని చెప్పవచ్చు క్రమ ముగ నీసమాధుల రెండింటి ననుభవించినప్పుడే సాధ్యము సిద్ధించినదని చెప్పనొప్పు భక్తులంద ఱీభావము నాహరించినచో ప్రపంచాతీతులైరి సిద్ధమూర్తులన వీరే లక్ష్యస్థానమైన భగవ ద్దర్శనప్రాప్తినే సిద్ధియనెదరు. దీనినే సవికల్పమని మఱికొంద ఱసంప్రజ్ఞాతయనియు జెప్పెదరు. ఇంకొకవిధముగగూడ జెప్పకొనినగు నాత్మను దర్శించునప్పుడు భావసమాధియని, అఖండాత్మను దర్శించునప్పుడు మహాభావసమాధియని, ఇప్పుడు, అష్టసిద్ధులు వాటియంతటవి లభించును. ప్రయత్న పూర్వకముగ బ్రకటింప దలంచిన బతనమునకు హేతువు లగు ఇష్టదేవతాసందర్శనప్రాప్తి లభించినవారినే మహాభక్తు లని చెప్పనొప్పు, దీనినే ఈశ్వరసాయుజ్యమనెదరు. భావ మహాభావముల ననుభవపూర్వకముగ నెఱింగిన సిద్ధపురు షుడు మన సింగరిదాసుగారు.

తండ్రి పెన్షన్ తాహశీల్ దారును, అనేకతటాక కూప నిర్మాతయునైన కామరాజు కృష్ణయ్యగారు. తల్లి సంతతాన్న దాన సంపన్నయు సాధ్వీశిరోమణియునైన రామలక్ష్మమ్మ.

ఒంగోలు మండలమునందలి వెంకటాపురమున క్రీ॥ 1840 సం॥ శార్వరి జ్యేష్ఠశుద్ధైకాదశి జననము. కౌమారకాలమునుం డియు జంతుప్రీతిగల్గియుండువాఁడు. తల్లి యన్నమునకు బిలచిన వెంటనే పరిగెత్తిపోయి తన యాటవస్తువులయిన కుక్కపిల్లల గొనివచ్చి వాటితోఁగలసి భుజించుచుండువాఁడు ఒకనాఁడు పిల్లవానిచర్యకుఁగోపించి యాకుక్కపిల్లలఁగొట్టి యావలనెట్టిన నవికుయ్యో! ముఱ్ఱో! అని దుఃఖింప మొదలిడ వాటితోఁగూడ తానేడ్చుచు, వాటినిబట్టికొనివచ్చి వానినోటి కన్నపుగవళమం దించి బుజ్జగించువాఁడుగూడ. ఈచర్యకై అసహ్యించుకొన దన ముందుగల భోజనపాత్రి వాటిముందఱకునెట్టె మఱియొక కంచమున దనకన్నముబెట్టువఱకు మారాముజేసి పట్టుబట్టి తన పంతము చెల్లించుకొనువాఁడు. దీనినిబట్టి కౌమారదశనాటి భూతదయ వయస్సుతోపాటెంతవఱకుబోయి యుండునో, యూహింపుడు. ఐదవయేటనక్షరాభ్యాసమైనది. లక్కవరపు వెంకటనరసింహముగారివలన బడిచదువుపూర్తిచేసి క్రమముగ బురాణగ్రంథముల శ్రావ్యముగ జదువుట, అందలిగూఢార్థ ముల గ్రహించుట, మఱియొకరికి వినిపింపగల్గు నేర్పుగలవా డగుట తల్లిదండ్రులకానందము గల్గించుచున్నాడు.

తండ్రి కృష్ణయ్య ప్రతిదినము కుమారునిచే రామా యణముజదివించి వినుచుండువాఁడు. దీనిచేభక్తిభావమతిశ యించి యప్పుడపుడు మైమరచుచుండువాఁడుగూడ ప్రతిరాత్రి ప్రథమయామమున గొంతసేపు రామమందిరమున భజనచేసి గాని నిద్రించువాఁడుగాఁడు.

# భక్తశిఖామణి సింగరిదాసుగారు

భావమహాభావములని సమాధులు రెండువిధములు సగుణసిద్ధి కాలవాలమైనది. భావసమాధి దీనినే తన్మయమనిగూడ ననెదరు. తన యుపాసనామూర్తిని యెల్లచోటుల యందు దిలకించుచు నానందడోలిక నూగులాడుట మహాభావసమాధి దీనిని సంప్రజ్ఞాతసమాధి అని చెప్పవచ్చు క్రమముగ నీసమాధుల రెండింటి ననుభవించినప్పుడే సాధ్యము సిద్ధించినదని చెప్పనొప్పు భక్తులంద ఱీభావము నాహరించిరేని ప్రపంచాతీతులైరి సిద్ధమూర్తులన వీరే లక్ష్యస్థానమైన భగవద్దర్శనప్రాప్తినే సిద్ధియనెదరు. దీనినే సవికల్పమని మఱికొంద ఱసంప్రజ్ఞాతయనియు జెప్పెదరు. ఇంకొకవిధముగగూడ జెప్పుకొననగు నాత్మను దర్శించునప్పుడు భావసమాధియని, అఖండాత్మను దర్శించునపుడు మహాభావసమాధియని, ఇప్పుడు, అష్టసిద్ధులు వాటియంతటవి లభించును. ప్రయత్నపూర్వకముగ బ్రకటింప దలంచిన బతనమునకు హేతువులగు ఇష్టదేవతాసందర్శనప్రాప్తి లభించినవారినే మహాభక్తలని చెప్పనొప్పు, దీనినే ఈశ్వరసాయుజ్యమనెదరు. భావమహాభావముల ననుభవపూర్వకముగ నెఱింగిన సిద్ధపురుషుడు మన సింగరిదాసుగారు.

తండ్రి పెన్షన్ తాహశీల్‌దారును, అనేకతటాక కూపనిర్మాతయునైన కామరాజు కృష్ణయ్యగారు. తల్లి సంతతాన్నదాన సంపన్నయు సాధ్వీశిరోమణియునైన రామలక్ష్మమ్మ.

ఒంగోలు మండలమునందలి వెంకటాపురమున క్రీ॥ 1840 సం॥ శార్వారి జ్యేష్ఠశుద్ధైకాదశి జననము. కౌమారకాలమునుండియు జంతుప్రీతిగల్గియుండువాడు. తల్లి యన్నమునకు బిలచిన వెంటనే పరిగెత్తిపోయి తన యాటవస్తువులయిన కుక్కపిల్లల గొనివచ్చి వాటితోఁగలసి భుజించుచుండువాడు ఒకనాడు పిల్లవానిచర్యకుగోపించి యాకుక్కపిల్లలగొట్ట యావలి నెట్టిన నవికుయ్యో! మొఱ్ఱో! అని దుఃఖింప మొదలిడ వాటితోఁగూడ తానేడ్చుచు, వాటినిబట్టికొనివచ్చి వానినోటి కన్నపుగవళమందించి బుజ్జగించువాడుగూడ. ఈచర్యకై అసహ్యించుకొన దన ముందుగల భోజనపాత్రి వాటిముందఱకు నెట్టె మఱియొక కంచమున దనకన్నముబెట్టువఱకు మారాముజేసి పట్టుబట్టి తన పంతము చెల్లించుకొనువాడు. దీనినిబట్టి కౌమారదశనాటి భూతదయ వయస్సుతోపాటెంతవఱకుబోయి యుండునో, యూహింపుడు. ఐదవయేటనక్షరాభ్యాసమైనది లక్కవరపు వెంకటనరసింహముగారివలన బడిచదువుపూర్తిచేసి క్రమముగ బురాణగ్రంథముల శ్రావ్యముగ జదువుట, అందలిగూఢార్థముల గ్రహించుట, మఱియొకరికి వినిపింపగల్గు నేర్పుగలవాడగుట తల్లిదండ్రులకానందము గల్గించుచున్నాడు.

తండ్రి కృష్ణయ్య ప్రతిదినము కుమారునిచే రామాయణముజదివించి వినుచుండువాడు. దీనిచేభక్తిభావమతిశయించి యప్పుడపుడు మైమరచుచుండువాడుగూడ ప్రతిరాత్రి ప్రథమయామమున గొంతసేపు రామమందిరమున భజనచేసి గాని నిద్రించువాడుగాడు.

అప్పుడప్పుడువిజనస్థలిజేరి భగవంతుడెట్టివాడు, నాకును భగవంతునకునుగల సంబధమెట్టిది. నేనెవడ నని తర్కించుకొనుచు దీర్ఘాలోచనానిమగ్నుడై యందే నిమురించిన దలితండులు నెదకితెచ్చి బుజ్జగించుచుండువాడు.

పండెండవయేటియం దుపనయనసంస్కారము జరిగినాటినుండి సమీపమునగల సింగరిగిరి నరసింహునిదర్శించివచ్చుచుయాచారముగలవాడైనాడు. ఒకనాడు ప్రొద్దుగ్రుంకుసరికి నరసింహునిజేరి భజనముచేతను ప్రార్థనలచేతను భగవంతుని దృప్తిపరచి అమవసనిశిబయలుదేరి ద్వితీయయామ ప్రథమమున నింటికి నొంటరిగా వచ్చుచున్నాడు దారితప్పి పెనదారిబడిపోవుచుండ ముందుజూపుమేరలో మినుకుమినుకుమను దీపముగ ననుపించిగ అది క్రమక్రమముగ పెటోలుబాక్సు ప్రకాశమైయుండుటదోచి భయాశ్చర్యముల గలిగించినది. వెంటనే బావతరంగములదృశ్యములై మనోశాంతి లభింప నానందముద్భవించినది. శరీరస్పృహదప్పి నేలకొరిగినాడు. ఎంతి కాలము పడియుండెనో, దేవుడెఱుగు స్పృహవచ్చి కనువిచ్చినాడు జ్యోతి లేదు. ధూళి ధూసరిత దేహుడై తిరిగి పయనముసాగించి తనను వెదకుచు నెదురేగిన యిద్దరుమనుష్యులతో నింటికివచ్చి చేరినాడు.

మఱియొకతరి సాయంత్రమైదుగంటలకు బయలుదేరి భగవత్సాక్షాత్కారమర్థించి సింగరిగిరికేగి ఆలయప్రాంగణమంతయు నిర్మానుష్యమైయుండ సంతసించి కోవెల బ్రవేశించి అర్చామూర్తిపాదములబడి ప్రత్యక్షదర్శన మర్థించుచు



భక్తశిఖామణి సింగరిదాసుగారు

దుఃఖించి దుఃఖించి సాక్షా భగవత్సాక్షాత్కారముగాక నిరాశాభరితుండై కన్నుల వేడినీరుగార గొంతవడి విలపించి కనులువిచ్చిన మున్నుదాగనిన దివ్యజ్యోతి గాన్పించె వెను వెంటనే దుఃఖమంతరించి యానందవారి వోలలాడి సంప్రజ్ఞాతలో మునింగిన నృసింహుడు సాక్షాత్కరించినాడు.

అంత దాసుగారానందనృత్యము గావించుచు సమాధి నుండి వెలువడి చూచిన దజ్జ్యోతిగాని నృసింహమూర్తిగాని కనుపింపలేదు. భగద్విశ్లేషమునకు జొక్కి మైమరచి కొంత వడికి దెప్పరిలి, యెట్లో ఆలయమునుండి బయటబడినాడు. వెంటనే ఒకయోగిని గంటబడినది నాయనా! నీకొఱకై నిందు వేచియున్నాను. అని బిగ్గగాగలించి సింగన్నా ! దుఃఖింపకు తారకముపదేశించెద. దాననీ కభీష్టసిద్ధిలభించునని చెప్పుచు శ్రీవారిని యాలయములోనికి గొనిపోయి సర్వవేదాంత రహస్యముల దెలిపి సందియముల దీర్చి తారకముపదేశించి యథేచ్ఛజనియె.

ఈమె సీతాంబయను శూద్రయోగిని బ్రహ్మచారిణి యింతకన్న నీమె పుట్టుపూర్వోత్తరాలేమియు దెలియరావు. అంత సింగరిదాసు తన్మంత్రసిద్ధి నార్జింప శ్రీరామసాక్షాత్కార భాగ్యమలవడినది. నేడు మొదలు దాసుగారి కంతా రామమయమైనది.

తదుపరి తండ్రి గతించుట గుటుంబభారమువైబడినది. కుటుంబాస్తియంతయు నప్పులపాలైనది. ఊర తన కప్పిచ్చు

వారు లేరు. ఉద్యోగము జేయుటకు మనస్సొప్పదు. కుటుంబము పోషించు టెట్లు మేనమామ వెంకటనరసింహముగారి బలవంతమున నుద్యోగముకొఱకు బెట్టబడిన యర్జీ మంజూరైనచ్చి లోపల యాత్రానెపమున నొకయర్ధరాత్రి బయలుదేరి పదునైదవరోజునకు నెల్లూరు జేరినారు దాసుగారు.

ఈ పయనమున నొకచిత్రముజరిగినది. దాసుగారు చీకటిబడువేళకు పెన్నయొడ్డుజేరి యుత్తరించుటకు నదిలోదిగి భజనతో పయనించుచున్నారు. ప్రవాహమంతకంతకు పెరిగి దాసుగారిచేతగల తంబురచిరతలేకాక పైగుడ్డతో సహా గంగాదేవి గ్రహించినదిగాని! దాసుగారి భజన జరుగుచునే యున్నది. నదినడుమ కేగుసరికి శ్రమించి నిలచిపోయినాడు ఈవలావలి యొడ్డల తన్నిపారుచున్నది నదీమతల్లి, కటికిచీకటిలో నదిలో నుండి వినంబడు రామనామము జెవిబడుట దయాపరులై పల్లెకారులు దివిటీలతో పడవనడపుకొనిపోయి దాసును సమీపించి తామెన్నడు కనీ వినీ యెఱుంగని యిసుకదిబ్బపై మొలబంటినీటిలో దేహముమరచి యున్న మూర్తినిగాంచి యబ్బురపడుచు, నెట్లో స్మృతిగలిగించి పడవనెక్కించుకొని ప్రయాసపై యొడ్డుజేర్చి ధన్యులైనారు. నమ్మిన భక్తుల యోగక్షేమముల భగవంతుడే వహించునను గీతోక్తి సార్ధకతవహించినదనుటలో సందియమేమాత్రమును లేదని మనవిజేయుచున్నాడ.

అంత శ్రీవారు రంగనిదర్శించి నాటిరాత్రి కొనెల యందు వసించి భగవంతుని గీర్తించుచు దెల్లవార్చినారు, ఉద్యోగమునకై యితరుల బలవంతముమీద పెట్టబడిన దర

ఖాస్తు శాంక్షనయి వచ్చినదిగాని దరఖాస్తు దారెక్కడ నున్న దియు తెలియనందున రద్దయినది యిది తెలిసి దాసుగారు చాలా సంతోషించినారు. శ్రీరామసేవకు మరిగినవాడు సామాన్యమానవసేవల సమ్మతింపగలడా?

సింగన్న ఉద్యోగము రద్దయినది తెలిసి తిరిగి వెంకట నరసింహముగారు ప్రయత్నించి శాంక్షను చేయించినారు దాసుగారు దక్షిణదేశయాత్రలు ముగించుకొని యింటికివచ్చిన రోజునకు సరిగా శాంక్షను ఆర్డరు ప్రత్యక్షమైనది చూచినాడు. రామకూరు షిర్కారివిన్స్యాఇన్స్పెక్టరుద్యోగము తన కిష్టము లేకపోయినను దైవయోగమునకు బద్ధుడై పనిలో బ్రవేశించి నారు. గాని జపతపముల గొడవలో నిమగ్నుడైయుండుట వేళ కాఫీసునకుబోవుట సంభవింపమి పైయుద్యోగి దాసు గారిని మందలించి బెదరించి భయపెట్టెను. గాని ప్రయోజ నములేకపోవుట నుద్యోగమునుండి తొలగించినాడు బంధము తొలగినందుకు సంతసించి తల్లి భార్యలతో నిల్లుజేరి శ్రీరామ సేవాపరాయణులై కాలముగడుపుచున్నారు. దాసుగారు కుటుంబజీవనమున కష్టపడినందున సహింపలేక దల్లి కట కటంబడి అన్న వెంకటనరసింహముగారితో జెప్పి దుఃఖించి నది. చెల్లెలిదుఃఖముచూచి భరింపలేక మేనల్లుని విరాగమును రూపుమాపెదనని పట్టుపట్టి యిష్టములేకపోయినను, ఇన మన మెళ్ళూరు తాలూకాకచేరిలో గుమస్తాపనిలో బలవం తముమీద ప్రవేశపెట్టినాడు. గాని అదిగూడ మూన్నాళ్ళ ముచ్చటైనది.

భార్యా గర్భవతియైనది. ప్రసవించుటకు పుట్టింటి కంపినాడు. నిత్యోపవాసములు జేయలేక దల్లి తనచిన్నబిడ్డలతో పుట్టింటికి బోయినది విరామము లభించినందులకు సంతసించుచు రామసేవలో బాల్గొని తృప్తిపడుచు తిరుపతియాత్రకై బయలుజేరిన మార్గములో బావమరది ధేనువకొండ రామకృష్ణయ్యగారు కలిసి యాత్ర పూర్తిఅయిన యనంతరము దనయింటికి వచ్చిపోవునట్లు ప్రార్థించిన సమ్మతించి తిరుపతికేగి యాత్ర ముగించుకొని అనినమాటప్రకారము బావమరదిగారియింటికిజేరినాడు. ఆయన దాసుగారి నెట్లో యొప్పించి చిత్తూరుమండలమందలి పూతలపట్టులో బడి పెట్టించినాడు.

ఇప్పుడు దాసుగా రాయూరంగల ఆబాలవృద్ధములకు గురువై పాఠములచేతను పురాణకాలక్షేపములచేతను పురివాసుల నానందవార్ధిముంచెత్తుచున్నారు. భార్య రుక్మిణమ్మ పసిపిల్లతో వచ్చిపతిసేవజేయుచుండ నొకవత్సరము జరిగినది.

దాసుగారికి రక్తనిరేచనములు పొడసూపి వ్యాధి విస్తరించుట పాఠశాలను కట్టిపెట్టి క్రీ॥ శ॥ 1864 వెంకటాపురము జేరినవెంటనే వ్యాధినుండి విముక్తుడైనాడు. తదుపరి భార్యాబిడ్డల నత్తవారింటికంపి శేషాచలమును జేరి గోగర్భప్రాంతమునంగల గుహాయందు తపోవృత్తి గైకొనినాడు ఆరవమాసమున కౌపీనధారియగు మునియొక్కడరుదెంచి నీతపము ఫలించినది. ఇంతటినుండి గోరినప్పుడెల్లను శ్రీరామ సాక్షాత్కారము కాగలదు. తపమునుచాలించి వెంకటాపురముజేరి ఆదర్శగృహస్థుడై యుండుమని యాజ్ఞాపించిన దనప్రయత్నము

విరమించి వెంకటాపురముజేరి నిష్కామకర్మాచరణదక్షుడై శ్రీభద్రాద్రిరామదాసుచరిత్రము రచించి శ్రీరామున కర్పించినాడు. ఇప్పుడమలులోనున్న రామదాసుచరిత్ర యిదియే. నిర్లిప్తస్థితిని గురుతించి మామ అప్పయ్య క్రీ॥ శ॥ 1869 సంవత్సరములో నల్లుని దనయింటికి జేర్చినాడు. ఒకవత్సరము మామిళ్ళపల్లెయందుండి రేపల్లెజేరి తమ్మునినుండి వేరుపడి పితరుల యాస్తినుండి రాబడిన ద్రవ్యముతో నాలుగుయకరముల మాగాణికొని ఇల్లుకట్టుకొని కాపురముజేయుచు జితేంద్రియోత్తముగానీక విషయవిముఖుడై కుమ్మరిపురుగువలె సంసారమున మెలంగుచు భగవన్నామామృతపానతృప్తుడై యాశ్రితుల నాదరించుచుండె. చెల్లెండ్రుపు రోకేరోజునలే మృత్యువువాతబడినను వెంటనే, ఖైదారుసంఖ్యల పుత్రికలు దివంగతులైనను తన నిర్లిప్తత గోల్పడలేదు.

ఇప్పటికి రేపల్లెపాఠశాల సాగుచునే యున్నది. నిద్దురలేచినదిమొదలు పొద్దుగ్రుంకువరకు దాసుగారికి తీరుకలేదు. కొంతకాలము పిల్లలపాఠములు,కొంతకాలము భాగవతపురాణకాలక్షేపము, రామభజనలు, జపతపానుష్ఠానములు ఇంకెక్కడతీరుక. ఈమధ్యకాలమున భార్య రుక్మిణమ్మయనంతరించినది. భార్యావియోగముతో రేపల్లెవదలి పెద్దకుమారుని యుద్యోగస్థలమగు నూజవీడుచేరి తత్కార్యప్రధానువర్తియై పిదప బొమ్మనుసం దొకవత్సరముండి బ్రహ్మవిద్యాభిమానియగు చానలి పున్నయ్యగారిని శిష్యునిగా గ్రహించి పాతూరి కోటయ్యశాస్త్రిగారిస్నేహము సంపా

డించి తదుపరి శిష్యులతో రామేశ్వరము జేరి స్వామిసేవతో నుండుతరి నొకనాడు భజనానందమున దేలియాడుచు ధ్వజము కడ భావసమాధి నైమరచిన నక్కడివారు హారతులతో నాదరించినారు. అటనుండి జంబుకేశ్వరుదర్శించి శ్రీరంగేశ నర్చించి, ఇట్లే దక్షిణయాత్రలనన్నిటిని ముగించుకొని స్వపురి జేరి అందు కొంతకాలముండి ద్వితీయపుత్రుడు చెన్నకేశవు లుండు బాపట్లజేరి గంగరాజు పట్టాభిరామదాసు, అద్దంకి వెంకటాద్రియుడుగార్ల స్నేహముగడించి మూడవసుతుని యాహ్వానముపై నర్సాపురముజేరి యందు భక్తిబీజములునాటి పోషించుచు దనడెబ్బదినాల్గవయేట నాతురసన్యాసమును స్వీకరించి నలవత్సర జ్యేష్టశుద్ధపంచమి మహాసమాధి బ్రవేశించినారు.



# బోధానందమహర్షి

యే యథామాం ప్రపద్యంతే।
తాం స్తథైవ భజామ్యహమ్ ॥

అనుభగవద్వ్యాఖ్యానుసరణి నొకటియైన పరమాత్మ స్మార్తులకు శబళబ్రహ్మముగను, శైవులకు, శివుడుగను, వైష్ణవులకు విష్ణువుగను, శాక్తేయులకు శక్తిగను, సౌరులకు సూర్యుడుగను, గాణాపత్యులకు గణపతిగను, సాక్షాత్కరించు చున్నాడు. షణ్మతములయందలి సాధకులు తత్తన్మతాను సరణి భగవంతు నుపాసించి సగుణసిద్ధిగడించి తద్వారా మనోనాశనరూపమైన యద్వైతానందము నార్జించు చున్నా రనుట లోకవిదితము.

ఇందుశైవులు శివలాంఛనానాదారులై శివారాధనము జేయుచు తదీయభక్తుల బ్రత్యక్షశివస్వరూపులనుగా బ్రేమించి సేవించుచు పరదారాధనవర్జితులై పరమేశ్వరాయత్తచిత్తుల గుచు శివార్పితప్రసాదదీక్షతో జీవభ్రాంతిని ద్రోసి వేసి శివోహ మను మహామంత్రజపదీక్షాదురంధరులై పురుషప్రకృతుల యందు శంకరభావము జేయుచు శివాద్వైతమహాభాగ్యము నార్జించి ధన్యులగుచున్నారు.

ఇట్టి మహానుభావులలో శ్రీబోధానందమహర్షిగా రొకరు. వీరి పూర్వాశ్రమమందలినామధేయము "సుబ్బన్న" ఇంటిపేరు ఇలపర్తివారు. తండ్రిసూర్యనారాయణ. తల్లి మహా

లక్ష్మమ్మ. జననము క్రీ॥ 19వ శతాబ్దమందలి వృషవత్సర కార్తీకశుద్ధతదియ.

ఈపుణ్యమూర్తి శైశవానంతరస్థక్రమమున శుక్లపక్ష పాకసునివలె సుగుణగణభూషితుండై శివాంశసంభవుడగుట దివ్యతేజమున బంధుమిత్ర జనసందోహ నయనానందకుండై శుభలక్షణలక్షితుండై, సుజనవంద్యుండై, విరాజిల్లుచుండె.

సప్తవర్షప్రాయంబున నుపనయనసంస్కారమందె. నాటనే ప్రాకృతవిద్యాభ్యాసమారంభించి పదియవయేట వచ్చియు, రాకపూర్వమే బడినుండి స్వగ్రామమైన గోదావరిమండలాంత ర్గత కాలీరున బంచకావ్యపఠనముగావించి కోనసీమలోని కౌశికా తీరమువగల బోడకుట్టున శ్రీకంఠం కేదారలింగేశ్వ రునికడ వేదాధ్యయనముగావించి పంచాక్షరీవిద్యనభ్యసించి, శంభ, సాళువ, బాలా మంత్రత్రయపాదుకాంతదీక్షసంగ్ర హించి కాంచిపురిజేరి పునశ్చరణావిశేషముచే స్వానుభవము గడించి, పదునైదవయేట మహాలక్ష్మమ్మనువివాహమై అతిథ్య భ్యాగతసేవతో సక్రమముగా గార్హస్థ్యముగడుపుచు విద్యా ర్థుల బలువురసేకరించి విద్యాన్నదానముల దృప్తులగావించి గురుప్రసాదలబ్ధిచే సత్కీర్తినార్జించి వేదపాఠశాలనిర్మించి తద్వారా! అనేకమందివిద్యార్థుల గృతకృత్యులంగావించి త్రిలింగక్షేత్రమందంటను బహుశివప్రతిష్టల జరిపించి స్త్రీవిద్యా ప్రభావముచే నాత్మశక్తివృద్ధిపరచి తన్మూలమున భూతి చికిత్సాబలముగ బలువుర నారోగ్యవంతులగావించి రుద్రాక్ష



బోధానందమహర్షి

ధారణచే బ్రత్యక్షశంకరమూర్తియై గోష్పాదప్రమాణశిఖయు గర్ణముల నాగకుండలములును కలిగి దర్శనీయుండైయుండె.

ప్రారబ్ధమెంతవానికైనను శ్రమలుపెట్టక మానదు గదా! అంత భార్యమహాలక్ష్మమ్మ మృత్యువున కాహుతియగుటయు, సత్యవతినివివాహమాడుటయు సంభవించి క్రమముగ శుభదినము లెమరేగ బ్రథమభార్యకుమార్తె రామమ్మ గారికిని ద్వితీయభార్యకుమారునకును వివాహములుగావించి పరమార్థదృష్టివిస్తరింప విషయలాలసుడుగాక దామరాకుపై జలబిందువువలె సంసృతికంటక మెలంగుచు శివానందస్వామికడ నాశ్రమముస్వీకరించి బోధానందబిరుదమంది సన్యాసాశ్రమ ధర్మములగౌరవడనీక నేరవేర్చుచు గ్రముకభక్షణ పర్ణభక్షణ ఖట్వాశయన కామినీసంభాషణాది గుణగణముల విసర్జించి దండకమండలధారియై కాశీసేతుమధ్యగల పుణ్యతీర్థముల గ్రుంకులిడి పవిత్రుండై కృష్ణానదీతీరస్థ జిలుమూరుజేరి పలువురు శిష్యులు వెంటనంట తెనాలి శైవసంఘము వారివలన జరుపబడిన నగరోత్సవమాదరంబున గ్రహించి, గొల్లలమామిడాడజేరి విస్సన్నగారి సన్మానముతో గొన్నిరోజులందుండి, దుర్గాంబా కళతుడగు వరామిళ్ళపల్లి సాంబయ్యగారికోరికపై భక్తలక్షణము లిట్లుబోధించె.

1. పూర్వజన్మమునం దొనర్చిన యొకానొక పాప విశేషముచే నితరులవలన నపకారము జరుగవచ్చు దాని నెన్నండును మనస్సున కంటనీయరాదు.

2. భగవదాశ్రయమునం దన్యాయ మెప్పుడును జరుగదు భక్తున కేవిధమైన బాధకలిగినను పూర్వజన్మార్జితమైన పాపవిశేషమైయుండు. తత్పాపవిముక్తికై, భగవత్ప్రార్థనము జేసిన యాతడు ముక్తుడగుచున్నాడు.

3. భక్తున కపకారముజేయువ్యక్తి యంతిపాపియుడు మాత్రము, పై పెచ్చుబాధగలిగించుటద్వారా వాడు అజ్ఞానావృతుడగుచున్నాడు తనపై దానే కష్టాల బిలిచి తెచ్చుకొనుచున్నాడు ఖండితము.

4. ఇతరు లెంతబాధగలిగించినను భక్త డాగ్రహపడడు. ప్రత్యపకారబుద్ధిలేనివాడే నిజమైనభక్తుడు. మహాపకారిని మహోపకారినిగా దలంచి ప్రేమించును. అప్పు డా యపకారి మనస్సు పరితాపాగ్నిచే దహించి అశాంతినొందును. ఇప్పుడపకారిని భక్తు డత్యంతదయతో వీక్షించును. వీక్షించుటే కాదు, అపకారిని సమీపించి 'సోదరా! నీవింతగా విచారించుచున్నావేల దీనికి నీవేమాత్రము గారకుడవుకావు, నాకర్మయే నాకపకారము గావించినది. భగవంతుడు నీద్వారా నాకు మహాపకారము గావించినాడు. కాన నీచిత్తమం గేవిధమైన యశాంతిని జెందకుము. యదార్థహృదయముతో జెప్పుచున్నాను. నామాటనమ్ముము' అని చెప్పు నాతడే నిజమైన భక్తుడు ఇప్పు డాతనిమనస్సు సంపూర్ణమైన శాంతిని బొందిన దగుచున్నది. ఇట్లు జరుగనిచో, ద్వేషాగ్ని వారిపురనుగూడ గాల్చివేయును. ఈరహస్య మెఱింగియే భక్తుడు పరాపకార స్పృహ మనస్సున కంటనీయడు.

5. పరులవలన దనకు స్వల్పాతి స్వల్పమైన యుపకారము లభించినను భక్తుడు మరచిపోడు. అది తనప్రారబ్ధమువలన గలిగిన దనిగాని, లేక దనప్రయత్న ఫలముగా లభించినదనిగాని కలలోనైనను దలంపడు. భగవంతు డీమిత్రుని రూపమున దన కుపకరించినాడని తలంచి వానియందెప్పుడును భగవద్భావము గలిగియే యుండును. పరిస్థితులుమారినను పరోపకార స్పృహానుమాత్రము మారనీయడు. వీలులభించినపు డాతని సేవజేయుటకు, సిద్ధముగానుండును. ఆతని యుపకారమును వేనోళ్ల గొనియాడుచుండువాడే నిజమైనభక్తుడు. ఉపకార స్పృహగలవాడే విశ్వరూపోపాసనమున కర్హుడు పై విషయములు జ్ఞప్తియందుంచుకొని, శివనామస్మరణముతో నీ జీవితము సార్థకమొనర్చుకొనుము.

6 యుక్తాయుక్తముల విచారింపక స్వార్థరహితుడవై విశ్వరూపుని బ్రేమించుము. హేతురహితముగా నవమానము జరిగిన అది భగవల్లీలయని సంతసింపుము. ధర్మమైనను పలువుర కిష్టముగాని మాటనుగాని, చేతనుగాని వెల్లడింపక మౌనముద్రవహించుము. దాన నీకు గష్టముగలిగినను సహించుము. ప్రాణాపదసంభవించినను పరహింసకుద్యమింపకుము. దేహాత్మబుద్ధియే మహాపాపమనుట మరువకుము. మాటలలోగాని, చేతలలోగాని శంకరు విస్మరింపకు. మృత్యు దేవతకు స్వాగతమిమ్ము. చూపునగల కామవృత్తి దూరముజేసి ప్రేమవృత్తి నలవరచుకొమ్ము. శంకరుడు సత్యస్వరూపియగుట సత్యదీక్షబూని కృతార్థుడవగుమని మహోపదేశము గావించినాడు. మఱియు,

గీ॥ విషయవిముఖతగల్గిన విబుధకోటి
తోడ భాషింపునియమంబు దొలగబోకు
దుర్జనులపొత్తుచేకూర్చు దొడ్డముప్పు
విజితదుస్సంగవృతి లభించుముక్తి.

అని నిర్మోగమూటముగా శాసించి ధన్యునిగావించు టయేగాక దనజీవితమంతియు మహోపదేశములతో వెలింగించి వేలకొలంది శిష్యుల సంగ్రహించి విజయవాడయందు గల స్వీయాశ్రమమున క్రీ॥ 20వ శతాబ్దమందలి విజయసంవత్సర వైశాఖ బహుళామావాస్యా గురువారమున శివనామ స్మరణతో బ్రహ్మనిర్వాణ భావమందినారు

వీరి భౌతికదేహమును కృష్ణయొడ్డున సమాధిగావింపబడి యపరోత్సవము జరుపబడినది.

శా॥ సన్యాసాశ్రమమందితుట్టతుదకున్
సాయుజ్యసంసిద్ధిచే
నన్యోపాధులులేకశాశ్వతశివ
ధ్యానార్చనాసక్తుడై
అన్యోన్యైక్యసమాధిలోమునిగి బ్ర
హ్మంచత్పరంజ్యోతియై
ధన్యత్వంబునుబొందె ముక్తుడితడా
ధ్యాత్మస్వరూపంబునన్.

(బోధానందవిజయము.)



# పాటిబండ్ల వెంకటప్పార్యులు

గీ॥ తివిరిచద చిద్విలాసహా దేహమంద
చిత్తు స్వేదాంబుధారలై క్షితినిదొరగ
గేవలానందమూర్తియై కీర్తిగొన్న
పాటిబండ్లకులాంబోధి బార్వణశశి
వెంకటప్పార్యుసద్భక్తి వినుతిజేసి
రామచంద్రునిగాంతు దుర్భవమడంతు.

మానవునియం దెన్నిశక్తిసామర్థ్యములు, ఎంతటిప్రభావము. ఎన్నిమహిమలు, ఇమిడియున్నవియో మనకుదెలియునవికావు. మానవునియందుగల మహాత్మ్యమంతయు నెఱింగినపుణ్యు మింతవరకును బుట్టలేదనుట అతిశయోక్తికాదు.

ఈమానవు డీవర్తమానసృష్టిలో నవతరించి దాదాపు రెండువందలకోట్ల వత్సరములు కడచినను వానిశక్తులలో సహస్రాంశము లైనను వెలువడలేదు. ఈ రహస్యమెఱుంగక దాను దుర్బలుడ ననియు, అల్పుడనియు, దలంచుచున్నాడు. విచారించిన నీత డల్పుడుకాడు, దుర్బలుడును కాడు, పైకి గాన్పించెడి దుర్బలము వెనుక నెన్ని సదవకాశములున్నవియో సాధింపదగిన వెన్నెన్ని శక్తులున్నవియో పాపమీతనికి దెలియదు.

జితేంద్రియులను పరమహంసలను, యతులను, అష్టసిద్ధులను సంపాదించినవారలను, వేయేల ఆత్మశక్తిపూరితులను, మన మెందఱెందఱిని చూచుటలేదు. మానవత్వ

మును గూర్చి మనకు దెలిసినది యత్యల్పము. అనంతశక్తి సాగరము మానవుని కాధారమై ప్రకాశించు చున్నది.

ఆధ్యాత్మికమును శ్రవణించి శ్రవణించి తానాత్మ స్వరూపుడనను విషయమును మననించి మననించి ఆ మనన శక్తి తనలో బ్రతిరక్తనాళములలో జొచ్చి ప్రతిరక్తబిందువు నందును, స్పదించువఱకు దనసప్తధాతువులలో దనపంచకోశములలో బ్రవేశించువఱకును రేయింబవళ్లు మననము జేయుచుండిన దన శక్తిసామర్థ్యములు, తన ప్రభావములు, మహిమలు, బయటబడును.

మానవుని తనువనిత్యము బ్రహ్మానందమయము. సర్వజ్ఞము. సర్వశక్తిమంతము. స్వయంప్రకాశమాన మగు ఆత్మను "నేను" అనుభావముననిండి నిబిడీకృతముగావలయు, అహోరాత్రములు దీనినే మననము జేయుచుండవలయు.

మానవ జీవితముతో నీతత్త్వమవినాభావసంబంధము నొందువఱకు ఐక్యమగువఱకు మననము జేయవలయు అప్పుడు కాని క్రియాశక్తి వెలువడను. నిండు హృదయమునుండియే క్రియలు వెలువడును. మానవు డాదర్శప్రాయుడై నప్పుడే క్రియాశక్తి వెలువడుట సంభవించును. నరుడు నిత్యము ప్రపుల్లహృదయములో నుండునపుడే భావబలమున గ్రియలు ద్విగుణీకృతశక్తివంతములగును. అవి దివ్యములై శోభించును. ఈభావము దన జీవితమున నిరంతరము వర్తింప జేసికొనిన "వాడే జ్ఞాని, వాడే భక్తుడు, వాడే యోగి" ఇట్టివ్యక్తులలో నాత్మ

శక్తుల గొన్నింటి నార్జించిన పుణ్యమూర్తి మన పాటిబండ్ల వెంకటప్పార్యు లొకరు.

తండ్రి దేవగురుబ్రాహ్మణ భక్తిపూరితుడగు నాగయ్య గారు. సాధ్వీమతల్లియగు తల్లి రాజమ్మ. వీరి పురుషసంతానములో బెద్దవాడు మన వెంకటప్పార్యులు. జననస్థలము గుంటూరుమండలమునగల చేబ్రోలు కమ్మవా . జననము క్రీ॥శ॥1866 జులై 29 తేది. తన అరువదిరెండవ వత్సరవయస్సున అనగా విభవవత్సరాషాఢశుద్ధత్రయోదశీ శనివారము తెల్ల వారుజాము 4 గంటలకు నిర్యాణసౌధ మధిరోహించినారు. వీరికి గోటయ్య. కృష్ణయ్య లనుసోదరులును, నరసమ్మగారను తోబుట్టువును గలరు. శ్రీవారు జననీగర్భ ద్వాదశమాసజీవి.

బాల్యమంతయు నాటపాటలతో బూర్తియైనది. గాని విద్యాభ్యాసప్రయత్నము సున్నపడినది. గాన నిరక్షరాస్యుడని చెప్పకతప్పినదిగాదు. అయినను వసుచరిత్ర మనుచరిత్ర, మొదలగుగ్రంథములనుగూడ నవలీలగా నర్థము చేసికొను శక్తిసామర్థ్యములుగల మహనీయుడు. స్ఫురద్రూపుడు. సుందరవిగ్రహముగూడ. ధైర్యస్థైర్యములలో మొదటివాడు.

ఒకప్పుడు దొంగలు పదుగురువచ్చి చేబ్రోలులోని సంపన్నగృహస్థుని యింటబడి దోచుకొని తమకు లభించిన ద్రవ్యము నూరి వెలుపల బంచుకొనుచుండ నెఱింగి యొంటి మైజని యాతస్కరులనోడించి జయముగాంచి, వారియొద్ద నుండిన ధనకనకాదివస్తువుల, గొనివచ్చి తద్గృహస్థునకిడి తన

బాహుబలమును పరీక్షించిన ధైర్యశాలి మన వెంకటప్పార్యమహాళి.

పై గనుపరచిన చోరులలోని పైలుమానొకడు శ్రీవారి సంతమొందింప నెంచి వచ్చి శిష్యత్వమర్థించిన సమ్మతించిన అతడు గురుసేవజేయుచు, కపటముతో గాలముగడపుచుండి యొకనాటిరేయి, తనయత్నమును సఫలీకృతము గావించుకొన నెంచి వినయమున గురువు సమీపించి పాదసేవా నెపమును పురస్కరించుకొని పనిగొన మొదలిడినాడు. ఇనుపతునకలపై జేయి వేసినట్లైనది. శరీరము స్పృశించిచూచినాడు, ఉక్కు-దుంగనంటినట్లైనది భయపడి మరుదిన ముదయముననే పలాయనము జిత్తగించినాడు.

ఎంతటిశక్తి, ఎంతటిపరిభావము ఇట్టివాడుకనుకనే ముప్పదివత్సరములనాడు సమాధినిజేర్చిన శ్రీవారి దివ్య దేహము చెడిపడకుండ గలిగినది. సామాన్యులకు విపరీతముగ దోపవచ్చు, బరీక్షించిన నిజమెఱుంగనగు.

వీ రేకోనవింశతి వర్షప్రాయమున జలువూరి భిక్షావతీం ద్రులవారివలన బంచాక్షరీమంత్రోపదేశమునందీ, దాదాపు పదికోట్లు జపించి దీక్షముగించినారు. నాడుమొదలు సంస్కృతాంధ్రగ్రంధముల యందుగల యాధ్యాత్మికములగు విషయముల శ్రవణమాత్రముచే గ్రహింపగలశక్తి యలవడినది. శ్రీవారి కనుభూతికిరాని యాధ్యాత్మికరహస్యములుగాని, ఆధ్యాత్మిక వాఙ్మయమునం దర్థములుగానిగ్రంథములుగాని లేవని చెప్పవచ్చును. వీరిప్రథమభార్యా దుర్గమ్మగారు. పదియేండ్లు

కాపురము జేసిన యనంతరము దేహముజాలింపగా, తన నలు బదియైదవయేట రెండవ వివాహమైనది. గాని ఆమెయు నెల దిరుగకముందే గతించినది ఈమె పేరు లక్ష్మమ్మ తదుపరి వత్సరము ముగియులోపలనే వెంకటసుబ్బమ్మను పరిణయమై పంచాక్షరీమంత్రి ముపదేశించినారు. ఈమెగారు పంచాక్షరి నుపాసించి మంత్రసిద్ధినందుటయే గాక దనదివ్యస్వప్నమున శంకరసాక్షాత్కారమంది పిదప కుంకుమప్రదానానంతరము శరీరము జాలించినారు ఈమెగారి సంతానమే హైమవతమ్మ, నాగేశ్వరరావుగార్లు. నాలుగవభార్య బాపమ్మ సజీవి. వీరు భర్తవలన బంచాక్షరీమంత్ర ముపదేశమందియుంట నాడు మొదలు నేటివఱకు నియమబద్ధయై జపతపానుష్టాన శ్రవణ మననములయం దాశక్తచిత్తలై పరమేశ్వరుని సేవించు చున్నారు.

శ్రీవారు సత్యదీక్షాధురంధరులగుట వాసిరెడ్డి వీరయ్య గారు. తేబడిన శివిల్ వ్యాజ్యములో దనదీక్షకు భంగము వాటిల్లనీక న్యాయవాది సలహానుగూడ నిరాకరించి జరిగినది జరిగినట్లుజెప్పుట నిజమెఱింగి కోర్టువారు వాదికి వ్యతిరేకముగా దీర్పువ్రాసి ప్లైంటును ద్రోసివేసి శ్రీవారి కనుకూలముజేసి లాభస్తేషామ్।జయస్తేషామ్ । కుతస్తేషామ్ । పరాభవః॥ అను నార్యోక్తిని సార్థకపరచినారు. ఆత్మశక్తిగలవాని కపజయము కలలోని వార్తగదా మరీ!

ఒకప్పుడు శిష్యులకోరికపై సేకూరుజేరి అందు దశి ప్రవచనము జేయుతరి దలవనితలంపుగ కోటిసూర్యప్రకాశమైన యాత్మజ్యోతిని దర్శించి తన్మయులై మూడవనాటికి ప్రపంచోన్ముఖులైనారు. అప్పటినుండియు జీవితాంతమువఱకు బ్రతిదివస మెప్పుడో ఒకప్పు డాత్మజ్యోతిని దర్శించుచు గొన్ని గంటలు సమాధి సుఖమనుభవించు యోగిపుంగవులు మన వెంకటప్పాశాస్త్రులు. వీరి కిప్పటినుండి భూతభవిష్యత్తులు కరతలామలకము లైనవి.

స్వీయవృత్తియగు వ్యవసాయమును కాలాతిక్రమణగానీకసాగింపుచు అందలి ఫలసహాయమువలన నతిథ్యభ్యాగత సేవతో నిజకుటుంబపోషణ జేసికొనుచు శిష్యవిత్తాపహారిగాక నాలుగువర్ణములనుండి శిష్యసంగ్రహముగావించి కృతార్థుల జేయుచు నితరకాలములందు బశువైద్యము పశుపరీక్ష మొదలగు లోకహితకార్యముల జేయుచు జీవితమును సార్థకపరుచుకొనుచుండువారు.

సాధుసేవయందు ప్రాణములగూడ నర్పించు త్యాగమూర్తి ఒకప్పుడు శృంగేరినుండి. రాబడిన సాధుమూర్తితో గలిసి ఆత్మవిచారమగ్నులై యన్నపానములమరచి బ్రహ్మానందపారావారమున మునకలువేయుచు దేహమునురచియుండుతరి యతివర్యు లంతర్హితులైనారు. నాల్గవదివసమునకు శ్రీవారు బహిర్ముఖులై ఋషిపుంగవుడు లేమి విచారించి పరితపించి కొంతవడికి శాంతివహించి సాక్షాచ్ఛంకరులే సాధురూపమున

దర్శనమిచ్చినారని ముదంబురాసి మునకలు వేయుచు దనముం దయాచితమున గనంబడిన యజ్ఞవరాహగీతా గ్రంథమును గాంచి నిజశిష్యుడగు దేశిరాజు రాఘవయ్యగారి చేజదివించి ప్రవచనరూపమున శిష్యకోటికిబోధించి కృతార్థుడగుటయే కాక దానిని బారాయణ గ్రంథముగాస్వీకరించి ధూపదీప నైవేద్యాదిపూజలతో దృప్తిగొనుచుండువాడు.

తనయిరువది రెండవసంవత్సరప్రాయమునందొకనాడిష్టగోష్ఠి నుండి మాటలసందడిలోశిష్యుడగు రావూరి సుబ్బయ్యగారితో గొలదిరోజులలో నిర్యాణకాలమురానున్నదని చెప్పిన కారణ ముగా విభవవత్సరాషాఢశుక్లత్రయోదశిరాత్రి యొంటిగంటకు అతిసారరూపమైన విరోచనమైనది. దానితో దేహము స్వస్థత దప్పి దుర్బలుడైనాడు. ఇది తెలిసి గ్రామమునంగలశిష్యులు గురువర్యుని సమీపించి సేవలన్దన్నుచు గురువున కెఱింగింపకయే పరాశరం వెకంట రామానుజాచార్యులవారిని పిలిపించినారు.

ఆచార్యులవారు నాడిబరీక్షించి శుష్కించియుండుట గాంచి ప్రశ్నించిన నాకుజబ్బేమియు లేదు. విరోచనమగుట దుర్బలముగమాత్రమున్నయది. అనిజబాబిచ్చిరి. ఇది ప్రాణప్ర యాణసమయమని యెఱింగినవాడగుట నాచార్యులవా రౌష ధము దెచ్చెదనని చెప్పుచు దప్పుకొనినారు. కుమార్తెహైమవ తమ్మతండ్రిపాదములొత్తుచు వైద్యుసిరాకకు నిరీక్షించు చున్నారు. కానివైద్యుడురాలేదు. వేకువనాలుగుగంటలైనది. బిగ్గరగా బంచాక్షరీ మంత్రముచ్చరించుచు శ్రీవారు శివైక్య మును బొందినారు.

తెల్లవారినది శిష్యకోటి గురువియోగమునకడలుచు నెట్లో శాంతివహించి శ్రీవారిభౌతిక దేహమునకు స్నానాదికములనిర్వర్తింప జేసి యూర్ధ్వపుండ్రధారణగావించి విమానము నందుంచి మంగళవాద్యములతో నగరోత్సవము ముగించి సాయంకాలమునకు సమాధిస్థలమునకు జేర్చిరి. గురువుగారి భౌతిక దేహమును విమానమునందుంచినది మొదలు సమాధి స్థలమునకు జేర్చువఱ కెంతచెమటనీరు శ్రీవారి శరీరము నుండి యూరినదియో? ఎన్నిమారు లూర్ధ్వపుండ్రములదిద్దినారో లెక్కింపదరముగాదు. గాని సమాధిసమీపమునదింపుటతో జెమటలాగిపోయినవి. జయజయధ్వనులతో సమాధి యందా భౌతిక దేహమును ప్రవేశపెట్ట నొకబండతో ద్వారముమూసి భజనలనోలలాడుచు దదుత్సవమున పాల్గొనిన వారెల్లరు దమతమ గృహములజేరినారు అపరక్రియలు బెద్దల సహాయముతో కుమారుడు నాగేశ్వరరావు జరిపినారు. ఆరు మాసములేగినవి. శిష్యులగు అరవ వెంకటాద్రి, దేశిరాజు రాఘవయ్య, చీదెళ్ల గోవర్ధనము, పాటిబండ్ల అచ్చయ్యగార్లొక నాడు సమాధిపై మండపముగట్టించుటకు బనివారి వెంటగొని సమాధిసమీపించి నిర్యాణకాలమున గురువను సమీపమున లేనివాడగుట నాకొదువ దీర్చుకొన దలంచిన అరవ వెంకటాద్రి కోర్కెమేరకు సమాధి పైబరుపబడిన బండను తొలగించి చూచిరి. ఆరుమాసములనాడు సమాధిలో గూర్చుండబెట్టిన శ్రీవారిభౌతిక దేహ మప్పుడుకు ూర్చుండబెట్టినట్లున్నది.

పడిపోవుటగాని, మురుగెత్తుటగాని లేదు పైగా జిరునవ్వు మొగముతో విరాజిల్లుచున్నయది. చూపరబ్బురపడినారు. శ్రీవారిమహిమ వేనోళ్ళగొనియాడినారు. అంత నివాళులిడి ద్వారము తిరిగి బండతో మూసి సున్నపు పనితో సమాధి నలంకరింపించి క్రమముగా మండపము పనిపూర్తిగావించినారు. నాటినుండి నేటివఱకు కుమారుడు నాగేశ్వరరావుగారు వార్షికోత్సవములు జరుపుచున్నారు.

బాపమ్మగారును పతిభక్తిగలవారై జపతపానుష్ఠానములుగావించుచు నాధ్యాత్మికవిచారణతో జీవితము బవిత్రవంతము గావించుకొనుచున్నారు. శ్రీవారిశిష్యులలో బ్రిధముడగు కీర్తిశేషులైన చీదెళ్ళ గోవర్ధనముగారికోరికపై నీ దివ్యచారిత్రము బూర్తిగావించి శ్రీమదాంధ్ర మహాభక్త విజయమునందు జేర్పబడినదని మనవి.

గీ॥ విభవసంవత్సరాషాఢ విహితశుక్ల
పక్షమందు త్రియోదశి రాత్రివేళ
తనువుజాలించి సంసిద్ధి తగనుబొందె
వసుధశ్రీపాటిబండ్లన ద్వంశవిదుడు॥.



# సందడి రామదాసు

ఏకోరికలు లేనివాడుజ్ఞాని. వీని కాజ్ఞానప్రకాశమువల్ల ద్వైతమునశించినది. దాన నంతయు దానేయైనాడు. "అద్వైత బ్రహ్మమనిన నితడే స్ఫటికమునీటిలోనుండి అది యాస్నీటికంటె వేరైయున్నను దానినెట్లుగుర్తింపలేమో? అట్లే జ్ఞానినిగూడ గుర్తింపలేము. వాయువాకాశమున గలసి పోయినప్పుడు ఆకాశ మునకు భిన్నముగా వాయువుండదుగదా? అట్లే జ్ఞానియగువాడు బ్రహ్మలోగలిసి, బ్రహ్మమేయగుచున్నాడు.

జ్ఞానస్వరూప పరబ్రహ్మమే కాని; జ్ఞానిమాత్రము గాడు. ఆకాశమునుండివాయువు బయటపడినప్పుడు ఆకాశము నందు ఆవాయువున్నదని యెట్లుదెలిసికొనుచున్నామో? అట్లే శరీరముద్వారా కర్మాచరణమొనర్చునపుడు, లోకులకు జ్ఞాని, భక్తునివలె గనుపించును. గాని, విమర్శించిన నాత్మానుభవము వలన భగవంతుడే యగుచున్నాడు. ఇతనికిప్పు డాత్మాను భవము సహజమైనది. సహజముగ బ్రహ్మమే తానునుట.

ఇతడుభిన్న దేహధారియైనను పరమాత్మాభిన్నుడు, అనగా మాధవుడైన మానవుడు జ్ఞానోదయంబైన వెంటనే తననుదామరచినాడు. ఆత్మానుభూతియను గంగాప్రవాహము బ్రహ్మానందసాగరమున గలిసిపోయినది.

ఇదిమహారహస్యము. ఇతడు వాసుదేవస్సర్వమితి, అనుభగవద్వాక్యమునకుగురియైనాడు. వీడే శ్రేష్ఠభక్తుడు ఆర్త అర్థార్థిజిజ్ఞాసభక్తులకంటె నుత్తముడు ఇతనియనుభూతిలో

స్థావరజంగమములన్నియు మునిగిపోయినవి. ఎందుచూచినను దానర్షై మిన్నుముట్టిన పుణ్యపూర్తి ఇతనికి పశువునుగూడ మాటలాడింప సమర్థతగలిగియున్నది. ఇట్టివారలలో మన సందడి నాగదాసుగారొకరు.

తండ్రి రామయ్య. తల్లి పార్వతమ్మ. అన్న కోటయ్య. తమ్ముడప్పయ్య. కులము కురప. జననము క్రీ॥ 19 శతాబ్దము. కుమారుడు (శ్రీ)రాములు సజీవి గ్రామము దబ్బాకుపల్లెనంది గాం తాలూకా. ఈయన శైశవమున నుయ్యలనున్నప్పుడీగలు, దోమలు, నల్లులు, పైనబ్రాకిన నుపేక్షించి పరధ్యానములో నుండునుగాని యేడ్చియెఱుంగడు తల్లిగాని, యితరులుగాని, వచ్చి ముద్దునకు నవ్వించిన విపరీతముగా నవ్వువాడట. దోగాడునప్పుడుగాని నిద్రించునప్పుడుగాని, మఱియేఇతరా వస్థలయందుగాని చిరునవ్వుతో గూడినముఖముగలవాడై యుండును ఆకలెఱింగిపాలిచ్చిన ద్రావునేకాని పోరుబెట్టి యెఱుంగడు, ఐదేండ్లునిండినవి,

సీ॥ ఆకలియనితల్లి నడుగబోడన్నంబు
యెఱిగిపెట్టినచో భుజించుచుండు
ఈడుబాలురగూడి ఆడబోడెన్నండు
వొంటిమైచరియించి యొప్పుజూపు
వస్త్రభూషణములు వాంఛింపడెన్నండు
రామభజనలుసేయ గోముగాంచు
గృహకృత్యములజోలికే పోవడేవేళ
హరిచరిత్రలవిన నరుగుచుండు.

గీ॥ గ్రామ జంతువులనుగను గొన్నవేళ
వైరమూనకనిజప్రాణి వలెనెయెంచి
పరమకృపజూపుదనదగు బాల్యమందె
నాగదాసుసామాన్యమా నవుడెతలప॥.

ఇట్లపరప్రిష్ఠోదుడై యుండునెడ దలిదండ్రులుగాంచి యొకనాడు పుత్రునిబుజ్జగించుచు నాయనా! నోడిపిల్ల లెట్లుండిరో? చూడుము నీవునువారికివలె బుట్టలేదా? ఏమిచెప్పినను తలనూచెదవేకాని, ఔ, ననవు. కా, దనవు, తుదకన్నమైన నడుగవు, పిల్లలాటలకుబిలిచిన సమ్మతింప వెందులకూ, నేటినుండి పశువుల మేపికొని వచ్చుచుండుము, లేకుండిన మందమతి యేర్పడును, పెండ్లికావలె, భార్యాకాపురమునకు రావలె. సంసారము చేయవలె, ఇట్లుండిన నెట్లుజీవితము సుఖవంతము జేసికొనగలవు.

నిన్నుజూచిన మామనములు తల్లడిల్లు చున్నయవి, నీయన్నను జూడుమెట్లున్నాడో? వానితో బడికిపోయి చదువుకొనుము, భగవద్భజనలు సేయుటకును, భగవచ్చరితల వినుటకును కాలమిదికాదు. ఆదిముందు రాగలదు అనిచెప్పి బడికంపిన నాతడట్లు కావించి యచిరకాలమున వేదశాస్త్రపారగుడై బడివిడచి ముత్తినరపు వెంకటాద్రివలన, యోగమభ్యసించి తానెఱింగిన సత్యమును పలువురకెఱింగించి కృతార్థుడయ్యె ఇట్లుండి తల్లియాన దలధరించి అచ్చమాంబను వివాహమాడి యిహపరముల సమముగ నడుప జూచెను గాని సంపూర్ణముగ వ్యతిరేకియైన భార్యతో సంసారమును

వేగించుచు వివేకముగోల్పొక భగవత్కథాకాలక్షేపముల, బొద్దులు పుచ్చుచుండె.

ఇప్పటి దాసుగారిసంసారశకటము కడగండ్లతో సాగి పోవుచున్నది. అత్యంతమెలకువతో సంసారనౌకను జీవితప్రవాహమున నడపుగొని పోవుచున్నాడు గురువారాధనా మహోత్సవ మేతెంచినది. వందలకొలదిగా శిష్యులేతెంచినారు. మొదటిరోజు గురుపూజ జరిగినది. రెండవనాటిరేయి భజనలతో బొద్దుపుచ్చి రెండవయామమున శిష్యులకు వేదాంతబోధ జేయుచు, దేహముమరచి పోయినారుదాసుగారు. శిష్యలోకము గురువుననుసరించినది, జాముపొద్దెక్కినది. దాసుగారికి గాని చుట్టునుగూర్చునియున్న శిష్యులకుగాని బాహ్యస్పృహ తలజూపవేదు. రాతిబొమ్మలైనారు. కేకలతో నచ్చమాంబ వచ్చి జాముప్రొద్దెక్కినది. పాచియిల్లు బాగుచేసుకొనవలదా? ఏమీ! మాట్లాడరు, మూగమొద్దులవలె బలుకరేమి లెండి లెండి, చాలు, చాలు, మీ వేదాంతబోధలు పలుకరేమి? అనుచు నోటబట్టరానిమాటలతో అదలించినది. కాని పలికిన వారులేరు. విసికినది. త్వరత్వరగాలోనికేగి గృహశుద్ధికొఱకు వేడగలిపిననీటితో నిండిన కుండనొకదానిని బట్టుకొనివచ్చి పటపటబండ్లుగొరకుచు శిష్యులమధ్యగూరుచుండిన దాసుగారిని స్నానమున ముంచెత్తినది. కాని శ్రీవారికి దేహస్మృతి రాలేదు. నివ్వెరపోయినది అచ్చమాంబ. శిష్యులుకొందఱు బహిర్ముఖులై గురుపత్నిచేతకు దలలూచుచు మిన్నకుండిరి.

తాను కోపముతో జేయబడిన విపరీతప్రకార్యమునకు బశ్చాత్తాపపడుచు బెనగొనుదుఃఖమున భర్తపాదములంబడి తప్పు క్షమింపుమని విలపింపదొడంగినది. ఆయేడ్పువిని చుట్టుపట్టులంగల స్త్రీపురుషులెల్లరు వచ్చిమూగిరి. గాని అచ్చమాంబ దుఃఖమూగలేదు. శిష్యలోకముతో దాసుగారు బహిర్ముఖులగుటకు బగలు రెండుజాములయినది. తనపాదములబడి దుఃఖముతో మైమరచిన యచ్చమాంబనూరడించి జరిగిన దానికై వగచిన ప్రయోజనమూవంతయు లేదు. గాన నూరడిలి యిటు వినుము.

సీ॥ సకలదృశ్యంబెన్న టికినేనినశియించు
నని మదినూహించు కొనగవలయు
బుట్టిచచ్చెడివస్తు వులకెద్ది హేతువో
దానినేమాయగా దలపవలయు
అఖిలమైయద్దాని కంటకనిర్మలం
బగునదియేస్థిరం బనగవలయు
కడకదే మూడవస్తలకు సాక్షియనుమ్మ
టంచు నీలోపల నెంచవలయు.

గీ॥ అట్టియాత్మనె యీశ్వరుం డనుచునమ్మి
నిండుభక్తిని భజియించు చుండవలయు
కడుభయంబున గాలంబు గడపితుదకు
భవముదరియించిమోక్షంబు బడయుమబల.

(నాగదాసుహరికథ)

అని తత్వబోధగావించి జ్ఞానపథగామినినిగా జేసి ధన్యను గావించినాడు.

నాడు మొదలు లచ్చమాంబ సుజ్ఞానఘనియై పరిపూర్ణ సమాధిసుఖమనుభవించుచు భర్తకు జేదోడు వాదోడుగా మెలగి లోకవంద్యయైన దాసద్గుణకదంబ, అచ్చమాంబ.

అప్రయత్నముగ వికారి వత్సర చైత్రశుద్ధతదియ సప్తాహముప్రారంభించినారు. చేత చిల్లిగవ్వయేనియు లేదు దాసుగారు ధనవంతుడా, కాదు. గృహములోనున్న నువ్వుల నూనె వినియోగించి సమంత్రకముగ నఖండారాధనగావించి శిష్యులతోడను గ్రామమందునంగల విప్రులతోడను గలసి భజనసేయుచు గూరుచున్నారు దాసుగారు.

బియ్యపుబస్తాలు, నేతిడబ్బాలు, కూరగాయలు బండ్లతో వచ్చినవి. కారణమడుగ గమ్మమ్మెట్టుషాహుకారియాజ్ఞ గొని వచ్చితిమనియు నాతనిపేరు తమకు దెలియబడదనియు బండ్లవారు చెప్పి తెచ్చినసంభారములన్నియు దింపి దాసుగారివలన బాడుగమాత్రము గ్రహించి వెళ్లినారు. విచారింప గ్రామవాసు లాపదార్థములంపించిన వర్తకుడెవ్వండో తెలియమి భగవద్విలాసమని సంతసించినారు ఏమని ప్రశ్నించిన తెలియనివానివలె, దాసుగారు, చిరునగవుద్వారా సమాధానమిడినాడు. ఆత్మశక్తి యెంతకుజాలదు క్రతువు యేడురోజులు భూరిఅన్నదానముతోడ నుపన్యాస భజన హరికథాది కాలక్షేపములుతోడను అవబృథాంతతో క్రతువు పూర్తియైనది. మఱియొక విశేషము! భోజనపదార్థముల

కొట్టుముం దొక నూతనవ్యక్తి రేయుంబవలు నిద్దురమరచి కావలియున్నాడు. ఈతడి దేయూరో? ఎక్కడినుండివచ్చి నాడో, పేరేదియో, ఎవరికిని తెలియదు గాని, ఆయేడు రోజు లీతనికి గుడువబెట్టి గాని, దాసుగారు భోజనముజేయు వాడుగాదు ఆతడాజానుబాహు, స్ఫురద్రూపి, ప్రేక్షకులెల్ల రతనిజూచి ముగ్ధులగువారేగాని, నీ వెవడవు ఎందుండివచ్చి తివి, పేరేమి అనిప్రశ్నించిన వారే లేరు. సప్తాహాంతమందం తర్హితుడైనాడు. ఎక్కడకుబోయినాడో? ఎప్పుడుపోయినాడో ఎవరకిని తెలియదు. భగవల్లీల లతివిచిత్రములుగదా? సప్తాహాంతమందొక సత్రమును నిర్మించుటయేగాక శ్రీలక్ష్మి నారాయణస్వామివారి ప్రతిష్టనుగూడ జరపించినారు. సంకల్ప సిద్ధుల కెదురుదిరుగు కార్యకలాపము లెందును గనుపింపవు. ధ్వజప్రతిష్టకాలమున జరిగినసంఘటనవలన దాసుగారి మహాత్వము వెల్లడియైనది. ధ్వజప్రతిష్టామహోత్సవమును దిలకించుటకు వేలకొలది చూపరు లేతెంచిరి. వచ్చినవారందఱును ధ్వజమునుగర్తముననిల్పుటకు బ్రయత్నించినవారే, గాని అది లేవలేదు; పలువిధప్రయత్నముల నల్పవిఫలులైనారు. దాసు గారాలోచించి పూజామందిరమున కేగి భగవానుని బ్రార్థించి ప్రార్థించి దేహముమరచినారు. ఇట్లుండ మేదరమెట్ట వెంక య్యగారెందుండియో? పరుగునవచ్చి, చూపరుల సహాయముతో సులభముగ ధ్వజమును లేపి గర్తమునందుంచి బిగింపించినాడు. ఇంతలో దాసుగారు బహిర్ముఖులై ధ్వజము కడ

కరిగి విషయమోతింగి పిలిపించి ప్రశ్నింప, వెంకయ్యగా రాశ్చ
ర్యముతో నిట్లనిరి.

అయ్యా! గతరాత్రి యందంతయు పనివారి వెంటనుండి ధ్వజముపని పూర్తిచేయించు కార్యమున వర్తించుట నిద్దుర లేని పాడనగుట బడలికచే నింటికేగి నిదురించుచు దాను గబురం పిన వచ్చినాడ. ఈధ్వజములేచినసంగతియే నేనెఱుంగను అని చెప్పినాడు. అదివిని ఇదియంతయు భగవల్లీలయని తలంచి, యాత్రికులతో దాసుగారు సంతసించినాడు.

ఒకప్పుడు స్వామివారికి తెప్పతిరుణాళ్ళ జరుగుచున్నది. తెప్పపైనగూరుచుండి భజనయందు బాల్గొనువారిలో నిద్దరు వ్యక్తులు నీటబడి మునకలు వేయుచుండిరి సమీపమున నీతగాడులేమి వారి నెవ్వరును బయటికిదీయ సాహసించిన వారు లేకపోవుకారణముగా మునిగిపోయినారు తేలలేదు. చచ్చినారనితలంచి యాత్రికులెల్ల హాహాకారములు గావించిరి. ఇంతలో నీతగాండ్లే తెంచి నీటదూకి శవముల వెదుక బ్రారంభించిరి ఉత్సవమాగినది దాసుగారు దెప్పనుండియే భగవత్ప్రార్థనలో మునిగినారు. కొంతవడికి దాసుగారిముందు నీటబడినమృత దేహములు తెప్పపై గనుపడినవి అవి సజీవములని యాత్రికులు సంతోషపారావారమున దేలియాడిరి. చూపరుల సంతోషమెట్టులకో? యనునట్లు ఆ దేహములను దాసుగారు చేతితో స్పృశించిరి నిదురబోయి లేచినవారివలె లేచిగూరుచుండిరి. ప్రశ్నించిన నీటమునింగి తల్లటపడు మమ్మెో

వరో తెచ్చి తెప్ప జేర్చినారు. వారిట్టి వారని చెప్పలేము. తెప్ప జేర్చిన వెంటనే మైమరచితిమి. అని ఈ శుభ వార్త దెలిసి నీట నుండిన యాత్రిగాండ్లు తాము వెదకు ప్రయత్నములుమాని తెప్ప జేరి అద్భుతదృశ్యమున కానందించినారు దీక్షితో నాత్మ శక్తిపూర్ణులని దాసుగారు పొగడొందినారు.

వీరు పలుకు మాటలన్నియు పద్యములుగనో, గేయములుగనో, శ్లోకములుగనో, వెలువడుచుండెడివి దాసుగారు నిరంతర ధ్యానానందపారావారనిమగ్నులై యుండుటయేగాక సుజనసందేహనివృత్తికరంబులును దుర్జన దురుక్తిభంజనములును అగు గ్రంథముల బెక్కిటిరచించిరి. అందు గొన్నింటి మాత్రమిందు బొందుపరచెద.

1. భగవద్గుణకీర్తనలు
2. లక్ష్మీనారాయణశతకము
3. శ్రీపతిశతకము
4. భజగోవిందకందార్థములు
5. భగవద్గీతాకందార్థములు
6. సకలతత్త్వార్థదర్పణము
7. జీవన్ముక్తివిచారము
8. అచలబోధసీసార్థము
9. సర్వమతసమత్వసిద్ధాంతము
10. రామనామప్రభావము
11. పంచాక్షరీమహాత్మ్యము
12. బ్రహ్మవిద్యైక్యసారము
13. మోక్షమార్గదర్శనము
14. దుర్మతఖండనము
15. వర్ణాశ్రమతత్త్వబోధిని
16. మతవివాదపరిష్కారము
17. తారకనామకీర్తనలు
18. పూర్ణబోధగీతార్థము
19. పుత్రీమణత్యాగోపాఖ్యానము
20. భక్తదూషణనిరసనము
21. అచలాంతార్థప్రకాశము
22. స్వరోదయము
23. నామదేవుచరిత్ర
24. సత్యనారాయణవ్రతమహాత్మ్యం
25. నిఖిలరోగనివారణోపాయము
26. ప్రారబ్ధదీపిక
27. రోహిదాసు,కబీరుదాసుసంవాదం
28. నారాయణనామప్రభావము

29. భద్రాచలమహాత్మ్యము
30. ద్రౌపదీవస్త్రాపహారణము
31. రంతీదేవుచరిత్ర
32. భక్తిసారసంగ్రహము(కీర్తనలు)
33. లక్ష్మీనారాయణకీర్తనలు
34. విశ్వజననిశతకము
35. విగ్రహార్చనసిద్ధాంతము
36. కర్మస్వరూపసిద్ధాంతము

మొదలగునవి.

వీరు ప్రత్యక్ష్యసచ్చిదానందమూర్తులు, దేహధారులయినను పరమాత్మాభిన్నులు వీరికి ప్రారబ్ధజన్యమయిన శరీరాభిమానము పూర్ణముగా నశించినను తత్ప్రారబ్ధము, లోకహితమున కుపయోగించుచుండిరి ఇప్పు డీతని చర్యము లన్నియు భగవల్లీలలు రోగనివారణోపాయమును గ్రంథరూపముగ దెల్పిన శ్రీవారికి కాసరోగము జనించినది. వ్యాధి ప్రబలినకారణముగ బాధ నభినయించినారు.

ఈస్థితిలో ధనుర్మాసోత్సవములు ప్రారంభింపబడినవి నాడు మొద లారుమాసములు వ్యాధితలజూప లేదు. మఱి యొకతరి దోటకూర బాపయ్య, ముకుందరామదాసుగార్లతో రాజమండ్రినుండుతరి నొకరోజు బగలంతయు వ్యాధిబాధితుండై లేవ లేనిస్థితిలో నుండుట, శిష్యు లుపచారములు, సేయుచుండిరి పొద్దుగ్రుంకినది క్రమముగ నిశీథిసమయమున కుపచారకులు కనుగూర్కినారు కొంతవడికి దడిగుడ్డలతో నొకబ్రాహ్మణుని వెంటబెట్టుకొనివచ్చి ముకుందదాసును లేపి వీరు గోదావరీస్నానమునకు సంకల్పము జెప్పిన విప్రులు పుణ్యా

మూర్తులు వీరికొకరూప్యము దక్షిణగా నిమ్మని చెప్పియిప్పించి పంపినారు రోగిష్ఠులైయుండి నడిరేయి గోదావరీస్నానమేమిటి ఈ తెడిగుడ్డ లేమిటి యని ప్రశ్నించిన దేహము చికాకుగా నుండిన స్నానము జేయుట తప్పగునా? నోగు నూయుమని యదలించి పంపినారు.

ఇట్లెన్నియో లీలల బ్రకటించి క్రీ॥ 20వ శతాబ్దము నందలి పరాభవసంవత్సరాషాఢబహుళామవాస్యనాఁడుదయ మందు బద్ధాసనాసీనుఁడై శరీరము జాలించినాఁడు.

వీరు 1921 దబ్బాకుపల్లె వెళ్ళినప్పుడు రంగదాసుగారు ప్రతిష్ఠించిన లక్ష్మీనారాయణమూర్తిని మఠమున నిలుపఁబడిన దాసుగారి చిత్రప్రతిమను చూచి ధన్యుఁడైనాఁడు.

గీ॥ నీవు నాలోన జేరుట నిఖిలదృశ్య
మంతయును నేనయన్యమావంత లేదు
లేదు ముమ్మాటికి కన్యంబు లేదు దబ్బ
పత్రపురివాస నవ్యశోభన విలాస ॥

---

# రా మ యో గి

స్వపరిపాలనా సంపదపైనను భౌతిక విధానము పైనను, భారతదేశవైభవ మాధారపడక తపోధనులగు మహర్షి పుంగవుల జ్ఞానవిజ్ఞాన రూపములైన ఆధ్యాత్మిక ప్రతిభ వలన సర్వాంగ సుందరమైయున్నయది.

యువకుల ప్రవర్తనలు పాశ్చాత్యనాగరికత కలవాటు పడి యార్యవిజ్ఞానభాస్కరుని మలినమొనర్ప నెంచినను ప్రభాకరుని తేజమునకు కళంక మాపాదించునా? కాలగర్భమున దాగిన మహాశక్తియొక్క నవ్యకాంతులు రోజులు మంచివయినప్పుడు ప్రభావంతములు కాకపోవు. హిందూ మహాసముద్రమునుండి వెలువడిన జ్ఞానరత్నములు జీవన్ముక్త కాంతులు వెల్లివిరిసి సుజ్ఞానోద్ధరణ కారణములగుచున్నవి. అట్టి మహామణులలో రామయోగి మణియొకరు.

తండ్రి చేవూరి పిచ్చిరెడ్డి. తల్లి రామమ్మ. జననస్థలము నెల్లూరునకు బదిమైళ్లలోనున్న నరసింహులుగిరి దాపునగల మోపూరు. జననకాలము (1895) మన్మథవత్సర శ్రావణ శుద్ధాష్టమీ యిందువారము. పంట రెడ్డివంశము. శ్రీవారి పుటుకకు బూర్వపురోజు వీరినాయనమ్మగారి కలలో నొక దివ్యపురుషుడు ప్రత్యక్షమై, "రేపటియుదయము మీవంశాలంకారుడగు దివ్యపురుషు డుద్భవించి లోకమాన్యుడగు" నని తెలిపి యంతర్హితుడైనాడు. ఆయన సెలవిచ్చిన కాలముననే మన యోగిగారి పుటుకజరిగినది. పిల్లవానికి రెండవనెల వచ్చియు రాకపూర్వమే తండ్రియు, నాయనమ్మయు బరప

దించినారు. భోగభాగ్యముల కాలవాలమైన కుటుంబమైనను తగుసమర్థతతో నడుపజాలమి భూములన్నింటిని మక్తాలకిడి పిల్లవాని జేతగాని రామమ్మ అన్నగారిల్లు జేరినది. ఆకారణముగ మన యోగిగారన్నారెడ్డిపాలెంలో సతిగారాబముతో బెరుగుచున్నాడు. బ్రహ్మానందస్వామి నెల్లూరునం దాధ్యాత్మిక ప్రచారము జేయుచుండిరి. యోగిగారిని చదువులబడికంపినారు. గాని ప్రాకృతవిద్య పట్టుబడలేదు. అందు వ్రాయుట చదువుట మాత్రము నేర్వగలిగినాడు నైనను వెల్లినది. అంతర్లక్ష్యము, ధర్మవిచక్షణ, సత్యదృష్టి, యుక్తాయుక్తవిచారణ క్రమముగా బెరుగ జొచ్చినవి. వివాహము నిరాకరించుట జననీపుత్రులకు సమస్య యేర్పడినది.

ఒకనాడీ వివాహవిషయమై చర్చించుకొను సందర్భము ననుసరించి వెలువడిన వాక్యానుసరణి దనకు గల పిత్రార్జిత మంతయు తల్లిపేర దఖలు వ్రాసి నెల్లూరుజిల్లా రిజస్ట్రారువారి ఆఫీసులో రిజష్టరుచేయించి సదరుపత్రమును పోస్టుద్వారా జనని కంపి యంతర్హితుడైనాడు. తనకు జేరిన దఖలు పత్రిమును చూచి దుస్సాధ్యములైన కాంతాకనకముల తృణప్రాయముగ వదలిన పుత్రుని వైరాగ్యమునకు సంతసించి అత్తగారు చెప్పినట్లు మహాపురుషుడని నమ్మినది. గాని పుత్రవియోగ బాధ మిక్కుటమై పలుచోట్ల వెదుకబంపినది గాని పుత్రుడు కనుపింప లేదు. మేము చూచితిమని చెప్పువారునుగూడ లేరు నిరాశవహించినది. కొడుకు దేనిలోనో పడిచచ్చి పోయినాడని తలంచి దుఃఖించి దుఃఖించి సంపూర్ణవిరాగిణియై తనకు

లభించిన యాస్తినంతయు దానధర్మములక్రింద వినియోగించి యెట్లో జీవితము సాగించుచున్నది రామమ్మ.

ఐదేండ్లుదాటిన నొకనాడు కర్ణాకర్ణిగా నెల్లూరునందు గొత్తగారాబడిన బ్రహ్మానందస్వామివారి సేవలో కొడుకుండుట విని సంతసించి, ప్రయత్నపూర్వకముగా బయనించి నెల్లూరునకేగి వానిగాంచి పుత్రవాత్సల్యము బ్రకటింప సమీపించిన, "ఏమ నీవాడుకాదు. నీకొడుకు చచ్చినా"డని చెప్పుచు బయవెళ్లిపోయినాడు అందామె యెన్నిరోజులున్నను తిరిగి కనుపింపలేదు నిరాశజేసికొని శ్రీస్వామివారి నాశ్రయించి తారకమంత్రోపదేశము నంది యిల్లుజేరి మంత్రజపసిద్ధిగడించి ఇహదృక్కు విసర్జించి, పరదృక్కార్జించి ధన్యురాలైనది.

అట్లు బర్వెత్తిపోయిన రామయోగి నిజమైనయోగియై చీమకుర్తి పర్వతగుహ జేరి. యన్నపానముల మరచి తపోసిద్ధి గాంచి నిర్వికల్పమార్జించియుండ, గొన్ని సంవత్సరము లేగినపిదప వైవాద్యాబాహ్యస్మృతిగలిగి తలవనితలంపుగా తీర్థయాత్రల జేయవలయు ననుసంకల్పమంకురించినది. వెంటనే బయలు దేరి గురుమూర్తి యనుజ్ఞవడయుటకై నెల్లూరున కేగినాడు. గాని స్వామివారు బాపట్లయందుండిన ట్లెఱింగి పాదచారియై భావపురిజేరి గురుమూర్తినిదర్శించి తనయభిమత మెఱింగించిన జిరునగవుతో స్వామివా రిట్లనిరి.

పుత్రా! నీసంకల్ప మతిపవిత్రమైనదియే, మేముకాదనము, గాని నీవుగాని పుణ్యక్షేత్రములు, నీవుగాని పుణ్యతీర్థములు, నీవుగాని పుణ్యనదీనదములు ప్రత్యేకించి యుండినగదా

# దూబగుంట్ల శ్రీరాములు

నిజమైన మానవు డలవరించుకొనదగిన గుణములు మూడు. అవి 1. ప్రేమ, 2. కపటరాహిత్యము, 3. సహనము. ఇందు యదార్థజీవనము ప్రేమయే. ప్రేమమయమైన జీవితము రామతుల్యము. సత్కార్యాచరణయు, పరహితాదరణయు క్రమముగ నిహపరసాధకములు. ఇవి లేనివాడు బ్రతికియు జచ్చినవాడే. ప్రేమస్వరూప మహాభాగ్యము లేకపోవుటచే మానవులలో నూటికి తొంబదితొమ్మిదిమందియును జీవచ్ఛవములని చెప్పక దప్పదు. వీరిని పిశాచములని గూడ చెప్పవచ్చు. పిశాచములని పిలిచినను తప్పుగాదు. ఈరహస్యమెఱింగినధీరులే భక్తకోటికి జెందినవారు. నిజమైన భక్తుడు దీనులను, పేదలను, అజ్ఞానులను చూచి పరితపించుచుండును. ఇంతియగాదు. హృదయము స్తంభించిపోవువఱకు దల దిమ్ముపట్టునంతవఱకు సంతపించి, పరితపించి దేహము మరచును. మానవున కుండదగినది ప్రేమ యొక్కటియే. ధనకనకవస్తువాహనాసామగ్రికాదు. పాండిత్యప్రకర్ష కాదు. దుర్భేద్యములగు కష్టముల విదళించి రాజమార్గమేర్పరచునది ప్రేమయొక్కటియే. అదియు సానుభూతితో మిళితమైయుండవలెను. ఇట్టి ప్రేమకు సమస్తవిశ్వము స్వీయనిలయము. విజయసింహాసన మధిష్ఠించిన దిదియే. దైవమును నెక్కడనో వెదుక పనిలేదు. సోదరమానవులను, పేదలను, దుర్బలులను దైవస్వరూపులనుగా ప్రేమించిన భగవత్సాక్షాత్కారప్రాప్తి. ఇట్లు విశ్వమంతయు బరమేశ్వరునిగా ప్రేమించి తరించిన వారలలో మన దూబగుంట్ల శ్రీరాములుగారొకరు. తండ్రి లక్ష్మయ్య. తల్లి

మహాలక్ష్మమ్మ. కుమారుడు లక్ష్మయ్య. కుమార్తెలు సుబ్బమ్మ, నాగమ్మ, లక్ష్మమ్మలు. వాసస్థలము సత్తెనపల్లి, గుంటూరుమండలము.

ఈతడు తన దశవర్షప్రాయమున బడికేగు నెపమును పురస్కరించుకొని యిల్లువిడచి శ్రీరామాలయమునకు వెనుక వైపునగల రహస్యప్రదేశమునజేరి కూరుచుండి నిర్వేదాయత్త చిత్తుడై, ఈశరీరమున "నేను" అను పదార్థమెద్ది? దానినెట్లు జూడనగు? ఈ రహస్యము నెఱింగించు వారెవరు? వారెందుం దురు? అని విచారించుచు, పై ప్రశ్నములకు సమాధానము దొరుకమి విచారసాగరమున మునింగి దుఃఖించి, దుఃఖించి మైమరచియున్నతరి శ్రీపీరోజిబాబు కజొన్నగింజతో జను దెంచి, పాదును సృష్టించి. అందా బీజమూడ్చి నీరిడిన వెంటనే అది చెట్టై యొకకంకిని విడచినది. అది కొంతవడికి పక్వస్థితికి వచ్చి బంగరువన్నెలుగల గింజల నెళ్ళగ్రక్కినది. ఆగింజలు వందలకు మించినవి. ఆగింజల చూపుచు పి రో జీ బా బు. శ్రీరామా! ఈ కనుపడుగింజలన్నియు మొదట నేగొనివచ్చిన గింజనుండి వెలువబడినవియే కదా! పాతిపెట్టబడినగిం జేమయినది చెప్పు?

శ్రీరాములు:- నశించినది.

పీరోజిబాబు:-ఆగింజనశించిన విన్నిగింజ లెచ్చటనుండి వచ్చినవి

శ్రీరాములు:- గింజనశించినదికాని అందలి జీవశక్తియే చెట్టై యీగింజల నీయఁగలిగినది యని తలంచెద.

పీరోజిబాబు:- ఇది జ్ఞాపకమున నుంచుకొనుము. కాని ఈ గింజ యందుగల బీజశక్తిని గురుతించుము, అనిచెప్పుచు నొక గింజ యాతని చేతబెట్టినాడు.

అంత శ్రీరాములు లాగింజ నొకక ఫితా ముక్కలు చేసి చూచినాడు. కాని జీవశక్తి కనుపింపలేదు. నిర్వేరపడినాడు.

పీరోజిగారు:- జీవశక్తి కనుపింపలేదా? అది సూక్ష్మమనుసని తెలంచెదవు, ఉండినగనుపింపదా?

శ్రీరాములు:- ఉన్నది. లేకపోయిన యిట్లేట్లు రాగలదు? వాయువువలె గనుపడనిదై క్రియారూపమును ధరించినది.

పీరోజిగారు:- ఇటులనే, ఒక్కండైన పరమాత్మనుండి నానా రూపములతో జీవకోటి యుద్భవించుచున్నది. అగుపడు గింజయొక్క రూపనామములే ప్రకృతి యనబడును. ఈ ప్రకృతి యందుగల జీవశక్తి మార్పుజెంది బహునామరూపములతో వెలువడినది. 'నేను' అనుపదార్థ మదియే! ఆపదార్థమునకు రూపనామములు లేవు. ఇది అఖండశక్తిసంపన్నమైనది గూడ! అది నీశరీరమందణుస్వరూపమున నున్నది. అగ్నియందుండి లేవబడిన రవ్వలెట్లు అగ్నికి వేరు కావో అట్లే అణుస్వరూపములగు జీవశక్తులును పరమాత్మకభిన్నములు. రవ్వను పట్టుకొని నిప్పునట్లు తయారు చేయవచ్చునో అట్లే అణురూపియగు జీవుడు అఖండశక్తిమంతుడగు పరమాత్మగా తయారగుచున్నాడు. దీనికి సాధకుని సాధనాబలమే కారణము. "యద్భావం తద్భవతి" అను ఆర్యోక్తి జ్ఞప్తియందుంచుకొనుము. దీనివలన నేకత్వమునుండి నానాత్వమేర్పడినదని తెలిసికొంటిమి. దీనికి "యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి॥ తస్యాహం న ప్రణశ్యామి సచ మే న ప్రణశ్యతి యను భగవద్వాక్యము సాక్ష్యమిచ్చుచున్నది. ఎవడు నానాత్వముగ నున్న ప్రపంచమును

పరమాత్మగ ప్రేమింపగలడో వాడే పరమాత్మయగుచున్నాడు. అని చెప్పి పీరోజీబా బదృశ్యుడైనాడు. వెంటనే ఒకకుక్కతో నద్దాలమేడ ప్రత్యక్షమైనది. ఆ అద్దాలలో గొన్ని తెల్లనివియు, గొన్ని ఎఱ్ఱనివియు, మఱికొన్ని నల్లనివియు, నింకను కొన్ని పలువిధములైన రంగులుగలవియు, మేడలోనున్న కుక్క అద్దములలో బ్రత్యక్షమైన నానారకముల కుక్కల జూచినది. మోమెత్తి నోరుదెరచి అరువ మొదలుపెట్టినది. అద్దములలోని కుక్కలన్నియు నరువసాగినవి. అసలుకుక్కకు గోప మతిశయించి తన్నుట గరచుట మూలముగా నద్దములు ముక్కచెక్కలైనవి. ప్రతిముక్కయందును ప్రతిచక్కయందును దనప్రతిబింబములే గనుపించుట గోపమతిశయింప దన్నుకొని చచ్చినది. అద్దాలమేడ యంతరించినది. శ్రీరాములునిర్ఘాతపడి స్మృతిదప్పి కొంతవడికి దెప్పరిలి మేల్కొనినాడు. తా ననుభవించినది కలగా నెఱింగినాడు. ఈ స్వప్నమును గాంచినవాడెవడు అని విచారించినాడు. స్వప్నమునకు విలక్షణముగనుండి తానే చూచితిననియు, దాగన్నకల మనోలీలయనియు, మనస్సు నాదిగాని నేను గాదనియు నేను జిత్స్వరూపిననియు గ్రహించి, మనస్సునుండి వేరుపడి శాంతమూర్తియైనాడు. శ్రీరామమూర్తి ఇట్లు తెలిసి, తెలిసిన తెలివిని మరువక మననించి, మననించి యున్మన్యవస్థ నార్జించి యచలపరిపూర్ణానంద మనుభవించినాడు. పంచ విధములైనసిద్ధులలో నిది స్వప్నసిద్ధి అని పాఠకులెఱింగెదరుగాక.

(55)

నేటినుండి శ్రీరాములుగారు విశ్వమునందుండి యుండనివాడును, విని విననివాడును, కని కననివాడును, చూచి చూడనివాడును, అయియుండుట దర్శిదండ్రి లీతని కున్నాడ వ్యాధి పొడసూపినదని వెఱగంది సర్వశక్తిసంపన్నుడైన పీరోజీ బాబున కెఱింగించిన,నాతం డరిగి పిల్లవాని వెంటగొని నిజనివాసమున కేగి పరీక్షించి నిజమెఱింగినవాడగుట, నని సహజ సమాధియని గురితించి, తనశిష్యకోటియందు ప్రథమునిగా గ్రహించి,నిస్వార్థప్రేమ నుద్బోధించి,కృతార్థుని గావించినాడు.

నాటినుండి యుపరప్రశ్నోపమ్మై విశ్వమంతా గన్న విన్న యర్థములందు వస్తుదృష్టి విసర్జించి, పరబ్రహ్మ దృష్టి బాదుకొల్పి యానందించుచుండువాడై, చిత్తశాంతి గలిగి ఏవిధమైన దుడుకులు లేనివాడై నిర్వ్యాపారికాక నిష్కామకర్మాచరణాదక్షుడై కామవృత్తి నడంచి ప్రేమవృత్తిని విస్తరింప జేసి, నిస్సంసారియై సంసారమున మెలంగుచుండెడి.

సంసారమున నెట్టి విషమస్థితి బొడసూపినను, సమచిత్తతనుగాని ధైర్యస్థైర్యములనుగాని కోల్పోవువాడు గాడు. జీవనము, ప్రపంచ మస్తిరము, వేయేల! సర్వము భగవంతుడే. తనయం దెన్నిశక్తిసామర్థ్యములు, ఎంతటిప్రభావము, ఎన్ని మహిమలు, అడగియున్నవియో తెలిసినవాడగుట యెప్పుడు గొప్పవాడననిగాని, అల్పుడననిగాని కలలోనైనను దలంచువాడు కాడు.

"అహం బ్రహ్మాస్మి"అను మహావాక్యసారము శ్రీవారి శరీరమందలి ప్రతిరక్తబిందువందును స్పందించుచున్నది. సప్త

ధాతువుల లోపలను, వెలుపలను పంచకోశములందంతటను నిండి నిబిడీకృతమైనది. దీనివలన గ్రియాశక్తిపూర్ణుడై యుం డుట సంశయము దానై విరాజిల్లిన పుణ్యమూర్తి మన శ్రీరామ మూర్తి వీరికి లక్ష్మణాఖ్యలను కుమారుడును, సుబ్బమ్మ, నాగమ్మ, లక్ష్మమ్మలను కుమార్తెలుగలరని చెప్పితిమి గదా! ఈ లక్ష్మణార్యులు పాటిబండ్ల వీరయ్యగారి శిష్యకోటికి జెందిన వారు. ఇతడు నిగూఢవర్తనుడు. నిరాడంబరజీవి. తన జ్ఞానసిద్ధిని జాగరూకతతో శ్రద్ధగలిగి దూరదృష్టిగలవాడై వివేకము వెన్నంట నిరాడంబరముగా రక్షించుకొనుచుండు పుణ్య మూర్తి యితడు. తనయాధ్యాత్మికానుభవములను మోక్ష సాధని మొదలగు పత్రికలయం దప్పుడప్పుడు, ప్రకటించు చుండుట మాపాఠకుల కెల్లరెఱింగిన విషయమే, విస్తరించి వ్రాయపనిలేదు. శ్రీరాములుగారు 19వ శతాబ్దమందలి నల సంవత్సర వైశాఖ బహుళపంచమి పుణ్యదినమున జీవయాత్ర ముగించి జీవబ్రహ్మైక్యమును పొందిరి.

గీ. అపర శ్రీరామమూర్తి నా నలరు పితృ
దేవతా భక్తి యేకపత్నీవ్రతంబు
సూనృతాచారసంపత్తి శుద్ధ బుద్ధి
నలరు శ్రీ దూబగుంట్లవం శాబ్ధిసోము
ప్రేమభావాభిరాము శ్రీ రాము నెన్ని
రామచంద్రుసి గొంతు దుర్భవ మడంతు.



# శ్రీ గురుమహారాజు వేజండ్ల అప్పదాసు

శ్లో. శ్రవణం కీర్తనం ధ్యానమ్ శ్రీవిష్ణోః పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యమ్ సఖ్యమాత్మనివేదనమ్.

లీలామానుష విగ్రహుడైన భగవంతుని కథను వినుచు తదీయకీర్తనల రాగతాళమిళితముగను భావయుక్తముగను పాడుచు, భగవన్నామముల మంత్రమూలకములుగ జపించుచు, భగవత్పాదారవిందముల మానసికముగ సేవించుచు, తదీయార్చామూర్తుల పుష్పాదులబూజించుచు, సాష్టాంగము లర్పించుచు, వందనము సమర్పించిన నెను నెంట ప్రార్థనలచన్ని సన్నిధి పీడలేనివాడై, అన్యచింత లేక నేకలక్ష్యమున ధ్యానించుచు ప్రేమపూర్ణుడై సర్వస్వము భగవదర్పణగావించి నిస్సంకల్పుడై తన్మయసుఖ మనుభవించుచు, నెవడు నిత్యజీవితము గాగించునో వాడు నిజమైనభక్తుడు. వీడు సముద్రమునందలి తరంగములవలె నిష్టదైవమునందు బ్రపంచమును జూచును. వీనికి భగవంతు డాత్మస్వరూపి. భూతభవిష్యత్తు లుల్లంఘించినవాడగుట త్రికాలవేది. అధ్యాత్మవిద్యానముదుడు. అనన్యభక్తినిమగ్నుడు. భగవద్విస్మృతి లేనివాడుగూడా. ముక్తిభక్తికి దాసి అనునార్యోక్తి వీనియందు సార్థకత వహించినది. ఇట్టి మహాభక్తులలో వేజెండ్ల అప్పదాసుగా రొకరు.

తల్లి నెత్తెమాంబ. తండ్రి రామకృష్ణయ్య. సోదరుడు సూర్యనారాయణ. కుమారులు 1. సంజీవరావు, 2. రామకృష్ణశర్మలు. గోత్రము శ్రీవత్సస. రామతారకము తొంబది

యారుకోట్లుచేసిన జపనిష్ఠాగరిష్ఠులు. గురువు పొట్లపాటి రామ యోగి. జననము క్రీ 19వ శతాబ్దాంతము. గంగాదీక్షితులవారి యధ్వర్యమున దులసీకళ్యాణముతో ప్రారంభించి దుర్ముఖి మాఘమునను, వికారిజ్యేష్ఠమందును, శార్వరిజ్యేష్ఠమందును క్రమముగ మూడుసప్తాహములును. క్రోధి మాఘమం దేక వింశత్యాహ్నికదీక్షతో శ్రీరామయజ్ఞమును, శ్రీమదద్దంకి వెంకటాద్రియఃభాగవతారుగారివలన బ్రదర్శింపబడిన మహా రాసక్రీడయు, పరాభవమాఘమందు మండలదీక్షతో శ్రీరామ సామ్రాజ్యపట్టాభిషేకమహోత్సవమును, కీలకవత్సరమాఘ మునసంగమేశ్వరుసన్నిధి అష్టోత్తరశతసంఖ్యాదంపతీజనపూజతో సార్థమాసద్వయదీర్ఘసత్రియాగమును భక్తి యుక్తముగ జరిపి ముగించినారు. పై దెలుపబడిన మహాకైంకర్యములం దన్నదానమవారిగా సాగబడినది. అతిథులకుటుంబాల కాల వాలములైనవి వంటపందిరులన్నియు. ఆకాలమున సప్తాహాది కైంకర్యములొనర్చిన వారిలో వీరే మొదటివారు. ప్రతికైం కర్యమందును దినమునకు నలుబది బస్తాలబియ్య ముడుకుచున్న వన నతిశయోక్తికాదు. ప్రేక్షకజనవసతు లత్యనుకూలములై యున్నవి. శ్రీవారు యాజ్ఞవల్క్యజయంత్యుత్సవ సమాజ మున కధ్యక్షులుగూడ. వీరి కుమారు లిప్పుడు తెనాలి నాజరు పేటయం దున్నారు. వీరెనుబదవయేట శరీరము జాలించిరి. వీరి జీవితమందొక విశేషముగలదు. యాదవకులోద్భూతుడై యోగసిద్ధిని గడించిన పుణ్యమూర్తి గురువగుటయే. ఈతని యుపాసనమూర్తి బాలాత్రిపురసుందరి.

వాసస్థలమెయ్యదియో తెలియబడదు. ఈతఁ డొకప్పుడు పొట్లపాడునకు సమీపమునగల యొకవృక్షచ్ఛాయ సమాధి నిష్ఠనున్నాఁడు. బాలక్రీడాభిలాషియై నాయూరిపిల్లవాఁడొక డాచెట్టునెక్కి ఆడుచు బాడుచు బ్రమాదవశమున మూత్ర విసర్జనము జేసినాఁడట. అవి సమాధినిష్ఠుఁడైన యోగిగారి శిరమున బడినవట; గాని యోగి బహిర్ముఖుఁడు కాలేదు. ఆపిల్లవానికి వెంటనే కాళ్లుపట్టుకొని పోయినవి. వాఁడు నతిప్రయాసముతో జెట్టుదిగి బహిర్ముఖు డగువఱకు యోగిని కాచియుండి తన తప్పు నెఱింగించి క్షమింపగోరిన చిఱునగవుతో "జరిగిన, దానికి వగవపనిలేదు. నీ ప్రారబ్ధమిట్లున్నది. నే జేయదగిన దేమియును లేదు. జీవితాంతమువఱకు గాళ్లుండియు లేనివాఁడ వయ్యెదవు. నీశరీరముమాత్ర మత్యంతబలిష్ఠమై యారోగ్య పూరితమై యుండుగాక! బాలయోగివై యిహపరము లార్జింప గలవు" అని వరం బొసంగెనట. నాఁడు మొదలా బాలుఁడష్టసిద్ధులు గలవాఁడై జీవితాంతమువఱ కొకగుఱ్ఱం బెద్దుబండిమీఁద దిరుగుచు నాశిష్యుల కాధ్యాత్మికబోధలందించి కృతార్థుల గావించుచుండువాఁడు. ఈ రామయోగి నెఱసిన వెండ్రుకలతో నలంకరింపబడిన తలయు గడ్డమును కలవాఁడై భ్రూభాగమున గల కుంకుమబొట్టుతో దేహపుష్టితో దండధారియై చూపరుల కానందదాయకుఁడై యుండువాఁడు. ఈతఁ డెక్కువకాలము కొండ గుహలనుండువాఁడు గూడ. చూచువారలకు భోగిగా గనుపించును కాని సంపూర్ణవిరాగి. శరీరసౌష్ఠవమునకును గారణము యోగశక్తియే యని చెప్పకతప్పదు. యోగిగారిదర్శన

మబ్బుటయే కష్టము. అబ్బినవానికి పునరావృత్తిరహితస్థితికర తలామలకమే.

యోగిగారి పరిభావములను విని మన అప్పదాసుగారు బహుప్రయాసలకోర్చి దీర్ఘపరియత్నముతో దర్శనభాగ్యమంది జన్మబంధమడంగ నరంబర్థించిన నట్లేకానిమ్మని సమ్మతిజూపి యిట్లనియె. నేగొల్లడ. నీవు బ్రాహ్మణుడవు నాగురుత్వము నీకు దగనిది. విప్రునకు దప్ప యన్యజాతి కుపదేశార్హత లేద నుట నీ వెఱుంగవే? జాతిధర్మము వీడరాదు గాన బొమ్ము. బ్రాహ్మణగురువు నాశ్రయింపుము. అనుట దాసుగారు చిరు నగవుతో అయ్యా? నా కుపనయనమునాడు బ్రహ్మోపదే శము గావించిన మహాత్ముడు నా తండ్రి ప్రధానగురువు, ముముక్షున కుపగురువు లెందరైన నుండవచ్చునని శాస్త్రము చెప్పుచున్నదగుట సంశయించుటకు దావులేదు. ఇట్లగుట నాకోరిక దీర్పక దప్పదు, అన్యజాతి వాని నుపగురువుగా గ్రహిం చిన జాతిధర్మము కొరవడదు. అని నమ్రుడై నిలచిన విలకించి నాయనా! అప్పదాసా! ధర్మమన జాతివిహితకర్మల నాచరించు టయే; వర్ణాశ్రితధర్మము దక్కువగా నాచరించినను, అది సం పూర్ణశ్రేయోదాయక మగుచున్నది. ఇతరవర్ణములవారికిని యితరాశ్రమములవారికిని విధింపబడిన కర్మములను తామెంత బాగుగానాచరించినను అవి యనర్థములనే సమకూర్చుచున్నవి. జన్మకు గర్మయే కారణమనుట వినియుందుము గదా! ఉత్తర దేహమునకు కారణమైన కర్మను ప్రారబ్ధమనియెదరు. దీనినే స్వభావమనిగూడ నందురు. ఇదియే జాతివర్ణములకు హేతువు

ప్రారబ్ధమున కనునగు ఆయాజాతియందే స్వేచ్ఛమందే ఆ యా జీవులు పుట్టగలరు కావున బ్రాహ్మణాది తమ తమ జాతివర్ణముల కనురూపములగు కర్మల నాచరించుటచే క్రమముగా పాపము తగ్గి పుణ్యవృద్ధియగుచున్నది. ఇదియే శ్రేయఃప్రాప్తికిమూలము. స్వభావము ల్లంఘించిన నాపద తప్పదు. అందుచే క్రమముగ జీవు డధోలోకముల పాలగు చున్నాడు. గావున నెవరుగాని జాతిధర్మ ముల్లంఘింపరాదు. గాని, నీవు చెప్పినటు లుపగురు సంగ్రహవిషయములో ప్రమాదములేదు. అనిన దాసుగారిట్లు నిరి అయ్యా సామాన్యమానవులకు వర్ణాశ్రమభేదములు పాటింపనగును గాని, బ్రహ్మనిష్ఠులకు గాదు. సమాధికాల ములోనన్యులు తనపై మూత్రవిసర్జన జేసినను, మఱి యేబాధల ముంచినను, బహిర్ముఖులుకానివారును తెలిసినపిదపనైన నహం కారమూనని వారును, బ్రహ్మనిష్ఠు లనబడుదురు. ఇట్టి బ్రహ్మ విదులలో దమరొకరు. దయయుంచి తారక ముపదేశింపుడని ప్రార్థించిన వల్లెయని దాసుగారికి వారి మూలముగా దాని కోపదేశమిడి ధన్యునిగావించినారు యోగిగారు. వీరిశిష్యకోటి కనిగిరితాలూకాలో మిక్కుటము. వీరిశిష్యకోటిలో జేరి నట్టియు, కనిగిరిహైస్కూలునందు ప్రధానోపాధ్యాయులైన ట్టియు, సుబ్బరామయ్యగారు యోగిగారినిగూర్చి ప్రశ్నించిన వర్ణమునుపాటింపని బ్రాహ్మణుడని చెప్పిరి. నివాసముగాని జననాదికములు గాని తెలియబడవనిరి. శ్రీఅప్పదాసుగారు గాయత్రి తారకమంత్రముల క్రమముగా మూడుకోట్లయేబది లక్షలు తొంబదియారుకోట్లు జపించి మంత్రద్వయసిద్ధిని గడిం

చిరి. తనగురువునుగురించి కొన్నికీర్తనలలో రామభద్రుడని, మఱికొన్నికీర్తనలలో రామార్యులని వెల్లడించిన కారణముగ పొట్లపాటిరామయోగియే శ్రీవారిగురువనకదప్పదు. వీరిజనన స్థలము వేజండ్లయేకాని తానాలితాలూకా సంగంజాగర్లమూడిలో బడిపంతులుగుటదాదాపు తనభగవత్కైంకర్యము లన్నియు సంగంజాగర్లమూడియందే జరిపినారు. జపదీక్షనుగిం చిన వెంటనే తలవనితలంపుగ దేశికార్యు దర్శనమబ్బుటనా నందాశ్రువులబాద ప్రక్షాళనముగావించి,

క మా చి - ఆ ది

శ్రీ గురువర చరణం సదా సేవకభవహరణం
శ్రీగురుతారక మంత్రనిధానం శ్రీమత్సాంఖ్యసుయోగసుగానం
శ్రీ అమనస్కసుధారసపానం శ్రీమద్బ్రహ్మానందనిదానం
శ్రీసద సద్రూపం సర్వాధారం శాంతమనంతమనామయరూపం
సకలాగమ సంతోషప్రబోధం।సమ్మునివేషసుఘోషవిభూషం॥
శ్రీ అనాది మధ్యాంతరమక్షిలేశం।అనన్యభక్తోదయపరహంసం
అద్భుతభావం అపరిచ్ఛిన్నం । హంసాశ్రితసంచారవిచారం।
శ్రీనిరుపమానసౌందర్యంధైర్యం।నిద్రయోగచిన్ముద్రవినోదం
పరమపవిత్రం భరితసుమిత్రం। పాలితదైవం దేవాదిదేవం
శ్రీరామభద్రగురు రాజప్రసారం। రామనామపారాయణసారం
శ్రీమదప్పదాసాఖ్య వినోదం । శ్రీహరిహరిహరినామస్మరణం

అని బ్రహ్మానందమున తాండవముజేయుచు నెమ్మేగి పాదములంబడి లేవకుండిన వాత్సల్యమునెరపుచు లేవనెత్తిశాం

తించుము. శాంతించుము. దుర్ముఖమాఘ వికారి జ్యేష్ట శార్వరి జ్యేష్టమాసములందు గ్రమముగా మూడుసప్తాహములు జరుప సంకల్పించి పనిగొన దలంపు నే నదృశ్యముగనుండి కార్య భారమువహించి నిర్విఘ్నముగ జరిపించెద ఇతరకాలములందు సమయమరసి దర్శనమిచ్చుచుండెద ననియాజ్ఞాపించి యంత ర్హితులైనారు.

దేశికాచార్యానుమతి పై మూడుసప్తాహములు భూరి యన్నదానముతోడను మఱికొన్ని క్రతువు లాయావత్సరము లందును జరిగినవని వెనుకజెప్పబడిన దాసుగారిచే నిర్వహింప బడిన భగవత్కైంకర్యములందు గ్రమముగ పాళీభజనలు, హరి కథలు, ఉపన్యాసములు, మంత్రపునశ్చరణములు, ఆధ్యాత్మిక గ్రంథపారాయణములు విరామము లేకుండ జరుపబడినవి. ఇంక తరంగాష్టపదీకాలక్షేపములు చెప్పనక్కరయే లేదు. తృతీయసప్తా హావభృథస్నానకాలమున ముగ్గురు కుఱ్ఱవాండ్లు సంగమేశ్వరా లయము ప్రక్కనను్న పడలకాలువలో స్నానములు చేయుచు మునిగిపోయిరి. జాలరులువలలతో వెదుకనారంభించిరి. చిక్క లేదు, వారు నిరుత్సాహులై కాలువవడ్డున కేగి చూచిన నావలి యొడ్డున ఆబాలురు గనంబడిరి. తమపోకడనుగురించి ప్రశ్నిం చిన నెవరో నూతనపురుషులిరువురు జలమునుండి తెచ్చి బయట జేర్చిరనియు వారలిందెందునుకనుపడ రనియు, జెప్పి చూపరుల కాహ్లాదము గలిగించిరి. ఈవిచిత్రచర్యకు రామలక్ష్మణులే కారకులనియు, దీనికంతయు దాసుగారిరామభక్తియే మూల మనియు, నూహించి జనులు శ్రీవారి నెంతయో! గొనియాడిరి.

నిష్ఠనుడగు తనచేత భగవత్కైంకర్యరూపమహాక్రతువుల జేయించిన గురుకరుణకుబ్బుచు ఇట్లు గురుస్మరణ గావించిరి.

ముఖారి – ఆట

యోగిరా! మహా! యోగిరా
శ్రీరామ యోగిరా! రాజయోగిరా!
యోగ్యమభ్యసించువారికి। భోగ్యమగుచున్నారురా! యో॥
సుంతరా? బల్ వింతరా?
ఒకగంతురా? వారితంతురా?
పంతముడిగినవారికెల్లను । భావమగుచున్నారురా? యో॥
చూడరా? వారి బాడరా? వేగగూడరా? జ్ఞానయోడరా?
తాలో నాడుపామును గనినవారికి ।
ఐక్యమగుచున్నారురా ?
తత్వసిద్ధిని జెందరా, వారి తత్వమెల్లనుపండెరా?
పర తత్వసిద్ధిని జెందువారికి।దత్వమసి; ఐయుండురా? యో॥
నిండుతా? మేల్, బండిరా? పీతజండాయొకడుండురా?
జండాజాడలుగన్నవారికి జాతమృతములు లేవురా?
గున్నరా? మా, అన్నరా? గుఘడన్న నిన్నటిమాటరా?
తనచిన్నపాదాచిహ్నాలిచ్చెను।చెన్నకృష్ణులు వీరెరా? యో
ఊరుపేరిల లేదురా? ఒకయూరిలోనిల్వాగురా?
ఊరుశూన్యంబైనవారికి ఉత్తమాటదిగాదురా? యో॥
గుప్పరా? ఫూల్ గప్పరా శ్రీఅప్పశిష్యుడుచెప్పెరా?
తప్పుదిద్దినరామగురువరు దర్శనంబిపుడాయెరా?

ఇట్లు రెండు మూడుకీర్తనలతో డనేకాక దుండకోత్పల మాలాపద్యములద్వారా గురువర్యాభినుతించినాడు. వీరు పరతత్త్వార్థసారసంగ్రహమను అప్పదాసచరిత్రి గేయపద్య రూపముల రచించి అందు పాండిత్యసంస్కారభాగ్యమేమి యు లేదు. నిత్యానుసంధాన నియతి లేదు. గణయతిప్రాసల క్షణముజూడగలేదు. చదువ లేదయ్యనే శాస్త్రవిశతి; సీకటా క్షముచేత నేరచించితిగాని నాదు ప్రజ్ఞయుగాదు. నలిననాభ. అని తననిరహంకృతిని వెల్లడించినాడు.

దాసుగారిచే నిర్వహింపబడెడు ప్రతిక్రతువుసకును తెనాలినుండి వచ్చెడి బియ్యపుబస్తాలబండ్లకుగాని, కూరగాయలబండ్లకుగాని విథివిరామము లేదు. రెండెడ్లబండ్లమీద నుచ్ఛిష్టపాత్రిల దోలుచుండినను తరుగుట లేదు.

ఈక్రతువులన్నింటికిని సంగంజాగర్లమూడి అంగలకు దురు కమ్మవారాబాలవృద్ధముగ నాయపడిశాశ్వతకీర్తి నార్జించినారు. శ్రీరామనవమిమహోత్సవ యజ్ఞము జరుగు రోజులలో నొకరోజు పందిరులంటుకొని పరశురామప్రీతియగుచుండుట గాంచి పైరెండుగ్రామములవారరు తెంచి మంటలనార్పి వెంటనే నూతనపరికరములతో బూర్వమునకంటె మించిన పందిలిని నిర్మించి క్రతువు నిర్విఘ్నముగ సాగునట్లు దోడ్పడి ప్రేక్షకుల కద్భుతము గలిగించినారు.

చాగంటిపాటి సప్తాహములో వైశ్యస్త్రీలుకొందఱు, బంగారపునగలతోడవచ్చి పగలంతయు నుత్సవవేడుకజూచుచు గాలముగడిపి రాత్రికిభోజనములు జేసి సప్తాహసందిలియందు

బరుండుటకు శంకించి దాసుగారిం జేరి చోరులు జేరరాని ప్రదేశము జూపుడని ప్రార్థించిన నప్పుడు మీరీసందినయందే బులుండుడు. సంజీవరాయుడే కాపాడగలడని సమాధానపరచినారు దాసుగారు వారల్లేగావించి సుఖనిద్దురంగొనిరి కొంతవడికి నిద్రించువారిలో నొకకాంతకు మెలకువగలిగి పరికించిన నొక భూతము పండుకొనినవారి చుట్టును దిరుగుచున్నట్లు అగుపడిన భయపడి కేకలిడినది. మిగిలినవారు లేచిచూచిరిగాని వారి కగుపడ లేదు. అంతదాసుగారరుదెంచి సంజీవరాయుని లీలయని చెప్పి భయముదీర్చినారు.

సప్తాహము మూడవరోజు సప్తాహపందిలికి నిప్పంటుకొని కాలుచున్నది. దాసుగారు శ్రీరామపూజాకైంకర్యమున నిమగ్నులై యున్నారు. హవ్యవాహనుడు భయపడినాడు. గాబోలు, దాసుగారిని సమీపింపసాహసింప లేదు. పందిలి యంతయు దగులబడినదిగాని రామమందిరము మాత్రము మిగిలినది. శ్రీరామలీల లద్భుతములనుట కిదియొక తార్కాణము. పమిడిఘంటం వెంకటసుబ్బయ్యగారిని, ప్రయోగ బాధనుండి తప్పించుటయే కాక తత్ప్రయోగమును జేసిన వాడర్థించిన మందలించి యాదరించి బహుమతి యొసంగి పంపినారుగూడా?

—

# శ్రీతారకబ్రహ్మ పంగల నారాయణప్ప

వేదము, సేవ, ప్రేమ, జ్ఞానములను సచ్యఘంము లం దించినది వానిననుభవించుచు రసానుభూతి జేసినవాడే నిజ మైనమానవుడు వీనిమాటలన్నియు వేదవాక్యములు నడక వేదవిహితము! వేయేల మూర్తీభవించిన వేదరూపి ఆనగనన్ని వేదములు భక్తుల హృదయములందు దాంపవించుచున్నవి యనుట ఎవనిమనస్సు పురుషోత్తమప్రాప్తి కంకితమైనదో! వాని లోక్యానికి మాత్రమిూ రహస్యము బోధపడును ప్రేమయొక్క బాహ్యరూపము సేవ, ప్రేమతోగూడిన సేవయున్నచోటనే జ్ఞానముండును విశ్వరూపునకే కాలమున కెట్టిసేవ యవ సరమో! దానిః గురుతింపజేయునది జ్ఞానము సేవ్యసేవక స్వరూపముల నెఱింగిచేసినసేవయే సంపూర్ణ ఫలకారి.

సహజముగ జేయంబడు సేవకంటెను ప్రేమతో జేయ బడుసేవ, ప్రేమజ్ఞానములతో నోతప్రోతమగుట శ్రేష్ఠాతి శ్రేష్ఠము ఇటుల విశ్వరూపుసేవింప జాలినవారే. వేద వేత్తల వేదములన్నియు వీరిలో నేకీభవించినవి అది మొదట బీజమై, సేవారూపమున వృక్షమై భక్తిజ్ఞానములను కాయలుకాచి పక్వములై నాస్వాదనమున కుపయోగింమను. ఈ రహస్య మెఱింగి వేదము భక్తులహృదయములంను దప్ప బయట లేదని తెలిసి శక్తివంచన లేని సేవాభాగ్యమార్జించి తరించిన వేద మూర్తి పంగల నారాయణమూర్తి.

వీరినివాసము నర్సారావుపేట తాలూకా జగ్గాపురము. జననము క్రీ. 19వ శతాబ్దాంతము. తల్లి కావేరమ్మ. తండ్రి

కొండంభొట్లు. సంపన్నగృహస్థు కుమారుడు కేశవభొట్లు. కుమార్తెలు సుబ్బమ్మ, నరసమ్మ, సీతమ్మగార్లు రామవరము, వేలూరు ధర్మవరములం దీకుమార్తెల కుటుంబములు దినదినాభివృద్ధినందుచున్నవి. వృత్తి న్వ్యవసాయము ఎట్టి విషమస్థితియందైనను చేయిచాచియెఱుంగని పుణ్యమూర్తి.

ఒకప్పుడు కోనసీమనుండి వేదవేత్తలయిన ముగ్గురు విప్రోత్తములు బీదలగుట యాచనకొఱకందందు దిరుగుచు, మన నారాయణప్పగారింట బసచేసినారు. శ్రీవారు వారిని చుట్టపుచూపులతో నాదరించి భోజనమజ్జనాద సత్కారములు కావించుచుండిరి. ప్రక్కన యతిథులు లేక భోజనముచేసిన రోజు శ్రీవారి జీవితములో లేదని చెప్పిన యతిశయోక్తి కాజాలదు. నిత్యాన్నసత్రమును మరపించిన గృహముగలవాడు నారాయణమూర్తి వీరిని నారాయణప్పయనియు నారాయణమూర్తియనియు లోకులు పిలుచుచుండువారు. తనయందు నిఖిల భూతములందును నొకభంగి సమహితత్వంబును జరుపువాడు. అనుపోతన వాక్యమునకు గురియైనవాడు మననారాయణప్ప. గుంటూరు మండలమునందంతటను సంచారముజేయు యాచకులందఱెప్పుడో యొకప్పుడు నారాయణప్పగారి సత్కారమందినవారై యుందురు.

ఒకప్పుడు పై ముగ్గురు బ్రాహ్మణులును మడుగులుగట్టి భోజనమున కేగి కూరుచుండిరి. నాడు వీరికితోడు మఱి పది మంది యతిథులువచ్చిరి. అందఱు బారుతీరి కూరుచున్నారు. భోజనపాత్రిలమర్పబడి నవరసాన్నములు వడ్డింపబడినవి.

అతిథులు పరిషేచనములగావించి భోజనములు సేయుచుండిరి. లకార్తితేన భోజనమను న్యాయము ననుసరించి మరదలు "లక్ష్మీనరసమ్మగారు" పెరుగుపాత్రతో ప్రత్యక్షమై సమయ మెఱసి వడ్డించుచున్నది. బ్రాహ్మణులు తృప్తిగా భుజించిరి. కాని అందొక బ్రాహ్మణుడు కన్నీరు కార్చుచు ముందున్న భోజన పాత్రయందుగల పెరుగన్నములో చేయి పెట్టుకొని యూరకు చున్నాడు. మహాత్మా! భోజనము సేయక విచారమునఁ గూరుచున్నారేల పదార్థలోపమా? ఆదరణాలోపమా? అన్నాడు నారాయణప్ప.

లేదు లోపము లేదు. ఆదరణయందును లోపము లేదు. నాకు ముగ్గురు పుత్రులును, నలుగురు పుత్రికలును గలరు. వారి కిట్టి దధ్యోదన మెప్పుడును పెట్టినపాపాన పోయినవాడఁగాను, నిర్భాగ్యుడనగు నాయింట వారేల పుట్టిరా యని విచారించు చుంటి. అట్లుగాక మీవంటి సంపన్నగృహస్థులయింట బుట్టిన మృష్టాన్నముల దృప్తులగుదురు గదా? అని గొల్లుమన్నాడు. నారాయణప్పచూచి దుఃఖింపకు భగవానుడు నీకోర్కె దీర్ప గలడు. చింతమాని భుజింపుము అని ప్రేమపూర్వక వాక్యముల నాదరించిన బ్రాహ్మణుడు దుఃఖమాపుకొని భోజనము జేసినాడు.

భోజనానంతర మతిథులు సుఖాసీనులై తాంబూలములు వేయుచు నిష్టాగోష్టినున్నతరి నారాయణప్ప ప్రక్కకు మానెడు పాలిచ్చు బఱ్ఱెతో వచ్చి తనపాలేరును బిలిచి దారిబత్తెము నకై కొన్నిరూపాయిలనిడి విషయ మెఱింగించి ఈబఱ్ఱె నీబ్రాహ్మణుని వెంటదోలుకొనిపో సనుజ్ఞయిడుట యేకాక దాని

పోషణమున కొకయకరముభూమినిగూడ దానము జేసినాడు. శ్రీవారి దానములన్నియు గష్టార్జిత ద్రివ్యసంభవములే ?

క. జ్ఞానము కేవలకృపన
జ్ఞానికి నుపదేశవిధి బ్రకాశముసేయం
గానది సకలధరిత్రీ
దానంబులకంటె నధిక తరఫలితమగుర్.

అనుభారతధర్మము ననుసరించి వందలకొలంది శిష్యుల జేర్చిన నిష్కామసేవాధురంధరుడు శ్రీనారాయణప్ప ఆరాధనా నెపమున బ్రతివత్సర మొకపరి శిష్యబృందమును జేరి సోదరులవలె నాదరించి పాదపూజాదికముల గ్రిహింపకయే ఆధ్యాత్మికోపన్యాసములతో రుచిరాన్న సత్కారములతో సబహుమానముగా బంపుయాచారముగలవారు వీరి యుపన్యాసములు స్వానుభవపూరితములై మనో రంజకములై మృదుమధురవాక్య శోభితములై యలరారుచుండెడివి

అసూయాగ్రిస్తుల దుర్బోధల ననుసరించి తనను బరీక్షింప వచ్చిన కొనశీమపండితులను, బ్రిహ్మావిద్యలో స్వానుభవమునుజూపి నిరుత్తరులజేసి గౌరవ మార్జించిన పుణ్యమూర్తి నారాయణమూర్తి.

వరుసగ నిరువదివత్సరములు కాలినడకను భద్రాద్రి కళ్యాణరాముల దర్శించిన భక్తాగ్రణి నారాయణప్పధీమణి. ఈ సమయమును స్వపురినుండి బయలుదేరుటతో మొదలుపెట్టిన రామభజన రాములసేవించి పర్ణశాలాది పుణ్యస్థలముల

గాక శ్రీవారి జపదీక్ష కేవిధమైన యంతరాయము జరుగ కుండెనట.

ఒకప్పుడు వేదపాఠకులగు శిష్యులతో గుటీరమున బ్రవేశించి భుక్త్యాయాసంబడంచుకొన బరుండిరి. అందరు నైమరచి నిద్రించుచున్నారు. చడీ చప్పుడు లేకుండగ సర్ప రాజ మరుదెంచి శ్రీవారిప్రక్క బరుండి గురవుగారి జెవిపై తన పడగ నుంచినదట. నిట్లుండ శిష్యుడొక్కండు కొట్టి నట్లులేచి కూరుచుండి దేశికుని వైపునకు దృష్టిసారించి భయ పడి నోటమాటరాక బాధపడుచు సహాధ్యాయుల గొట్టి లేపినాడు. చేసన్న సర్పమును జూపినాడు. చూచి భయాకులిత చిత్తులై దిక్కుల బర్వెత్తి గ్రామీణుల కెఱింగించిన వారు జనుదెంచి చూచిరి. గాని సర్పమగుపడలేదు. గోలచేయుచు వెదుక మొదలిడిరి. యీ స్థితిలో శ్రీవారు లేచి తెలియని వానివలె గారణమడిగి తెలిసికొని మా రామప్ప యిప్పగిది దర్శన మొసంగినాడుగాబోలునని సమాధానమిడినాడు.

నాటనుండి భగవానుడు శ్రీవారి వెన్నంటి తిరుగు సూచనలు చూపరులకు గనుపించుచుండెడివట శ్రీవారి దర్శన స్పర్శనాది సత్కారముల గ్రహసంకటములు తొలగుటయు నాధ్యాత్మికాది వ్యాధిగ్రస్థు లారోగ్యవంతులగుటయుగూడ జరుగుచువచ్చినది. నిజమైన పౌరోహితుడుగాని నామధారి మాత్రముకాడు అశ్రితకల్పభూరుహామను పేరుగాంచిన పుణ్య శాలి నిరంతరాన్నదాన దీక్షాధురంధర చక్రవర్తి.

"కుమారస్వామి" అను విప్రుడొకడు క్షయరోగి యగుట వంతనందుచు పొలముల నాగలి దున్నుచుండు నారాయణప్పగారిని సమీపించి నమస్కరించి తన్ని వారణ ప్రార్థింప దాపుననున్న పొదరింటగల యోషధిసంగ్రహించి తినిపించినాడు. వెంటనే సుగుణము గనుపించి నెలనాళ్లలో నారోగ్యవంతుడై తనజీవితము శ్రీవారి సేవకర్పించి ధన్యుడాయెను.

వీనినివాసమేదియో? బంధువులెవరో? తెలియదు గాని మదీయవంశస్థుడగు కుమారస్వామి శ్రీవారి శిష్యుడని మాత్రము విన్నాడ ఆకుమారస్వామి యీకుమారస్వామియగునేమో? అని సంశయించుచున్నాడ శ్రీవారి వంశాభివృద్ధి సాగించుచు గ్రంథముగించెద.

---

# రామదాసు రాగం పిచ్చియార్యులు

శ్రీరామ నామసంకీర్తన, సద్యోఫలదాయి, విద్యాగంధ మెఱుంగని, సామాన్యమానవులకు గూడ, సుకరము, సులభము, సర్వుల కంఠము బాటులోను దునది. యోగసాధనకు వలె, కష్టనష్టముల పాల్జేయునదికాక, సుసాధ్యమైనది. ఆనంద దాయకముగూడ? భగవానుని యనంతనామములలో. ప్రణవ మునకగ్రస్థాన మీయఁబడినది. ఇది సకలవేదసారము, ప్రణవ ప్రతినిధి రామనామముప్రణవమెట్లేకాక్షరీమంత్రమో ? అట్లే? రామనామముగూడ? ప్రణవోపాసనవలననే ఫలముగలదో ? రామమంత్రోపాసనవలనను, ఆ ఫల మే కలుగును.

రామనామజపమువలన గిరాతు డాదికావ్యకర్తయై నాడు ? కాశియందు మరణించినవారికి, ముక్తినొసంగునది, రామనామమే ? రామనామమాధుర్యము విడలేక, రాముని తోపాటు జలసమాధి నధిష్ఠింపక హనుమంతు డిప్పటికి నప్పుడప్పుడు భక్తులకు బొడకట్టుచున్నాడు. కాళిదాసు, రఘువంశమందును, భవభూతి, యుత్తరరామచరితయందును, మురారి అనర్ఘ రాఘవమునందును, జయదేవుడు ప్రసన్నరాఘవము నందును రామునిగూర్చియు, రామనామమునుగూర్చియు, వేనోళ్ళ బొగడియున్నాడు. అప్రయత్నముగా గావించు, సంకీర్తనమునకుగూడ, ముక్తిసిద్ధము, పరిహాసముగా. గాని నిందారూపమున గాని, అర్థరహితముగా గాని చేసిన నామసంకీర్త

నకు, మోక్షము కరతలామలకము, పెంపొను చింతకాను రామ నామమునేర్పి గోపన్న రామదాసైనాడు. ధ్యానశ్రీగ్రంథాంగ్రర గ్రాదులలో నామ లేఖనము కోటిగుణితము.

మనో వాక్కాయ శుద్ధినర్థించి, మూడునమూళ్ళు నోట నుచ్చరించి, పిదప మోక్షసిద్ధినాశించి, శ్రీరామ ఋషక్షరిని, లేఖనము గావించుచు, గోటినామముల లిఖించిన పుణ్య పురుషుడు రామనాయుజ్యసంపద జూరగొనగలడు వేయేల? రాముకనకువలె? స్థిరస్థాననివాసియగునని రామదాసు రాగం పిచ్చయార్యుల జీవితము సాక్ష్యమిచ్చుచున్నది.

పూర్వవాసనాబలమున మంత్రోపదేశ పత్నియందు సగుణదృష్టియు, సగుణమున సాక్షాత్కారము, యనాదిబీజమున గల శుద్ధచైతన్య మహాకాశమున నిర్గుణదృష్టియు, జీవితాంత లోనంగ వ్రాసి ముగించిన రామకోటిత పాటు సంపూర్తి వ్యక్తిలో నిరాయాసప్రభ లుట్టిపడ నానందవారి దేలి యాడుచు, దేహేంద్రియాదుల గోదావరీనదీ సుతెగ్గి కడి, జీవుని శ్రీరామచంద్రునిచేర్చి, శాశ్వతసుఖ మనుభవించిన, భక్తా గ్రణి జీవితగాథ శ్రవణీయమై, ఆదర్శప్రాయమై మనసాధన భక్తికి తోడ్పడగల దనుటలో సంశయింప బనిలేదని ఖండి తముగ జెప్ప సాహసించితి.

పాఠకమహాశయులారా! వినుడు, సావధానులరై వినుడు,

కం. ఎఱుక గలవారి చరితల

గఱచుచు సజ్జనులగోష్ఠి గదలక ధర్మం

తెలుగుచు నెఱిగిన దానిని
వాలున కనుష్ఠించునదిస మంజసబుద్ధిక్.

(భాగవతము)

భక్తిశ్రద్ధలతో నేకాగ్రచిత్తులపై వినుండు. తండ్రి కోటయ్య. తల్లి కోటమ్మ. ఈపవిత్రదంపతుల మూడవపుత్రుడు మన భక్తాగ్రణి దాసు రాగం పిచ్చయాచార్యులు వాసము గుంటూరు. వీరి కాంధ్రాంగ్లేయ విద్యలయందు ప్రవేశము గలదు. ఈవంశక్షేత్రమున భక్తిబీజమునాటి, మొలకెత్తించిన పుణ్యమూర్తి రాగం వీరయ్యగారు. దాసుగారి సోదరు డీతండు. ఒకప్పు డన్నతో, బంధువులతో భద్రాద్రి యాత్రకేగుకారణాముగ వంశక్షేత్రమునం దంకురించిన భక్తిమొలక దాసుగారిచే బోషింపబడి తదగ్రపుత్రుడు సమర్థ ఆంజనేయులుగారి దోహదమువలన వృక్షమై పండ్లతో, పూలతో, కాయలతో విరాజిల్లుచు వర్తమానమున నాంధ్రభక్తలోకమున కాశ్రయమైనది. ఈ యూత్రాకాలమున గలరావ్యాధిద్వారా బరీక్షించి భగవానుడు మన భక్తాగ్రణి కదృష్టపయపత్రిక మాలముగ దాసుగారి కష్టసహానశక్తి లోకమునకు వెల్లడించినాడు.

గుంటూరు మండల గహానశాఖలో నుద్యోగిగా నున్న తరి తన యాగ్గురు బిడ్డలతో ప్రథమ భార్యా శరీర యాత్ర జాలించినను ఉద్యోగమూడినను జీవనాధారమంతరించినను విషయలంపటుల కెందును సుఖములేదని తెలిసి పరిపూర్ణ

త్యాగియై తన నిర్లిప్తత్వము వెల్లడించినాడు. ఇంతలో విరాగిని పట్టుబట్టితిరిగి ప్రారబ్ధము పెండ్లికొడుకును జేసినది. రెండవ భార్య సుందరమ్మ. యెండలో తట్టయుండినట్లు సర్వవిధముల భర్త ననుసరించి భక్తి వృక్షమును బోషింపుమ ననుకూల దాంపత్య వైభవమున దోహదమిడ సద్వృక్షము కాపునకు వచ్చినది.

పెండ్లినాడు నల్లబోటికొండపై వేంచేసియున్న శ్రీ నృసింహస్వామివారి దంపతులకిడిన యాశీర్వాద బలమునను, గుంటూరు నల్లమస్తానుగారి కృపాదృష్టిబలమునను గ్రమమున మంగళగిరి, వినుకొండ, శ్రీశైలము మొదలగు పుణ్య క్షేత్రముల నుద్యోగములభించుటయే కాక, సుగుణపుర పుత్రులు నొకపుత్రికయు దానుపెంచిన భక్తిఫలపుష్పములా! యన్నట్లు లుద్భవించిరి.

ఎంతటివారి నైనను పారబ్ధము కలతపరుపక పోదు చూడుడీ? వాతావరణ మనుకూలింపమియో? పూర్వకర్మ కృతం పాపం వ్యాధిరూపేణ బాధించు ననున్యాయము ననుసరించియో? వ్యాధిబాధితుడై తన యుద్యోగమునకు స్వస్తి జెప్పి గుంటూరుచేరి యత్యంతకష్టముతో గుటుంబ పోషణ జేసికొనుచు పెద్దకుమారునకు విద్య నేర్పించు కార్యమున దాసుగారికి లభించిన క్లేశములు వర్ణనాతీతములు పుత్రీ వియోగముగూడ జరిగినది. ఇట్టి విషమపరిస్థితిలోగూడ శాంతిని కోల్పడలేదు.



రాగం పిచ్చియామాత్యులు

కోటిలేఖన కార్యక్రమమారంభించి పనిగొనుచు, దన పత్నియ త్నమున కంతిరాయమని కాబోలు కిల్లి కొట్టును కట్టి పెట్టి శ్రీ నృసింహాలయములో పెద్దపుత్రుచే బడిపెట్టించి, గుట్టుగా సంసారమును నెట్టుచు, క్రమముగ నగ్రతియుని నెత్తి నంటగట్టి గట్టిపట్టుదలతో దినము పండ్రెండుగంటలు కాలము రామ కోటి లేఖనమందును, మిగిలినకాలము, రామభజన పురాణ శ్రవణాదులయందును వినియోగించుచు దనజీవితమును సార్థక పరచుకొనుచున్నారు. డెబ్బదియైనపడివచ్చియు రాకమునుపు మన పిచ్చియూహ్యలకు దాసబినుదమంటు పడినది గుట్టా !

నృసింహాలయములో నాగుచుండు పాఠశాల కను కూలముగ నిజకుటుంబ మగ్రహారమున కతిరిక్తములో మార్చిరిగాని. రామవిశ్లేషమున కోరుచు తనయు భీషితమున కన్యథాత్వము సిద్ధించుట విచారించు నడ, నొకనాటి స్వప్న మున సాక్షాత్కరించిన శ్రీరామచంద్రమూర్తి, నిజసోదను నుద్బో ధించి. చెలో, భాయ్, చలో అని త్వరపెట్టు బయటకు దేరిన దాసుగారి పాతయింటినుండి బయలు బడిన దృశ్యమును గాల కించి కుటుంబమునకు వసతిగృహ మవసరమనుట భగవదా దేశమని తెలిసి మరునా డుదయమున నన పాతయింటగల శ్రీరామపట్టాభిషేకచిత్రము భక్తులభజనలతో నగ్రహారము లోని నూతనగృహప్రవేశము గావించి గృహద్వయమునం దును, భజనలు గావించున శ్లేర్పాటుగావించి సమయాను గుణముగా, నందు దానును భాల్గొనుచుండెను

నూతనగృహము నృసింహాలయ సమీపమునందుం డుట హరికథా పురాణశ్రవణాదుల గాల్గొనుచు నానంద ముగా గాలము వెళ్ళింపుచున్నారు. దాసుగారు దినములు గడచినకొలది శ్రీ సీతారామ నామసంకీర్తనసంఘ మభివృద్ధి నంది భాగవతసేవలవారిగా సాగుచుండుటయే కాక గ్రామ మం దంతటను గృహసంకీర్తనములు, నగర సంకీర్తనములు, అన్నదానములు, హరికథలు, భాగవతసేవలు, విస్తరింపించుట నుపన్యాసపూరితములైన భగవన్నామప్రచారముతో శ్రీసీతా రామనామసంకీర్తనసంఘము గర్తపురి గర్గోలు పెట్టుచున్నది. ఈ సత్క్రియా కలాపముల కన్నింటికిని దాసుగారి గృహమే కేంద్రస్థానము. దాసుగారిప్పుడు యువకులతో గలిసి యువకు డైనాడు భగవత్సేనయందు.

దసరా రాబడితో గుంటి గుర్తుల కన్నదానము జేయ గుమారుని బ్రోత్సహించి, కార్యము సాగించుచుండ గొన్ని యేడులకది శ్రీసీతారామనామసంకీర్తనసంఘమునకొక శాఖగా రూపొంది. ఇప్పుడు సమర్థుని యాధిపత్యమున జరుగుచున్నది ప్రతిరామకోట్యుత్సవాంతమున జరుగుచుండు బీదనారాయ ణాన్నప్రదానమున కిది బీజమైనది. అంత గొంతకాలమునకు జ్వరపడి రామకోటిలేఖనమునం దశక్తులైనను శ్రీయుత అద్దే పల్లి రామకృష్ణయ్య శ్రేష్ఠిగా, రుచితముగ నొసంగు రామ కోటిలేఖన గ్రంథముల స్వయము భక్తులకిడి వ్రాయించుచు, అట్లన్యులును, తానును వ్రాసినట్టి రామకోటిగ్రంథముల

నన్నిటి నొకచో జేర్చి, సంవత్సరమున కొకసారి పూజింపు నట్లు కట్టడి కావించి పనిగొనుచుండ 2-9-1933 సంవత్సరము మొదలు వారిగా జరుగు రామకోటి మహోత్సవములకు మూల కందమై విస్తరించినది.

తదీయోత్సవముల మొదట, 48 మందిరములలో జరిగిన పూజలిప్పుడు నందలకొలది మందిరములలో జరుగు చున్నవి. త్ర్యాహ్నిక పంచాహ్నికదీక్షగా పారాయణలే గాక, శ్రీ రామ సామ్రాజ్య పట్టాభిషేక కల్యాణాది సత్క్రతుకలాపములు కాక క్రమముగా నామసంకీర్తనము లతో సుందర మందిరములలో అనేక మహోత్సవములతో "శ్రీరామనామక్షేత్ర" మేర్పడి సర్వత్ర వెలసినదియై జరిగినవి. ముందుగూడ జరుగనున్నయవి సంకల్పసిద్ధిసాధనములు ఉత్తరో త్తర వృద్ధిదములు.

భాగవతులు నిర్భయస్వరూపులు, హాలాహలముగానీ, కాలాగ్నిగానీ తుదకు మృత్యువుగూడ భక్తుని భయపెట్ట లేదు పెద్దపక్షి యొకప్పుడు తనగృహముపై వాలిన తక్కు వేమి మనకు రాముం డొక్కడుండువఱకు, అనిపాడుచు, నింటిపై పాలుచల్లి తృప్తిగొనినాడు. ప్రతిగ్రీష్మమునందును చలివేంద్రముల నిర్మించి స్వయముగ మార్గస్థుల దాహశాంతి గావించుచుండు మహోపకారి శ్రీరామనామక్షేత్రశ్రేష్ఠ సాధన శాఖకండగా నిలిచి జపకుటీరములు నిర్మింపజేసి, వానియందు జపముల గావించు సాధకుల కండగా నిలిచి కృతకృత్యులు

గావించినారు. శ్రీవారినిత్యకృత్యములు రెండే రెండు. అందొకటి రామకోటి లేఖనము, రెండవది శ్రీ నృసింహాలయమందలి పురాణశ్రవణము. తన శ్రీరామకోటి లేఖనగ్రంథములను శ్రీభద్రాద్రిరాముని కర్పింపవలయునను యపేక్షయతిశయింప. క్రీ. శ. 1934 సంవత్సర చైత్రశుద్ధమున జరుగు సీతా కళ్యాణమహోత్సవమున చిన్నకుమారుడు నంక కొశ్వర్లను వెంటగొని బయలుదేరి చైత్ర శుద్ధ పంచమి పొద్దుపొడు పున గౌతమి నుత్తరించి స్నానమాడి స్వరూపధారియై మడు గులలో బందగులగూడి భాగవతబృందము సన్నంటరా రామ భజనలు దేలియాడుచు, గనుకొలంకుల నానందవారి బిందు సందోహము. మిరుమిట్లు, పురవీథుల దాండవించుచు గిరికి వలగొని భద్రినగ మెద్దమెంచి భూళిదర్శన వ్యాజమున సీతారాముల దర్శించి వందనము లర్పించి, సాయుజ్యమర్థించి, యిష్టార్థసిద్ధి గడించి, సెలవుగొని బసజేరి భోజన భాజనముల గావించి సుషుప్తిసుఖ మనుభవించి యానందించిరి.

తెల్లవారినది గౌతమి గుక్కిళించిడివార్చి మడుగులదీర్చి సుఖాసన మలంకరించి స్వీయాజ్ఞానువర్తియగు పుత్రుజేరి కాలాతిక్రమణమున కనుమతింపజాల సప్తమిగడియలకై వేచి యుండనేల భగవత్కార్యకలాపముల కన్నియు శుభసమయ ములే లెమ్ము నేడే శ్రీరామకోటి శ్రీరాముని కర్పింతము శుభస్య శీఘ్రమనినారు. ఆలసింపరాదు. అని త్వరపడుచు లేచి రామకోటి లేఖనగ్రంథములకట్టి శిరమున ధరించి, భక్త

బాంధవకోటితో గిరిప్రదక్షిణము గావించి, కోవెల బ్రవేశించి, ప్రదక్షిణ నమస్కారములు స్వామిని కీర్తించి స్వామికో టర్పించి జన్మ సార్థకత వహించినదని సంతసించుచు, భగవన్నామసంకీర్తనము విడిదిలకేగి, సమారాధనాది సత్క్రియల బాంధవ భాగవతముఖ్యుల నర్చించి సంపూర్ణతృప్తి నార్జించిరి దాసుగారు.

పొద్దు గ్రుంకినది పుత్రులకు ఉత్తరక్షణము మనది గాదు. కోవెలకేగి రాముదర్శించి సెలవుగొనవచ్చు భక్తులు గావించు సప్తాహములో బాల్గొందము నేటి రేయియే పట్టుబట్టి భగవన్నామ ప్రవాహముసకలు బెట్టుచు ప్రసాదస్వీకార తృప్తి నార్జించి మానవ జన్మసార్థకము గావించుకొనవలెను రమ్ము, రమ్ము అని త్వరపెట్టుచు భజనలు జేసి రాముని దర్శించి, ధ్యాననిష్ఠనుండి కొంతవడికి బహిర్ముఖులై సెలవంది ఇంట చేరి భుజించి పరుండిరి. తన ప్రక్కగదిలో సప్తాహము జరుగుచున్నయది. కుమారునిచే సప్తాహము జరుగు గదిప్రక్కకు తన పడకను త్రిప్పించి సంకీర్తన మాలకించుచుండిరి. రాత్రి రెండు గంటలైనది పడకనుండి లేచి కూర్చుండిరి. శ్వాస విరాడదు తల దిరుగుచున్నది. కూర్చుండజాలననుచు భద్రగిరిప్రభు చేతులు జోడించి "శ్రీరామ రామ" అనుచు ప్రక్కపై కొరుగుట గాంచి వెంకటేశ్వర్లు తనతొడపై తండ్రిని పరుండ జేసినాడు. స్మృతిదప్పుచున్నదని తెలిసి తండ్రి చెవిలో రామనామము జెప్పుచు గూరుచున్నాడు. వెంకటేశ్వర్లు శ్రీరాముని నన్య

సుందరమూర్తియై దర్శన మొసంగుట. భగవానుడు తన తండ్రి నన్నుగ్రహింపవచ్చి దర్శనమిచ్చినాడని దలంచి వందన శతములు మానసికముగ నర్పింప సంతృప్తితుడైనాడు శ్రీరామమూర్తి.

రాత్రి నడిజామునకు మించినది 22-3-1934 దాసుగారి జీవాత్మ పరమాత్మలో కలిసినది. పెద్దకుమారుని రాకకై వేచి యుండి మరునాటి సాయంత్రికి భక్తులు భగవన్నామకీర్తనలతో శ్రీవారి భౌతిక దేహమునకు దహనసంస్కారము గావింపబడినది. నాడు భజనలతో భద్రగిరి ప్రతిధ్వనించినది. సంగానయన సంస్కారభాగ్యముమాత్రము సమర్థున కబ్బినది. అనాయాసమరణదాతయైన శ్రీరామకోటిని లిఖించి, రాము స్మరించి, తరించి మాపాతకులు కృతార్థులగుదురుగాక.



చుండిరి. కడుబీద విద్యాశూన్యుడు సుందరదేహుడు కాడు. ఎట్టివాడైననేమి ధనవంతులెల్ల రీతనిదాసులు సుందరాంగులుకు శ్రీరామమూర్తి,విద్యావంతులుభృత్యులు. తండ్రిఇలపావులూరి శ్రీనివాసులు. తల్లి ఆదెమాంబ. సోదరులు వెంకటకృష్ణయ్య, సీతారామయ్యలు. జననము క్రీ. శ 19వ శతాబ్దము నేటి కాసువదినాలుగేండ్ల వయస్సు. నివాసము కందుకూరు తాలూకా, సింగమనేనిపల్లె. ఐదవయేట నక్షరాభ్యాస ముతో భక్తిబీజము మొలకెత్తినది ఆది వయసుతోపాటు పెరిగి వృక్షమై పూలు కాయలతో విరాజిల్లి కాపుదిగినది ఇప్పుడు న్వృక్షమునం దక్కడక్కడపడుకాయలుమాత్రమగుపడుచున్నవి. క్రమముగా బడిచదువు పూర్తిఅయినది ఉపనయనమహోత్సవము జరిగినది. స్వపురిభజనమండలి స్థాపించి, నిత్యభజనలు జరుపుచు, నాయాపర్వములందు రామ, కృష్ణ నృసింహాది జయంతుల జరుపుచు బరమానందమున నోలలాడుచు గ్రిమముగ దరంగ కాలక్షేపమున కలవడినాడు. ఆరోజులందు దరంగ కాలక్షేపమున బేరుగడించినవాడు. ఏలేశ్వరపు సీతా రామాంజనేయులుగా రొక్కరుమాత్రమే.

వారిని దర్శింపదలంపు గలదు. గాని అది నెరవేరుటెట్లు చేత డబ్బులేదు నడువ గాళ్ళులేవు. దైవముమీాద భారము వేసి తాబేటికివలె జేయూతచక్రాలతో నెడ నెడ మకాములు జేయుచు మున్నుపండరియాత్రకేగు కూర్మదాసునికివలె బంగ వోలుస్టేషను చేరి యొక యుదారమూర్తి ద్రవ్యసహాయముతో

తెనాలి కేగి యటనుండి పయనముసాగించి యెడ్ల పల్లి కూరును గాంచినాడు.

అందు బ్రహ్మశ్రీ మల్లాది సుబ్బదాసుగారు జరుపు సప్తాహములో కాలక్షేపము జరుగుచుండెను. సీతారామాంజనేయులుగారి వెంట నల్లభాపురము జేరి సుబ్బదాసుగారిని దర్శించి తదీయ సత్కారమంది సముచితైన మనశ్శాంతిబాలును గాంచి యూరడించి మార్గసరియాసమంతయు విని కూర్మదాసను సార్థకనామ ప్రదానము జేసినాడు. నాటనుండి వెంకట సుబ్బయ్య పేరునుమాని భక్తలోకమంతయు కూర్మదాసని పిలువజొచ్చినది.

నాయనా! కూర్మదాసగా? మీ యూరిపయన ప్రశ్నైన సను సాగించుచున్నావా? నీవును నామస్మరణములో బాల్యాను చుంటివా? లేనిచో? నేటినుండి భజనానందమున మునిగి తేలుము, నే నిడినపేరు సార్థకమగును అనుచు సాదరముగ కూర్మదాసుగారిని ముందు గూర్చుండబెట్టుకొని హస్తమస్తక సంయోగమున నాదరించె. తదుపరి సీతారామాంజనేయ భాగవతారుగారివలన బాలగోపాలతరంగ కాలక్షేపము సాగినది. అందు భక్తులెల్లరు బాహ్యాని తన్మయసుఖ మనుభవించు చున్నారు. చూపరులెల్ల రానందవారి నోలలాడుచున్నారు. జోడు మృదంగనాదములు మిన్ను ముట్టుచున్నయవి. సంకీర్తనా పరుల గంఠధ్వనులు దిక్కులజెవుడు పరచుచున్నయవి. తాళముల మ్రోతలు భూనభోంతరాళములు మారుమ్రోగుచున్నవి. భక్తుల నేత్రము లానందజలధులైనవి. సుబ్బదాసుగారు ప్రేమ

వచినారు. కూర్మదాసు ప్రత్యక్ష కూర్మదాసయినాడు. గంట లతిక్రమించినవి. పగలెల్ల గతించినది. రాత్రిసమీపించినది బహిర్ముఖము లంతరించినవి. అంతర్ముఖము లుద్రేకించినవి ఇట్లు బ్రహ్మానందమున దేలియాడిన భక్తుల కెట్టి యతిథి సత్కారము లాచరించి ధన్యతగాంచవలయునో? యోచించి తగు ప్రయత్నములో నున్నారు కార్యకర్తలు. ప్రొద్దుగ్రుంకి జాముప్రొద్దుపోయినది. సంకీర్తన ముగిసినది. భక్తు లెల్లరు బాహ్యావృత్తు లార్జించిరి. సుబ్బదాసుగారు భక్తులెల్లర కభ్యంగనముల గావింపించి మడుగులిచ్చి రుచిరాన్నముల దృప్తులగావించి చందనతాంబూలములిడి సుఖాసీనులంజేసి భాగవతకథాశ్రవణమున సంతృప్తుల గావించుచు సుబ్బ దాసుగారు కూర్మదాసుతో నిట్లనిరి.

కూర్మదాసూ! ఈ భక్తసమాగమమువలన మనము ధన్యులమైనాము. ఇట్టి సద్భక్తసమ్మేళనముతో జరుగుసప్తాహ దీక్ష నాగించుట గుటుంబీకుల కసాధ్యమే గాని నీబోటి బ్రహ్మ చారులకు సులభసాధ్యము పంగుత్వస్థితి దలంచి భయపడకు ఇది దేహమునకే గాని మనస్సునకు లేదుగదా? స్థిరసంకల్ప పూర్ణుడవగుము దాన నీవు దరించుటయే కాక నాంధ్రావని నంతటిని దరింపజేయగలవు. అదుగో నిరతాన్నదానశిరో మణిగారగు వరంగలు వరమ్మగారు వారి యాశీర్వచనము బొందుము అని చెప్పుట సంతసముతో గూర్మదాసు వరమ్మ గారికి నమస్కరించి యాశీర్వాదమందినాడు. ఇట్లు సప్తా హము క్రమముగా నన్నదాన భజనానందములతో ముగిసి

నది. భక్తులమహాశీర్వాదములు ముంగునకు దొరికెను. పాండు రంగ సప్తాహములుజరుప సంకల్పించినాడు కృష్ణదాసు.

తనూపరి వరమ్మగారి యనుజ్ఞనుపొంది పండరికేగి పాండురంగనిదర్శించి సప్తాహదీక్షలు నిర్విఘ్నములుగ జరుగు నట్లు వరమర్థించి రంగనిసేవలో గ్రొన్ని నాసరకులుండి బయలు దేరి తెనాలిజేరి తురగా కృష్ణయ్యగారింట జరుగు భజనలో బాల్గొని అటనుండి ఈమని ప్రవేశించి సోమనాథం సుబ్బావధానులుగారింట బసజేసి యుపవాసదీక్ష సాగించుచు బ్రహ్మ సత్రము జరుపుటకు సిద్ధార్థినామ సంవత్సరాషాఢ శుద్ధసంతమి ముహూర్తము నిశ్చయించి గ్రామవాసుల కెజెంగించిన నాయూరు నియోగి వైదికకక్షలకు నిలయమగుట వ్యక్తి నికగృహమున బస జేసినాడని నియోగులును, దానుగారు నియోగియగుట తమకు సంబంధము లేదని వైదికులును విముఖులగుట జరిగినది. ప్రయత్న మేమియు సాగలేదు. ఇప్పటికి క్రతువు ప్రారంభమగుటకు ముహూర్తము మూడురోజులు మాత్రమే.

గ్రామవాసులు విముఖులైనను వాతావరణమునను కూలమైనను,

తన సేవకులు మగువనో తానువారి
మగువనో చెప్పుటకిని రామప్రభుండు
భక్తజనకల్పధేనువై పరగినట్టి
శ్రీరఘూత్తముడెప్పు పేక్షింపబోడు.

అను సమర్థుని వాక్యానుసరణే నాటిరేయి స్వప్న మున శ్రీరామలక్ష్మణులు వైష్ణవవేషధారులై సాక్షాత్కరించి,

నిర్ణయించుకొనిన ముహూర్తమునకు బ్రహ్మసత్ర మారంభింప బడెను. సనమికి మాస్చుకొనుము ఈలోపల పోగ్రామనోటీసులు పంచి పెట్టుము. తక్కినపనులు మేము చక్కబెట్టగలమని సెలవిడి యంతర్హితులైనారు.

భగవదాజ్ఞ ననుసరించి పోగ్రాము పత్రికల ముద్రించి పంపబడినవి. నేలనూతల సుబ్బావధానులుగారి ఖర్చుతో బందిరులు పూర్తిఅయినవి. గతరాత్రి స్వాప్నికముగ లభించిన భగవదాజ్ఞను పురస్కరించి పెద్దిరాజు మహాలక్ష్మమ్మగారిని జేరి ప్రథమరోజున సంభావన యొసంగుమన బదులుచెప్పక తల యూచి వెళ్ళిపోయినది. భగవదాజ్ఞకంతరాయము వాటిల్లదని తెలిసినవారగుట దాసుగారు నిర్విచారిత్వులై, మంటపనిర్మాణము గావించి శృంగారించి యందర్చామూర్తుల బ్రవేశపెట్టినారు. నాటిరాత్రి యామద్వాయ మతిక్రమించిన నైదువందల రూపాయిలుగల పళ్ళెరముతో బ్రవేశించి దాసుగారికి సమర్పించి తనకు స్వప్నమున లభించిన శ్రీరామాజ్ఞ ననువర్తించితి ననియు మిగులు తగులులనేనే భరించెదననియు జెప్పుచూ, వెళ్ళిపోయినది మహాలక్ష్మమ్మ.

మరునా డుదయమునుండి బ్రహ్మసత్రము ప్రారంభింపబడి, శేషించిన పదిరోజులకు బది యుభయములు సంపన్న గృహస్థులొసంగుట క్రతువు ముగిసినది. కొత్తపల్లి నిడమానూరు మైనంపాడు నగరములనుండి వచ్చిపాళీ భజనలలో బాల్గొనిన భక్తబృందమునకు గావించిన సత్కారములతో గ్రతువు జగజ్జేగీయమానమైముగిసినది.

త్తైనారు. వీరిప్పటికిని సజీవులు. ఈ సప్తాహములో రోజునకు రెండునీలిమందుకళాయీల నెయ్యి పూర్తిగా వినియోగింపబడుచు వచ్చినదనిన నతిథులసంఖ్యను ప్రత్యేకించి చెప్పబని లేదు దానుగారెండు సప్తాహములనుప సంకల్పించినను అఖండారాధనమునకు నూనెమాత్రముసంపాదించి క్రతుప్రారంభువారు రెండవకంటికి తెలుపబడకయే అయాచితముగ లభించిన వేలకొలంది ధన ధాన్యములతో క్రతువు పూర్తియగుచుండునది.

ఈ ఒంగోలు సప్తాహము ప్రారంభించుటకు పూర్వము సందిరులకు దాక్షిరియాకు గొనివచ్చిరి అవి ప్రోగులమర్చబడినవి. ఆప్రోగులపై గేలంతోయు రెండునల్లత్రాచులు కాపలాగా యుచు డస్కుసులదిసుము చుండెడివట.

అరయ జాలదుగానిపా మరులురామ
చంద్రమహాత్మ్యమరరెప్ర శస్త్రతమము
భక్తకల్పద్రుమంబన బరగినట్టి
శ్రీరఘూత్తముడెపుడుపేక్షింపబోడు.

భక్తుడన ప్రత్యక్షభగవంతుడు, భగవల్లీలలెట్టివియో, భాగవతలీలలును అట్టివియే. ఒకప్పుడు గుంటూరునంగల న్యాయవాదులలో గొందరు నీలంరాజు చలపతిరావుగారిని జూచి "చలపతీ" ఎవరికిగాని, యేతరినిగాని, యొకపైసయు ధర్మము జేసియెఱుంగవే కూర్మదాసుగారి సప్తాహములో నారువేలరూపాయీలు వెచ్చించినావట చిత్రముగానున్న దే

గారి మనుమడు తటాకమునబడి మృతినందనున్నతరి ఆజన్మ విరోధియగు వ్యక్తియొక్కండు పిల్లవాని ప్రాణాపదనుండి తప్పించి రక్తియ్యను సంతసపరచినాడు. ప్రశ్నించిన తాను నూతనపురుషుని ప్రోద్బలమున నీకార్యము జేయ జాలితినాని బుద్ధిపూర్వకముగా జేయలేదని ఆవ్యక్తి చెప్పినాడు. భక్తులకు భగవంతుడు ప్రత్యక్షపరోక్షముల సాయపడుచుండుననుట, ఇదియే తార్కాణము. శుభాంతముగా సప్తాహము పూర్తియైనది.

నియోగి వైదికికక్షకు మూలస్థానమైన నర్సారావుపేటలో ధనుర్మాస దీక్షతో గలిసిన సప్తాహ మేమియు దుడుకులు లేకుండగ పూర్తియైనది. రెండు తెగల వారన్నదమ్ముల వలె గలసి మెలసి కర్తువు బూర్తిగావించినారు.

ఆర్తవాక్యాలనాలించి యుబ్జమిత్రు
డేకరణిజకర్ణవాకాల నేలెనట్లు
యార్తరక్షావనుండను కీర్తిగనిన
శ్రీరఘూత్తము డెపుడు పేక్షింపబోడు.

ఒకప్పుడు రామకోటి నర్పింప భక్తబృందముతో భద్రగిరియాత్రకు బయనముసాగించి పనిగొనుతరి చాపరాళ్లపల్లి, మొలకలపల్లి నడుమ భక్తులందఱు మేనులుమరచి భజనలు గావించుచున్నారు. మృదంగధ్వనులు మిన్నుముట్టుచున్నవి. కరతాళధ్వని దిశలావరించి మారుమోగుచున్నవి. భక్తుల మూర్తధ్యానములు భగవాను నున్ముఖుగావించినవి. ఆత్మ

జ్యోతి దిక్కులావరింప నందుండి పట్టాభి రామమూర్తి దాసు గారికి సాక్షాత్కరించినారు. స్నానపానములతో బాటు గుంకి నది పయనమాగినది క్షుత్పిపాసలు మరచి ఆనందమానంద ప్రవాహమున దేలియాడుచు దెల్లవార్చినాడు మరునాడుదయము నకు భక్తులెల్లరు బ్రహ్మానందోన్ముఖులై యుత్సాహ భద్రగిరి జేరి శ్రీరామమూర్తికి రామకోటినర్పించి కృతార్థులైనారు.

సికిందాబాద్ సమీపములో గుండా మహారాజు గారివలన బాండురంగ మహామంత్రోపదేశమంది తదీయ ప్రభావమున భద్రాచల సమీపములోని లింగనూడ గోసవీడు లందు సత్రములు సాగించి భూతసేవనాచరించినారు మన సనాతన బ్రహ్మచారిగారు.

గోసవీడు సత్రములో యాత్రికులు భోజనములు చేయుచున్నారు. దాసుగారి యాజ్ఞననుసరించి గుండుకొక్క లడ్డుమాత్రమే భోజనపాత్రల బడుచున్నది మారడిగిన సమాధానమిడువారు లేరు. ఎందుండియో యొక తేజోమూర్తి యరుదెంచి బ్రహ్మచారిగారిజేరి లాడువలు చాలవని భయపడు చుంటివా ? భగవదనుగ్రహముండిన దన్కువేమి మనకు చాలినన్ని వడ్డింపమనుము అని చెప్పి అంతర్హితుడైనాడు. తన కుదోచ్ఛదించినమూర్తి శ్రీరామమూర్తియని నమ్మి భగవదాజ్ఞ ననువర్తించిన యాత్రికులు తృప్తిగాభుజించినారు గాని లాడువులరాసి తరుగలేదు మరునాడు సమీప గ్రామవాసుల నాహ్వానించి మిగిలిన లాడువులతో దృప్తిపరచినారు.

ప్రయాణసౌకర్యముచెడి వెనుకబడిన భర్తలకై విచారించి విచారించి క్షుత్పిపాసా వశులైన స్త్రీరత్నములు కొందఱు లింగగూడ సత్రమున జేరి దాసుగారియానతి భోజనములు జేయుచున్నారు. వంటవారవారిగా భోజనపదార్థములు వడ్డింపుచున్నారు. నూతన స్థూలకాయుడొక డరుదెంచి ఆకలి, ఆకలి యని కేకలిడుచు బరుగిడివచ్చి భుజించువారి నడ్డగింప నా దుండగీని వారించి కఠినవాక్యముల మందలించుచు దాసుగారు వాని బ్రత్యేకముగ గూరుచుండబెట్టి భోజనమిడ వాడు భుజించుచు,

పరులునిందించుపట్లగో పంబుగొనక
శాంతమునుబూనివినయపు మ్మలతనూని
విహితసంభాషణంబుల వెలువరించి
స్వాంతమా ! వారిసంతస పరపుసతము.

అనుపద్యము బదే బదే బాడుచు గోవిందలతో భుజించి యంతర్హితుడైనాడు. ఇతడు సాక్షాద్భగవంతుడని విశ్వసించి దాసుగారు తన కోపమును రూపుమాపికొనినాడు ఇపుడెన్ని కోపకారణము లెదురేగినను చలింపని దీక్షతో జీవితము సాగించుచున్నారు.

ఇట్లు దాసుగారిరువది సప్తాహములు దీక్షతో సాగించుటయే కాక భద్రాచల యాత్రికుల సౌకర్యార్థము నాలుగు వర్షములు గొనవీడునందును, లింగగూడ నొకవత్సరమును, బూరగొమ్మలపాడున నొకవత్సరమును, కొత్తగూడ నాలు

నైవేద్యాదిసారాధనాది కైంకర్యము లవారిగా సాగుచుండు
టయే కాక ప్రతియేట బ్రహ్మోత్సవము మహావైభవముగా
జరుగుచున్నది. శ్రీమాన్ రా॥బ॥ హరిప్రసాదరావు, అచ్యు
తని వెంకటసుబ్బారావుగార్లు మఱికొందఱి భక్తులతో గలసి
విరాళముల సమకూర్చి కైంకర్యములకు శాశ్వతస్థాయిని
గల్పింప యత్నించుచున్నారు. అచిరకాలమున వీరికోరికకొన
సాగించి పాండురంగమూర్తి వీరి నిహపరసౌఖ్యముల ముం
చేర్తి రక్షించుగాకయని వరమర్థించి వందన శతములతో
శ్రీపాండురంగని ప్రార్థించుచు నీకథముగించెద.



# శ్రీ ఆంజనేయ పరమహంస

పుణ్యభూమియనగు భరతఖండము అనాది నుండియు అనేక మహనీయులను గన్నట్టిది. ఒకపుడు శ్రీమన్నారాయణుడు రాముడై కౌసల్యా దశరథుల గర్భవాసమును జనించి దుష్టశిక్షణ శిష్టరక్షణ సల్పి మాయామానుష విగ్రహుండై ఉత్తరమున హిమవత్ప్రాంతమునుండి దక్షిణమున రామేశ్వరము వరకు పర్యటనగావించి ప్రతిచోట నాటికి నేటికి జనులచే మన మెల్లరము స్మరించు రీతిని గుర్తులుమాని మానవధర్మము దానాచరించి లోకమున కాదర్శప్రాయమైన పాదపద్మములు సోకినంతనే పరమ పావనమైన పుణ్యక్షేత్రముగ విలసిల్లునట్లు చేసినదీ భారతావని యందేగదా! ఇంతేగాక, శ్రీకృష్ణుడై దేవకీ వసుదేవుల గర్భవాసమున అర్ధరాత్రమున కారాగారమున దుష్టశిక్షణ శిష్టరక్షణార్థమై అవతరించి లీలామానుష విగ్రహుండై పరమాత్మ తత్త్వరహస్యమును అర్జునుని శిష్యునిగా గ్రహించి లోకమంతటికొరకు బ్రహ్మవిద్యయైన గీతాశాస్త్రమును బోధించినది కూడా యీ భారతావని యందేగదా! అట్టి యీ భారత దేశమున పరమ పూజ్యులైన మహాపురుషులెందరో పరమ పతివ్రతామతల్లులెందరో మహా సమాధి నిష్ఠా గరిష్ఠులైన తపః సంపన్నులెందరో నిరంతరము ఏమూలనో ఒక్కొకచోట అవతరించి తమ పాదధూళిచే జీవకోటికి తరుణోపాయము చూపుచు నాటికి నేటికి అధర్మమును రూపుమాపి ధర్మసంస్థాపన చేయుచునేయున్నారు.

సనాతన ధర్మమునకు పుట్టినిల్లైన యీ భరతఖండమున ఆధ్యాత్మిక తత్వమార్గాసక్తిలేని జీవికి తావుగలదా? మత్స్యములు నీటనేగాని భూమిమీద నివసింపలేనట్లు బ్రహ్మవేత్తలు భారతావనియందే ఎక్కువగలరు గాని వేరొకచోటగాదు. అట్టి భరతఖండమున రామదాసు, త్యాగరాజు, నారాయణతీర్థులు మొదలైన ఆంధ్ర మహాభక్తాగ్రగణ్యులను గన్న ఆంధ్ర దేశమునందే శ్రీ ఆంజనేయ పరమహంస అవతరించినది.

స్వస్తిశ్రీ నందననామ సంవత్సర కార్తీక బహుళ దశమి ఆదివారమునకు సరియగు క్రీ. శ. 1892 వ సం॥ నవంబరు 13 వ తేదీన ఒక సాధారణార్థిక స్థితిగల బ్రాహ్మణ కుటుంబమున శ్రీభైరవభొట్ల వంశమున జోగీశ్వర సీతమాంబల గర్భవాసమున కృష్ణాజిల్లా గుడివాడయందు యీ మహనీయుడు జన్మించెను. పుట్టిన శిశువునకు తలిదండ్రులు ఆంజనేయశర్మ అని నామకరణమిడిరి. హనుమదంశమే ఆశిశువునందు మూర్తీభవించెను ఉగ్గుబాలతోనే తల్లివలన రామ నామ రసమును యీ శిశువు చవిజూచెను. ఉయ్యాలతొట్టిలో రామ నామము చెవి బడినంతనే ఎంతటి ఏడుపునైన మానును. శిశువు దిన దినాభివృద్ధిగా రామభక్తియందోలలాడు చుండెను. తలిదండ్రులు యీ పిల్లవానికి అయిదవయేట అక్షరాభ్యాసమును, పదవయేట ఉపనయన సంస్కారమునుగావించిరి. తండ్రివలన నాతడు బ్రహ్మోపదేశమును పొంది ఆధ్యాత్మిక వికాసమునుపొందెను. యీ పిల్ల

వివాహము జేసికొని గృహస్థాశ్రమ ధర్మముస్వీకరించి కృష్ణా జి॥ నూజవీడు గ్రామముజేరి కొద్దివేతనమున కొకచోట చిన్న యుద్యోగములో చేరెను ప్రతివాని జీవితము అనేకమార్పులు జెందుచుండును. ఆయాజీవుల పూర్వసంస్కారమును బట్టియే అవి జరుగుచుండునని పెద్దలవాక్యము. ఇది శాస్త్రసమ్మతము లోకములో ఒకని జీవితమునకు మరొకని జీవితమునకు పోలికయుండుట యరుద.

క్షేత్రము బాగుచేసి యుంచిన పిదప విత్తువాడువచ్చి విత్తులుచల్లుట ధర్మమేగదా! ఇట్లు ఈ మహనీయుని జీవితము కొన్ని కాలము జరుగునప్పటికి బంగారమునకు మెరుగుపెట్టిన రీతిని ఒకానొక పుణ్యదినమున బ్రహ్మర్చస్సు ముఖమున దాండవింప, బంగారు ఛాయగలిగి ఆజానుబాహుండై యొక యోగిపుంగవుడు యీ మహనీయుని గృహమున కరుదెంచి. యోగరహస్యములనెల్ల వివరించి యుపదేశమొనర్ప యీ మహనీయుని జీవితమునకొక క్రొత్త వికాసముగల్గెను. అప్పటి నుంచి యీ మహనీయుని పూర్వజన్మ సంస్కారమున పందొమ్మిదవ సంవత్సరము వయసునకే అనగా గురూపదేశము నందిన 1, 2 సంవత్సరములలోనే సద్గురు కృపవలన బ్రహ్మ విద్యా, రహస్యములనెల్ల గ్రహింపగల్గెను. ఈ మహనీయుని బ్రహ్మవిద్యా సంపత్తిచే ప్రకాశింపచేసినది అప్పటికి భద్రాచలమందు ఓంకారాశ్రమమండలికి చెందిన శ్రీశ్రీశ్రీ సచ్చిదానంద జోగీశ్వర అవధూతస్వామివారే.

మును గ్రహించినవారు వారినిజేరి 'అయ్యా! తమ అను గ్రహమున్న చాలు' నడివారు అట్టియెడ వారిని చేయితో పిస్పుత్తిట్టి నాయనా! రామనామ మెంతగొప్పనియో చూడుము దానిని నీవు నిరంతరము అనుకొ నన్ను మనవకు నేను నిన్ను మనవను. ఇదేగా చిన్నముక్క (అనగా మాట అని వారిభావము' అన్నంతనే విశ్వసించినవారు ఆయన నొక మహాపురుషుడని గ్రహించెడివారుగూడ.

అపుడపుడు యోగరహస్యములను పూర్ణముగ గ్రహించితిమని విజ్ఞప్తీగుచుండిన మరికొందరు బాహ్యావిరాగులై, కాషాయ వస్త్రధారులై యీమహనీయులతో తత్త్వవిచారణ చేయ నుద్యుక్తులై వచ్చితిమని విన్నవించినంతనే వారితో "నాయనా! యోగివేమన" 'చెప్పేవాడు చేయడుసుమ్మా చేసేవాడు చూడడుసుమ్మి, చూచేవాడు చెప్పడు సుమ్మా' అని చెప్పిన భావమూహించితివా? వాచాబ్రహ్మజ్ఞానముకన్న ఏకొద్దియైనను అనుభవము గొప్పది. వేదములన్నియు చదివి ఉపనిషత్తులను మొదటినుండి చివరవరకు వల్లెవేసినప్పటికి సర్వకాల సర్వావస్థలయందు ఆబ్రహ్మభావన లేనిదే యీ జ్ఞానము వ్యర్థము 'దృగ్యగ్మంలీయతే యత్రమనస్తత్రైవ లీయతి' యిది యోగసిద్ధాంతము ఈ విధముగ మనోలయ మైనగాని మనజ్ఞానము పూర్ణత్వముగాదు. గాన ఇది మనము సాధించుటకు ముందు ప్రయత్నము చేయవలెనని చెప్పుచునే యోగనిష్టయందు నిల్చియున్న కొద్దిసేపటిలో శరీరమంతయు కొంతవరికి యొకకట్టెవలె బిగిసి యీ భౌతికప్రపంచములోనికి

వచ్చి యొకపిల్లవానివలె ప్రక్కనున్నవారి నోటికడనుంచి 'నాకుతినుట కేమైన పెట్టుదువా? ఆకలియగుచున్నది' అనెడి వారు అప్పటికప్పుడే వారు భుజించు స్థానమునకు వచ్చినయెడల ప్రక్కనున్నవారికి కొంచెముపెట్టి తాను భుజించెడివారు. ఈస్థితి చూచుచుండినవారలు యీ మహాత్ముని గూర్చి యోగాభ్యాసియనెడివారు.

ప్రతి దినచర్యనుచూడగా, ఎప్పుడును సముద్ర అరణ్య ప్రాంతమునందో, ఏకాంత వాసమున కౌపీనధారినో. దిగంబరునివలెనో మౌనమువహించి బ్రహ్మనిష్ఠ యందుండువారు మూరు యీ వ్యవహార ప్రపంచములో అందరివలెనే ఆడుచు పాడుచు అందరివలెనే తినుచు, సంచరించుచు కాలముగడుపుట చూడగా గీతాశాస్త్రమునందలి బ్రహ్మనిష్ఠ లక్షణములు కనబట్టి వీరొక యంతర్ముఖులని స్పష్టమగుచున్నది.

ఈ మహాపురుషులు 1928 వ సంవత్సరమునుంచి 1931 వ సంవత్సరములలో కృష్ణాజిల్లాలో బెజవాడ గుడివాడ గ్రామములలో తమ యుద్యోగధర్మము నిర్వేర్చుకొనుచు తమ తీరిక వేళల యందెల్ల తత్త్వరహస్యములను శిష్యగణమునకు బోధచేసి వారి నుద్ధరించుచు భక్తులతో కూడి నామ భజనలు చేయుచు యిట్లు కాలముగడుపుచుండిరి. ఈవిధముగా గుంటూరుజిల్లా తెనాలితాలూకా కొల్లూరు గ్రామములో కొంత కాలము గడిచెను.

అపుడు వీరొక భక్తునిగా నందరు పరిగణించుచుండిరి. ఆకాలమున వారి సేవాభాగ్యము లభించినవారిలో ప్రస్తు

తమ శాస్త్రవ్యాస్తవ్యులైన శ్రీకంభంమెట్టు మధుసూధవరావు ఒకడు. వీరు ఆడిటరుగా పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరులో తమ యుద్యోగధర్మము నెరవేర్చుకొనుచుండగా, బాపట్లకు పోయి స్థిరనివాసము ఏర్పరుచుకొనుమని సెలవిచ్చిన గురువాక్యములే 1934 సం॥ నుంచి వారు బాపట్ల నివాసముకు కారణము.

శ్రీ ఆంజనేయ పరమహంస తమ గురువాజ్ఞ ప్రకారము తమ 40 వ యేట. (1925 సం॥ లో) వాన ప్రస్థాశ్రమము స్వీకరించి, గుడివాడ తాలూకాలో పామర్రు సమీపమున కొండిపర్రులో నొక మామిడితోటయందు శ్రీ హనుమంతుని విగ్రహమును ప్రతిష్ఠించి అచట నివసించుచుండిరి. 1934 సం॥ లో తమ శిష్యులు మధుసూదనరావు బాపట్ల జేరినపిదప తరచు యీ మహనీయులును ఆగ్రామముకు దయచేయుచుండెడివారు.

ప్రతిదినము బ్రహ్మముహూర్తమందే లేచి కాల్యకృత్యములను తీర్చికొని తెల్లవారకముందే మేలుకొలుపులు పాడుచు పలువురు తమతో కలసి రామ నామసంకీర్తనచేయు భాగ్యమబ్బచేయుటకో యన్నట్లును తమ యనుగ్రహమునకు పాత్రులజేయుట కన్నట్లును తమసేవకులు మధుసూదనరావును చేత ఏకతారు, చిరుతలు ధరించి పాడుచుండగా బాపట్ల వీధులలో అప్రశాంతిసమయమున ఆర్తితో ఎలుగెత్తి సంకీర్తనచేయుచు ఒక్కొక్కరి ఇంటికిబోయి పిలచెడివారు తెల్ల

వారుజామున జేయు ఆ సంకీర్తనమందు పాలుపరుచు వారలను చుండెడివారు కీర్తనలు పాడుచునే భక్తి, జ్ఞాన, వైరాగ్యము లను ప్రజలకు ప్రబోధము చేయుచుండెడివారు సర్వకాల సర్వావస్థలయందు రామనామమహానందమునందే తన్మయత్వము చెందెడివారు వారు చెప్పిన ఉపదేశవాక్యముల సత్యము గుర్తెరిగి నమ్మినవారికి అద్భుతమహిమలు గోచరించెడివి. అందరకు రామనామమహిమయు, కలియుగమున శ్రీహనుమద్భక్తి ప్రాశస్త్యమును వెల్లడిచేసెడివారు ప్రజలకు సంచిత కర్మలనుండి విముక్తి ప్రబోధము చేయుచుండెడివారు "నాయనలారా! రామ అను రెండక్షరము లెంత మహిమగలవో మీకు తెలియునా? అవి స్మరించి, భావము గ్రహించి హనుమంతుడు వారధి కట్టగల్గెను. ఇంకను మీకు ఋజువుకావలెనా?" అని తమతో కలిసియుండెడి సంకీర్తన పరులతో ననెడివారు.

వారి యనుగ్రహమున కష్టపరంపరలనుండి విముక్తులైన వారుకొందరు వారి మహిమనే మా గ్రహించిన మరికొందరును దరిచేరినప్పుడు "కేవలము సిద్ధులు మహిమలుచూచి మోసపోకండి రామనామ పరులవ్వారి కెంత మహిమలుండునుగదా. దీనము చేత ధరించినవానియొక్క బలము పెంపొందు టాశ్చర్యమా? మీరున్ను సద్గురుకృపకు పాత్రులై రామనామపరులుగండి. రామనామ మెంతమహిమ గలదో మీకే తెలియగలదు" అనుచుండెడివారు.

ఈవిధముగా అప్పుడప్పుడు సాయంసమయములందు అనేకచోట్ల భక్తులగృహములందు సద్బోధచేయుచు కాలము గడపుచుండిరి. వారిబోధలయందలి కొన్ని సారాంశములను వారిమాటలలో యీ క్రింద వుదహరింపబడినవి

"భార్యా భర్తలు యిరువురును ఒకేమార్గములోనే యుండి తమధర్మము ననుష్ఠించుట వుత్తమము. పుణ్యస్త్రీలు తమ భర్తలచేత మంత్రోపదేశము పొందవలెగాని అన్యుల చేతగాదు.

"ప్రతిమనిషి అన్నిపనులుచేసి మరువవలెను. మగ వాడు పంక్తిలో విస్తళ్ళు ఎత్తుటకున్ను ఆడది అంట్లుతోము టకుకూడ సంశయింప వలెనా? రానురాను యికముందు ఎవరి కెవరు నౌకరుగా పనిచేసెదరు? (చేయరని భావము.")

"నీ సంసారము తెలిసి నీవలెనే యితర సంసారము లున్నవని తెలిసికొనురీతిని నీఫొటోను, నీవు చూచుకుని విర ళించి తెలిసికొని నిన్ను నీ వెఱిగి ప్రపంచమును తెలిసి కొనుము. అపుడు నీలోఉన్న బ్రహ్మమునీకు బయల్పడును."

"సమాధి అనగా ఏకాగ్రచిత్తత. అట్టి ఏకాగ్రచిత్తత ప్రపంచములో అన్నివస్తువులమీద నుండవచ్చును. అనేక ఆలోచనలనుండి ఏకాలోచనలో పడుటయే సమాధి. అట్టి సమాధియందు అట్టి ఆలోచింపబడుచున్న వస్తువుతప్ప యిత రము కనలేదు.

"ప్రపంచములో ప్రతి చిన్నవస్తువు దగ్గరనుంచి మనము నేర్చుకోవలసినది చాలయున్నది. మానవుడు తన ధర్మము

లను విడనాడి హీనస్థితి యందున్నాడు" "అన్నింటికి సిద్ధ పడినపుడే మనము గమ్యస్థానము చేరగలము."

"ఏ ప్రకారము ఒక స్త్రీ యే తనయిల్లు చక్కబెట్టు కొనుచు పిల్లకుపాలిచ్చి పెంచుకొనుచు భర్తకు సేవచేసి సంతోషము కలుగచేయుచు పని చేసికొనుచు అనేకవిధము లుగా వర్తింపుచున్నదో అట్లే మనస్సే బుద్ధియై మనస్సే చిత్తమై మనస్సే అహంకారమై వర్తింపుచున్నది.

"అహంకారము అంతనే మహాశత్రు. నీయింద్రియము లను చెడుమార్గములోనికి దిగనీయక నీయహంకారము నశింప చేసి కొన్నపుడే దేశమునకు, భగవంతునికి, మానవులకు సేవ చేయుటకు అర్హుడగుదువు. గాని అంతవరకుగాదు. అప్పటికే అన్నివిధముల నీమనస్సు నిర్మలమై, మోక్షముఖ వ్యాప్తియై బ్రహ్మసాక్షాత్కారము నందును. ఆస్థితియే సమాధి అపుడు నీలో సర్వబ్రహ్మాండభాండమును జ్ఞాననేత్రముచే నిర్మింపగలవు. నీవు నిజమైన సుఖమనుభవింపగలవు. అదేపూర్ణ సమాధి. ఆనందకోశము తురీయాతీతము. అదిబయటకు చెప్పనలవి కానిది. ఎవరికి వారు, తమ అనుభవము వల్లనే గ్రహింప వలసినది. అట్టి అనుభవము ఊరక ప్రశ్నలవల్ల వచ్చేది కాదు. గురుసేవచేసి గురుకటాక్షమువల్లనే లభ్యపడకలదు."

ఈ విధముగ సజ్జనసాంగత్యమును విస్తరింపజేయుచు బాపట్లగ్రామములో 1940 సంవత్సరములో శిష్యులు శ్రీమారుతి ప్రణవాశ్రమము నిర్మింపగ అందు భజన కాల క్షేపములతోడను, తత్త్వబోధలతోడను, తమదర్శనమునకై

విచ్చేయుభక్తుల ననుగ్రహించుచు, సంసారమున కష్ట పరం పరలలో నిస్పృహులై దరిగానక తమను వెదకికొనివచ్చిన వారికి తమమహిమానుగ్రహప్రసాదముచే రామభక్తి నుప దేశించి విముక్తులనుచేయుచు శిష్యగణములయెడ గురుకటాక్ష వీక్షణముల ప్రసరింపచేయుచు తమ భౌతిక శరీరమునకు అంత్యకాలము సమీపించుట గుర్తెరింగి ఒకానొక దినమున తమశిష్యులగు మధుసూదనరావును ఒకకాగితమును తెమ్మని యందు "దీపముండగనే యిల్లుచక్కపెట్టుకొనుడని" లిఖించి అది దాచియుంచి చూచుకొనుమని సెలవిచ్చిరి.

అది మొదలు దేహము క్షీణింప నారంభించెను. తమ శిష్యుడగు మధుసూదనరావు నొక మంత్రదీక్షయందుంచిరి. తదుపరి క్రమముగా రాచకురుపు లేచి అది యొక కారణముగా కన్నట్టి 1941 వ సంవత్సరము అక్టోబరు 11 వ తేది రాత్రి 9 గంటలకు తమశిష్యుడగు మధుసూదనరావును తమచెవియందు నారాయణోపనిషత్తుల నేడుపర్యాయములు చదువగా శ్రవణముచేయుచు, శ్రీవారు సకుటుంబసపరివార మంతయు సన్నిధిలోనుండ భౌతికదేహమువీడి సోహంస్వరూపు లైరి. ఈవిధముగ రాజయోగ సాధనముచే రామనామ ప్రాశస్త్యమును లోకమునకు వెల్లడిచేసిన మహనీయులలో శ్రీ ఆంజనేయ పరమహంస యొకరు. సద్గురు ప్రభువునకు జయమగుగాక.

# ఆంధ్ర భాగవత గ్రంథమాల

## భాగవతసేవామందిరము

## అప్పికట్ల



ఆంధ్రదేశమం దవతరించి తరించిన భక్తులజీవితముల "శ్రీమత్ ఆంధ్రమహాభక్త విజయ" మను పేరుతో ప్రకటింప సంకల్పించి, ప్రస్తుతము 47 మంది మహాభక్తుల జీవితములు 500 పుటలతో ప్రథమసంపుటము ముద్రింపబడినది. గాన తామెల్లరు చేయూతనొసంగి యీ యుద్యమమును కొనసాగింప ప్రార్థన.

| | |
|---|---|
| మహారాజపోషకులు | రు 100 |
| రాజపోషకులు | 50 |
| ప్రధానపోషకులు | 25 |
| పోషకులు | 10 |
| చందాదారులు | 5 |

ప్పికట్ల,
ట్ల తాలూకా

ఇట్లు,
పంగులూరి వీరరాఘవుడు.

## మహారాజ పోషకులు

| | |
|---|---|
| శ్రీ పోలిశెట్టి సోమసుందరంగారు | గుంటూరు |
| ,, కర్పూరపు వెంకటనారాయణగారు | గుంటూరు |
| ,, గుండవరపు వెంకటసుబ్బారావుగారు | గుండవరము |
| ,, సూర్యదేవర హైమవతమ్మగారు | చేబ్రోలు |
| ,, దూబగుంట్ల లక్ష్మణాచార్యులుగారు | సత్తెనపల్లి |

## రాజపోషకులు

| | |
|---|---|
| శ్రీ గర్భం నరసింహారావుగారు | పేరేచర్ల |

## ప్రధాన పోషకులు

| | |
|---|---|
| శ్రీ ఇనగంటి వెంకటప్పయ్యగారు | అప్పికట్ల |
| ,, కురుచేటి వరదమ్మగారు | పేరేచర్ల |
| ,, సమిడిఘుంట శ్రీరాములుగారు | పరుచూరు |
| ,, చివుకుల వెంకటేశ్వర్లుగారు | పెదవడ్లపూడి |

## పోషకులు

| | |
|---|---|
| శ్రీ కర్పూరపు సూర్యనారాయణగారు | గుంటూరు |
| ,, అచ్యుతుని వెంకటసుబ్బారావుగారు | చీరాల |
| ,, కలభంమెట్టు మధుసూదనరావుగారు | బాపట్ల |
| ,, భాగవతుల రాధాకృష్ణమూర్తిగారు | కొల్లూరు |

